# ఎపటీకన్య

శ్రీ తెన్నేటి కోదండరామయ్య B. A.



పబ్లిషర్సు: అద్దేపల్లి అండు కో
సరస్వతీ పవర్ ప్రెస్
రాజమహేంద్రవరము

# EVAREE KANYA

## [Who is this Girl?]

(Novel)

by

TENNETI KODANDARAMAYYA B. A.

First Edition – January 1960

Price Rs. 4-00





Publishers : ADDEPALLY & CO.

SARASWATHI POWER PRESS

RAJAHMUNDRY (A. P.)

# విన్నతి

## శ్రద్ధాంజలి

హాస్యబ్రహ్మ స్వర్గీయ భమిడిపాటి కామేశ్వరరావుగారితో బాల్యస్నేహం, కుటుంబబాంధవ్యం, ముఖ్యంగా భావబాంధవ్యం, లభించడమే, నాకించెక్ కళారాధనకు ఆదికారణం. 'చెలికారపుమ్మమత' ఎంతగాఢమో, బడిచదువులనాటినుంచీ, వారు దివంగతులయేవరకూ, సాలుసాలూ. కాలవ్యయసూచిక వ్రాసిపెట్టుకున్నట్టుగానే, విధిగా వేసగిసెలవుల్లో వచ్చి, ఒక్కమాటతో, ఒక్కమెలికెతో, ఒక్కవిసుపుతో పొట్టచెక్కలుచేసే, వారి సహజ లలిత హాస్యోక్తులతో నన్ను తనిపి, ప్రపంచమునెడ, ఒక ఆనందమయమైన మానసికదృష్టిని కలిగించే కళ్ళఅద్దాలు నాకు ప్రసాదించి వెళ్ళారు. ఆబహుగ్రంథద్రష్ట కావ్యదృష్టి వెనకనిల్చి, దానిలోకి గంభీరభావప్రపంచములను పారించే వారి విస్తృత కావ్యపరిచితి, తాత్త్వికవిభూతి, సంస్కారసంపత్తి, ధ్యానధారణాభ్యాసాలతో లభించేవి కాని, వారికి నాపై యెంతవాత్సల్యముండుగాక వరప్రసాదంగా లభించేవా? ఒక కవితాతపస్విలోకానుభవాలు, మహత్తర లోకోత్తరానుభవాలు కబుర్లా? అవి నేను కోరగలిగినవీ కావు వారు ప్రసాదించగలిగినవీకావు అని సరిపెట్టుకున్నా. వారిచ్చివెళ్ళిన కళ్ళజోడుమాత్రం నా కంటికి అతికిందని నాధిలాసా.

## రచనపరమార్థం

ప్రాచీన భారతజాతీయజీవన గంగాప్రవాహం, మన ఉత్తమస్త్రీయేనన్న సత్యాన్నీ, వారి ఆర్షసంస్కృతీ సంప్రదాయాలనూ, విద్యావతులవుతోన్న ఆధునికకన్యలు మఱుస్తున్నారేమోనన్న వెఱపుతో, సనాతన భారతజాతీయాదర్శములగు త్యాగసేవలపట్ల, గృహిణీధర్మాలపట్ల, వారికి లక్ష్యబుద్ధికలిగినకాని మనం సంకల్పించిన సాంస్కృతిక పునరుజ్జీవన పుణ్యకార్యం సాధించలేమన్న వేదనాయుతమైన మనసుతో సంకల్పించినదీ రచన. ప్రాచీనతాపక్షపాతము గల నవ్యమార్గానువర్తినిగా. ఉద్భాసిల్లే కుమారిక ఆధునికకన్యలకు మెఱవడిగల యొరవడి కాగలదని విశ్వసిస్తా,

## ఇతివృత్తం

శ్రీరామకృష్ణ మఠస్వాముల సన్నిధిని సుశిక్షితురాలైన కుమారిక, కారణాంతరంచేత పల్లెప్రాంతానికివచ్చి ఆప్రాంతాన్నే సేవాక్షేత్రం చేసుకుంది. సంసారంలో, సమాజంలో తమమీద జరిగే అత్యాచారాలను, అపనిందలను. ఎదుర్కొన

లేకనో, కాక, వారి ఆత్మజనకులు వరులుకోరు శుల్కముల నర్పించలేకనో, అవివాహితలుగా, ఉండిపోయిన అబలలకష్టాలకు అయి, తనధీశక్తితో, యుక్తధర్మసముద్ధరణశక్తితో, వార్లను వివాహితులను చేస్తుంది. ఆమె సన్నికర్షణప్రభావమేమో, యూర్ధ్వాశుపులు, ఛాందసులు, ఆతతాయులు, సమాజాభ్యుదయ నిరోధకపరివారమంతా, పరివర్తను లవుతారు. సర్వజనసంపూజ్యశీల, కుమారిక, పెండ్లాడి, గృహిణిధర్మాలను పాలిస్తొ. తనభర్తకు, సంఘసంక్షేమకార్యకలాపాల్లో, చేదోడు వాదోడుగా, సహకరిస్తుంది.

ఉ ప వి ష యా లు

వరులవిషయంలో నీచాతినీచంగా జరుగుతోవ్న నీలిసంతవ్యాపారం, పెద్దపులులాంటి పెద్దాదబిడ్డలు పెళ్ళికూతుళ్ళను పెడ్తోన్న జీవహింస, శ్రోత్రియుల శషభిషల మూలంగా, యుక్తసంస్కరణాభిలాషులైన విదుషీమణులకు కలిగే అశాంత్యావరోధాలు, రోడ్డురోమియోల మూలంగా సౌందర్యవతులకు కలిగే శిరోభారం, సంస్కరణావిలాసతో, అందందు పరామర్శించబడ్డై. పెద్దచదువులు చదివి, ప్రజ్ఞావాదం జెస్తొ, నిగ్రహం చాలక దారితప్పే సంఘమూరులకు, పెండ్లీడు తప్పుతోన్నా, పెండ్లి అంటే మూతిముడుస్తోన్న సర్వజ్ఞులకు, ఏకొంచమైనా పెండ్లివెష్ట కలిగించాలన్న సదాశయంతో, పెండ్లిపందిర, ముచ్చట్లు, పెండ్లిసందడి, స్పర్శించ బడ్డై. ఏపది మంది విద్యావతులు నారచనచే ప్రభావితులై, నాపేర్కొన్న పరమార్థ దృష్టితో వివాహసంస్థను విలోకించి, భారతీయ సాంస్కృతిక పునరుజ్జీవనకు తోడ్పడ్డా, నేను సంకల్పసిద్ధుణ్నైనని సంతోషిస్తొ.

క థ లో క థ

' స్వాప్నికసాధ్యమయేమొ ' అనేలట్టి విశేషమొండు, కాకతాళీయంగా, ఈరచనకు సంభవమైంది. ఈరచన ముద్రణాలయం విడచివచ్చేలోపల, రచనలోపుట్టిన కథకు సరితూగెడు మరోకథ రచన చుట్టూపెరిగింది. రచయితను ముద్రణాధిపతులను, యేక కుటుంబానురాగ బంధులను, చేసేకథ అయిం దది. ' ఎవరీకన్య, ' ముద్రణాధిపతి గృహలక్ష్మియేనా, అని నన్ను, విస్మయరసావేశుణ్ని చేసిన కథానికను, పుస్తకమంత పుస్తకంకాకుండా మనవి చేస్తున్నా.

కామేశ్వరరావుగారొకపుడు మావాకట్లో ప్రసక్తాను ప్రసక్తంగా, శ్రీఅద్దేపల్లి నాగేశ్వరరావు దంపతుల సేవాలక్ష్యైక్యతను అభినందించగా విన్నాను. తర్వాత

'పండితజనానువర్తి శ్రీపామర్తి రవణమూర్తి' గారు శ్రీమతి వివేకానందదేవిగారు వ్రాసిన వారిసంస్కృతిపత్రిక వ్యాసావళిని నాకు చూడమని పంపించడం జరిగింది. అతర్వాత కామేశ్వరరావుగారిని వారి అనారోగ్యస్థితిలో చూడవెళ్ళినపుడు, కామేశ్వరరావుగారింట, శ్రీనాగేశ్వరరావుదంపతులు నాకంటబడ్డారు. ఈరచన అచ్చుకు వెళ్ళిన తర్వాత, శ్రీమతి వివేకానందదేవిగారికి ప్రభుత్వం స్టేట్‌సోషల్‌వెల్ఫేర్‌బోర్డు వైస్‌ప్రెసిడెంటు పదవిని వప్పచెప్పింది. ఈఘటనలకుపూర్వమే, నేనీరచనను సంకల్పించి కొద్దిపుటలునింపిఉన్నా, నాపేర్కొన్న మొదటిరెండు సంఘటనలు, నా ఊహాచిత్ర స్వరూపస్వభావాలకు కొంతస్పష్టతనిచ్చినై. మూడవఘటనదాన్ని తీర్చిదిద్దడమేగాక, అయ్యది వట్టి ఆదర్శం అవిరీకాదని నాచిత్తరువుకు వాస్తవికతను, నాకు ఆత్మవిశ్వాసాన్ని కలిగించింది. అంచేత శ్రీమతి వివేకానందదేవిగారిని కామేశ్వరరావుగారింట తొలిసారి చూచినపుడు, నాకాల్పనిక కుమారికయే, నాకళ్ళముందు ప్రత్యక్షమైనట్టు పులకితుడనయా. నాహృదయ స్పందన వారెవరికీ తెలియదు.

'పఠితలు నాకు స్వోత్కర్షదోషం ఆరోపించకుంటే, నావాక్సుద్ధి ఫలితమేనని నేను ఆనందించుకోవచ్చేమో, నేను కథానాయిక కుమారికకు ఆపాదించిన ఆశయాదర్శాలు, జాతీయవికాస కేంద్రాల యాజమాన్యపర్యవేక్షణలు, శ్రీమతి వివేకానందదేవిగారు సంఘసంక్షేమకార్య విషయసేకరణకు, విదేశపర్యటనం చేసివచ్చి, సోషల్‌వెల్ఫేర్‌బోర్డు వైస్‌ప్రెసిడెంటు కావడంతో, క్రియారూపందాల్చి నిజమయినై. ఈరచన శ్రీనాగేశ్వరరావుగారి ముద్రణాలయంలోనే ముద్రితం కావడం, ముదావహము. నాకు, ముఖ్యంగా, ప్రూఫులభారం తప్పింది. అడుగడుగునా వారి గృహలక్ష్మిని తలపించే, ' ఎవరీకన్య ' ప్రూఫులు సరిచూచుకోడం శ్రీనాగేశ్వరరావుగారికి ఏమంతభారం ? సర్వేజనాః సుఖినోభవంతు.

## కృ త జ్ఞ త

నాగ్రంధపఠన కాయత్తంచేసిన త్రిభువనవిజయంలాంటె సభలో, ఆంధ్రావని మీద పేర్వడ్డ బహుముఖప్రతిభాశాలురు, సమ్మోహనాస్త్రవేత్తలు అయిన రచయితలు, రసజ్ఞులు శ్రీ శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి, మధునాపంతుల సత్యనారాయణశాస్త్రిగార్లు, అతిశయాదరానురాగాలతో కథాక్రమరీత్యా పెండ్లినిశ్చయం మాత్రమైన కుమారికను పెళ్ళికూతుర్నిచేసి, ఆశీర్వాద ప్రణ్యాహనాదాలతో శుభాక్షితలు చల్లి, శ్రీ నాగేశ్వరరావుగారికి వప్పగించి, నన్ను పరమహర్ష సంపూర్ణహృదయుణ్ని చేశారు. వారికి నావందనశతాలు.

రచయిత

## స మ ర్ప ణ

మాటకారి, నిరతాన్నప్రదాత, సంస్కరణాభిలాషి

పూజ్యపితృపాదులు స్వర్గీయ

తె న్నే టి కా మ య్యా గా రి కి

# పరీక్షలైన రాత్రి

## కాలేజీవిద్యార్థుల కులాసాకబుర్లు

"శ్రీరస్తు. శుభమస్తు నీవొచ్చి పిల్లనుచూచుకోవడమే తర్వాయి. కట్నం కాన కలవిషయమంతా శాంతమ్మక్కగారితో ప్రస్తావించవమైం" దని పరీక్షలతరద్దిలో చతుర్వేదికి తరపరంపరగా ఉత్తరాలొచ్చిపడ్డై. ఉత్తరాని కొక్కరోజుచొప్పున చూచినా, అధమం అయిదువారాలు, ఉళ్ళంట. తిన్నఊళ్ళో తినకుండా, తిరగాల్సినన్ని కార్డులూ, కవర్లూ టేబు ల్సొరుగులో పేరుకొన్నై. సరే, కన్యాప్రదాతలు స్వయంగా వచ్చి చేసిన ఆహ్వానాలు, కావలసినవాళ్ళద్వారా పంపిన వర్తమానాలు, బుర్రలో అలంగంతిరుగుతున్నవి, యివాన్ని. బి. యే. ఆఖరిపేపరైనరాత్రి, పలంటోసు కొచ్చినట్టు తెరిపిగాకూర్చుని సొరుగులో గిరాటేస్తూ వచ్చినఉత్తరాలను పైకితీశాడు. "ఇంటికి ప్రయాణముహూర్తం ఎప్పుడుపెట్టావోయ్" అంటూ సహాధ్యాయులు వెంకట్రావు, కోట్లు కేరింతాలు కొడ్తూ గదిలోకొచ్చారు. ఉలిక్కిపడ్డాడు చతుర్వేది. "తీరా యిప్పుడీ బొత్తి పైకితీస్తినే, వొట్టినే పరిహాసం చేసేస్వభావం కోట్లుది. యిహ నోపట్టాన్ని వదలిపెడ్తాడా," అనుకుంటో, కంగారు కప్పుకుంటో, ఏంచేస్తాడుగనుక, అంతంతగానే "రాండోయ్" అన్నాడు. "ఏవోఉత్తరాలు చూచుకుంటున్నాన్రా, యిప్పుడొచ్చాం," అన్నాడు వెంకట్రావు. "ఇందుకే నిన్ను వెనకటిరావు అంటాన్రా. పాతకాలపువాడివి. అవ్వి ఏవో వొట్టొట్టి ఉత్తరాలు కావురా భాయీ, గవర్నమెంటు ఆఫ్ ఇండియా గిల్టుయెడ్జిడు బాండ్సురా. అంచుల్ని పసుపెట్టి ఉన్నై చూచుకో. ఏ ఒక్కటీ ఆరుమొదలు పదివేల వరకు సొమ్ము అయిందేరా," అన్నాడుకోట్లు. కోట్లువ్యాఖ్యానానికి నవ్వు కొన్నారు. "అవును, ఒకటిరెండూ ఎకరాలున్నవాడికే, కాలేజీచదువులో పట్టావంటేచాలు, ఏడూఎనిమిదీవేలు పోస్తోన్నారీరోజుల్లో," అన్నాడు వెంకట్రావు అపామాషీగానే స్మండీ. అపామాషీమాటలే ఒకప్పుడు కొంప లంటించేస్తై. కోట్లు కున్నదల్లా రెండెకరాలలోపు కొంద్ర అని గాని, ఎనిమిదివేలు కట్నంపుచ్చుకొన్నాడనిగాని, దృష్టిలోపెట్టుకొని అన్న

కట్నంకోసం పెళ్ళినాణ్ణి పీడిసి నిలకట్టుకట్టి నగను చేశాడు నీడిపెళ్ళి. ఆయనగారి కాలుచూపనతో, ఒకన్యాప్రదాతను నగ్ను రపిచి, పీడ్ని కొజ్జా అనియాగిచేస్తేనేగా తప్పకచేశాడు! వీడు మహాచెప్పవస్తాడు. నా వివాహంతో నాలుగేళ్ళనాడు కాదగ్గది వీడకీని. అప్పుడు కట్నం నాలుగు వేలు అన్నారు. ఏడాదికి వేయిచొప్పున వయడీమార్కెట్టు నాల్యా యీ నాలుగేళ్ళలోను నాలుగువేలు పెరుక్కొచ్చింది. ఎనిమిదివేలూ ఊడేశాడో లేదో వాణ్ణేఅడుగు తెలుస్తుంది. నాలుగువేలు అదనం కట్నానికి కక్కుర్తిపడి, హాయిగా అనుభవించదగ్గ సంసారసుఖం నాలుగేళ్ళ జారవిడ్చుకొన్నానని యిప్పుడు ఏడ్చిపోతున్నాడు. అవును, అవ్వా కావాలి, బువ్వా కావాలి అంటే ఏలావస్తాయి'' అన్నాడు వెంకట్రావు, అభినయయుక్తంగా. వెంకట్రావన్నది ఏమాత్రం సత్యదూరం కాదు.

కోట్లుచేసేపరిహాసాలను సాధారణంగా నవ్వి పారవేసే సరళహృదయుడు వెంకట్రావు. నే పతినిష్ఠునిడై, పోటుమాటల నింత చేటు సాగిలాగాడేమా అని చతుర్వేది విస్తుపోయాడు. సరసంగా ప్రారంభించిన సంభాషణ వాదంలోకి, వాదం వివాదంలోకి పరిణమిస్తోన్నందుకు ఆతడు కలవరపడ్డాడు. ఉద్విగ్న హృదయుడు కోట్లు. యీవేంద్రంలో యిచ్చే సమాధానం తప్పక వెంకట్రావును గాయపరుస్తుందని భీతిల్లాడు. సంవత్సరాలుగా పెంపొందిన వారి సౌహార్దాన్ని కొక్కత్రృటిలో ఒప్పుమి సంఘటించేటట్టుందని చతుర్వేది మనసు మథనపడింది. కాని, కోట్లే, పమను పాటించకుండా, అసత్యానికికూడా పాల్పడి, పరిహాసంచేసినందుకు ప్రతిఫలం అనుభవించానని పస్తాయించు కున్నాడు కాబోలు, వంగుసరాయించి ''నేనా, ఊడేశానా, పాపము శమించుగాక, అత్తారు మరీ ముచ్చటపడితే, అత్తారిముద్దు చెల్లింపవద్దా అల్లుడన్నవాడు'' అన్నాడు విరునవ్వు ఛాయలను పులుచుకొంటూ. ''మరే పాపం వీడిఅత్తారికి ఎనిమిది వేలు బరువై, పీడ్ని బరువుదింపమని కోరవచ్చారు'' అన్నాడు వెంకట్రావు నవ్వుతో. దీర్ఘక్రోధంపెట్టుకొనే మనిషి కాడు. స్వతహాగా ప్రశాంతాంతకరణుడు వెంకట్రావు.

సంభాషణను కట్నాలబద్దలమీదనుంచి తప్పిస్తేగాని, తిరుగా నాశేనిము

అంతా వేరు. అంచేత మనుషుల ఆర్థికసూత్రాలు జీవితంలో తప్పవు" అన్నాడు కోట్లు. "నైతిక విలువలను పాటించడం మానవుడు వదిలాడు. తనకు ఒప్పని ఆర్థికసూత్రాలకు విలువలను కట్టిపెడుతున్నా డనే నా భావన. వివాహాల్లో పనిచేస్తోన్నది ఈ ఆర్థికసూత్రప్రభావమే. ఆర్థికసూత్రమే నేటిపెళ్ళిళ్ళకు మంగళసూత్రమైంది. నేటివివాహాలు బయలాజికల్ పర్పస్సుకు కాదు. మనసికతానందానికీ కాదు. వివాహాలు, యికనామిక్సు ఫ్యాక్ట్ అంకె సింపుల్ అయినై" అన్నాడు వెంకట్రావు. "అందుకు కారణం వే" న్నాడు కోట్లు. "ఏమిటో ఆమహత్కారణం!" అన్నాడు చతుర్వేది. "పెట్టుబడి పెట్టి చదువుకొని కెరియర్ సంపాదిస్తున్నాడు మొగాడు. ఆడదానికి వివాహమే కెరియర్ కద. పెళ్ళాడోసి మొగాడు కొనుక్కొన్న కెరియరు ఫలితాన్ని సుఖానికిసుఖం, రాకాని అయితే పూర్తిగానే, ఆడది ఊరికనే కూర్చుండి కొట్టేయడం ఎట్టిన్యాయం? అంచేత లాస్టై అధమం అనువేలు. కట్నం బేరాల కిట్టు యిదీ" అన్నాడు కోట్లు. వెంకట్రావు ఘ కాలున నవ్వుతో, "ఉద్యకష్టంతో నేపుచ్చుకొన్నా నన్న మాట కోట్లు కట్నం" అన్నాడు. "పైకి అనరు కాని ఎవరుపుచ్చుకొన్నప్పుడూ, యిదే అంతర్గతంగా ఉంటోన్న కారణం. మరి చతుర్వేది మాత్రం ఏంచేస్తాడు?" అన్నాడు కోట్లు. "కట్నంపుచ్చుకోవడం నాకు సుతరామూ యిష్టంలేదురా. కాని మావాళ్ళు వత్తిడిచేస్తే కాదనలేననుకొంటా" న్నాడు చతుర్వేది. "చతుర్వేది చెప్పింది వాస్తవమే. ఆదర్శపాలనకు. అక్క కాంతమ్మ అడ్డొస్తే కాదనేసామర్థ్యం చాలదు చతుర్వేదికి. కోట్లందుకొని "అలాచెప్పు. మేమంతా ఒనాడు అలా అన్న వాళ్ళమే" నంటో నవ్వాడు.

మాట్లాడుతోనే, కోట్లు ఉత్తరాలను స్లిప్పులను ఒకక్రమంలో సద్ది, "యిదిగో, ఒకటితో ప్రారంభించి, వీటిపైన వేసే అంకెలక్రమంలో పయనిస్తే, తొక్కనటూరు తొక్కకుండా తొందరలో యిల్లుచేరుకుంటా" వంటో, యర్రపెన్సిల్తో వాటిమీద అంకెలు వేస్తున్నాడు. "రేపందరము యిళ్ళకు పోతాము, మళ్ళా ఎప్పుడుకలుస్తామో, సెలవుల్లో ఏం చేస్తావురా కోట్లు" అనిఅడిగాడు వెంకట్రావు. "నాకింక చేసేదేముంది, వాం పెద్దు కాలమ్సు పరీక్ష యీ కాడినుంచి" అన్నాడు కోట్లు. "నీకు నాం పెదుకాలమ్సు కర్మ

మేమెచ్చుకుంటాం. శీఘ్రంగా లాకు పోక, మాట కాదనికూడాను" అన్నాడు వెంకట్రావు. చూపుడువ్రేలును బొటనవ్రేలుతో మీటి, "ఉండనొద్దురా" అన్నాడు కోల్లు. "నువ్వన్నట్టే, అత్తారిముద్దు చెల్లించినబాపతు ఉందిగా. డబ్బు చేతికొచ్చినాక ఇక లేనపుడు సంశయమెందుకు" అన్నాడు వెంకట్రావు. "ఏముంది ఇంకేమ. ఎనిమిదివేలు పుచ్చుకున్నావని నువ్వన్నపుడు, ఉడుకుమోత్తనం వచ్చే. నీతో పరుసంగా మాట్లాడాను. క్షమించు. బాధఅణచుకోలేక తొందరపడ్డాను. ఈ చేత్తో ఇలా తెచ్చుకొన్న కట్నం అల్లా మా చెల్లెలు అత్తారికి చెల్లగట్టే. చేతులు కడుక్కొని కూర్చున్నాము. సున్నకుసున్నా, హాళ్ళికి హాళ్ళీ, ఎనిమిదివేలు కట్నం పుచ్చుకొని, పెళ్ళికుమారుడు మెళ్ళో మామిడాకు కట్టిపోయారని, నా అత్తారు వప్పగింతలప్పుడే మమ్మల్నిదూబట్టారు. వప్పగింతలై మేం గృహప్రవేశానికి మా వూరు బయల్దేరుతోంటే, నా వంక నా వదినగారు ఓరగా చూస్తూ, చేతులూ కళ్ళూ యాక్టివ్ వెలాసిటీతో త్రిప్పుతుంటూ — ఒకటి మెల్లకన్ను లేత తిప్పకపోయినా తిప్పినట్టుంటుంది— 'మెళ్ళో మామిడాకు, జాగ్రత్తమ్మా' అని చెల్లెలిని హెచ్చరించింది ద్వంద్వార్థాలు, చెప్పలు, శ్లేషలు, శాకల్యార్థాలు, యీశస్త్రాస్త్రాలు అవిడగారిసొమ్ము. మెల్లకన్ను కవచం, ఎవర్నంటున్నదీ తెలియకుండా. అంచేత ఒకులను తిట్టి. తాను తినకుండా దాటుకొస్తోంది. పల్లకీలోంచి ఉరికి. కిందకనుకోక్కావా లనిపించింది కాని దోషం మనలో ఉన్నప్పుడు, తగాయిదా పడ్డం లాఘవం కాదని. వంచినతల ఎత్తకుండా యింటికి దారట్టాను. 'పౌరుషంకూడా లేదేమిటే మీఆయనకి' అందిట నాభార్యతో, ఓర్మి ప్రకటించారని చెప్పమని ఆలా కసితీర్చుకున్నా. అంతతో ఆగిందా. నావివాహమైన వెంటనే, మా చెల్లెలు వివాహం. దానికి నా అత్తారొచ్చారు. ఆవిడా ఊరేగింది. వచ్చిన కాడినుంచి, కాకులనుకొట్టి గెద్దలకేశామంటూ సలపాదించింది మమ్మల్ని. ముద్దుముచ్చటలు మేముసరిగాజరపడం లేదంటూ మా చెల్లాయిఅత్తారుసణుక్కుంటే, తమడబ్బుగోదావరిలోపోసుకున్నామంటూ నాఅత్తారు గొణుక్కున్నారు. ఆసణుగులు, యీగొణుగులు యివ్వే పెళ్ళివేడుకలు వినోదాలున్ను. యీ తావాతా చెప్పవచ్చేది, ఎనిమిదివేలూ పుచ్చుకొని, కట్టుబట్టలతో నేను. మామిడాకుతో నాభార్య దిగడ్డాం. పైపెచ్చు హెచ్చుకట్నం పుచ్చుకొన్నా

కని అపఖ్యాతి నన్నూ, ఉండీలేని దాన్ని అయిపోయినా ననే విచారం బాధా వ్యను నీడలా వదలకున్నై. పనిలోపని ప్రస్తుతపరిస్థితి చెప్పనక్కర్లా. అశోకవనంలో ఉన్నట్లు పుట్టింట ఉంది నా భార్య. ఇక్కడ నాలుగేళ్ల బ్రహ్మచర్యం నడిపిస్తున్నాను నేను. పదిహేను వందల కిమ్మత్తు వస్తువులైనా పెట్టి పిల్లను తీసుకు వెళ్ళవలసిందని మా అత్తారివద్దనుంచి మాకు తాఖీదు వచ్చింది. పాత ప్రత్యర్థఖర్మాలను పసందుగా నాలుగు పేరాగ్రాఫులు వ్యాకరణదోషరహితం ద్వారా వాని పోస్టులో పంపించాం మేము. ఈ వేళా వారిదగ్గరనుంచి వచ్చిన సమాధానాన్ని, తెగేసి తిరగ్గొట్టారు మా వాళ్ళు. సంప్రతింపులకు పూర్తిగా డెడ్లాక్కు ఏర్పడిం దిపుడు. వాళ్ళు మేము చూపులు, రాకపోకలు మానుకొన్నాము. ఇహనో, యిప్పుడో రిజిష్టరు నోటీసులు చూసుకోవడంలో కొచ్చింది వ్యవహారం" అన్నాడు కోట్లు.

వెంకట్రావు డిల్లపోయి అటుతిరిగి కళ్ళు తుడ్చుకొని, "వివరాలు తెలియక యథాలాపంగా నేనన్న మాటను మనసులో పెట్టుకోకురా కోట్లు. నిన్ను ఉద్దేశించి అన్నమాట కాదని నమ్ము. మన మధ్యమతరగతి చిన్నస్థాయి వాళ్ళం నూటికి తొంభైదాకా అనుభవిస్తోన్న గృహచ్ఛిద్రాలేనా యివి. నాకు పుట్టెడు భూమి ఉందన్నావు కాదనడమెందుకని ఊరకున్నా. పుట్టెడు భూమీ ఉంది. ఇద్దరు ఇంటర్మీడియెట్లు చదివే సోదర్లూ, ముగ్గురు పెళ్ళికి సోదరీలూ ఉన్నారు. మేము నిద్రపోయినా. అది నిద్రపోకుండా మా నాన్నగారి హయాంనుంచీ పెరుక్కొస్తోన్న రెండువేల పైచిల్లర కుటుంబఋణం ఒకటుంది. ఈ పుట్టెడు భూమీ తెగనమ్మితే కాని చదువులూ జరగవు, ఈ పెళ్ళిళ్ళూ కావు. ఋణమూ తీరదు. పిత్రీయపు ఆస్తి చేతిక్రింద పెట్టుకొని, వీటిలో దేన్ని ఉపేక్షించినా, కన్నొడ్చెయ్యను ప్రపంచం నన్ను? సోదరసోదరీల అభ్యుదయ మపేక్షించి ఆస్తి అమ్మస్తే కో, తండ్రిగారి హయాంలో పచ్చగా ఉండే కొంప, పెద్దబ్బాయి పెత్తనంలో నిప్పచ్చరయిందని మా బంధుకోటే నన్ను దులిపెయ్యరూ? తప్పేదీ, తెల్వితేటలతో తప్పించుకొనేదీ ఒక్కటుండగా వీటిల్లో సోదరసోదరీలు బరువూ కాను నాన్నగారి ఆస్తికి, ఆస్తి చేమా కాదు. జ్యేష్ఠుని బాధ భగవంతుని కెఱుక. నాన్నగారి హయాంలో గాదినిండా ధాన్యం, కుండనిండా పాడి,

పంటనిండా పట్టు, ఇంటినిండా పిల్లలు, చేతినిండా డబ్బు తోణకసలాకుతో. కొంపపచ్చగా ఉండంటే చిత్రమేముంది. అమ్మాయిల కష్టాలు బువ్వాలట యాడు, అబ్బాయిలకు వీధి బడియాడు. నేనొక్కడనే ఘారాల కక్కినవాళ్ళె, ఖారాలైనా సాయంత్రానికి నేనాటి కానాడు యింటికి తిరిగి వచ్చే పల్లెంలోనే. ఏదో పదిగజాల పంచరంగుల పువ్వుల అద్దకపుగుడ్డ తెస్తే అమ్మాయిలకు పరికిణీలు కొల్లలు. పదిగజాల చార్ల నేతగుడ్డ పుచ్చుకొంటే బొందుల లాగులు బోలెడు మాకు. ఆ ఖర్చులకు నేటి నా పెత్తనం కొత్తాలఖర్చులకు పోలికేఉందిరా కొట్లూ? ఎకరన్నర అమ్మితే కాని పిల్లకు పెళ్లి కాదు, ముగ్గురికి మూడు ఎకరన్నరలు నాలుగున్నర ఎకరం అమ్మితే కాని అనువైన కోట వాళ్ళను పడేయలేనన్న మాట. మిగతా రెండు ఎకరాల పైచిల్లరలోటే. అందులో ఒక యకరం బోడిలేనిది, మరోయకరం ఒకమనోవర్తి జాల్జీకి చిక్కుడ్డది, సమస్త శుభాశుభ పరంపర, చదువులు. ఖర్చాలు, అన్నీ వెళ్ళాలి. ఇదిరా కోట్లు, ప్రస్తుతంభూమి ఉండడమంటే. ఇప్పుడుచెప్పు ఉన్నవాడినా, లేనివాడినా. నీభార్య ఖేదిస్తోందన్నావే. అలాఉండీ లేనివాడినా'' అన్నాడు వెంకట్రావు. కట్నాలయాతన లేకుంటే ఒబ్బిడిగా చేసుకుంటే మూలవిరాట్‌కు ముప్పులేకుండా పంటలమీద ఇన్నీ సాగును. నాలుగెకరాలన్నర అమ్మవారేసుకు పోయినట్టు, కట్నాలేసుకు పోతే, యింకా యెక్కడి ఒబ్బిడి? అయినకలుపు, ఆ మొత్తంలోనుంచి అయినతీసి ఆనేలాంటి, యీవర్రాళ్ళ లెక్కల వినోదం మధ్యమవర్గీయులకెందుకు కలుగుతోందో అర్థంకాదు. భేషజాలకుపోక, వివాహాల విషయంలో వాస్తవికదృష్టితో వ్యవహరిస్తే కట్నాలు కోరం, కట్నాలుయివ్వం. ఏంతంతకట్నాలు పుచ్చుకొన్నా. ఎక్కడున్నావు గొంగళీ అంటే వేసిన చోటే ఉన్నాను. కంబళీ అన్న స్థితి తప్పునపుడు కట్నాలను వర్జిస్తే కాస్త ఒబ్బిడితో ప్రాంతంగా నడిచే కుటుంబాలకు. ఉల్లాసీదాలు ఉత్థాన పతనాలు తప్పును. ఉత్సాహ కరంగావృత్తులు చేసుకొంటో భవిష్యత్తుకు భయపడి పోకుండా సుఖ జీవితాలు గడిపే సంసార్లు బోలెడుందురు. అది దేశానికెంత బలం'' అన్నాడు చతుర్వేది.

పంఘు సంస్కర్త, సామాన్యమనిషీకూడా ఈ సత్యం గుర్తించారు.

అయితేం డిజార్మమెంటు, న్యూక్లియర్ టెస్టు సమస్యల్లా తయారైన ఓవిషచక్ర బంధంలోంచి తప్పించుకొని బైటపడలేకుంది సంఘం. నల్గురూ మాన్తేగాని, ఏఒక్కడూ మానడానికి పూనుకోలేకున్నాడు. కొంపలంటుకుంటేనో వరదలొస్తేనో, వళ్ళు తెలియకుండా చేచిక్కింది లాగేసుకుపోయేవాళ్ళ వీరావేశంతో ప్రతి ఒక్కడూ కట్నాల కెగబడుతున్నాడు. గట్టునకూర్చున్నవాడు చేత కాని వాడికీ హడావిడిలో. కట్నం పుచ్చుకోకూడదన్న ఆదర్శం పాటించినవాడు ఆర్థికంగా ఆహుతి అయిపోయే దుష్కాలం ప్రాప్తించింది. ఇచ్చేచోట తప్పకపోతే, వచ్చే చోట ఎవడు మానుకోగలడని ముఖంమీద అడుగుతున్నారు. దానికి సమాధానమూ కన్పించటంలేదు. తత్సమస్యా పరిష్కారానికి, పోనీ, యువకుల కాన్ఫరెన్సొటిపెట్టి చూతామా అంటే సోదరీలున్న యువకుని అభిప్రాయానికి, సోదరీలులేని యువకుని అభిప్రాయం అంతా ఏకంపెట్టు అవుతుంది. తథ్యం. యునిలేటరల్ గా తామొక్కరూ మానే ఉదారుల నాశించగలమా ఈ భీభత్సంలో? అబ్బో, ఎక్కడిమాట?" అన్నాడు వెంకట్రావు.

“బీదకుటుంబాలు దూభరాఖర్చులు చేసి ధ్వంసంకాపండాను, ఒబ్బిడీ బ్రతుకు నలవర్చుకోడానికి కోఆపరేటివులు, స్మాల్ సేవింగ్సుస్కీములు. గృహపరిశ్రమలు ప్రభుత్వం నెలకొల్పి, దేశాభ్యుదయ కార్యక్రమం కొన సాగిస్తూంటే, కూతురుకట్నభారమోతి పెనుభూతంలా గృహస్థుపై విరుచుకుపడి, అతడు శ్రమించి, నోరుకట్టుకొని చేసుకొన్న స్వల్పఆదానే కాదు, అతడి ఒబ్బిడి అభ్యాసాన్ని, ఆత్మవిశ్వాసాన్ని కూడా కూకటివేళ్ళతో పెల్లగించి పారేసిపోతోంది. అతడు జన్మలో తిరిగా కోలుకోడం కల్ల. ఈకష్టార్జితం రయేస్వయంకృషి జీవితలక్ష్యాలులేని అబాంత్రాల చేతపడునో ఏకష్టజీవిశ్రమఫలితం ఏగుడ్డాడిచేతిరాయి కానో అంచనావేయలేముకద. ముద్దుగా, ముచ్చటగా, ఒకలాంఛనంగా ఒకవేడుకగా వచ్చినట్టేవచ్చి. కట్నా లీనాటికి బ్రహ్మరక్షస్సై కుత్తుకపట్టుకుంటోన్నై. ఎన్నికుటుంబాల సిరిసంపదలు మటుమాయమైపోతున్నాయి. కట్నాలసమస్య దేశాభ్యుదయ కాముల కెంతశిరోభారంకలిగిస్తోన్నదీ, మొన్నజన్మదినోత్సవ సందర్భంలో

ప్రధానస్త్రీ ప్రచారానికి ఉపయోగించిన ఒక వింత కానుక ద్యోతకం చేస్తోంది. పెళ్ళాడ్యాడ మానికి పుచ్చుకోరాల సంకేతం చేస్తామని బాస చేస్తో డెబ్భైవేలయువకులు వ్రాళ్ళు చేసి పంపిన ప్రమాణస్వీకారపత్రికలో. కట్నాలుపుచ్చుకోమన్నది, ప్రధానవిషయమైంటే అన్నాడు చతుర్వేది. "ఇంతప్రధానవిషయాన్ని ప్రభుత్వం యెందుకు ఉపేక్షించాలో అర్థంకా"దన్నాడు వెంకట్రావు "ప్రభుత్వం శాసనాలు జారీచెయ్యగలదేమో కాని, ఈవిషయంలో వాటిని అమలుజర్పించడం దుష్కరం. ప్రభుత్వం శాసించిన వడ్డీరేటును సాహుకారు కొత్తకొత్త ఉపాయాలతో అధిగమించి యథాప్రకారం అధికవడ్డీలను ఊడ్చేస్తున్నాడు. శాసనాలఫలితమల్లా కట్నాలను సభమీద చదివించరు. అంతే" నన్నాడు చతుర్వేది. "అంతేఅయితే బాగే, అది మరీకత్తిలకు కిటవాలపై దాటితీయకప్పు కలిసొచ్చేది వీసమెత్తులేకపోగా" అన్నాడు కోట్లు. "గట్టి ప్రచారం చేసిప్రజల్లోప్రబోధంకల్గించా"లన్నాడుచతుర్వేది. "స్వార్థపరత్వ కాలాన ప్రళయతాండవం చేస్తోన్న ఈరోజుల్లో నీత్యోపదేశాల నెవరు వినిపించుకుంటాడు. ప్రచారాలుకూడా శుష్కప్రయాసే. మనకంఠశోషే. కాని, మనవాదోపవాదాలవల్ల యీగవాలకు వాళ్ళమీద.కట్నాలరాయిళ్ళు, చర్మాలు బాగా దళసెక్కి ఉన్నారు. మొదట్లో ఏమో కాని, యిప్పుడు, ఇనప్పెట్టెలోపోసుకోడమే గాని మరేమాట నచ్చదు. నొచ్చదు. యిరోజు సోమ డి. డి. టీకి యిమ్యూనిటీ డెవలప్పైందని విన్నా మీమధ్య. ఈమానవకీటకాలు ఆతరహాలోవే. మింగినకొద్దీ ఆకలిముదిరే వింతరోగం యీ కట్నాలజాడ్య"మన్నాడు వెంకట్రావు ఆవేశయుతంగా. "అవును. అష్ట వారిజాడ్యాలు ఊరిమీదపడితే, ఆరోగ్యవారప్రదర్శనాలుచేసి యేం లాభం. కట్నాలరోగం ప్రచారానికీ ప్రబోధానికిలొంగుతుందట్రా మీపిచ్చికాని. దానికి ఒక్కటేమందు, ఒక్కటేముక్తిమార్గం. వాతకు కానిలొంగ దారోగం. ఆవాతపెట్టడం కన్యలచేతుల్లోనేవుంది. దానికి సూచనలూ కనిపిస్తోన్నాయి. ఆడవాళ్ళలో అబలత్వలక్షణం అసహాయభావం అంతరిస్తున్నై. పురుషుడు కంటబడితే మెలికలుతిరిగిపోయే స్త్రీ ఈనాలుగైదేళ్ళలోను నాకుకన్పించలేదు. మనకాలేజీఅనుభవం చూస్తున్నామా. మనమే భిడియపడి తప్పుకుంటున్నాం. వాళ్ళు మనముఖాలమీద

నుంచి విసవిసా నడిచి ముందు న్యాలకి నలంకరిస్తాన్నారు. హాళ్ళల్లో మస్త్రత్రం సుద్ధంగా ఎదురవ్వుతున్నారు. ఇళ్ళల్లో ఎదురుతిరుగుతున్నారు. సభావేది కలనెక్కుతున్నారు. నాటకరంగాలనుతొక్కుతున్నారు. మగతోడు లేకుండా మగతాపనులన్నీ చేసుకుపోతున్నారు. చెనికిమిగతారా కోట్లు. మరీకుర్రతనమెుస్తోంది నీకు" అని నవ్వాడు వెంకట్రావు. "వాడిక్యాంగ్యం యివాళకొత్తరా, కానీరా కోట్లు"అన్నాడు చతుర్వేది "నాటకరంగంరా నామినహాయింపు. పెద్దరాలు తీస్తాడు వెంకట్రావు." "చెప్పేది కానిరా" అన్నాడు చతుర్వేది. "ఏలైబ్రరీ చూడండి, లైబ్రేరియనకు పని చెప్తోన్నది యువతులే కాని యువకులు కారు. కాలేజీలో విద్యార్థినుల పెర్సెంటేజీ ఎలా పెరిగిపోతోందో నేను మీకు చెప్పనక్కరలేదు. చచ్చిచెడీ పత్యం మార్కులుమనం తెచ్చుకొంటె, క్లాసులు వాళ్ళుకొట్టేస్తున్నారు. నాగపూరు యూనివర్సిటీ బి. యే. యగ్జామ్‌లోనేగా, హైయస్టుమార్కున్న స్కోర్ చేసిన మొదటిపేరుగురు స్త్రీలేననిచదివాం. వృత్తివిద్యలు నేరుస్తున్నారు. ఉద్యోగాల్లో అడుగడుగునా వాళ్ళు మనలను తలపడేదినం మారంలోలేదు. గట్టిగా పోటీప్రబలిననాడు అధికారుల ఆదరాభిమానాలను చూరగొనేది వాళ్ళు కాని మనం కాము. స్త్రీలు కెరియర్లను చేచిక్కించుకొని, స్వరక్షణ శక్తిని సంపాదించుకొన్నకొద్దీ, ఎవరు ఎవరికి కట్నాలీయాల్సివస్తుందో అయిదేళ్ళలో మనమేచూస్తాం. వ్యవహారమంతా తారుమారవుతోంది. ముందుముందు పెళ్ళిచూపులకు బయల్దేరేది వధువో, వరుడో సంశయపడ నక్కరలే" దన్నాడు కోట్లు.

"ఓరి, ఎంత కవనమల్లావురా కోట్లు? అయితే, అప్పట్లో, వాకిట్లో, అగ రొత్తులపొగలో, మధ్యమధ్యకీకంటి చూపులు చూస్తో తలవంచుకొని తివాసీ మీదకూర్చునేది, నీలెక్కప్రకారం వధువా, వరుడా" అన్నాడు వెంకట్రావు. మాబాగా పొగవేస్తావురా కోట్లుకి. వా పనలేకబుర్లకోరు. వాడ్ని రూల్సేయనిస్తావాలేదా" అన్నాడు చతుర్వేది.

"పరీక్షలకు ప్రయాసపడి ఉన్నాడు చతుర్వేది. పాపం యీనాటినుంచి ఆడపిల్లల పరీక్ష ఒకటివచ్చిపడింది వాడికి. రూల్సేసిపెట్టరా" అన్నాడు వెంకట్రావు. ఉత్తరాలుమీద అంకెలువేస్తున్న కోట్లు తలఎత్తి, "ఆడపిల్ల

"పరీక్ష కాదు, వేటఅంటే బాగుంటుంది" అని సవరణ చెప్పాడు "వేటఏమిట్రా, అరటికాయవ్వళ్ళాంటి ఆడపిల్లలను పట్టుకొని ఏదో క్రూరజంతువులైనట్టు మాట్లాడ్తావు" అన్నాడు వెంకట్రావు "నేనన్నానంటావు, చూచుకో తరువాత నీకే తెలుస్తుంది. ఈడొచ్చిన అమ్మాయితో వ్యవహారమెంత ప్రమాదకరమో చదువు" అని ఒక పంక్తి టిక్ పెట్టి యిచ్చాడు. "ప్రమాదకరమా, ప్రమోదకరమా నువ్వనేది" అంటూ ఉత్తరం పుచ్చుకొని, "ఈ జ్యేష్ఠమాసంలోనైనా ముహూర్తం పెట్టకుండా ఆడపిల్లను ఆపలేం" అని చదివాడు వెంకట్రావు. కోట్లావాక్యాన్ని వ్యాఖ్యానిస్తూ "ఏదైనా సత్యం పెట్టకుండా ఆపలేం అంటే ఏమనుకోవాలి. రోగి, అన్నం అన్నం అని అరామీ చేసి, యిల్లు పీకిపందిరివేస్తుందనేగా దాని తాత్పర్యం. రోగి, పత్యం పడనుకొచ్చిందంటే, రోగం వెనకట్టిందన్న మాట, ఆడపిల్లకు ఈడువచ్చిందంటే కన్యాత్వం ముగ్గిందన్నమాట. ఆ ఉత్తరం వ్రాసిన శాస్త్రులెవడో గట్టివాడ్రా, ఆపలేం అన్నమాటలో ఎంత అర్థం కూర్చి అన్నాడో మూడు పత్యానికొచ్చిన తత్వం ఎప్పుడెప్పుడని ఉవ్విళ్లూరుతోందన్నమాట. ఈ వేసంగుల్లో వివాహం చెయ్యకపోతే, మాటామంతీలేకుండా విరుచుకుపడిపోతుందన్న మాట. ఆ అమ్మాయి యెవరితో ఏమిచేసినా చెయ్యగలదని, హడలిపోతూ ఉండాలి చుట్టుప్రక్కలవాళ్ళు" అన్నాడు కోట్లుం యెంతో భయవిహ్వలత్వ ప్రదర్శిస్తూ. "అరెకోట్లూ. పులో, భూతమో, యిప్పుడు, యిక్కడ మీదకురికినట్టు చేశావు కదరా మామా ఆడపిల్లలంటే యింతభయం ఎప్పటినుంచిరా" అన్నాడు చతుర్వేది. ఆడపిల్లలంటే కాదు. యీడొచ్చిన ఆడపిల్లలంటే అను. వెంకట్రావు వేషాలంటాడు కాని, ఇప్పటికి యీడొచ్చిన ఆడపిల్లను చూస్తే, పులిపిల్లను చూచినట్టుంటుంది నాభయం. వయస్సు పదకొండు పన్నెండేళ్ళు. దాని జన్మస్థానం తాళ్ళపూడి. పదకొండు, పన్నెండేళ్ల క్రితం తాళ్ళపూడి పెళ్ళికి తీసుకెళ్ళారు మావాళ్ళు. నాకప్పుడు కుర్రతనం. మా మగపెళ్ళివారికక్కడ విడిది ఏర్పాటు చెయ్యలేదు. ఆడపెళ్ళివారి లోగిలి నాలుగిళ్ళ పవంతి. మండువాలోగిలి. ఆడపెళ్ళివారు దక్షిణగదుల్లో సర్దుకొని, మా మగపెళ్ళివారి సందర్భి—పాతిక ముప్పైదాకా ఉన్నాము — ఉత్తరగదుల్లో మకాంచేశారు. మాతో వచ్చిన చాకళ్ళు, మంగళ్ళు, డోళ్ళువగైరా

హోంయిద్యాలను మండువా పంచను పెట్టుకొని, మండువాచుట్టూ పశుశాలో వాల్సివచ్చింది. దొడ్డిపైపున ఉన్న మూలగది యావత్తు అమేషా వెలపలున్న అనర్హాయి, ఒక్కరాత్రే, ఆక్రమించేసింది. ఆప్రాంతానికెళ్ళడానికి ఎవళ్ళూ జంకిపోతున్నారు.

ఒక్కయింట్లో యింతఘుందని దట్టించడానికి కారణం, అప్పటి ఆగ్రామ పరిస్థితి. అప్పటికి వారంనుంచి సూర్యాస్తమయానికే, ఊళ్ళో తలుపులు బిడాయించేస్తున్నారు. చీకటడిందేం, వీధుల్లో జనసంచారంబందవుతోంది. రాత్రుల్లా వీధిమొగల్లో. ఒకటో రెండో కుక్కలు మోరలెత్తి యీాడు పోమని మొరగడం తప్పితే. నిశ్శబ్దత ఆవరిస్తోంది, నీరెండవేస్తే, అట్లకు పోయిన పిల్లలను, పొలాలకు పోయిన పశువులను తోలితెచ్చుకొని కాపాడుకొంటున్నారు. సాయంత్రం యింటచెప్పకుండాపోయి పరాయింట, సూర్యాస్తమయంతో అక్కడ తలుపులు బిగవడంచేత బందైపోయిన వాళ్ళూ. రాత్రికి పరాయి ఊళ్ళో చిక్కడిపోయినవాళ్ళూ చచ్చిన వాళ్ళతోనే జమకొస్తోన్నారు. మేము వెళ్ళినక్రితంరాత్రి పెండ్లిపనుల తొందర్లో ఆడపెళ్ళివారు పరాధ్యాన్నంగా, దొడ్డితలుపు గడియను, అశ్రద్ధ చేశారట. ఉదయానికి పాకలో గేదెలేదు. చెర్వుగట్టుకంటా రక్తపు చారలు కన్పించినై. దానిక్రితంరాత్రి పెండ్లివారి పక్కయింటిపాలేరు, యజమాని యింటపరున్నాడని, పాలేరుతలితండ్రులనుకున్నారు. ఇంటివద్దనే పడుకున్నాడని యజమాని అభిప్రాయపడ్డాడు. ఉదయాని కొకరింటికి ఒకరువచ్చి వాకబుచేసుకుంటే, ఆయింటాలేడు, ఈయింటాలేడు. ఉభయులు కల్సివెతికితే, పుర్రెలేనికొంత మొండెం, పాలేరు వెండి మురుగులు ఊరుచివర చెర్వుగట్టునున్నై. మధ్యాహ్నానికి పోలీసులొచ్చి, పంచాయితీచేసి. మొండాన్ని పోస్టుమార్టంకుపంపి. వెండిమురుగులను సీలుచేసుకొని, సూర్యాస్తమయం కాకుండా, అఘమేఘాల మీాద ఊళ్ళోనుంచి వాటేశారు. పంచాయతీ రిపోర్టులో, 'పోలారపు అడవుల్నంచితప్పి వచ్చిన పులివాతను పడ్డందున' అని మరణకారణంవ్రాసి సంతకాలు పెట్టారట పంచాయితీదార్లు. పశువ దిగడంతోనే, విడిదెక్కడ అని మావాళ్ళడిగితే, ఆడపెళ్ళివారు చెప్పినవృత్తాంతమిది. రాత్రులు వీధిముఖం చూడ్డా

...కి పయనం లేనప్పుడు. మరోయింట విడిది ఏర్పాటుచేయడం, అపాయ కరం కాదా అన్నారు. అవును పెళ్ళికొచ్చిన శాస్త్రీలన్నీ యిళ్ళకు సురక్షితంగా చేరాలంటే, ఆడపెళ్ళివారింట బసచేయడమే క్షేమమని మాకూ తోచింది. మా తర్వాత కించెదాలస్యంగా వచ్చిన బందుగోరు వ్యాఘ్రవిషయం వినిఉండకపోతె, భేష్ బాగుంది, వీధి అరుగులు విశాలం, చాకళ్ళూ మంగళ్ళూ ఊరంట బసలుచేసి యిబ్బంది పెట్టకుండా, పిలిస్తే పలుకుతో, శుభ్రంగా అరుగులమీదే పండుకోవచ్చునని తన అమూల్యాభిప్రాయం తెలిబుచ్చడంతో, తాళ్ళపూడి తాతయ్యగారొకరు సకాలున నవ్వారు. ముక్కున కోపంకట్టు కోస్తేగాని మొగపెళ్ళివారి ఛాయాకన్పించదుగా, మా బంధుక్కి ముసలాడు తనమాటకు నవ్వనా అని అంతలో కోపంవచ్చేసి ఆయనగారికేమీ పిచ్చెత్తలేదుకదా అని నెమ్మదిగాఅడిగాడు. మావాడికి మతోయింగని ఆయనగారు భావించాడు కాబోలు, పిలిస్తే పలికేవా శ్నైవరు స్వామీ, వాళ్ళను అరుగులమీద పండుకోబెడ్తే, నయం, చెర్వుగట్టుమీదే వాళ్ళకళేబరాల్ని సారి కళేబరాలు కూడానా, ఎముకులగూళ్ళని చూడ్డాం అన్నాడు.

రాత్రి భోజనాలైన తర్వాత పెద్దకూ పిన్నకూ ప్రతిఒక్కరికీ, వీధి తలుపుగాని దొడ్డితలుపుగాని, ఒంటిగాతియ్యబోకండిసుమా అని పదే పదేచెప్పి. అప్పటి కందరూ ఉన్నారని పేరుపేరున విలియావేసుకొని, ఆడపెళ్ళివారు దక్షిణపు గదుల్లో స్థిమితపడ్డారు, గడచిన పదిరోజులూ పులుల కథలను, భోజనశయ్యా విహారాలను, మనోభావాలను తెగచెప్పుకొని ఉంటారు. ఇంకాకొత్తగా చెప్పుకునే దేమి దిగడి ఉంటుంది వాళ్ళకు. ఎంతవింత అయినా వారంరోజులు వల్లెవేసేసరికి, దానికొత్తయిగిరపోదూ! ఎక్కడో మా మామలాంటి చాందసులైతేతప్ప. తణుకుభీమవరం సందున, రైలడి పాతికేళ్ళయినా అతడి కది పాతబడలేదు. నేటికీ ఎప్పుడెక్కినా. ఓహోహో ఏమి సౌకర్యం యేర్పరిచాడండీ గోస్తనది డింగీలో ఓ రాత్రల్లా ముడుచుకు చచ్చేవాళ్ళం, అంటోనే ఉంటాడు, ఆశ్రితం సాయం త్రమే రైలడ్డట్టు. బలిమినే అనండి, గ్రామజీవితంలో స్థిరస్థావరం చేసుకుని కూర్చున్నపులికి, వాళ్ళా పదిరోజుల్లోనూ కొంతకొంత అలవాటుపడి

కొంచెపెంచేత నిద్రలకు పడ్డారు. మేమూలాగా! మేం పులివిశేషం విన్నట్టిగా జామైనా కాలేదు. మాగన్నుల్లో నిద్ర లేలాపట్టై? మరోటికీ, కొండలు, లోయలు, అడవులులేని సత్నవకమైన సమతల ప్రదేశంనుంచి వచ్చినవాళ్ళం, పామర్త్తారి బడిగోడమీద వేసినబొమ్మల్లో పులిని, రెండుకాళ్ళ దసరా పులిని తప్పితే బరిమీదపులిని చూచినవాళ్ళం కాము. అంచేత పులింటే మాకు గుండెల్లో రామఢోళ్ళు కొట్టోసైన్నె.

ఆపూటేవో కేవలం పిడిగుమ్మంలో పొంచివున్నట్లే బెదురుతో గుసగుసలాడుకొన్నాము. రెండుచేతులతోను కళ్ళుమూసుకున్నా, పులిచారలు, కోరలు, కన్ను, గోళ్ళు నాకంట్లో ఆడుతున్నై. దాని వడి, వడుపులు ఎవరోచెప్పినమాటలు, బుర్రలో అలంగం తిరుగుతున్నై. దానికిసాయం నాప్రక్కనున్న పొట్టికుర్రాడు, కంఠంనొక్కుకొని, 'వరే, వరే, పెద్ద పులికి మనిషిమాంసమంటే అందులోను పిల్లలమాంసమంటే మరీప్రీతిట్రా' అంటూ ఏడుపుముఖంవేశాడు. వాడిగుండె అదటుతగ్గించాలని నేను లేని ధైర్యంతెచ్చుకొని, నిజమో అబద్ధమో, "ఛఛ ఎవడుచెప్పాడు నీకు. పులికి మనిషిమాంసమంటేడ్డోకు" అన్నా నాలాగే వాడికీ ఏమీ తెలియదుకదా అని. అమ్మో! వాడెక్కడ? మొన్ననే పాలేరాడిని తిందటగా అన్నాడు, అంతసులువుగా నమ్మేసేవాడ్ని కానన్నట్టు నాకళ్ళల్లోకి చూస్తూ. "అదా నీకొచ్చిన అనుమానం, ఏం మాంసం దొరక్క, గతిలేక, లంకణంచెయ్యలేక ఏదోఏడ్చింది, బొధవచచ్చుపెద్దమ్మ ముసలిపీనుగ దరిద్రప్పులి. అంతలోనే అసహ్యం వేసి మొండెం వదిలేసి పోయిందిగా"అన్నా. ముసలిపులైతేం, పడుచువాడిమీదే పడిందిగా. వాడ్ని చంపేసినతర్వాత, మొండెం వదలేస్తేం, మెడ వదలేస్తేం అన్నాడుఏడుపుకంఠంతో. "అందుక్కాదురా, అసలు మాటవిను. వాడ్నిచంపేసింవో మనంబ్రతికామో వాడ్ని మొన్న చంపేయడం మనకెంతనయం అనుకొన్నావు"అన్నా ప్లేటుమార్చి. "వాడు చావకపోతే, వాడేం మన్ని చంపునా!" అని అడిగాడు ఆశ్చర్యంగా. "పాలేరుమన్ని ఏమిచేసునని కాదు. మనిషిమాంసం పంటికితగిత్తే, పదిహేను రోజులదాకా ఎంతఆకలివేసినా. మనిషిని వాసన చూడదట పులి. దాని దగ్గరనుంచి యీలేసుకుంటూ వెళ్ళినా ఊదగుతుం అనింటుట అంటేశా. కో

మనం ఈవూరినుంచి వెళ్ళిపోయేవరకు మనకు పులిభయముక్కఱలేదు. మరో సారి తాళ్ళపూడి రానేరాం, మనకెందుకు పులిభయం! హాయిగా నిద్రపో అన్నా" వాడివీపు చఱచి. 'నిజమేనా నీకెవరు చెప్పారు' అన్నారు. నీకాపరీక్ష ఎందుకు, నేనేదో పుస్తకంలో చదివా కళ్లుమూయ్ అన్నా. పోరుముయ్ అన్నంత, కోపంగా. వాడెక్కడ మూస్తాడు. నాప్రాణం తీస్తాడు కాని. వీడుమరీ భయపెడ్తున్నాడని రెండోప్రక్కకుతిరిగి పడుకున్నా. కాస్సేపటికి వీపుగోకాడు. పులిగోళ్ళ భయాన్నున్నానేమో త్రుళ్ళిపడ్డా. "అల్లరిచేసేవాళ్ళను పట్టుగోడానికి. చప్పుడు చెయ్యకుండా దొంగపోటుగా చింతబరికతో, మనక్లాసుకొచ్చే రెండోమాస్టారిలా, పిల్లి కాళ్ళమీదవచ్చి పీలుకుతుందటగా పులి," అన్నాడు. "మరే ఇట్లాంటి మాటలు నిన్నెవతికి చెప్తున్నార్రా వాడెవడోను. నాదగ్గర చెప్పమను తెలుస్తుంది. వాడివన్నీ శుద్ధఅబద్ధాలు, వాడిమాట నమ్మకు" అన్నా. 'నీమాటే నమ్ముదును కాని మూడోక్లాసు పులిపాఠంలో పులి పిల్లి అను కులమనవచ్చునని చదివా. నడుం విళంబుబద్దలా చాచేసి, యీపెలా దభీలున కాలుకకలదని యీ వూరి అబ్బాయి చెప్పేవార్రా' అన్నాడు. వాడల్లాచెప్తే యిద్దరుకట్టకట్టుకుని చావండి అన్నా వళ్ళుమండి. అసలే నేను హడలి చస్తూంటే, నాకుతోడు, వీడోవూ నష్టజాతకం గుచ్చిస్తో వెనకాల. మఱచిపోనీయడు. కునుకోనీయడు.

అప్పట్లో గ్రహింపు లేకపోయింది. ఇదోరకం మనుష్యులుంటారు. చదువు, జ్ఞాపకశక్తి జ్ఞానం, తెల్వితేటలు, అన్నీ ఉంటై. అయితేం అభిరుచులుమాత్రం అనారోగ్యం. మా ఊరుప్లీడరుగారి అబ్బాయి ఒకడు ఫోర్త్ ఫారం చదివేరోజుల్లోనే చిత్రలేఖనంలో సిద్ధహస్తుడయాడు. ప్లీడరుగారి కోరోజున ఆఫీసులో పార్టీతో ఫీజువిషయం మాటామాటా వచ్చింది. వేళావిశేషం పార్టీకూడా పేచీకోరుకాదు. ఇంకొక్క కాని ఇయ్యనక్కరలేదు చూసుకోండి కాతా అంటూనే దభీలున పక్కవాడి చేతిలోని కర్రలాక్కుని, గుడ్లు పెద్దవిచేసి, ప్లీడరుగారి తలపైకి విసురుగా కర్ర ఎత్తాడు. అయ్యో అయ్యో, దేవుడంటివాడు, ఏమన్నాడనిరా, నీకేం పోయిందిరా, ఆయనబుర్ర కొడ్తోంటివి అని ఛాట్టున ఆకర్రదొరక

బుచ్చుకొని, పార్టీ మేనమామ. తేలు. తేలు. అని అరచాడు. ఎక్కడి వాళ్ళు అక్కడ కాళ్ళపైకి లాక్కున్నారు. ఏమీలేదు. అచ్చంగా, ఆ డెక్కలు, ఆకొండెం, ఆపూసలు, ఆవర్ణం, ఏలాపడ్డాయో, ప్లీడరుగారి సుపుత్రుడు. ప్లీడరుగారు కూర్చునే కుర్చీ వెనకగోడమీద. ప్లీడరుగారి తలకు మూరెడు, పైగా. ఎదగకుర్చీల్లో కూర్చున్న వాళ్ళ కంటికి చక్కగా ఆనేలా సర్వాంగసౌష్ఠవమైన చారెడు మండ్రగబ్బను చిత్రించిఉన్నాడు. అంత అభినయించిఉంటే. ఆకునో, పువ్వునో, పావురాయినో గీయకూడదూ? వాకట్లోకి వచ్చినవాడల్లా ఎగిరిపడ్డానికి, వీడికుంచెకు దొరికిందల్లా తేలూ, జరీనా! అందులోనూ తండ్రిగారి తలమీద పస్తోనట్టా! అబ్బాయి చిత్రలేఖనం నాన్నగారి ప్రాణానికే ముప్పు కానా! అయినా ఆ కుర్రాణ్ణి కొంటి డిప్పకాయి అనుకోవచ్చు.

ఈ పొట్టాడిరకం వేరు. ఈరకంవాళ్లు కుట్లను పాతికినట్లు మనోక్లేశాన్ని వరిస్తారు. భయమేసినపుడు దాన్ని తగ్గించుకోడానికి ప్రయత్నించాలా? అదీ లేదు, యిదీలేదు. భయాన్నీ దుఃఖాన్ని అరికట్టడానికి మనుషులు, సర్వశక్తులు వినియోగించి, భయాన్ని రెట్టించే రహస్యాల నెన్నిటినో కొక్కొచ్చి, కల్పించుకుని కల్పించుకుని ఏడ్వడం వీడికిసరదా. మరీ ఏడ్చి పోతున్నాడని ధైర్యం చెప్పబోతే, నన్ను మోసం చెయ్యలేవన్నట్టు, వాడి తెల్వితేటలన్నీ చూపెట్టి యక్షప్రశ్నలేస్తాడు. పోనీ అని తనమానాన్ని తాను పడిఉండడు. మళ్ళీఓదార్పు కావాలి. మంచిమాట వినుపించుకోడు. ఏదోఒకటి మనసులో పెట్టుకొని కుములుతోండడమే వీడికి ఆనందం.

ఇక్కడైతే పులివచ్చింది కాని, ఈ పొట్టాడికి ఇంటిదగ్గర దెయ్యాల గొడవ. వీడిబుర్ర దెయ్యాలపుట్టది, కాలక్షేపం దెయ్యాలకబుర్లు. వేళ వెతుక్కుని, వినేరకాన్ని వెతుక్కుని చెప్తాడు. దెయ్యాలు ఆడపిల్లలకు ఎక్కువ పట్టిస్తాయని ఎరుగును. చీకటిరాత్రి, బుడ్డీదీపం, ఈదురుగాలి, కిటికీ తలుపుల కిరకిర, బొలలు, ఇట్లాంటి బాగ్గొండు అమిరితే, దెయ్యాలను చెప్పి చూపెడ్తాడు. మన మాటలు అవివింటాయేమో నని మనకుభయం కలిగేట్లా, మధ్యమధ్య కంఠం నొక్కేస్తూ, అంతలో ప్రక్కలకు బెదురు చూపులు చూస్తూ, చీమ చిటుక్కుమంటే దెయ్యమేఅన్నట్టు కళ్లుతేలేస్తూ, అష్టదిగ్బంధంచేసి హడలగొడ్తాడు. ఒక్కొక్క బిగిలో, ఏదోచేతికి తగిలి

పోయినట్టు ఉలిక్కిపడేవాళ్ళం. కోనసీమదెయ్యాలు అంతానిద్దర్లమీద ఉత్సంగా రాత్రులు ఊరేగుతాయని, తల్పుతీసుకొని వెళ్ళినపిల్లలను ఎత్తుకు పోయి స్మశానంలో వదిలిపెడ్తాయనీ, మరీబెదర కొట్టేస్తుండగా, వాడి మాటలమధ్య దణ్ణెంమీది తువ్వాలు యిట్టే క్రిందపడింది. దీపం ఆరిపో యింది. బారుమన్నారు ఆడపిల్లలు.

ఈరకంవాడు పెద్దపులిని మఱచిపో నిస్తాడా. పులికి వచ్చినచోటుకే వస్తోండడం అలవాటట. నిన్న రాత్రి యిక్కడనుంచి గేదెను ఎత్తుకుపోయిం దట. మళ్లా అది వచ్చేవేళ నీకు తెలుసురా అని అడిగాడు. తెలియ దన్నాను. నాకుచెప్పనాయన రాత్రి పదకొండు అన్నాడులే. ఇపుడు టైము ఎంత అయింది అంటావన్నాడు. పదకొండు అన్నాను. పదకొండు అన్నానో లేదో, వెంకట్రావ్! మధ్యమధ్యన, కొంతకొంతుగోయినకంఠంతో అంచేత మాకు వినుపించకుండా పోయిన మాటలుంటాయి – దొడ్లోనుంచి కెవ్వన, చంపేసిందే ... నాప్రాణానికి వచ్చిపడిందే ... పెద్దపులే, అన్న మూడుపోగుల మాటలు. ఎవరివో, స్టేషన్లో ఆగక దూరంగా కూసు కొంటూ పోతోన్న రైలుకూతలా వినుపెంచినై. కేక వినిపించడం తర్వా యిగా, భం, భం. అని భయంకర రవంఒకటి, మండువావైపు వచ్చిపడింది. పైప్రాణాలు పైన ఎగిరిపోయాయి మాకు. మాగదుల్లో ఎక్కడివాళ్ళక్కడ వివక్షతలు పాటించకుండా ప్రక్కవాళ్ళను కాగలించుకొని కట్టకట్టుగొని గొల్లుమన్నారు. నన్ను పీడిస్తోన్న పొట్టాడు ఉశ్వాసనిశ్వాసాలు తియ్యటం లేదు. ఆ భీభత్సంలో ఎవరుఎవరికి ధైర్యం చెప్పగలరు. దీపం ఆర్పే యండి దానికి కన్పించం అన్నాడు ఒకడు. పులివి పిల్లికళ్లు, ఆర్పేయ వద్దురా, అంటాడు పొట్టాడు, నన్నుగోకి.

ఆడపెళ్ళివారుకూడా దొడ్లోనుంచి పులి ఎవర్నో ఎగరేసుకుపోయిం దని, మళ్లా మండువాలోకి వచ్చిపడిందని, వాళ్ళగదుల్లో కంగారుగా కలియత్రొక్కుకుంటున్నారు. అంతలో మునిలావిణ్ణేనట్రా అని ఆయజ మాని బారుమని గోడంటే దిగజారాడు. అంబా అంబా అని లేగదూడ అర్చినట్టు అమ్మా అమ్మా అని అరవైయేళ్ళ యజమాని వాపోతోంటే, విరుద్ధంగాఉన్నా నాకు కళ్లుచెమర్చినై. ఆగదిలోంచి, యీ గదిలోంచి వచ్చిన ఆయనగారిభార్యా బిడ్డలు ఆయన్ను పెనేసుకుపోయి, ఏకకట్టగా దుఃఖసముద్రంలో మునిగిపోయారు. అమ్మా అమ్మా, అత్తా అత్తా,

మామ్మా మామ్మా అంటో, ముసలావిడబలగమే, కొడుకు, కోడలు, కూతుళ్ళు, మనుమరాళ్లు ఒకచేకోకాలు. రేపోమాపో కన్నుమూయ్యాటానికి సర్వసిద్ధం చేసుకొనికూర్చున్న ఒకముసలమ్మకోసం, అరవైయేళ్ళ యజమాని దగ్గరనుంచి ఆరేళ్ళఅమ్మాయి దాకా దుఃఖపారవశ్యంతో దుర పిల్లుతున్నారంటే, పేగుసంబంధమన్న ఆ అనుబంధాన్ని మానవులెంత చిక్కగా పేనుకుంటా రనిపిస్తుంది. సృష్టియంత్రానికీ పేగుసంబంధం మెయిన్‌స్ప్రింగు లాంటిది కాబోలు. పరస్పర రక్షణకిది ఎంత అవసరం. ఈబంధమే లేనివాడు నిస్సహాయులైన శిశువులను, మూడుకాళ్ళ ముదుసళ్ళను చూచేవారెవరు. కాచేవారెవరు.

అని ఆలోచనలోపడ్డట్టున్నాడు కోట్లు. "మధ్యన నీవేదాంత మోటా? ఏంజరిగిందీ అదిచెప్పరా," అన్నాడు వెంకట్రావు. "జరగడాని కేముంది. జ్ఞానం వచ్చీరానిపిల్లలు బెంబేలు పడిపోయారు. చంటిపిల్లలు గుక్కపట్టారు. చిట్టికొయ్యాయిందర్రా అని ఓతల్లి కెవ్వుమంటే, కృష్ణుడు కళ్లు తేలేశాడు. నాబ్రతుకేమి కానైయుందోఅనిఓతల్లి మొత్తుకుంటోంది. తొలి ఉద్ధృతం ఓ కొంచెం తగ్గాక, యజమానికి మాటతిరిగింది. భావాలకు చోటు చిక్కుతోందేమో, నీపేరు పెట్టుకున్న పిల్లపెళ్ళి చూచుకొని కాని వెళ్లిపోనన్నావు కాదటే అమ్మా, ఆకాస్తా చూడకుండానే దాటి పోయావా అమ్మా అమ్మా అంటో యజమాని, మీరుపట్టుపడితేనే కాద టండీ అత్తా తొందర్లో ముహూర్తంపెట్టాం, తెల్లారకుండానే మాయమై పోయారా అత్తా అత్తా అంటో యజమానురాలు కంఠాలు కలిపారు. నాకేం మహారాజులాకొడుకు చేతుల్లో వెళ్లిపోతానని ఎంతమందితో అనే వారత్తా అని యజమానురాలు ఆలపిస్తే, ఉప్పొంగుకొని, యిదేటే అమ్మా నాచేతుల్లో వెళ్లిపోవడమంటే, పులినోట్లో పడ్డమాఅని యజమాని దంపతీయుక్తంగా విలపించాడు. కర్మకాండలు పండగలా చెయ్యాలని ఎంత ఉబలాటపడ్డావు అని భార్యఅంటే దహనకార్యమైనా చేయించుకోకుండా అదృశ్యమైందే అంటో భర్త బోలుబోలు మన్నాడు. "ఎన్ని పురుళ్లోసింది. ఎన్నిపెళ్లిళ్లు చేసింది. ఎంతమందికి చేసిపెట్టింది. మనమరాళ్ళకు పని నేర్పాలని వాళ్ళనేపనైనా చెయ్యనిచ్చిందేమో కాని, వళ్లు దాచుకుంటా. చిర్రున చీదిఎరుగదు. ఒకళ్ళచేత చేయించుకోనన్నమాట అక్షరాలా నిల బెట్టుకు వెళ్లింది. ఎంతమందికి, ఎంతమందికి నోములూ, వ్రతాలూ, మడి

మైల నీమాలూ చెప్ప చేయి ంచింది. ఒకళ్ళంం మాత్రం ఉట్టి కట్టుకు వేళ్ళా డ్డాములు కానీ, కలకల్లాడ్డో కూడిన యింటికి బంధుగులమధ్య నుంచి, ఈగదిలో అడుగు అగదిలో పెటినంత తేలిగ్గా, మాట్లాడుతో స్వర్గానికి వెళ్లింది. పుణ్యాత్ముఠాలు'' అని ఒక దగ్గరబంధువు, "పొద్దుకి నిప్తే గాని, పదిరోజులముసురైనా పచ్చిమంచినీళ్లు కంఠంలో పోసుగుంద లే, కార్తీక మాసంలో ఎంతఅర్ధరాత్రి వేళ బుడ్డిలాంతరేసుకొని ఒక్కర్తీ గోదావరీ స్నానంచేసుకొచ్చేదే'' అని మరోదగ్గరబంధువు, ఆవిడగారి గుణగణాలను, అచారవిశేషాలను, మధ్యమధ్య ఓళ్ళో కానికి దారిస్తో, కీర్తించారు. ఒక బ్రాహ్మ డందుకొని "అవును పుణ్యాత్మురాలే. పుణ్యాత్మురాలని ఊరుకుం టుందా, మనకు పెద్దదిక్కు అని ఊరుకుంటుందా మృత్యువు. మృత్యు వుకీ లెక్క లక్కాలేదు. సెకనువార లేకుండా దాని నిర్ణీతసమయాని కదివచ్చి తోడుకుపోతుంది. తిర్యగ్జాతులదగ్గరనుంచి మహాతపస్వుల దాకా. మృత్యువాతను పడనివాళ్లెవరున్నారని యీవిడ మరణానికి దుఃఖిచడం. పోనీ, దుఃఖించి, చచ్చినవాళ్లను తెచ్చుకున్నవాళ్లున్నారా ? పుట్టినవాడికి చావకతప్పదు. చచ్చినవాడికి పుట్టకతప్పదు. పుట్టడం, గిట్టడం సృష్టికి తప్పవు. తప్పనిసరి విషయాలకు విచారించి ఏం లాభం. ఈ సాటి కిక తర్వాత కార్యక్రమం ఆలోచించండి. దహన సంస్కార, సమాధు లేవీ అవశ్యకతలేని ఈరకంచావులకు కార్యకర్మలు లెలాచెయ్యాలో, చైన్లునడిగి తెల్సుకుందాము. పందలు వేలు అపరకర్మలు చేయించిన చెయ్యివాడిది. ఏమ య్యా చెన్లూ'' అనిఅబుద్ధిమంతును చైన్లుతో ముసలావిడ అపరకర్మ కాంచ విషయం కదిపాడ్లో లేదో, బడాబడావిసురుగా, వీధితలుపు బ ధిన భీషణ శబ్దం, దాంతో మేళవించి, షడ్జమంలోతలుపట్రాఅన్న కేక, విద్యుద్వేగంతో అందరి చెవుల్లోకికూడా వినిపించి, యింటిల్లపాదీ గతచేష్టులయారు. ముసిలావిడ కంఠం పనికట్టాడు కాబోలు, వాకట్లో ఉన్న పీటికి చాకలి ఒకడు ముస లమ్మొరండో అనిపాలిబొబ్బపెట్టి ప్రక్కవాడి చేతుల్లోకి ఒరిగాడు. మరో సిధకేక తో ముసలావిడ అంటే ముసిలావిడే అంటూ, ఇల్లు నాల్గుమూల్లా ప్రసారమైంది. 'కాస్సేపు యిట్టేనేను వీధిలోకెడితే, నేను లేకుండా చూసి, నా అపరకర్మలు చేసెయ్యాలని గూఢపురాణీ చేస్తున్నారట్రా. కనుక్కుంటూ కనుక్కుంటూ'నన్న ట్టుండేమో అవిడకేక, అందరు వాకిట్లోకివచ్చారు, ఏదో నేరం చేసినవాళ్ళలా బెదురుతో.

యజమాని వీధితలుపు దగ్గరికెళ్ళి, తగుమాత్రం దూరంలో నుంచుని, తలుపు కేసి చెవి పెట్టి, ఆవ్యాయతను సూచించే మందరంలో 'అమ్మా' అన్నాడు. 'దెయ్యమేమోరా' అంటాడు నాప్రక్కనున్న పొట్టోడు "నేనేరా అబ్బాయి" అంది ఆవిడ తలుపవతలనుంచి. 'దెయ్యమేమోరా' అన్నా నాచూడు. నేనేరా అంది. ఇంకా ఏం కావాలి, దెయ్యాన్నే నందిరోయి. ఇల్లా నమ్మించే, యిళ్ళలోకి వస్తాయట దెయ్యాలు' అన్నాడు. ఇంతలో తలుపు తీశాడు యజమాని. నీళ్ళు కారుతోన్న తడిగుడ్డలతో, లోపల పడింది ముసలావిడ. నాప్రక్కనున్న పొట్టోడి కది, ముసలమ్మగారి ప్రేతస్వరూపమో, నిజస్వరూపమో అన్న కొత్త భయం అవరించింది కాబోలు, ముసుగుబిగితన్నాడు. "ఇక్కడెకు పులి అయింది, దెయ్యం దిగండింది వాడికి. ఏనాడో చేసుకున్న కర్మ, ఇటువంటివాడితో సావాసం" అనుకుంటున్నా. మనమరాళ్ళందరు ముసలమ్మగారి చుట్టూ మూగారు ఏడుపో, సంతోషమో తెలియని కంఠాలతో. చెర్వులో పడేసిందా పులి, మరి నిన్ను పీకెయ్యకుండా ఎల్లా వదలిపెట్టింది, అంటో ఎవరిథోరణ్ని వాళ్ళుప్రశ్నలవర్షం కురిపించారు. పరామర్శలు చేశారు. వీళ్ళమాటలకు. తలాతోకా తెలియని ముసలమ్మ గారు. పులి ఏమిట్రా, నన్ను చెర్వులో పడేయుడమేమిటి, నేను దానినోరల్లోంచి బైట పడటమేమిటిఅని ఎదురడిగింది. ఆవిడకూతురిబిడ్డ, విస్సాకోడే రాతడిది, ఆతడందుకొని 'చాల్లేవమ్మా, నేర్చుకుపోయావు. నేర్చుకుపోయావని ఇంటిల్లిపాదికీ నీమూలాన ప్రాణం కడంటింది! మొన్న పత్యం తిన్న మానూరి కొయ్యాయిపోయి కళ్ళు తేలేసింది! దానికి ఊపిరి రావడానికి నా తాతలు దిగొచ్చారు. చూడు, ఆమగ పెళ్ళివారికుర్రకుంకలు ఆమూల మిటుగుమిటుగు ఏలాచూస్తున్నారో పాపం యిప్పటికింకా తేరుకోలేదు వాళ్ళు. ఇంతమంది ప్రాణా లుచ్చుకొన్నావే పులేమిటంటో శాంతంగా విశేషాలడగబోతావే' అని చర్రుమన్నాడు. ముసలమ్మగారు తెల్లబోయి, 'ఏమిట్రా అబ్బాయి వీడిగొడవ నాకేం తెలియటంలేదురా' అంది కొడుకుతో. మనుమడు అందుకొని, 'నీకు తెలియదేం, నువ్వు తలుపుతీసుకొని దొడ్లోకి వెళ్ళావా లేదా యీరాత్రి' అని అడిగాడు. జామిచెట్టునకట్టిన మడిగుడ్డ తెచ్చుకుందామని వెళ్ళాన్నా. అయితే,' అంది. 'అయితేలేదు. గియితేలేదు. పొడిగుడ్డతో వెళ్ళావా, తడిగుడ్డకట్టుకు వెళ్ళావా జామిచెట్టుదగ్గరకు' అన్నాడు. 'పొడి గుడ్డతోనే, ఈపరీక్ష ఎందుకురా' అంది. 'ఎందుకా, ఇందుకు. మరి యిప్పు

డీ తడిగుడ్డ లెక్కడనుంచివచ్చేయి, నిన్ను పులిఈడ్చుకుపోయి చెర్వులో పడేయికపోతే' అన్నాడు. 'నేనుస్నానంచేసి వచ్చాన్రా. పులీలేదు గిలీ లేదు' అందావిడ." పులిలేదేం, ఇన్నేళ్ళొచ్చి ముఖంమీద అబద్ధ మాడడానికి ఎల్లాప్రాణం వప్పిందమ్మా. ఇంతమందివిన్న నీకేక, కాదని బుఖాయిస్తావు. 'చంపేసిందే, నాప్రాణానికొచ్చిపడిందే, పెద్దపులి,' అని నువ్వు దొడ్లోనుంచి బొబ్బపెట్టావా లేదా, ముందామాటచెప్పు" అన్నాడు. ఆవిడకు మబ్బు విడుతోంది. అంతలో కోడ లావెతో, 'అవునత్తా, మీరామాటలన్నారండి. నేనబద్ధమాడ్తానా, మీకంతం నాకు ఆనమాలేనండి' అంది. 'ఆళ్శీ అదిశే' అని ముసలావిడ ఒకశేనవ్వు, ఒకశేనవ్వు. 'ఏమిటిమామ్మా ఏం జరిగిందని అడిగారుమనమరాళ్లు, ఎంతో కుతూహలంగా.

'మరేం లేదర్రా, దీని కింతగొడవపెట్టారు. రొట్టిముక్కకొరికి, జామిచెట్టున ఆరేసిన సైనుగుడ్డకోసం దొడ్లోకివెడ్తున్నా. "రాత్రి తలుపుతియ్యవద్దు అనుకున్నాం కాదటమ్మా" అన్నాడుకొడుకు "ఎనభైదాటాయ్, పురేసుకు పోతేం, మృత్యువు వేసుకుపోతేం అనుకున్నాన్రా. జామిచెట్టు కేసి వెడ్తోంటే మట్టుగదిలో ఉన్న శేషి, కిటికీఊచల్లోంచి, మామిడి పండు తింటోంది కాబోలు. అప్పుడే ఆతొక్కగిరాటేసిందేమో, ఆఎంగిలి తొక్క వచ్చి ఛెళ్ళున నాచెంపకు తగిలింది. చీకటిపడ్డతర్వాత అది తొక్కనని. యిది తొక్కనని అప్పటి కారుస్నానాలుచేసి ఆయాసపడిఉన్నా." "అవున్లె క్రితం జన్మలో నీటికాకివి. పూర్వజన్మ వాసనలు ఓపట్టాన్ని పోతాయా. యిరవైనాల్గు గంటలూ మైలపడ్తానన్న భయమే నీకు నీవు మైలపడితే యిండియా రిపబ్లిక్కుకొచ్చే నష్టమేమో. కాస్తకు కూస్తకు ములుగుతోండడం. ఇల్లంతా తడుపుతోండడంఅలవాటుచేశావు మమ్మల్ని చంపడానికి. కాలుజారిపడ్డ శేషయ్యన్న చట్టసెప్పి యింకాయిప్పటికితగ్గలేదు నీపుణ్యమా" అన్నాడు విస్సాకొడేరు మనమడు. మీవిస్సాకొడేరు విసురు పెద్దావిడ మీద చూపెడ్తావు, ఊరుకోమామయ్యా, మామ్మనుచెప్పనియ్ అన్నారు ఆవిడమనమరాళ్ళు. 'పగలల్లా చేసిన చాకిరీతోటీ, స్నానాలతోటీ, అలసట పడి ఉన్నానేమో, చప్పున తెములుచ్చుకొని ఓకునుకేతామనుకొంటోన్న ఘుళ్ళల్లో, మళ్ళీ శేషినన్ను మైలపర్చింది. మళ్ళీ స్నానంచేసి చావల్సివచ్చిందని దానిమీదవళ్ళుమండిపోయి, 'చంపేసిందే శేషి, సుబ్బమ్మా ఇదెక్కడనుంచి వచ్చిపడిందే. ఇది నాప్రాణానికి పెద్దపులి అయిందే" అని నిన్ను

కేక లేస్తో, చెరువుకుపోయి స్నానంచేసి వచ్చా' నంది కోడలితో ముసలమ్మ గారు. 'దొడ్డితలుపుతీసుకువెళ్ళినదానివి అటేరావాలి కాని, వీధిదారినెందుకు రావాలి. ఈలోపలదొడ్లో దూడలకోసం వచ్చేపులి యింట్లోకి దూకితే మేమంతా ఏమైపోదుము' అన్నాడుమనమడు. 'అరి వెర్రివాడా, ఏళ్ళొచ్చె కాని, నీకు తెల్వితేటలురాలేదురా వెళ్ళినదారినే వస్తే, చీకటిని ఆ మామిడి పండుతొక్క కాలికి తగిలిందనుకో, మళ్ళీ వెళ్ళనా చెయ్యకు. రాత్రల్లా చెరువు యింటికిమధ్య, తడిగుడ్డలతో ఆసుకండెలా తిరుగుతోందమనా నువ్వ నేది' అంది. 'మ్రే గొప్పపనిచేశావు' అన్నాడు ఆపె చేదస్తానికి మరేమీ అనలేక. ఏదిఏమైనా, 'నువ్వాదొడ్డితల్పు ఆలావదలేసి వెళ్ళడం వచ్చీగా నిన్నీ, పెద్దదానివినిన్ను నోరుచేసుకున్నానన్నదోషం నాకెందుకు, నీవైతే 'ఆయుర్దాయభుజంగ మృత్యువున నాయాసంబునన్ గెల్చిరో' అన్న ఒక మానవాతీతురాలవు కావచ్చు, పిల్లజల్లా. చీమాచిటుగు యింటిడి పిల్లలున్న కొంపకు కాలద్వారకవాటం తెరవడం కాదటమ్మా ఆదొడ్డితలుపలా, వదలివెళ్ళడం అయ్యోఅయ్యో'' అన్నాడు ఒకసోమయాజి, శిష్టభాషలో' లోపల గడియ వేసుకుంటుందని కోడల్ని కేకవేస్తిని, దొడ్డిగుమ్మం బైట గొళ్ళెంపెట్టివెళ్ళా, యింతమంది మగవాళ్ళుండి కలియత్రొక్కుకుని చస్తా రనుకున్నానా సిగ్గుసిగ్గు 'అంది ఆవిడ.' ఏమీ లేనిదానికి ఎంత జడుసుకు పోయాం. ఆ! అదేమో కాని గాండ్రు గాండ్రుమంటో పులి కేవలం మండువాలోకి ఎగబడ్డట్టు భీతిల్లాం. గుండెలదిరిపోయేచప్పు డేదో అప్పుడే కానా' అన్నాడు యజమాని.

అదియిక్కడాండి బాబయ్యా. మాతమ్ముడు మరీ పిరికెదవండి భయంతో ముడుసుకు పరున్నాడు. దొడ్డిపక్కనుంచి ఏదో సావుకేక ఇన్పించడం తోనే, ఎగిరిపడి, కాళ్లిసిరేసి, బిగుసుకుపోయాడు ఆడికాళ్ళదగ్గరున్న డోలు కంజిరా యిసురుగా మండవాలోపడి, అటూయిటూ దొర్లాయండి అంటో వాటిని తీసి మండవాపైన పెట్టా డోమంగలి.

ఆళ్ళీ, శేషుఁ మామ్మప్రాణానికేకాదు, మనందరిప్రాణాలక్కూడా పెద్ద పులిఅయిందే అని కొందరు, రాండే రాండే పెద్దపులిని చూసొద్దామని కొందరు, ఆడపెళ్లివారంతా మూలగదిదగ్గరకెళ్ళారు. మైలడతారర్రా, ఒక్కొక్కళ్ళనే తడిపిచావలేను అర్థరాత్రి అని ముసలావిడ కేకేసింది. ఆవిడ

కేకలువేస్తూ, ముఖ్యగదికి దూరదూరంగా నుంచున్నారు. పిల్లలుజాగ్రత్త, గుమ్మందగ్గర కెళ్లనీకండి, ప్రమాదం, పెద్దపులితోపని. పంజాదెబ్బ కొట్టే సేను అంటూ శేషుకు బావవరసలు. అతడే తో వికటాట్టహాసం చేశాడు. నెత్తొళ్లసుకురానీ నీకథపడ్తాను అంది బావతో. అమ్మో అకిలిమీద ఉన్న ఆమెపులి అన్నాడు బాలుడు. ఏమిట్రా ఆ మాటలు. నీతి. రీతి లేనిమాటలు అని కసురుకుంది అత్తడి పిన్నమ్మట. అదుగో తలుపుసందుల్లోంచి చూస్తోందని, ఒకరు, గదంట తిరుగుతోందని ఒకరు, పిల్లలనువొరికబుచ్చుకొని మామిడి తాంకను పీకేసినట్టు పీకేస్తుందనిఒకరు, శుభ్రమైన శేషుకు పెద్దపులిశివాలు తెరిచారు. తర్వాతమూడురోజులూ ఆ అమ్మాయికనిపిస్తేపులిపులిఅనేవారు. ఆపిల్ల వెనక్కుతిరిగితే, పిల్లలు బొరుమంటో పారిపోయేవారు. నిజంపులి మాత్రం ఆ అమ్మాయికన్న ఎక్కువ బాధ పెట్టగలదా అనిపించింది నాకు. నాటినుంచి యీడొచ్చినఆపెపిల్లా, పులిపిల్లా ఏమిరకాటంలో ఏం చేస్తుందో, అసేయం నాహృదయాన్ని హత్తుకు పోయింది. ముట్టుగది దగ్గరనుంచి పెళ్ళివారు తిమగముల కెళ్లారు. కథకంచికెళ్లింది మనం యింటి కొచ్చాం’ మన్నాడు కోట్లు.

“ఇంటికొచ్చామంటూ వేసి. ఉదయం యింటికి వెళ్తాము. జీవిత ప్రవాహంలో ఎవరేకోస్తా చేరుతామో గాని, కాలేజీదినాలను మాకు చిర స్మరణీయం చేశావురా కోట్లు. నీ కబుర్లు, కథలు మా హృదయాలను హత్తుకున్నై. ఏ క్లిష్టపరిస్థితులలోను హృదయాన్ని క్లేశము కృపణత్వము కప్పకుండా, నీయుక్తికై చిత్రి మాకు గిలిగింతలు పెట్టి ఉత్సాహోత్తేజాలను రేకెత్తించింది. నీకు ఋణపడి యున్నాము రా కోట్లు” అని అశ్రుపూరిత నేత్రాలతో వెంకట్రావు చతుర్వేది కోట్ల నాలింగనం చేశాడు. మరి కాసేపు అన్యోన్యహితభాషణులై కాలక్షేపం చేసినతర్వాత, ఆహ్వాన మందడంతో, ఎన్నిపనులున్నా వివాహానికి రావాలిసుమాఅని మరోతూరి చెప్ప వారికి వీడ్కోలుయిచ్చాడు చతుర్వేది. ఉదయం, వాల్తేరునుంచి వ్యాసంజర్లో యింటికి బయిల్దేరాడు.

# ఎవరికన్య?

చతుర్వేది వస్తోన్న ప్యాశంజరు ప్రక్కబద్దెలమీదకు తప్పుకొని, ఎదరొస్తోన్న మెయిల్‌కు దారిచ్చి, మెయిలు వెళ్ళిపోంగానే, ముందుస్టేషనుకొచ్చినిల్చింది. ఆస్టేషన్లో దినపత్రిక కొనుక్కోరావచ్చునని, ధీమాగా దిగాడు చతుర్వేది. సంకల్పమైతే మంచిదే. కాని చామర్లకోట బెజవాడల మధ్య పుష్కర వత్సరంలోను, పెళ్ళిళ్ళ సీజనులోను రైలెక్కడంలో పడాల్సిన పాట్లు విలియావేసుకోలేదు. పెట్టెలో వదలివచ్చిన ప్రదేశానికి ప్లాట్ఫాగానికి, ఎక్కినా దిగినా దారి ఒక్కటే కావచ్చు. దూరం ఒక్కటే కావచ్చుకూడా లెక్కకు. నిజానికిమాత్రం, యీప్రాంతంలో దిగినవాడు మరిఎక్కడం కల్ల. మానవసాధ్యంకాని కృషి. దిగినవాడు యెక్కేడేం వాడు టెన్సింగే. చదవడంమాట అటుంచి పేపరు విప్పడానికైనా జాగా ఉండదని అనుకోలేదు. స్త్రీపురుషభేదం లేకుండాయావన్మందీ నిలువు కాళ్ళమీదే ఉండాల్సివస్తుందనీ అనుకోలేదు. అది పెళ్ళిళ్ళసీజను అన్నమాట వేళకు పరాకుపడ్డాడు. పాపం, పేపరుయావ నున్నాడు.

చతుర్వేది కానాడు పేపరుచూడ్డం కాలకృత్యనిర్వర్తనగాగాని, విషయ సేకరణార్థంకాని, ఊసుపోకకుగాని కాదు పేపరుసుఖం గ్రహించిన వాడయీ కాదు. పేపరుసుమంటే, ఏలోకాల్లోఉన్నాడో, రిటైర్డు ఉద్యోగి ఉమాకాంతంగారు జ్ఞాపకంవస్తారు. మనం యిరవదినాల్గుగంటల్లోను కాల్చేప్రతిసిగరెట్టులోను, సిగరెట్టుసుఖం కనం. ప్రాతఃకాలపు తొలికప్పు కాఫీ కంఠందిగడంతర్వాయిగా కాల్చిన తొలిసిగరెట్టులోఉంది, సిగరెట్టుసుఖమేమున్నా అంటారు, అవిరళహోమతత్పరులైన, అనుభవజ్ఞులు. మిగతాది తగలేత. సుఖంక్రింద జమరాదు. వ్యసనంక్రింద ఖర్చు పడుతుంది. పత్రికారంగంలో. సుఖమెక్కడో, ఆపట్టు పసిగట్టినవాడు ఉమాకాంతంగారు. గ్రంథంపుటలనుతిప్పేవారు కుప్పలుతిప్పలుగా ఉండవచ్చు. అందలిసారభూతమైనరహస్యాన్ని పసిగట్టినవాడే లెక్కకొచ్చేవాడు. కళేబరధారులు కోటానకోట్లుండవచ్చు. జీవనసౌందర్యాన్ని పసి

గట్టినవాడే లెక్కకొచ్చేవాడు. పేపరు చదివేవాళ్ళు అసంఖ్యాకులుండి వచ్చు. పేపరు సుఖానుభూతిని పొందనేర్చినవాడుగా లెక్కకొచ్చేవాడు, ఉమాకాంతంగారంటే అతిశయోక్తికాదు.

వారిప్రాణానికి, పేపరురాని రోజు. ప్రొద్దుకనిపించనిరోజే. ఆపై పీఢని, పేపరుకుర్రాడు, పేపర్లకట్టతో కదల్తున్నాడన్న మాట వింటేగాని, భోజనప్రమేయం పెట్టుకున్నట్టుండడు. చిరకాలాభ్యాసంచేత, యింట్లో ఆడంగులు, పేపరబ్బాయిజాడ తెల్సుకునే స్థానానికి లేకమంటారు. ఒక వినాయకచవితికి, పాలవెల్లితతంగంలో పేపరబ్బాయి వచ్చివెళ్ళింది కానక, వాడిజాడతెలియక వంటలు చేసుకునికూర్చున్న ఆడంగులు, పేపరుబెంగని ఎక్కడవాళ్ళక్కడే, కొంగులువాల్చుకొని పరుండాల్సివచ్చింది. వాళ్ళవంక, పిండివంటలవంక బీదచూపులుచూస్తో, డొక్కలు దించుకుపోయినపిల్లకాయలు, పడిఉండాల్సివచ్చింది. అంతలో ఉమాకాంతంగారి మనమడోడు, యింటంట కాలుకాలినపిల్లిలాతిరుగుతో, యివాళపేపరు, ఉత్తరగదికిటికీలోంచి లోపలపడేసుంది తాతయ్యోహ్యో అనిగుక్కట్టినట్టు అక్కడనుంచేఅరచాడు. ఇంటిల్లిపాదీ, పెద్దా, చిన్నా ఆగదిగుమ్మంలోకి విరగబడ్డారు, పండక్కిపుట్టింటికొచ్చినఅమ్మాయి వీధిగుమ్మంలో బండిదిగితే విరగబడ్డట్టు.

ఉమాకాంతంగారు పేపరుచూడ్డానికి రోజురోజూ పెద్దతంతు చేస్తాడు. చూడ ముచ్చటవుతుంది. ఆయనఉన్నది ఉదయమే పత్రిక వచ్చేఊరైనా దాన్ని పుచ్చుకొని జాగ్రత్తగా హెచ్చుతగ్గు లేకుండా మడిచి బీరువాలో పెట్టి బిగిస్తాడు. రావడంతోనే, దాన్ని ఎగుడు దిగుడుగా విప్పి హెడ్ లైన్సు చూడ్డంగాని, మరోరు చదువుతోంటే వంగి వెనకి నుంచి చూడ్డం కాని, మరోర్ని చూసి యిస్తాను. ఒక్క పర్యాయం యిలా పంపిస్తారూ అనడం కాని, యిట్లాంటి చపలత్వాలకు సందీయని నిగ్రహాసంపన్నుడని, ఎరుగున్నవారు, ఆయన్ను అభినందించడం కద్దు.

గడియారం చూచుకొని సరిగా పగలు పదకొండు గంటలకు పేపరు యావను భోజనానికి లేస్తాడు. దండీగా పట్టించి. పేపరు ధ్యాసను పీట మీద నుంచి లేస్తాడు. భోజనమైన వెంటనే పేపరువిప్పడానికి అప్పుడు సద్దుళ్ళ ఆలస్య అవరోధా లేమీ లేకుండా, భోజనానికి లేచే ముందే, దక్షిణ వసారాలో తన ఉద్యోగంనాటి సర్వారావుపేట పడ

కుర్చీ వాల్చి, బీరువాలోని పేపరు దాల్లో పడేసి, వసారా పైన గొళ్ళెం పెట్టి, సర్వసిద్ధం చేసుకొని, అప్పుడు స్నానానికి లేస్తాడు.

భోంచేసి వచ్చి యీలా చెయ్యి తుడుచుకోవడమేమిటి, పేపరు చేబట్టి కుర్చీలో వాలడ మేమిటి. కుర్చీ చేతుల మీద కాళ్ళు సాచేసి పేపరు విప్పడ మేమిటి. నిండు పొట్టకు నిండ్ర మెండు కాబోలు, పేపరు పది పంక్తులు నడవకుండగనె, షేక్స్పియరు చెప్పిన, 'హనీ హెవీ డ్యూ ఆఫ్ స్లంబర్' కమ్మేస్తుంది. అక్షరాలు అలుక్కుపోతై. పంక్తులు వంకర్లు తిరుగుతై. మరిరెండు నిముషాలకు వసారాలోంచి పిల్లికూతలు వినిపిస్తై. 'ఆయిన లేస్తే చంపేస్తాడు అటువెళ్ళకండి' అని వసారా బైటినుంచి పిల్లలకు మందలింపులు వినిపిస్తై. రెండు గంటలకు మెలుకువ నిద్ర కానిఅయోమయ స్థితిలో కొట్టు మిట్టాడుతోంటాడు, ఉమా కాంతంగారు. రెండున్నరకు టీకి కేకేస్తాడు. ఇంత సేపూ పతిపరిష్వంగంలో ఒదిగిన పత్నిలా, ఆయన గారి పొట్ట పోటుపాటులతో, పడుతో లేస్తో, ఆయన్నాశ్రయించి చేతి క్రింద అడిగి మణిగి ఉంటుంది పేపరు. ద్వితీయం చేసుకోని లోపాన్ని పత్రిక కమ్మేసిందంటే అత్యుక్తి కాదు.

ఉమా కాంతం గారికి పేపరు చూడక పోతే తలనొప్పి అనికీర్తి. పగలు నిద్ర లేక పోతే తలనొప్పి వస్తుం దాయనకు. భోజనమైన వెంటనే పేపరు చూస్తుంటే గాని నిద్ర పట్టదు. అసలు రహస్య మిదని చాలామందికి తెలియదు.

చతుర్వేది కీనాడు పేపర ప్రమేయం యింతకెందుకూ కాదు. కొన్ని మాసాలుగా పొస్తకాలు వేళ్ళ నంటుకుపోయేటట్టు పరీక్షలకు పడ చదివిన విద్యార్థికి పరీక్షలైనాయంటే స్వేచ్ఛావాయువులు పీలుస్తోన్నట్టుంటుంది. పరీక్షసంకెళ్ళు తొలగినందున చతుర్వేది కానా డదోస్వాతంత్ర్య ప్రకటనాభిలాష. అంచేత వెనకముందులు, సాధక బాధకాలు చూచుకోకుండా రైలు దిగాడు.

రైలుదిగడానికేం. దిగజారుడికి అతిశయ మక్కరలేదు. ఎంత చేతకాని వాడికైనా చేతిలోపని. రైలు దిగలేక పైస్టేషను కంటా బోయి, అక్కడ దిగి, యింటికినడచి వెళ్ళా డన్నవాడిని యింతవరకూ వినలేదు. రైలు ఎక్కలేక వచ్చిన జట్కానే యింటికి పట్టించా డన్నవాణ్ని విన్నామేమో కాని. రైలు దిగుతానంటే వద్దనేవాళ్ళుంటారా. తన అడ్డులేకపోతే

దింపడానికి అంతా సిద్ధమే. దిగే ప్రయత్నంలో ఉన్నవాడు కించెద్ శ్రద్ధ చేస్తే, కొంపత్రవ్వి రైల్లో బద్ధకించడుగదా అన్నట్టు, అందరు శ్రద్ధతీసుకుంటారు. మందహాసం చేస్తూ, అతడు లేచిన స్థానంలో ఓవైపున సారకాయిస్తూనే, చేయూతనిస్తారు. మీరుదిగండి, మీమూట కొచ్చినభర్వా లేదు, నే నున్నానుగా, అందిస్తానని బుజ్జగిస్తారు. మూట మూటంటో అతను మూలుగుతోనే యుంటాడు. వీళ్ళు అంతమేరా ఆక్రమిస్తూనే యుంటారు. ఆస్తిగలముసలమ్మను ఆఖరిఘుళ్ళల్లో దింపడానికి, వారసులు కూడా అంత తొందరపడరు. ఎంతఆప్యాయతో గుమ్మరిస్తారు. అమని షేస్మండీ, పోనీ పైస్టేషన్లో దిగుదునా, మావూరికి రెండూ ఒకటే, అంటూ కాస్తంత వెళ్ళడానికి వెనకాడేడేం, వెనకవాళ్ళు ముందుకు గెంటూ, ముందువాళ్ళు వెనక్కు గెంటూ, ఆమైత్రిఅంతా మటమాయమైపోతుంది. అంతలో అందరికీ శుద్ధ అనవసరమ్మనిషై ఊరుకుంటాడు. దిగేవాడు పరమమిత్రుడు. ఎక్కేవాడు గర్భశత్రువు, ఇదీ రైలునీతి. దిగనిచ్చారుకదా అని దిగేయడమేనా!

దిగడం, దిగినచోటే పేప రందుకోడం, పేపరబ్బాయి బేడ కాసందుకోడం మూవీరీల్లా, కనుమూసి తెఱచినంతలో అయిన్నైన్త. నిన్న తాను అనుకొన్న ప్రశ్నలే గడ్డు సబ్జక్టులో రావడం, యీనాడు ప్రతిపనీ, చిన్నాపెద్దా పట్టాలమీద రైల్లా, పంటికింద దూటపచ్చడిలా చెక్కుకుపోవడం, రెండు మూడు స్టేషన్లు దాటితే, తన వూరెళ్ళే స్టేషనురావడం, తనవాళ్ళు తనకోసం యెదురుచూస్తూండడం, చిత్రించుకొంటూ, అత్యుత్సాహంగా పెట్టెలో కెక్కడానికి వెనుతిరిగాడు.

అవుపారంతా ఏమైందో, తెల్లబోయాడు. చీమదూరడానికి సందు లేకుండా గుమ్మం తానేసుంది. తాను దిగినపెట్టేనా అది? అవును. అదిగో, పెద్దవాణ్ని దిగేటప్పుడు నాకు కాస్త సాయం చేస్తావు కాదు నాయనా అని తనను కోరిఉన్న తాతయ్యగారు, ఆజనసమూహంలో పెట్టెపైన కన్పిస్తున్నారు. నిముషంలో యింతమూక యెక్కడొచ్చిపడింది. ప్రక్క కమ్మీలు పట్టుకొని వ్రేలాడుతున్నవాళ్ళే ఒక వందఉంటారనిపిస్తోంది. ముందువెనకలవాళ్ళ వత్తిడి తప్పితే, అంగుళమైనా వసతి చాలక, నాఅన్న పట్టైదీదొరక్క, నిలదొక్కుకోలే కున్న నిరాధారులెందరోయున్నారు. ఒకకమ్మీని దార్ఢ్యంగా పట్టుకొన్న ఒకపెద్దమనిషి

జబ్బునునమ్మి, యిహపరాల మధ్య ఊగులాడ్తోన్న వాలఖిల్యులు మరెందరో. అంతలో కలబడుతున్నారు. విడబడుతున్నారు. కాట్లాడుతున్నారు. కలియత్రొక్కుతున్నారు. పయిటికొంగులు తొలుగుతున్నై. కండవాలు జారుతున్నై. ఆక్రందనలు వినిపిస్తాయే కాని, ఎవరో ఎవరోనై, కంఠాలు విడతీయలేము. పసోయింపన్న పెదబొబ్బ, పైన యెందుకు పెట్టుకున్నా వన్న హితవాక్యం పెనేసుకుపోయె. పావంపచ్చడైంది. చచ్చానండోయ్ అన్న దీనాలాపం. ప్రయాణప్రారంభం ధనిష్టవిషనాడిప్రవేశం. యిదిపరలోక ప్రయాణమేనమ్మా అన్న దైవజ్ఞుని ఓదార్పుకలుసుకుపాయె. ఎవర్ని పేరెట్టి అనడానికీ తొక్కినవాడిముఖం కన్పించదు. హతగాత్రుడి ముఖం ఇదివరకే కన్పించదు. ఎవరిఅవయవాలు వారివద్దికలో లేవు, ఒకచోట లేవు, "పరాయి ఆడదానిమీద చెయ్యి యెక్కడవేశావో కన్పించటం లేదా" అంటే, నిజానికి ఎవరికళ్ళకు, వాళ్ళకాళ్ళూ వేళ్ళూ కన్పించటంలేదు. తెల్సి చాచింది కాదు పాపం. ఏపట్టూ దొరక్క ప్రాకులాడ్తోన్న చెయ్యి కావాలి. అప్పుడు తెల్సిమాత్రం ఏంలాభం. ఆపట్టే తప్పితే, హరహరా అని అక్కడనుంచే బెడ్డముక్కలా ఊడి పడ్డం. మంచికి పోతే మొదటికే మోసం, ఆ ఆపత్సమయంలో. చంక గొడుగులు, కాలిజోళ్ళు జేస్తోన్న జీవహింస యింతా అంతా కాదు. తొందరపడకండి, అందరం యెక్కవచ్చు, ఒక్కనిముషం అటూయిటూ గాని—చూచావా, విడుపించుకుంటూరా, అః! అః! అంటో ఆశ్చర్యా భినయం చేస్తోనే — అనేమనిషి. వినేమనిషీ కూడా, ఎక్కడా ఎక్కువ తక్కువలు లేకుండా, సమానంగా కుమ్మరుకుని చొఱబడుతున్నారు.

చచ్చీచెడి ఒకడు లోపలపడ్డాడేం, అల్పుడు అడ్డమైన కాళ్ళూపట్టు కొని ఒక ఉద్యోగం గడించి, అధికారమంతా వెలగబెట్టినట్టు, చుట్టూ మనిషిమీదమనిషి నుంచున్నా, తాను మట్టుకు బాసినపట్టు వేసేస్తోన్నాడు. అంతతో ఆపుచెయ్యవచ్చునా, తన అదృష్టంఅంతా గమనించలేదేమో అన్నట్టు, బాసినపట్టు మనిషి. అరచేత్తో కులాసాగా, తనమోకాలిచిప్పల మీద, ఆదితాళం వినిపించడం మొదలెట్టాడు. నుంచున్నవాళ్లలో ఒక విద్యార్థికి వళ్లురవిలింది కాబోలు, కారణంచెప్పకుండా కలబడి, మోకాళ్ల చిప్పలు పగిలేట్లా బాసినపట్టుమనిషిని బల్లమీదనుంచి పడగొట్టాడు. అదే మంటే పోయటిక్ జస్టిస్సంటా డాతడు, కొట్టినవాడూ, పడ్డవాడూ వగురు

స్తోనేయున్నారు, కలిగినఖాళీని, మరోముగ్గురుగంధర్వులు సొమ్ము చేసుకున్నారు. ఈస్టేషన్లో ఎక్కి పైస్టేషన్లోదిగే పదినిముషాల ప్రయాణీకుడు కూడా, క్షణికపద్మాసనయోగం కాంక్షించనా! అదో రైలురోగం. వాళ్ళల్లోమళ్ళాముఖాలుచూచుకుంటామన్న మాట మరచిపోతారు. ఒక్క అడుగు ముందేసినవాడికి రైలు పెద్దలార్జించిన కాణాచి. మానవునిఅల్పత్వం అరాతియ్యడానికి, ఆనాటిరైలుప్రయాణంకన్న అనువు పదును దొరకదనుకున్నాడు చతుర్వేది.

ఆ పెట్టెను వలచినప్రయాణీకుల కానాడు మరోదుస్సంఘటన దాపరించింది. కుమ్మకుని, తీరా, వ్యాయామబలీయు డొక శెలమదొర లోపల పడ్డాడు. అతని పెంపుడుకుక్క వెనక దిగడిపోయింది. ఉద్యోగాంతమున మాంసాహారంపెట్టి పెంచలేక, ఒక ఫారెస్టాఫీసరు అమ్మిన బ్లడ్హౌండు జాతి జాగిలమట, అంతకన్న తాని పైడిగ్రీ తెలియదు. నిత్యం నిర్ణీత కాలములో దానికి మాంసమందిస్తోన్న ఫారెస్టుగార్డోనాడు ఉత్తచేతుల్తో దానికెదరకెడ్తే, పాపంవాడు కేకపెట్టడానికేనా వీల్లేకుండా వాడికంఠం ముడి కొరికేసిందన్న వివరంవినా, దాని అంటిసిడెంట్సు తెలియవు. లోపల నుంచి దొర మోలక్ మోలక్ అని గుండెలవిసేలా బొబ్బలెడ్తోన్నాడు. ప్లాట్ఫారం వంచనుంచి జాగిలం భం భంరావాలు శ్రవణపుటాలను బ్రద్దలు కొడ్తోన్నై. బహుభయానకంగా బాయ్బాయ్ మంటో రివ్వున యజమాని కేక వెంటనే జాగిలం, పెట్టెగేటునుపట్టి ఉన్నవాళ్ళమీదకురికి, నోటికందినమట్టుకు కాలోచెయ్యో, కట్టుపంచో పీకేసి, ఆపైకి దాటిదొరక్క ప్లాట్ఫారంమీదికి దూకుతోండడం, మరోకేకకు ద్విగుణీకృతోద్వేగంతో పునః ఎగబడి దిగడ్డవాళ్ళను వీపులమీద మెడలమీద గోళ్ళతోరక్కి రక్తపాతం చేస్తోండడం, ఈవరసని నానాభీభత్సం చేస్తోంది.

పైవాణ్ణి వేసుకుపోతుందిక దాఅని, కథలో కోమటిమాదిరిని, ఎవరి చాటుకు ఎవరు తప్పుకోడానికి జాగాఉందిగనుక! లోపలయజమాని మమకారం, బైట జాగిలాయి భక్తివిశ్వాసాలు, వీటిమధ్య జనం గక్తం కళ్ళ చూస్తున్నారేగాని. దిగరు, దిగలేరు. జాగిలం కుప్పించినప్పుడల్లా, చెక్కల మీద జనం గొల్లుమంటున్నారు.

ఇంతలో చతుర్వేదిసాయమపేక్షించియున్న వయోవృద్ధు, ఈస్టేషన్లోదిగాల్సి, ఆరోహణావరోహణ జనప్రవాహ బలాబలాల తారతమ్యత్వేనా,

ముందరకో వెనక్కో నెట్టబడుతో, తుల మొత్తుఊతంపెట్టి నిలదొక్కుకో లేక, చెక్కలమీద నిస్సహాయస్థితిలో ఊగులాడుతో. వేటకుక్కకు అభిముఖుడైనాడు.

దభీమని ప్రళయ కాలాభీల భైరవోదగ్రతతో, నిప్పులుకక్కుతో, ఊర్ధ్వ ముఖంగా లంఘింపనుంకించుచున్న వేటకుక్కశాతిదీర్ఘదంష్ట్రికల వాత నాముదుసలి పడనైయున్నాడని యెచటనుంచిచూచిందో, భానుదీప్తితో వెలుగుతోన్న పదునేడుపదునెనిమిదియేండ్లవీరకుమారి ఒకర్తుక, పదారువన్నె బంగరుఛాయ, అతులగ్నిగోళాలాముహూర్తంలో చాపముక్తశరవేగంతో ఆదెసకురికి, గుండెలుగుభిల్లుమన ఒక్కబొబ్బపెట్టి, మెడపటకానుపట్టి, జాగిలాన్ని మరికదలకుండా నొక్కిపట్టి ముదుసలిప్రాణానికి, తనప్రాణం అడ్డంగవేసింది.

“కంఠపాశంబులింతడుస్సిన, మీదబడి, దిశాకరినైన గెడపజాలు” నన్నట్లుంది, జాగిలం.

ముదుసలిప్రాణరక్షణమాటఏమైన, అపట్టేతప్పితే నిస్సంశయంగా జాగిలమాకన్యకండలు చెండేసును. ఈసాహసం కళ్ళపడ్డంతమేర జనం భయకంపితులయారు. ఒక్కనిముషం భయంకరనిశ్శబ్దతనింగి నావరించింది.

ప్లాట్ఫారంవంచనున్నచతుర్వేది చేతులుచాచగా, ఆవయోవృద్ధు రైలు దిగాడు. “నాకు ప్రాణభిక్షపెట్టినసాక్షాత్ దాక్షాయణి యింతలోనే అంతర్ధానమైనట్లుంది. కన్పించదేంనాయనా” అని ఆముదుసలి సజలనయనుడైనాడు. ఈలోపల నీరోసుకొచ్చిన ఎంజిన్ పెట్టెలనతుక్కొని వాటిని కుదిపింది. ఆ హెచ్చరికతో పెట్టెలగేట్లలో కల్లోలంరేచ్చింది. ఇదిపనిగాదని చతుర్వేది కాలేజీజీవితంలో తనకలవడినసంస్కారము. పెద్దమనిషితరహా, ఒకనిముషం వెనకపెట్టి, నడుంకట్టిరంగంలోకురికాడు.

కాలినున్నకొత్తజోడు తొక్కేస్తారన్న సంశయంతప్పితే, ఒకకొంటె సాహసియే. ఏలాగో అడుగుచెక్కమీది జనం కాళ్ళలోకి ఎడంకాలు పోనిచ్చాడు. కుడికాలు జాగాకువెతుకుళ్ళాడుతోంది. అంతలో అప్పటి కప్పుడెక్కడనుంచివచ్చిపడిందో అనుకోని, అంచనావేసికొని ఉండలు అవరోధపతాలమొకటి ఏదోపెళ్ళివారిమూక, అతడికుడికాలునుచెక్కకు దూరంచేసింది. అసంశప్తకులు అడ్డడకపోతే, చతుర్వేదికుడిపాదత్రాణం జారిపోకపోయేది.

చతుర్వేది శ్రోత్రియకుటుంబంలో పుట్టి పెరిగినవాడు. వస్తోన్నది స్వగ్రామం. అదో పల్లెటూరు. కాలేజీపట్నంలో పాంటులు పైజామాలు తొడుగుతోన్నవాడైనా, ఇంటికిరావడం, పెళ్ళిచూపులకు బయల్దేరాల్సిన సమయం కావడం కారణంగా, గ్రామాల్లో ధోతీ, లాల్చీ అకుజోడుధరించడం బందుగుల్లో కలిసికట్టుతనంగా ఉంటుందనే ఊహతో క్రితంసాయింత్రమే శుభ్రమైన బాటా క్రోమట్టు అకుజోడు ఎనిమిదిచ్చి కొన్నాడు. పొంకంగా బింకంగా, నల్లపాలీష్‌తో నిగనిగలాడ్తోన్న జోడును పదేపదేచూచుకుంటూన్నాడు. అజతలోనే, కుడికాలిపాదత్రాణం స్తిమితంగాసందు చూచుకు పడ్డట్టు సరిగా రైలుబద్దెకుప్లాట్ఫారం గోడకుమధ్య ఊడిపడింది. అపాటు కన్యకంటబడింది. తనసహాయమపేక్షించిన ఒకముదుసలికి అపత్సమయంలో తానాకన్యమాత్రంత్యాగబుద్ధిచూపలేకపోతినని చిన్నబుచ్చుకొన్న చతుర్వేదికి, తనపాదత్రాణపతినాపస్థను, అకన్యచూచిపోయిందని, కించి దవమానక్లేశం కలక్కపోలేదు.

అందులోను ఒంటిపాదరక్ష పోవడం బాధ భగవంతునికెఱుక. రెండవ పాదాన్నున్నదీ పోయనట్టే జమ. ఒక్కటేపోతేఅంకగణితం నాల్గు రూపాయిలేదండగకట్టినా, అనుభవంరెంటినినాలుగులు ఎనిమిదీదండగేనంటుంది. కంటిజోడులోఒకఅద్దంజారిపోవడంవంటిదా? దానికేం పండు. జోడుమడిచిపొంద్గా పైజేబులోపెట్టుకొని, రెండోకంటివాడికి తెలియకుండాయింటికొచ్చి, అఒక్కఅద్దంవేయించుకుంటేసరిపోతుంది. ఏగొడవా లేదు. ఒకపాదరక్షపోవడం దండగతోఅగదు. పైపెచ్చు పదిమందిలోను చిన్నతనం. పరువేప్రధానంగాచూచుకునే అబ్బాయిఅయితే, ఉన్నదికూడా బ్రహ్మకుతెలీనీకుండా, జారవిడవడంతప్ప మరిగత్యంతరం లేదు. అది బహు నాజూగ్గా జరగాల్సినపని. తీరావేళకుఏఘాందసుడైనా చూస్తే, “సారి ఎవరబ్బాయివి నాయనా, ప్రమాదవశాత్తూ ఒకటిజారిపోతే, పనిగట్టుకొని రెండోదాన్నికూడావిసిరేస్తివి. ఇదిసంసారాజులక్షణమేనా” అనినవ్వుతాడు. కాక ఒంటిపాదరక్షతోనే నడకసాగించాడా, ముందే నవ్వేస్తారు. వింతమనిషినిచూచినట్టు వీధిపిల్లకాయలు వెంటపడతారేమో కూడా “ఇదేదో ఒంటిచెప్పురేస్సు రాండ్రా చూచివద్దాం” అనిపదిమందినీ తోడుకొచ్చే కొంటికుర్రాణ్ణి ఏలా కానేది. పోలీసులుపరీక్షించడానికీ కారణంలేకపోలేదు. పోనీచేతికందేచోటఉందికనకనా, గప్‌చిప్‌గా

తీసి కాలికి తొడుక్కునో చంకనున్న న్యూస్పేపరులో రెండూ కట్టుకునో, అప్పటి కాలప్రదిష్ట తప్పించుకుందామంటే.

పోశ్శిఅని తెగతెంపులు చేసుకోడానికి కాని పోనీ అని సరిపెట్టుకోడానికి కాని చతుర్వేది వయస్సు మీరినవాడా? వసంతంగారిలా వృద్ధుడూ, వేదాంతిగనకనా. కాశీలో పడవదిగేసొచ్చినట్టు, కాకినాడ రోడ్డుకు రెండూవదలేసొచ్చాడుగా ఒకప్పుడు వసంతంగారు. అసుజోడైనా జాలి పడకుండా తెగమన్నడానికి, కొన్న రోజునే, కప్పులో కప్పు, వీసెడు బరువు నాడా జేయించాడు దాని ఆదాయానికి అర్భకత్వానికి సాప మాకుజోడు, ఫ్రూటు ఫ్రూటూ అంత ఇనుం మొయ్యలేక పోయింది. కాకినాడ రోడ్డుమీద పెద్దలతో ప్రసంగిస్తో నడుస్తున్నాడు. వేళ్ళదగ్గర తాడు తెగింది. వంగనైనా లేకు బ్రాహ్మణుడు, రెండోజోడులోంచి కూడా, పాదం లాగేసుకొని. నిర్మలంగా నిజపదకమలాలతో యిల్లు జేరాడు. అంతే మళ్ళా జోడెఱుగడు. తనకు జోడు అచ్చిరాలేదనుకున్నాడు. వేదాంతే అయాడు. పీడాపోయె పొరుగూర్లో జోళ్ళనమ్మి తిరగరాదట. పొళ్ళోజోడే అక్కఱలేదట. ఇదీ వసంతంగారి అనుష్ఠానిక వేదాంతం.

జోడుమీద ఆశపెట్టుకుంటే ఆనాటికి ప్రయాణానికి స్వస్తి చెప్పుకోవాలి చతుర్వేది. స్టేషనువదలి రైలెడ్తేగాని జోడురాదు. రైలును వెళ్ళనిస్తాడా, రైల్లో తనవి, అధమం సాత్విక ఆలాంటి జోళ్ళ కిమ్మత్తుచేసే, పెట్టె బేడా పుస్తకాలు, క్యాంపుకాట్, స్టవ్ వగైరాలెన్నో ఉన్నై. ఒక్కవరహా సొమ్ముకు కక్కుర్తి పడ్డాడే, యేభై వరహాలు తనకళ్ళముందునుంచి రెక్కలు కట్టుకొని ఎగిరిపోతై. అంచేత ప్రమాదహేతువైనా కుడికాలు కూడా చెక్కమీదకు లాగేదా, ప్రయాణాని కానాటికి నీళ్ళు వదలి ఎడం కాలునుకూడా ప్లాట్ఫారంమీదకు లాగేదా అన్న అనిశ్చిత పరిస్థిలో సంకట పడ్తోంటే, చప్రున ఆకన్య, అక్కడ ఎవరిచేతిలోదో గొడుగుచ్చుకొని దాని కామతో లాఘవంగా చతుర్వేది పాదత్రాణాన్ని పైకితీసింది. జోడాతనికి అందించి పోదామంటే, చతుర్వేది దాన్ని పుచ్చుకోగల స్థితిలో లేడు. ఇంతలో చెవులు చిల్లుపడేటట్టు రైలుకూసింది. గార్డు జండా నూపుతున్నాడు. రైలు పడినందుకుంటోంది. పరుగుమీద. పక్కనున్న స్త్రీలపెట్టిలోకి, ఆకన్య చతుర్వేదికి విశదంగా కన్పించేలా ఆతడి పాదరక్షను చేత్తో ఊపుతో, ఊరికింది.

తలమాడ్తో, పడిచెక్క ప్రయాణం చేస్తోన్నా చతుర్వేది కాబాధ కన్పించటం లేదు. అతడిమనసు ఆకన్యపై కేంద్రీకృతమై ఉంది. ప్రాణ రక్షణ మహాకార్యం మొదలు స్వల్పాది స్వల్పమైన తనపాదరక్ష క్షేమం వరకు ప్రకటితమైన ఆకన్య దృష్టినైశిత్యం, పరహితబుద్ధి, మన స్థైర్యం, శరీరదార్ఢ్యం అతని కథ్యయన విషయాలైనై. ముఖ్యంగా ఆమె ప్రకృతి అతణ్ని పరవశుణ్ని చేసింది నావాళ్ళు, పైవాళ్ళు అన్న వివక్షత పాటించకుండా, విపత్తులో వచ్చిపడి, మఱువరాని సహాయం చేసి పోయింది. మెఱమెచ్చు కోరదు. యిట్టినిరాడంబర సేవా కార్యం, కేవలం ఒక నిస్వార్థ, నిర్మలిన హృదయ సత్సంకల్ప, సద్భావ,సత్క్రియాభిలాషా ప్రేరితం కావాలి. ఏసేవను యీశ్వరసేవ గానే పరిగణించిన ఆమె పారమార్థికశీలము చతుర్వేదికి గ్రాహ్యమైనకొద్దీ, అతని ఆత్మలో నొక అనిర్వచనీయమైన విజ్ఞాన తరంగ మూగులాడదొడగింది. అపన్నుల ఆత్మ గౌరవం నొవ్వకుండా, వారికి వలయు సహాయం చేసి. తనను కానట్టు తప్పుకు పోవడంలో ఎట్టి భావమృదులత ద్యోతకమవుతోంది. ఇంత చిన్న వయస్సులో ఈకన్య కింత ఉత్తమసభ్యతాలక్షణ మెచ్చుట అలవడింది? ఏమహనీయులిచ్చిన అపూర్వోత్తమశిక్షా భాగ్యం ఈ త్యాగబుద్ధి? తనకు కన్యల పరిచయం తనకాలేజీలోను, స్వగ్రామంలోను లేక పోలేదు. నగరవాసుల నాగరికతలో, ప్రతిఫల వాం[illegible]రహితమైన యీ ఉదాత్తత కానరాదు గ్రామవాసుల అమాయికతలో యిట్టి దృష్టినైశిత్యం, భావ మృదులత, నపేక్షించలేము.

"అహో! ఎవరీకన్య? ఎక్కడికి? ఎక్కడనుంచి?"అని చతుర్వేది ఆలోచనాధీనమనస్కుడయాడు.

తాను దిగాల్సిన స్టేషను రాగానే పెట్టెనుదింపుకొని, బెడ్డింగుకొఱకు చతుర్వేది లోపలకువెళ్ళిన నిముషంలో ఆకన్య అతడిపాదరక్ష నాతని పెట్టిమీదపెట్టి పోయింది. కృతజ్ఞతచెప్పే సావకాశమైనా లేకుండా ఆమె అంతర్హితమైనందు కాతడు తెచ్చపడ్తోంటే గేట్లోటిక్కెట్టుయిస్తోంది. ఆమెకూడా, తనస్టేషన్లోనేదిగినందుకు సంతసపడి, తొందరగా పోర్టరుకు సామానువెత్తి గేట్లోకి వెళ్ళాడు. ఆమె స్టేషనువదలి నాలుగుబారలు వెళ్లే సరికి ఆమెను సమీపించాడు. "అదిగువస్టేషన్లోచూచిన రౌద్రరసోల్లసిత

మూర్తియేనా ఈ సాధుశీల సమన్వితౌదార్యమును సాక్షాత్కరిస్తోన్న ఈ సౌందర్యమూర్తి'' అని ఆశ్చర్యచకితుడైనాడు.

కన్నియ అవయవసౌష్టవం, కనుముక్కుతీరు, బంగరుమైఛాయా కామ స్ఫోరకములైనాపురుషుల నల్లంతదూరంలో నిలబెట్టే వీక్షణచ్యుతులు వీర వనితాలక్షణాలు ఆపెయందు భాసిస్తున్నై.

అంచేత సంభాషణావిధానం తోచక, చతుర్వేది యిబ్బందిపడ్తోంటే యువకుని పలుకరిస్తున్నానన్న శంకాసంకులత్వ మేమీ కానరాని సహజ కంఠంతో, "ఈ స్టేషనుకనతిదూరంలో రంగాలయమున్న ఫలాని అగ్రహారానికి దారి యేటండి" అని సూటుగా అడిగింది.

తత్క్షణావసరవిషయం, ఆపె నిశితంగాప్రశ్నించినపుడు, ఆపెకు ఆ సమాచారమిచ్చుట ప్రథమకర్తవ్యంగా భావించి, "పావుగంటలో బస్సు వస్తుంది. దానిమీద[!]మా గ్రామం చేరితే, అచ్చటనుంచి అగ్రహారం అరగంట ప్రయాణం అది రాజబాట. ఇచ్చటనుంచే అయితే దూరంకల్సివచ్చినా, చెట్లంటా, చేమలంటా కాలినడకను వెళ్ళాలి. ఈ ఉత్తరపురోద్దుచ్చుకుంటే పిల్లకాల్వగట్టు ఎక్కుతారు. అక్కడనుంచి అడుగడుక్కీ వాకబుచేస్తూ, ఎడంచేతిమీదుగా పొలంగట్లంట పడిపోవాలి. మధ్య మధ్య కంటకావృతంగా ఉంటై ఆగట్లు, స్త్రీలకాదారి ప్రయాసకాదా''అని, తీరా స్త్రీ పురుష వ్యత్యాసంమాట ఆపెవద్ద నోరుజారితినే, అని భిడియబడ్డాడు. "పోనీ మాగ్రామమొచ్చి, రాత్రిఉండి. ఉదయమే సుఖంగా అగ్రహారం చేరడంమంచిదికాదా'' అన్నాడు.

ఆమాటలో అంతర్గర్భితంగా ఆహ్వానంస్ఫురిస్తోన్నా, తదాహ్వానం అంగీకారయోగ్యమైనదే అయినా, "ప్రయాస అన్నారుకాని, అడ్డదారి దూరంచెప్పారుకా''దండి. నాల్గుమైళ్ళలోపుఅన్నాడు. అంతేనా, అయితే చీకటిపడకుండా సునాయాసంగా అగ్రహారం చేరుకోగలనని, మరి సంభాషణ కెడమీయకుండా, "నమస్తే, సెలవండి,'' అనిమాత్రంఅని, స్వాతంత్ర్య సమరంనాటి సేవాగ్రాం బాలభటుని చాకచక్యంతో, చరచరా అడుగేసింది. ఆపెకదలికలో కానవస్తోన్న సంకల్పబలానికి, కాయకష్టసంసిద్ధతకు కర్పూరవప్పచెప్పి నిలబడిపోయాడు.

చతుర్వేది యింటికొస్తోన్నది బస్‌రూటయినా, మనసు అగ్రహారం అడ్డదారి పట్టింది. ఏదో ఓటమి ననుభవించినవానివిధాన మనసు మథనపడు

తోంది. ఆకన్యకోరినసమాధానం వినా, పైన ఒక్కమాట కలపలేక పోయాడు. ఆమె ఏదోగీటుగీసి నుంచోపెట్టినట్టు, కట్టుడిపోయి. అంగుళం కదలలేకపోయాడు. ఆమె నభిసంధింప నాశించాడు కాని, తాను అల్పప్రసంగం చేయబూనలేడే. సరసల్లాపేచ్ఛకలవాడు కాడే. తన సత్సంకల్పాన్ని సంశయించి. తనగ్రామంవచ్చుటకామె విముఖురాలు కాలేదుకద. ఒకటే ప్రశ్న, ఒకటే ఉత్తరవు. ఆమెమాత్ర మెందుకంత ముభావంగా ఉండాలి! తానేల ఆకన్య సముఖాన అప్రతిభుడైనాడు. తనతొల్లింటి చాకచక్యమేమైంది, తనకంఠంయెందుకు మూగపోవాలి. తనశక్తియుక్తులేమయినై? ఏమిటి ఆమెమూర్తిత్వప్రభావం! అని పౌరుషందెబ్బతిన్నవాడివైఖరి నింటివద్ద ముభావంగా ఉన్నాడు. బాగా వ్రాసానని ఖచ్చితంగా చెప్పినా, అక్క కాంతమ్మ పరీక్షలుబాగా వ్రాసినట్టేనా అబ్బాయి, అని రెండుమూడుపర్యాయములు ముపరకించింది. ఇంటికొచ్చిననాటినుంచి ఆకన్యనుకలుసుకొని అభినందించిరావాలన్న కోర్కె బలవత్తరమైంది. అదితనకనీసధర్మమని భావించాడు. తనఅభిలాష, ఒకరకంసంస్కారమున్నవాళ్ళకు అర్థవంతమైనదే అయినా, తదితరుల నాసున్నితభావం, సందేహాస్పదులను చేయవచ్చు. ఉన్నమాట చెప్పకోలేకున్నాడు. అది, కానిమాట కాకపోయినా.

తాను అవివాహితుడు. ఆమెకన్య. యువతీయువకులు విజ్ఞానవిషయకమనస్సంబాధులు కావచ్చునేమాత్రం జ్ఞానోదయమైనవారు తన యింటివద్ద లేరు యువతీయువకులఅన్యోన్యతకు, జనసామాన్యమెరుగుచున్నది, ఒకటే కారణం, ఆకన్యను చూచివస్తానంటే, తనవాళ్ళు తనసంకల్పానికి విపరీతార్థం తెచ్చిపెట్టి, అక్రమంగా తనకు స్వేచ్ఛాప్రవృత్తినారోపించవచ్చు. తనవీరపూజాధ్యాసను, స్త్రీలోలత గా అన్వయించుకోవచ్చు.

"వకే. వకే శాంతమ్మా, యింకా ఏంకావాలే, యేదో ఒకసంబంధం చూచి చతుర్వేదిని కట్టిపడేయూ శే" అంటూ అవహేళనచేస్తుంది శేషమ్మ పిన్ని. ముసిముసినవ్వులు మొలకలెట్టగలదు తన మేనకోడలు సుభద్ర.

అంచేత యింటివద్ద చెప్పివెళ్ళడానికి వీలులేదు. చడీచప్పుడూ కాకుండా అగ్రహారంవెళ్ళివస్తాను అంటే, ఆకన్య అగ్రహారంలో ఎక్కడుందో, అక్కడ యింకాఉందోలేదో తెలియదు. పోనీ, ఒక అంతరంగికుడిద్వారా తెలుసుకుందామా అంటే, ఆమె పేరు తెలియదు. అగ్రహా

గంగలో నాలుగైదు రోజులు బసచేసి. ఎక్కేగడపా, దిగేగడపా, ఊరంతా యాగీ అయితే కాని, ఆకన్యకంటబడదన్న మాట.

ఇన్ని విధాల వితర్కించుకుంటూ పదిరోజుల్లోను పదిసార్లైనా సైకిల్ వీధిలో పెట్టాడు. పదిసార్లయినా యింట్లో పెట్టాడు. శరీరాన్ని స్వగ్రామానికి మనసును అగ్రహారానికి వప్పగించి ఊగిసలాడుతున్నాడు. న్యాయబద్ధమైన ఆత్మప్రబోధాన్ని అదుపులో పెట్టలేకున్న పెద్దమనిషి పాట్లు. పెద్దమనిషిఅని పేరేసుకున్న యువకునికి మరీయిబ్బంది అప్రమేయం. జీవితసౌఖ్యాన్ని ఆస్వాదించే వయసొచ్చిన యువకుడొక జవ్వనితో సత్ప్రసంగం చెయ్యడమే యజ్ఞమంతపని గానా. స్వల్పవిషయాలకే కులపాంసనమైనట్లు ఘూర్ణిల్లేసంకుచితస్వభావులు యింకా ఉన్నారా అన్నా

---

# 2. ఎవరమ్మా యో!

చతుర్వేది చెప్పిన మాదిరిని ఉత్తరపురోడ్డుచ్చుకొన్న కన్యపిల్ల కాల్వగట్టు చేరింది. వంతెన దాటి యెడంచేతిమీదుగా పొలంగట్లంట తొక్కుకుపోతే. ఒక్క అరమైల్లో అగ్రహారం. వంతెనకు కుడిచేతిమీదుగా కన్పిస్తోన్న మట్టిరోడ్డు. పదిపదిహేను వందల గడపతో విస్తరిల్లిన ఒక పెద్దగ్రామానికి దారితీస్తుంది.

ఆమె వంతెనమొగలో ఆగి కుడిచేతివైపు గ్రామపరిసరాలపై చూడ్కి నిలిపింది. దారిచీలిన మొగలో కొత్త వాళ్ళకు సాధారణంగా కలిగే సందిగ్ధ కారణాన కాదు. ఆమె కళ్ళల్లో మిక్కుటమైన కార్యభారం, ఆమె ఆదాయానుభవాలకు మించిన వ్యవహారబాధ్యత కానవస్తోన్నై. శరీరగత కామేచ్ఛను తీర్చుకొని, పరిణయమాడుటకు వెనుదీసిన ఒక యువకునిచే వంచింపబడ్డ ఒక మెడికల్ విద్యార్థిని యొక్క మానప్రాణరక్షణ మదినిడుకొని ఆయువకునితో సంప్రతించి అతణ్ని వివాహశుభకర్మకు వప్పించుటకు ఈ ప్రాంతాల కొచ్చింది.

ఆయువకుడీ గ్రామవాసి. డాక్టరు పరీక్షనిచ్చి స్వగ్రామంలోనే ప్రాక్టీసు పెట్టాడు. అగ్రహారం వెళ్ళాల్సిన పని తనస్వవిషయం. మున్ముందు

అగ్రహారం పోదునా, కాక డాక్టరు గ్రామం పోదునా, అని తటపటాయిస్తో, ఒక నిమేష కాలం, ఖంతెన మొగలో జాగుచేసే సరికి, ఎటు వెళ్ళవలసిందీ, దైవమే నిర్ణయించాడు.

కుడిచేతివైపున, కూతవేటుదూరాన కన్పిస్తోన్న తాడిమట్టల మడుపులోనుంచి వెళ్ళబెట్టుగా, ఆడంగులు గొల్లుమన్న ఆక్రందనలు, నిద్దట్లో కెవ్వుమన్న పిల్లలకంఠాలు, హృదయ విదారకంగా వినవచ్చినై. అచట ఎవరికో సాపం యేదో అమాంతంగా వచ్చిపడ్డ విపత్తయి ఉంటుందది. అప్రళయ మేమైై యుండునా అని ఆమె కలవరపడ్తోండగా, ఆదెసనుంచి వెనకపాటున ఎవరో తరుము కొస్తోన్నట్టు, కంగారుగా, గాలికి భుజం మీదనుంచి అల్లంతలో ఎగిరిపడిపోయిన ఉత్తరీయాన్ని పడ్డచోటే వదలేసి, మెడత్రిప్పకుండా, యెత్తుపల్లాలు సరకు చేయకుండా, మధ్యవయస్కుడొకడు, సైకిల్ త్రొక్కుకొస్తోన్నాడు. అగి విషయం చెప్పేట్టు కనపడడు. ఎందుకైన మంచిదని, ఒకఅడుగు మార్గమధ్యాని కేనే సరికి, మడుపువద్ద పరిస్థితి ఒకకొంత ఆమెదృష్టిపథాన పడింది. పిల్లకాల్వ గట్టు ఎగువపుంతలో బాగాపల్లాన్ని, బోదగట్టుకు ఒరిగిఉన్న బండి గూడు, తలమీద పెట్టుకొని మోస్తోన్నట్టు, ఆగూడుపైన అపసవ్యంగా ఒకబండిచక్రం, అగుపించై. ఒక యెద్దు చేలమీదపరుగిడుతోంది. రెండోది కాడిదగ్గరే కదలలేక కట్టడినట్టుంది. ఎవరికేమి ప్రమాదకరమైన ఘాతలు తగిలాయో, నలుగురైదుగురు బోదగట్టున కూలబడ్డట్టున్నారు. హా హా రావాలు వినుపిస్తోన్నై. /

సైకిల్ మనిషి పదిబారల్లో యదర ఉండగానే, “గాయాలు తగిలాయా ఎముకలే విరిగాయా” అని కేక వేసింది,

సమాధానంలేదు సరికదా, సైకిల్ మనిషి తనను తప్పించుకొని పోవ సమకట్టినట్టు కన్పిస్తోన్నాడు. ఈతడు ఆహతగాత్రులకు సహాయం చేకూర్చుకొని వెళ్ళుటకు వస్తోన్నవాడు కాడు. ఆపత్సముద్రంలో మునిగియున్న దైవోపహతులవంకనైన చూడనొల్లక వచ్చేస్తోన్న ఈపశుతుల్యుణ్ని వీసమెత్తయినా పరహితబుద్ధిలేని యీ పాపిని తోసుకు పోనీయడం ప్రాజ్ఞలక్షణం కాదని భావించింది.

పిక్కబలముంటే, దుర్మార్గం దానంతటదే తోసుకు పోతుందన్న దుర్బుద్ధితో వీడుతొక్కుకు పోరాదని నిశ్చయించి, పాదాలు గట్టిగా

నిల్లొక్కి—, విసురున ధరికొచ్చిన సైకిల్ హేండిల్ బార్ను దఖీలున పట్టు కుంది. తాను తూలితేంగనక, అతడు, ఊడి క్రింద పడ్డాడు.

"నీసైకిల్ని చూచి రెొద్దు బెదిరి బండినిపల్లానికి లాగేసిఉన్నా అది నీచేసిన నేరంకాదేమోకాని, నిస్సహాయుల నాదురవస్థలో వదలివేసి రావడంనిస్సంశయంగా నేరం. భగవంతునికిసమాధానం చెప్పకోదగ్గ రాక్షసకృత్యం. పుష్టిగాకనిపిస్తావు, పెద్దమనిషివేషంవేశావు. ఈపిటికి తనం ఏంకర్మం వచ్చిందయ్యా, పారిపోతావు? నాఖనకాలేవచ్చె. మనమిర్వురంకలసి వారికిసహాయంచేయలేకపోము. మనుష్యులమైపుట్టిన తర్వాత, అపన్నులకామాత్రంసేవచేయడం మన కనీసకర్తవ్యం. విశేష ధర్మమేమీకాద"ని చెప్తోనే, అతనికిచేయూతనిచ్చి లేవతీసి. హేండిల్ బారును మలుపుపై పుకుత్రిప్ప, అతనికిదెబ్బతిమ్మిరితగ్గి ప్రతీకారంఆలోచించే వ్యవధీయకుండా, తొక్కమనితొందరపెట్టి, సైకిల్ కదలడంతోనే క్యారేజీ మీద కూర్చుంది.

మడుపుదగ్గరదృశ్యం భీభత్సంగా ఉంది. ముసలావిడకు తలపగిలి రక్తంస్రవిస్తోంది. ఎడంభుజంకంటూ ఆపార్శ్వం రక్తంసిక్తమైంది. ఆవిడ మేనకోడలు రెండోఆవిడ, ముప్పైఏళ్ళుంటాయి. ఆపెకు నుదుటిమీద నిమ్మకాయంతబొప్పకట్టింది. తల్లిప్రేమఅంటారు అ పభావమో, దైవ కటాక్షమో, ఆపెపిల్లలు చెక్కుచెదరలేదు. ముసలమ్మగారు స్పృహ తప్పఉంది. బండివాడు మోకాలిచిప్పపగిలి యమబాధ పడ్తోన్నాడు. ఆతల్లీ పిల్లలు ముసలమ్మగారిచుట్టూమూగి, ఏకధారిగా విలపిస్తోన్నారు.

కన్య, వెడ్తోనేముసలమ్మగారినాడిచూచి, ప్రాణభయంలేదని రెండో ఆవిడకు ధైర్యంచెప్పింది. సెకనైనాతడవుచేయకుండా, చేతికందినపైను పంచను చింపి, ఆసుపత్రినమోనాఉండలుచుట్టి, ముసలమ్మగారికి, బండి వాడికి కట్లుకట్టి రక్తస్రవణ నరికట్టింది. ముసలమ్మగారినిలేవతీసి, చెంప భుజం శుభ్రంగాకడిగి, నీళ్ళుపట్టించి, తనభుజంమీదకు ఆపెతలను జేరదీసు కొని, తనచీరకొంగుతో విసురుతోండగా, ఆవిడకళ్ళు తెఱచింది. ముసలమ్మగారికి కడంటినప్రాణం కదలివచ్చిందికాబోలు, దాంతోటే దుఃఖం ముంచుకొచ్చింది. వాళ్ళంతా తిరుగా గొల్లుమన్నారు.

"మామ్మగారూ, మీగు కనుమూస్తే, తల్లీ, పిల్లలు బెంబేలుపడిపో తున్నారు. వాళ్ళనుదగ్గరకుతీసుకొని ధైర్యంచెప్పండి. పిల్లలకేమీ

దెబ్బతగలకుండా దాటడం, భగవద్విలాసము, ఎంతఅదృష్టమో గమనించండి" అని దుఃఖంతో నురసిల్లుతోన్న ఆకుటుంబానికి, ఉన్నంతలో, క్షణంలో మేలుచూపి, కించెదానందం రేకెత్తించింది.

జంబుకానా పరచుకొని రెండో ఆవిడను కూర్చోమని, ఆవిడతొడమీద ముసలావిడ తలపెట్టుకునేటట్టు సవరించి వప్పగించింది.

బండివాడిని పలకరించి, "కొంత, వాడి కాలు కదపడం, విదపడం పనికిరాదు. కట్టు బిగి తగ్గరాదు. అదృష్టవంతుడవు. ఎముక విరగలేదు. కొద్ది మాత్రం గాడి తప్పింది, రెండుకట్లతో సద్దుకొంటుంది. నాలుగో రోజుకల్లా పనికి పోగలవు" అని ధైర్యం చెప్పింది. కాళ్ళమీదా రెక్కల మీదా ఆధారపడ్డ తనబ్రతుకు కేమి కాదని నిరాశాక్రాంతుడైన వాడి కళ్ళల్లో కాస్త ఆశాకిరణం గోచరించింది.

పిల్లలకు ఫలహారం కాళ్ళబాడి కడిగి, వాళ్ళతో తెచ్చుకొన్న టిన్నులోంచి బిస్కట్లుతీసి వాళ్ళకు పెట్టింది. పిల్లలు వాటిని కరకరలాడిస్తోంటే, తల్లి చేతిలోబిడ్డను తానుతీసుకొని, పాలబుడ్డి పాలుపట్టిస్తో, మామ్మగారి కాళ్ళ దగ్గర జంబుకానా మీద కూర్చుంది. కన్నుమూసి తెరచినంతలో యిన్ని పనులు చక్కబెట్టి, వారిదిగులును మఱపించి, స్తిమితంగా కూర్చున్న కన్యను నిర్ఘాంతపోయిచూస్తోంది రెండో ఆవిడ.

కాస్తంతస్వాస్థ్యంచిక్కిందేమో ముసలమ్మగారికి, కన్యను ఆప్యాయతగా స్పృశిస్తో. "అమ్మాయి! ఆ కాశంమీదనుంచిఊడిపడ్డట్టువచ్చి. ఆపత్తులో మమ్మ ఆదుకొన్నావమ్మా. ఏవూరో, ఎవరమ్మాయివో, ఎక్కడికెడ్తోన్నావో కాని కొత్తవాళ్ళమన్న ఎరమరిక ఏకొంచెంలేకుండా, నాకు కడుపునపుట్టిన కూతురుకన్న ఎక్కువగా సేవచేశావు నీఋణంతీర్చుకోలేనమ్మా, తల్లీ!" అని చేయిపట్టుకొని మమకారంగుమ్మరించింది.

"ఇంకా ఈ అమ్మాయికి వివాహమైనట్టుకన్పించదత్తా. బిడ్డలను కని పెంచినవాళ్ళకన్న ఎక్కువఅనుభవంతో, బెంబేలుపడ్డ నాబిడ్డలను బుజ్జగించి ఆడించింది. పదినిముషాల్లో కన్నతల్లిని మఱపించింది. చూడు శేషీ, సీతా ఆపెనుపట్టుకువదలడంలేదు. పిల్లలంటే యింతఅనురాగం ఈపెకెక్కడ అలవడిందో" అంటో, "అక్కబిడ్డలను కాని మరోదగ్గరవాళ్ళను కాని పెంచావమ్మా, ఏయింటికోడలవవుతావో, ఎవరిఅదృష్టంపండనైయుందో కద" అంది రెండో ఆవిడ.

ఈ అభినందనలకు భిడియపడ్డో, కాక స్వవిషయం చెప్పకోనుటకు సంసిద్ధ కాకనో, "మామ్మగారూ, రక్తపుపెల్లుఅరికట్టడానికి, తక్షణగర్వ్య గాకట్టివకట్టిది. గాయంతొందరగా మానుపుట్టుటకు ఆసుపత్రి టించర్లతో కొద్దిచికిత్స అవుసరం. ఈప్రక్కగ్రామంలో ఏదైన ఆసుపత్రిఉంటే, మిమ్మక్కడికి చేరుస్తా. ఇది డాక్టరెవరైనా ఉన్నగ్రామమేనా యింతకు" అని తెలియనట్టు అడిగింది.

"సారి, ఆసుపత్రిలేకపోవడమేమిటమ్మా? ఇక్కడ డాక్టరు నాకు..." అని ముసలావిడ ఏదో చెప్పబోతుంటే, కన్యవత్తిడివదల్చుకోలేక వచ్చిన వాడుకాని, సద్బుద్ధితోవచ్చాడుకనక వా సైకిల్ ఆసామీ, కన్యవద్దకువచ్చి, "యిక నేను వెళ్ళిపోతున్నా" నన్నాడు.

కాలికట్టుతో కాస్త తేరుకున్న బండివాడు సైకిల్ ఆసామీనిచూడ్డంతోనే తోకతొక్కినత్రాచులా, క్రగతంతోలేస్తూ, "వీడే, వీడే! అమ్మ వీడి మూలానే బండిబోల్తాకొట్టింది. ఏమైతేంపారిపోయాడు బుర్రపగలేతును" అని ఆవుద్రేకంలో, క్రపత్తి పట్టుచాలక, పడిపోయాడు.

"కట్టు కాలిమీద పడలేదు, కొంతనయం" అనుకొంది కన్య.

కనుమేరదూరంలో మరోమనిషి కానరాకున్నాడు. ఉన్న ఒక్కణ్ణీ కఠినోక్తులతో చెందనాడుకోడం చేతకానిపని. ఆతణ్ణిదారినిపెట్టుకొని ఆతడిసాయంపొందవచ్చుననుకొని, బండివాడిని మందలించింది. "ఎంతవడుదుడుకుప్రదేశంలో రావాల్సివచ్చినా కాడి దిగడు బండివాడు. అటిస్థలంలోనైనా సైకిల్ని చేత్తో నడిపించుకొచ్చే ఓర్మిఉండదు సైకిల్ మనిషికి. మోటార్లకే శుభ్రంగా అలవాటుపడ్డ యీకోజుల్లో సైకిల్నిచూచి పల్లానికి లాగేసే బెదురుగొడ్డు నీచాపటేయెద్దోటిఉందని ఆతడికి తెలియదు. నీయెద్దు స్వభావం ఎరుగున్నవాడివి, వెనకసైకిల్ గంట వినుపించడంతోనే, నీవు బండిదిగిఉంటే, ఆపదంగులకీఅపత్తూ రాకపోను, ఆతడి బుర్ర పగలేస్తాననే, నీబీరాలకూ అవసరంలేకపోను. పెద్దమనిషినిపట్టుకొని పైగా పాటిపోయాడంటావా, కష్టంలో ఉన్నవాడితో కజ్జాపెట్టుకోవడం, సమంజసం కాదని ఆతడు ఊరుకొన్నాడుగదా అని రెచ్చిపోతావా? నేనిక్కడకు వచ్చింది ఆతడిసైకిల్ మీదనే. బాధలోనీవు నాకాకగమనించలేదు. నాకు

కట్టునేస్సు తెల్సి ఉండడంచేత, తొందరగా సైకిల్ మీదవచ్చి, నన్నిక్కడకు తోడుకొనివచ్చిన ధర్మాత్ముణ్ణి పట్టుకొని పారిపోయాడని, ఎంతసులభంగా ఆనేశావ్" అంది.

"తెలియక తొందరపడ్డానమ్మా" అని తమాయించాడు బండివాడు.

ఇక సైకిల్ మనిషో, "నేరంకట్టడానికైనా, కమ్మేయడానికైనా స్త్రీకే చెల్లిం" దనుకొంటోనే ఆత్మపరీక్షలో పడ్డాడు. సైకిల్నా పినచోట ఆపె ఉపదేశాన్ని పెడచెవిని పెట్టకలిగాడు కాని ఇప్పుడు ఆపెఉదారత తన అల్పత్వాన్ని తనకళ్లముందు పెట్టింది. "ఒంటిగా ఉన్నపుడాపె దూషించినా, రచ్చకొచ్చినపుడు పరులసమక్షంలో తనను భూషించింది. నలుగురిలోను తనను బహుయోగ్యునిగా చిత్రించి, తనకు అల్లరి అవమానం తప్పించింది. ఎంతమంచిస్వభావంకలవాళ్ళు. సరసులుఉంటారు" అని అబ్బురపడ్డాడు. పరుల మంచిని గ్రహించి, వారిరీతినీతులను మనసులో స్తవంచేసుకోవడమేగద, హృదయ పరివర్తన క్రమానికి ప్రథమసోపానము. ఇక నాతడు ఎవరివిన్నపమూ అక్కరలేకుండ అచ్చటు. కాడిక్రిందపడి, గింజుకొన్నకొద్దీ మెడ త్రాటిని ఉరిపోసుకొంటోన్న ఎద్దును విప్పి రెండో యెద్దు సరసకు తోలి, గడ్డి, కాడా వేసొచ్చాడు. విసురునచొక్కా లాగేసి పారేసి, పంచి బిగ్గట్టాడు. అడుసులో కూరుకుపోయిన బండి చక్రాన్ని పైకెత్త సమకట్టాడు. అహో! ఏమి అహృదయ పరివర్తన మహత్తు. కండ, దండవినియోగానికొచ్చె. మనిషిలో కళా కాంతీ హెచ్చె. ముద్దొస్తున్నాడు. శాప బలంచేత యుద్ధభూమిలో కూరుకుపోయిన రథచక్రాన్ని భుజబలంతో లేవనెత్తుతోన్న భారత వీరుణ్ని తలపునకు తెస్తున్నాడు, అప్పటి కార్యదీక్షలో. పత్యానికొచ్చిన తత్వం భోజనయావను పడ్డట్టు, చేతనయిందంతా చేసెయ్యాలనే పరోపకారేచ్ఛ బుర్రనుపట్టేసింది. కొంతమందిలో, ఏదైనా, అతి. ఎంతతప్పుకొని తిరిగాడో అంతపూసుకుంటున్నాడు.

ఈతడి భావపరిణామాన్ని గ్రహించినకన్య, అతణ్ని చేరబిల్చి, "అయ్యా అంతకన్న అవసరకార్యముంది. నీవు ప్రక్కగ్రామంవెళ్ళి తొందరగా రెండు మూడు రిక్షాసైకిళ్ళను పంపిస్తే, వీరిని ఆసుపత్రి చేరుస్తాను

ఆపింగుల కొచ్చిన ఉపద్రవంచేత, మనసువికలమై, ఆదిలో నీపట్ల మర్యాదాతి క్రమణచేశా. బుద్ధిమంతుడివి, మనసులో పెట్టుకోకు మన్నించు. రిక్షాసైకిళ్ళ నిచటకు పంపించి, యిక నీదారిని నీవు వెళ్ళ వచ్చున''ని నాతణ్ని పంపించింది.

పత్రికావిలేఖరులను కూడ మరిపించే వార్తాసేకరణశక్తి ముసలమ్మల సొమ్ము కాబట్టి, రిక్షాలొచ్చే లోపల. అవ్యవధిలో, డాక్టరు వివాహవిషైకరహస్యాన్ని తెల్సుకోదలచి యథాలాపంగా ప్రసంగిస్తోన్నట్టు, ఈ వూరు డాక్టర్ను గురించి, ఏదో చెప్పబోయారు మామ్మగారు,'' అని కదిపింది కన్య.

“ఏమన్నావే రవణమ్మా! అవును. ఆడాక్టరు నామేనయల్లుడేనమ్మ. మారవణమ్మను సోదరుడు. ఈతడికి పిల్లనిస్తామని ఎవరోవస్తే, వాడు వద్దంటోన్నా, పిల్లను చూచి రావడానికి బయల్దేరాం. మొదట్లోనే ఇల్లా అయి ఊరుకుంది. వాడిపెళ్ళిమాట ఏలాఉన్నా. మధ్యన నాపెళ్ళిఅయింది'' అంది ముసిలావిడ, తలకట్టు తడుముకొంటో!

“బలవంతంపెళ్ళిళ్ళు చెయ్యబోతే, యిల్లాకాక, యిహెల్లా కాబోతుందనుకొన్నావు ఒహప్పుడు! బయల్దేరేదాకా నిలవనిచ్చావా, నుంచోనిచ్చావా'' అంది రవణమ్మ.

వెతకబోయిన తీగ కాళ్ళకు తగిలినట్టుంది, కన్యకు వాళ్ళ సంభాషణ. అందులోనూ, అమాట్లాడే వాళ్ళు, తానునిర్వహించాల్సియున్న రాయభారంలో ముఖ్యపాత్రలు కావడం, శుభసూచికంగా కన్పించింది,

“ఏబలవంతం చెయ్యక, యేలాగే. పాతికేళ్ళు వెడతైవాడికి వచ్చే జేష్టమాసానికి. ఇంకెంత కాలం వాడ్ని అలా పెట్టుకొని కూర్చోమే. కంటికింపైన చోట కాలంగడిపేవాడైతే కొంప లేలానిలబడ్తాయే. పెళ్ళి, పేరంటం లేకుండా సాగనిస్తే, మొగాడు ఎందుకైనా పనికొస్తాడే? తండ్రితెచ్చిన సంబంధాలు లక్ష. అన్నిటినీ తన్నేసి కూర్చున్నాడు. ఆబెంగనే మంచంపట్టి హరి అన్నాడుమీ నాన్న ఏలోకాల్లో ఉన్నాడో'' అని కళ్ళు అద్దుకొంది ముసలమ్మగారు. తమ్ముడిమీద అపేక్షయింతా అంతాకాదు ఆవిడకు. పిల్లలులేక, భర్తపోయిన నాటినుంచి, తమ్ముడికుటుం

దాన్నే కనిపెట్టుకునుందిది. వీళ్ళనే తన పిల్లలుగా చూసుకొంటోంది.

"రోగం తీరు తెలియని వైద్యం చేశాడు నాన్న. వాడు వద్దు మొర్రో అంటోంటే, ఎన్ని సంబంధాలు తెచ్చి ఏంలాభం. విన్నాడు కాదంటో వాణ్ణి అల్లరిపెట్టడానికి కాని."

"వాడి కల్లరియేం వచ్చిందే. ఆ అల్లరిపడ్తోన్న వాళ్ళం మనం. పోనీ ఆడాళ్ళంటే భిడియపడి పెళ్ళివద్దంటున్నాడుకనక నా, కడియాలారి బ్బాయిలా ఎవరికీ బాధలేకపోను. పెళ్ళికుపిల్ల గుమ్మంలో అడుగెట్టేసంభయం, తనకో సమేవచ్చినట్టు, దాన్ని వెంటేసుకొని, చెయ్యీచెయ్యీ పెనేసి, ఆసుపత్రి అన్ని గదులూ తిప్పి, దాన్ని నవ్విస్తో, కవ్విస్తో కాఫీ త్రాగిస్తో కబుర్లేసుకు కూర్చుంటాడు. పెళ్ళిచేసుకుంటాడేమో పిల్ల నన్న ఆశతో వాళ్ళవాళ్ళు నెల ఊరుకుంటారు. రెండు నెలలూరుకుంటారు. ఎంత కాలం ఊరుకోగలరు. ఆపిల్లలు కాని, వాళ్ళ తలితండ్రులు కాని పెళ్ళిమాటతలపెడితే, అంతే వెనక్కి లాగేస్తాడు. ఇదేంఖర్మమే ఎక్కడా చూడలేదీగుణం. ఇహ వాళ్ళపిల్లలకు పెళ్ళిళ్ళు కావని, మనమేదో వాళ్ళను మోసంచేసినట్టు మనమీదపడి ఏడుస్తున్నారు. ఎంతమంది, ఎంతమంది. ఎక్కడదాకనో యెందుకు? మనవాళ్ళ కమల నేం చేశాడు చెప్పు? నేటికీ దాని అమ్మమ్మ దొడ్డమ్మ, నన్నుదుమ్మెత్తిపోస్తున్నారు. నీ అఖరుపిల్ల బారసాలకు ఆది వాళ్ళవాళ్ళతో వస్తే, దాంతో చనువుగా ఉంటున్నాడుకదా పోనీ దాన్ని కట్టేస్తే బాధ విరగడవుతుందని దాన్ని కట్టేసెట్టుకున్నాం. అదంటే ఎంతయిష్టంచూపెట్టాడు. పట్నమెళ్ళినప్పుడల్లా ప్రత్యేకంగా దానికేదో తెచ్చేవాడు మేర్భానీ. అనుచ్చుకొని మిట్టిపడిపోయేదది. పనునుకొచ్చాడనుకుని పెళ్ళిమాటతలపెట్టాం. అంతే యిక యిల్లట్టేసం మానేశాడు, వీడితో తేల్చుకొని కాని యింటికిపోనని భీష్మించుకు కూర్చుందది. ఆపరగంగను వాళ్ళవాళ్ళకు వప్పగించిరావడానికి పెద్దబుదిగివచ్చారు నాకు. పట్నవాసాల్లో ఉంటారట, పెళ్ళిపెడాకులు అక్కఱలేకుండా, మొగాళ్ళతో చెయ్యీచెయ్యీపట్టుకొని పరాచికాలాడే పింజార్లు ఆవేషాలు పల్లెటూళ్ళో ఏలా సాగుతాయే. ఈడొచ్చిన పరాయి ఆడది యింటింటా తిరుగుతోంటే, కళ్ళుపొడిచెయ్యరటే యిరుగుపొరుగున్నూ యిక్కడ," అందిముసలమ్మగారు.

ఏ అంతేలను. వాడికితిక్క తిరిగేదాకా మనంఓపిక పట్టాలి కాని, ఎత్తుపెరుత్తుకేసి వాడినిదారికితేగలమటే అత్తా. ముందకేడు వేసంగుల్లో నాన్నచేసినహంగామా యింతాఅంతానా. వీడితో చమవుకుంటోన్న ఎవరోపిల్లతో, కాలేజీఊళ్ళో కాపురమే సాగిస్తున్నాడని, కళ్ళతో చూసందిగాలికబురట్టుకొని, అల్లరిచేస్తేనేగా సెలవులకొచ్చినవాడు, ముఖంచూపెట్టాడో లేదో, పారిపోయాడు.''

''నీవు నీతమ్ముణ్ని వెనకేసుకొస్తేనేగా, మీనాన్న నిజంతెల్సుకురామని మీఆయన్ని పంపించాడు. జగజ్జంత్రీగాడు, జిత్తులమారి వీడు మీఆయన అక్కడికెళ్ళేటప్పటికే పసిగట్టేసి, నిముషాల బసమార్చేశాడు. పైగా కొంటివెధవ ఎవడికో చెవులోఏమిఊదాడో, వాడు మీఆయనను, యీ అమ్మాయేనని, పోలీసుహోద్దుకూతుర్ని చూపిస్తేనేగా, తన్నులుతినకుండా మీఆయన్ను యింటికి తెచ్చుకోవడం, చచ్చినంతపనయింది'' అంది ముసలమ్మగారు.

''అప్పుడే నాన్న వాడితో లాలనగా మాట్లాడి ఆపిల్లనే చేసుకో రాదట్రా అంటే ఏంజరుగునో. నిప్పులు చెరగాడుగాని నిమ్మళంగా ఒక్కమాట నాన్న వాడితోమాట్లాడాడే, అత్తా.''

''ఊరుకో! నాన్నమీద నేరంవేస్తావు, వీడితో నిమ్మళంగా మాట్లా డాడు కాదని. వీడి నిమ్మళం ఏంచచ్చిందని అడుగుత. పోనీ దగ్గరకు, చేరి, 'నాన్నగారూ, నేనో పిల్లకుమాట యిచ్చాను. సర్వవిధాలా నాకా పిల్లనచ్చింది. మీరి వేరేసంబంధాలుచూచి హైరానుపడకండి'అని ఏద్వలేక పోయాడా. తండ్రి నిమ్మదస్తుడు కాదు, పోనీ నీతో చెప్పకూడదా, నాతో చెప్పకూడదా. వాడిపెండ్లి విషయం తండ్రి అన్నివిధాల అలమరు గుతోంటే, చీమకుట్టకుండా, నోటికి తాళంవేసుకొని కూర్చోవడం, ఏమిటంటావు ,అదుర్బుద్ధి. అంతదొంగతనం ఎందుకు బాజాభజంత్రీలతో చేసుకునే పెళ్ళికి, పోనిద్దూ, యెదరవాళ్ళ బాధ, దేమీపట్టించుకోని కిరాతకపు బుద్ధి వీడిది. ఏమిఎత్తులు వేశామన్నా వాడిబాగు కోరేగా. వాడు పెళ్ళిచేసుకొని, ఓయింటివాడు కావాలనేగా. ఏమి ఎత్తులో నాకు తెలియదు కాని, యిక్కడికి తండ్రిప్రాణం పుచ్చుకొన్నాడు. దైవం మేలు

చేసి నేడోరేపో నేనుకూడా దాటిపోయానంటే, వాడిధర్మాన్ని పెద్దవాన్ని, అప్పుడు బుట్టలోంచి పామునుతీసినట్టు, ఎక్కడపెట్టాడో, ఎవర్తో, అనంగనాచిని. టింగురంగాఅని కొంపలో దింపుతాడు!!

"అయితే అత్తా తెలియకడుగుతాను. వాడు ప్రేమించిన పిల్లను వాడుతెచ్చుకుంటే మనకీకంఠశోష యెందుకే కాక పోయినా"

"అమ్మగో అమాటే అనవద్దని మొత్తుకుంటూ. వళ్ళుమండిపోతుంది. ప్రేమ ఏమిటే తుచ్ఛంమాట సంసార్లకు, పెళ్ళిచేసుకొందీను. మీ మామ నేను ముప్పైయేళ్ళ కాపురం. ప్రాణంయిచ్చేవా రాయన ముప్పైయేళ్ళకు ఒక్కపర్యాయం, రాత్రిబోంచేసి చెయ్యితుడుచుకుంటో ఏమివాళ, ముస్తాబయా వన్నారు. ఆమాత్రనికే సిగ్గు ఉటికేది మారోజుల్లో, ఒక్కపూట ప్రేమ అంటో యీకోణంగిమాట పెదిమలమీద కొచ్చిందే, మాటమంత్రీ యెరుగదు, మాయింటిపక్క కృష్ణవేణమ్మగారు, పదిమందిపిల్లలు. ప్రేమలూ, విడాకులూ ఈ పిదప కాలంలో బయల్దేరిన పాపమ్మాటలు. పెద్దవాళ్ళు తెచ్చిన సంబంధాలు తోసెయ్యడానికి. యేర్పాయాలు అడ్డం వేసుకునే సాకులు. ఇష్టం అంటు రవణమ్మతల్లీ. ఇష్టంఅంటే రోజూ గడవకపోదు. పనిగట్టుకొని ప్రేమ అంటో, ఎక్కడి పట్టవాసంమ్మాటో పెల్లగించుకురానక్కఅలేదు నన్ను ఏడిపించడానికి" అంది ముసలమ్మగారు కుతకుతలాడుతో.

ముసలమ్మ రవణమ్మగార్ల వాదసశేషమేమి వినుపింతురో, అంతలో రిక్షాసైకిళ్ళు వచ్చినై.

రిక్షాలో ముసలమ్మగారిని పట్టుకునికూర్చుని, కన్య ఆలోచనకు పడింది. ఇంతకు రవణమ్మముసలమ్మగార్ల సంభాషణరీత్యా, డాక్టరుమనస్తత్వం సుస్పష్టంగా తెలియలేదు. ముసలమ్మగారిమాటలు ద్విముఖంగా ఉన్నై. డాక్టరు వివాహ సంస్థనే అంగీకరింపని విప్లవభావ ప్రేరితుడా, స్త్రీసుఖం కోరుతో సంసారబాధ్యతలను వహించుటకు భయపడ్తోన్న పిరికిమనిషా, పెండ్లి అన్న, విపరీతమైన భీతి అతనినిల్లో ప్రబలుతోంది. వధువో, వరుడో, ఒకరీమధ్య క్లోరోఫారంయిచ్చి మరీపెళ్ళిపీటలమీద కూర్చోబెట్టమని కోరారట. ఒక స్త్రీతో విందుకు కట్టడి ఉండాలన్న విలాసపురుషుడా

భోగలాలసుడే అయినా, సమయం చూచి, తానువలచియున్న లీలను తెచ్చి పరిణయమాడ నిశ్చయించి యితరసంబంధాలను కాదంటున్నాడా. కాక కొంపత్రవ్వి లీలపట్ల తిరస్కార భావం జనించే పర స్త్రీలతో అవి నీతికి పాల్పడుతున్నాడా? ఏమనుకోవాలి. డాక్టరు అభిప్రాయమేదో స్పష్టమైతే గాని లీలపరిణయ ప్రక్రియకు ముసలమ్మ గారిని ఒప్పించు కోవాలో, డాక్టర్నే ఒప్పించవలసిఉంటుందో, ఎక్కడఅందుకొనినరుక్కు రావాలో అర్థంకావటంలేదు.

రిక్షానైకిళ్ళు ఆసుపత్రి చేరేటప్పటికి, డాక్టరూ లేడు. కాంపౌండరూ లేడు. ఆసుపత్రి డాక్టరుయింటివాటాలోనే ఉంది కాబట్టి, రిక్షాసైకిళ్ళను పంపేసి రమణమ్మ, ఆసుపత్రితలుపులు తెరచింది. వెంటనే స్టవ్ మీద నీళ్ళు కాచి, కట్లువిప్పి లోషన్తో గాయాలను పరిశుభ్రంగాకడిగి. గాయాల వివరాలను డాక్టరుబల్లమీదయున్న పొడ్డుమీదవ్రాసి. యాంటీసెప్టిక్సు వినియోగించి పునఃకట్లుకట్టి, కన్యస్నానంచేసివచ్చి డాక్టరుఆఫీసుగదిలో జుట్టుఆరబెట్టుకోంటోంది.

వీధిలో ఎవరుచెప్పారో అనుద్రాగా డాక్టరు లోనికొచ్చేసరికి, ముస లమ్మ గారు. బండివాడు కునుకోతున్నారు. డాక్టరుష్టూచప్పుడువిని, కన్య ముసలమ్మగారిమంచంకేసివచ్చి, కన్లుపెద్దవిచేసి, పెదిమలమీదవ్రేలు వేసుకుని గొడవచెయ్యొద్దన్నట్టు డాక్టరుకుసంజ్ఞ చేసింది. ఇంటియాజమాన్యమా డాక్ట రిది. ఆపత్తా డాక్టరుస్వజనానికి. విషయమూ డాక్టరుచికిత్సకోరేది. అయితేం, ఆ పెన్య క్తిత్వప్రభావ మేమో కాని, డాక్టరు పిల్లిఅడుగులమీద వాకలివదలి, అక్కగారివద్దకువెళ్ళాడు. ఆరడానికివిరియబోసిన కురులు వత్తుగాకన్య ముఖంమీద పడ్డోన్నందువల్ల, యింతసేపూ ఆపెముఖబింబం కొంతమరుగడి ఉంది. డాక్టరుకు ఆపెకనుముక్కుతీరు స్పష్టంగా తెలియలేదు. రమణమ్మ ముఖంమీద వాపుచూచినంతన, డాక్టరుకు కళ్ళల్లోనీళ్ళుతిరిగినై.

"అత్తకు బండివాడికిబలమైనగాయాలా, అక్కా? అనిఅడిగి, వివ రాలుతెల్సుకోడానికి "కాంపౌండ రేడీ" అనిఅడిగాడు. "కాంపౌండరు అసలుకనిపించనేలే"దంది. "అయితే. అహాస్పిటల్ కట్లు ఏలావచ్చినై" అన్నాడు.

"ఇక్కడ లేకపోతే అత్తదగ్గర ఒకఅమ్మాయి కన్పించలేదా, ఆఅమ్మాయి కట్టిందంటోంది.

వాకిట్లో ఉన్న ఆమ్మాయి కట్టుకట్టిన అమ్మాయిఅన్న మాటచెవిని పడ్డంతో, డాక్టరుప్రాణంగతుక్కుమంది, ముఖం డీల్లపోయింది. కన్య విషయం తెలియాలి. కానీఅనుద్దా అక్కకు తెలియకూడదు. ఒక్కనిముష మాగి, నెమ్మదిగా, "ఎవరోడాక్టరుభార్యో, నర్సోఅయియుండాలి" అని చాలా ఆషామాషీగా అన్నట్టు పెదిమెలుపెట్టి, అక్కసమాధానానికి వేచియున్నాడు, అవుననో, కాదనో అంటుకుని, అక్కసుంతైనా రాల్చకపోతుందా అని. ఆడపిల్లఅరాతీసేవరకు కాలుకాలినపిల్లి అయిపోతాడని, తమ్ముని నైజం ఆసుధేష్ణకుతెలుసు. అంచేత ఆమె కులుకలేదు. పలుకలేదు. డాక్టరు కాదామర హెచ్చింది. కంఠంనొక్కుకొని, "అబ్బ, ఆ అమ్మాయి ఊరుపేరుతెల్సుకోకుండా ఏమిచేస్తున్నట్టే" అని తేలిపోయాడు.

అట్టేఆకన్యపై ఆతడిదృష్టిపడకుండా రాత్రిగడవాలని భావించి, "ఏం చేస్తున్నామా, ఆఅమ్మాయిబెంగేమివచ్చిందిరా నీకు, అత్తకు బండివాడికి చచ్చేదెబ్బలుతగిల్తే, కాకపోయినా" అని విసుక్కుంది.

ఆపిల్లఎవరో, ఎందుకొచ్చిందో చెప్పేవారెవరున్నా రిక. అక్కే చెప్పకపోతే అత్తచెపుతుందా? అనిడిదగ్గర తాను కన్యలఊసుఎత్తి, బ్రతికిబయటపడగలడా? తినేస్తుంది. పెద్దపులి.

చేతులులేనికుర్చీలోకూర్చుని ముసలావిడను విసుర్తోన్నకన్యను, సందేహ నివృత్తికి మరొకమారు తనగదిలోనుంచి చూడయత్నించుచుండగా, తన ఆఫీసుపాడ్ మీద, అచ్చుడాక్టర్లువ్రాండుసర్టిఫికేట్లో ఉదహరించే తెలుగున. గాయాలు, ఆవిపడ్డశరీరభాగాలు వాటిపరిమాణస్వభావాలు, చేయబడ్డ చికిత్స, నాడివేడిలక్షణాలు, ససాకల్యంగావ్రాసినవి డాక్టరుకంట పడ్డాయి. వైద్యవిద్యనేర్వని వారికాసాంకేతికపదాలుకాని, ఆపరిశీలనా దక్షతగాని అలవడదని తోచింది. తనసందేహంనిజమైందని వళ్ళుఝల్లు మంది. తనచేవంచింపబడ్డ తనసహాధ్యాయిని లీల, తనమోసాన్నిముఖం మీద కడిగేసి, కసితీర్చుకొనుటకు వెతుక్కుంటూ వచ్చిపడిందని గుండె

కరేలుమంది. అవసరమైతే తననేరాన్ని నలుగురిలోనూ పెట్టి, ఆపె భవిష్యత్తును పరిష్కరించుకొనుటకు, తత్ప్రయత్నంవిఫలమైతే, ఇక్కడే యేదోఆఘాయిత్యంచేయుటకు, తెగువతెంపులుచేసుకునే వచ్చిఉండాలని, భీతిల్లిపోయి, కుర్చీలోకూలబడ్డాడు. కూసంవిడిచిన క్రూరసర్పిణి వాకట్లో కదల్తోన్నట్టు ప్రాణాలు అరచేతుల్లో పెట్టుకొనిఉన్నాడు.

కత్తీపనిచేసినవాడిదెపుడూవెత్తిబ్రతుకేగా. సమాధానంచెప్పాల్సివస్తుందన్న ఒకుగు యెప్పుడూఉంటుంది. తానుచేసిననేరంలేదని పరులను కనుగప్పకలడేమో కాని. తన అంతరాత్మను కనుగప్పకలడా? తన అంతరాత్మముందు తనదోషాన్ని దాచిపెట్టలేకున్నాడు. తొలిచూపునాటినుంచి నేటివరకు తాను లీలకు కావించిన మహాపచారమంతా, డాక్యుమెంటరీ ఫిల్ముపైఖరిని, తన మనోఅవనికపై పడసాగింది. కాలంగడచినకొద్దీ, అదే పాతబడిపోతుందన్న ఆశ అడియాస అయిందని ఖేదిస్తోన్నాడు. తన దుష్కృత్యానికి సమాధానంచెప్పదగ్గ పరీక్షాసమయం యీనాడువచ్చిపడిందని హడలుతున్నాడు. లీలపడ్డక్షోభ కుఠారాఘాతమువలె అతడిహృదయాన్ని వ్రయ్యలుచేస్తోంది. ఇకరెండేండ్లుగడిస్తే డిగ్రీపుచ్చుకోదగ్గలీల కెరియున్న కూకటివేళ్ళతో ధ్వంసంచేసి, ఆపెపరువుప్రతిష్ఠలను మంటగలిపి, ఆపెను జన్మాంతరబహిష్కృతను చేసినచండాలుడనని ఛీత్కరించుకొంటున్నాడు. మాతృపితృవిహీనయయిన లీలను కన్నకూతురుకన్న నెక్కుడుగా పెంచి, చదువుచెప్పించిన ప్లీడరుగారిఅవసానకాలమందు. వారినికడచూపుచూడలేకపోతినని, ఎంతగాఏడ్చిందోపాపం. కలరూపు తెలియక తనను కృతఘ్నురాలని ఆపుణ్యాత్ముడు తలుస్తాడని ఎంతగోలపెట్టిందో, ఆనాటిశోకోద్రేకంలో రెండవమారు ఆత్మహత్యకు సంసిద్ధనైతినని వ్రాసి ఉంది. గర్భందాల్చినకన్య, యెంతయిక్కట్టు అయితేం, యెంతఆత్మీయులకైతేం, ముఖమెట్లుచూపగలదు? ఆకష్టంలోనైనా తానుతండ్రిగారితో ఉన్న విషయంచెప్పి, వారిని వప్పించో, అయ్యదిసాధ్యంకాకపోతే, ఏమిటికానీ, సాహసించి, రిజిస్టర్డుమేరేజీ చేసుకునో, ఆపెనుభార్యగా స్వీకరించి అవమానం తప్పించడం తనబాధ్యత కాదా? ఆబాధ్యతను ఎంతపరమకిరాతుడైనా వహించుటకుసందేహించడే! తనవిలాసతృష్ణ యింతభీషణపరిణా

మాన్ని దాల్చినా, ఔదాసీన్యం వహించాడే కాని, తన పాపం తన్నో నాడు కట్టికుడుపుతుందని కానలేకపోయాడే.

ఏ కారణం చేతనో, దైవికంగానో, లీలయందు భేదభావం జనించి తానామెను తిరస్కరించాడా, లేదు. తొలి ప్రణయ ప్రాబల్యం తగ్గి విసువు చెంది ప్రేయసి నుపేక్షించిన ప్రేమికుడా తాను? కాదు. లీల కౌగిలింతలో తాను పొందిన సుఖము రెండేండ్లు గడచినా నేటికీ మనసులో పచ్చిగానే ఉంది. దాని పసిమి అరలేదే. నేటికీ. ఏ స్త్రీ కౌగిలింతలోను అసంపూర్ణత్వమే తోస్తుంది. లీల కలలోనికి రాని రాత్రి లేదే. ఆ లావణ్యం, అపూర్వ భంగిమ విలాసం, ఆమె అమాయకపు ముగ్ధత్వం, కంటిలో ఆడుతోంటాయి. లీల శీలాన్ని శంకించాడా? ఆమె పరాసక్త హృదయయా? లీల సుశీల. అనాఘ్రాత పుష్పం. తాను ఒగ్గిన ఉచ్చుల్లో తగుల్కొన్న అమాయికురాలు. నిష్కల్మషమైన ఆమె క్లాస్రూమ్ చనువును దుర్వృత్తితో, నేర్పుగా దోహదం చేశాడు. సోదర సదృశుడననే గద, ఆమె హృదయంలోకి ఆదిలో దొరబడ్డాడు. స్థానం చిక్కిన తర్వాత, ఆమె ఊహించని పరిస్థితులెన్నో తెచ్చిపెట్టి, స్వసుఖమాశించి, సోదర సోదరీ ప్రేమను పెడదారి పట్టించి, ఆమె రసప్రవృత్తి కలిగించాడు. అంతఃకూపంలో పడ్డ తర్వాతగాని లెక్కకు రాని చిలిపి జిత్తులెన్ని పన్ని లీల చిత్తసీమను అవినీతి బీజం నాటి, పాపవ్యవసాయాని కొడిగట్టాడు. పాశ్చాత్య గ్రంథమైన శరీరశాస్త్రం సుబోధకమవుతుందని · నా మాట పుచ్చుకు నేగద, పాపం కలిసి చదువు పెట్టుకుంది. కలిసి చదువే కద చూస్తుంటే కలిసి భోజన శయ్యా విహారాలకు దారితీసింది. శారీరక శక్తులచే నాకర్షింపబడి, లీల తెలియని స్థితిలో లొంగి చేసిన పనికి నిశ్చయంగా నేనే నేరస్థుణ్ని. ఎంత మనసు దిటవు గల కన్య అయితేం, కృషి చేసి ఆమె మనసును దిమ్మ ఎక్కించాను.

లీల ఇంటర్ సెకండు యియర్ చదువుతోండగా ఆమెకు చదువు చెప్పిస్తోన్న ప్లీడరు గారి భార్యకు కాన్పు వచ్చింది. లీల ప్రతిభావంతంగా ఇంటరు ప్యాసై పై చదువు యావనుంటచే, 'అమ్మా నీవు పైకి చదువుకున్నా సరే, పరిణయమాడి స్థిమితపడ్డా సరే, నీ భవిష్యత్తు నీవు నిర్ణయించుకోగల ప్రాజ్ఞురాలవైనావు, ఇది ఎప్పుడూ నీ స్వగృహంలా నే పాటించి మీ పిన్నికి కష్టసుఖాలకవుతో ఉండు. నే నెప్పుడేమో. బ్లడ్ ప్రెషరు తగుల్తోంది,' అని

ష్టేవరుగా రాపె పేర ఆరువేలు బ్యాంకులో వేశారు. ఆబాపతుసొమ్ముంటచే, లీలకు గర్భచిహ్నాలు కనిపించడంతో, కాలేజీకి స్వస్తి చెప్పినా, కానిదేశాలు తిరిగిపొట్టోసుకో నవసరంలేకుండా, రహస్యం కోలుపోనిగతిని, ఉత్తముల నేరినో ఆశ్రయించి, ప్రసవమైంది. ఎచ్చటో తాపసాశ్రమంలో తలదాచు కొంది అన్న గాలికబురు ఒకటి అందింది. ఉదారహృదయ, పుణ్యాత్మురాలు ఎవరో ఆశ్రమకన్య శరణిచ్చి, సేవాసదనంలో సుశిక్షణ గడుపుతోందని మరో వార్త తెలిసింది. అజ్ఞాతవాసం చేస్తో తనకు ఉపద్రవం తప్పించమని అతి దీనంగా యెన్నో ఉత్తరాలు వ్రాసింది. ఆమె ఉత్తరాలకు సమాధానమిచ్చు టకుగాని, ఆమెను చూచుటకుగాని చొరవచాలక చాటేశాడు. చొరవ చాలకనే తండ్రిగారితోను చెప్పలేకపోయాడు. తండ్రిగారుపోయిన తర్వాత లీలగోల మరివినిపించకపోతే, పాతబడిపోయిన విషయాన్ని పనిగట్టుకొని రేపడం ఇష్టంలేక, యిక మొండెత్తు వేశాడు. అంతేకాని వాళ్ళవీళ్ళలా అన్యథాయత్తచిత్తుడై తాను లీలను త్యజించలేదు. తానుచేసింది, ఉపేక్ష, అకర్మణ్యత మేమో కాని నేరం కాదని, తానుబుద్ధిమంతతనంగానే ఉన్నా నని తలచాడు.

ఈమె లీలేఅయితే, శిశువెక్కడ? ఈమె వెంట శిశువువచ్చినజాడ కానరాదే. ఈమె లీల కాదో, కాక ఒక వేళ శిశువు జారిపోయిందో. ఇంత పొడుగాటిజుట్టు, ఈఛాయ, యీవలం లీలకుండేవా అనికూడా ఒక సందేహం కల్గకపోలేదు. లీల కాదని సరిపెట్టుకోలేకున్నాడు. అపసోపాలు పడ్తున్నాడు.

మధ్యమధ్య ముసలమ్మగారికి విసనకర్ర వేస్తో కన్య ముందు పని నాలో చించుకొంటోండగా, ముసలావిడ కళ్ళు తెరచి, కన్యగుత్తి పట్టుకొని, “ఇదేమిటమ్మా తల్లీ ఒక్కవరసనే నాకు చాకిరీ చేస్తోంటివి” అంది.

“మామ్మగారూ, నాకుమాత్రం ఎవరున్నారు. నాతలితండ్రులు చిన్నతనంలోనే గతించారు. పెద్దవాళ్ళకు శుశ్రూషచేసుకోవడం ఒక పుణ్యకార్యంగా చెప్పారు రామకృష్ణమఠస్వాములు” అంది కన్య.

“ఎవరమ్మా ఆస్వాములు?” అని అడిగింది ముసలమ్మగారు.

“దిక్కులేనివాళ్ళకు దిక్కు. దీనులు, క్షుదార్తులు, అంగవైకల్యాలు,

అనాథలు అన్నార్థులై వారి ఆశ్రమాని కెందరో చేరుతోంటారు. దర్మాధర్మ, నిత్యానిత్యవస్తువివేకజ్ఞానశూన్యులకెందరికో వారి వారి హృదయగత దుర్భావాలను తొలగించి, హృదయపరివర్తన కలిగించే సదుపదేష్టలమ్మా వారు. మామ్మగారూ, వారిఆశ్రమదినచర్య చూస్తే తరిస్తామండి. వారిఆశ్రమంలో వాల్మీకిఆశ్రమంలోవలె ప్రసూతిగృహం, శిశురక్షణ కేంద్రం ఉన్నై. ఎంతమందిసీతమ్మలో అక్కడ పురుడోసుకుంటారు. ఎంత మంది కుశలవులో అచ్చటపెరిగి, సుశిక్షితు లవుతోంటారు. సీతమ్మపోట్లు పేగునపట్టని భారత స్త్రీయుండెదుకద."

స్వాముల అనాథదీనజనరక్షణోదంతం, ముసలమ్మగారి హృదయాన్ని భక్తితో నింపింది.

"అమ్మాయీ! యీ దెబ్బ నిమ్మళించాక నన్నోసారి వారికాళ్ళమీద పడేసి పుణ్యంకట్టుకో అమ్మా. బ్రతుకంతా యీ గుయ్యారంలోనే సరి పోయింది నాకు. కాస్త రామా, కృష్ణా అనుకునేయోగం యింతవరకు కలగ లేదు" అంది ముసలమ్మగారు.

ఈప్రసంగం గదిలో పాముచెవు లెట్టుకొని వింటోన్న డాక్టరుకు కొంతకొంత వినుపించింది. వెంటనే అతని గదిలోనుంచి బహువేదనా భరమైన అనిర్దిష్టాలాపమేదో వాకిట్లోకి వినబడ్డది. ఆమాటలన్నీ తాపసా శ్రమంలో ప్రసవించిన మాతృపితృవిహీన, అనాథ లీలను అతుకుతున్నై. కాబట్టి దుఃఖం పట్టలేక పోయాడన్నమాట డాక్టరు. రామకృష్ణాశ్రమ మంటే అతడి కున్న మూర్ఖభిప్రాయం కొంత కారణం అతని దుఃఖానికి. కాలేజీలో సాంస్కృతిక సభలు జరుగుతోంటే ఒక్క ఉపన్యాసానికి కూర్చునే అభిరుచి ఓర్మిచాలక అగడువులో ఏదో స్టంటుపిక్చరుకుపొయ్యే సంస్కారశూన్యుడు. పాఠ్యగ్రంథాలు మననం చేశాడేమో కాని, పై సాహిత్య పరిచయం కలవాడుకాడు. 'షాప్' మాట్లాడిపోయే సాహస గాళ్ళే కాని, సద్వ్యాసంగేచ్ఛగల స్నేహితులులేరు. మరమని విన్నాడు కాబట్టి, రామకృష్ణమఠాని కెళ్లేవాళ్ళు, ఆపత్తులొచ్చి, ఆత్మహత్య చేసుకో లేక, యోగులై జోగులై ముక్కుమూసుకుని కూర్చునే దుఃఖభాగులని, ఏలా పడిందో ఎప్పుడోఅతడి బుర్రలోపడింది. అంతేకాని రామకృష్ణస్వాములు,

భారతప్రజను కార్యరంగాన్ని వరించేకర్మశూరులను కావించుటకే, వారిపారమార్థిక సంపద్వైభవాన్ని, త్యాగాత్మానుభవాలను, ప్రపంచ పర్యటానుభవాలను, సర్వతోముఖ పాండిత్యాన్ని వినియోగించి ఆశ్రమాలను నెలకొల్పారని ఎరుగడు. అంచేత లీల, జీవితమం దాసపీడి, ఉత్తరగతిచింతతో మఠం చేరిందని విపరీతనిర్ణయాని కొచ్చాడు. అంచేత గుండె అంతా ఉడిగిపోయి డాక్టరు వదనము ఎండిపోయింది.

ముసలమ్మగారు కన్యతో, "అమ్మాయీ, ఆఫీసుగదిలోనుంచి రెండుమూడు దఫాల కమ్మరకొలిమిలోంచి వస్తోన్నట్టు దీర్ఘోశ్వాసనిశ్వాసాలు వినిపించినై. అక్కడ ఎవరో ఆపసోపాలుపడ్తోన్నట్టుంది. బండివాడిని వీధిగదిలో పరుండబెట్టివికద, మరి యిక్కడెవరున్నారు? కొంపత్రవ్వి రవణమ్మకు దెబ్బబాధ ఎక్కువ కాలేదు కద" అంది.

"అబ్బే అదేమీ కాదండి. రవణమ్మగారు పండులా మడిగట్టుకుంది. పిల్లలు సుఖంగా నిద్దర్లోతున్నారు. రేపుదయం కట్టుకు తెచ్చుకుంటానని బండివాడి భార్యట, ఆమనిషి బండివాడిని యింటికి తీసుకుపోయింది. ఆఫీసులోనున్నది మీమేనల్లుడే. మీరు నిద్రమీదఉండగా వస్తే, మిమ్మల్ని లేపవద్దని వారించాను. 'అత్తకింత దెబ్బతగలనా?' అని చింతాక్రాంతుడై, బెదురుగుండె కాబోలు, గదిలో ఆవరసని బాధపడుతోండాలి. అంతకన్న మరేం ఖేదముంటుందండి బామ్మగారు? కొఱతఅన్నది లేకుండా సమస్తసౌఖ్యాలు అనుభవిస్తోన్న మనిషికి" అంది కన్య మనిషి అన్నపదంలో డాక్టరుపట్ల తనకు కలిగిఉన్న జుగుప్సనంతా కూరి.

ఇపు డాతడున్న మనస్థితిలో కన్య చలితేలుమాట డాక్టర్ని నొవ్వపొడిచింది. ఎవరితో చెప్పుకుంటాడు. తనఖేదం, గుట్టుకపడి ఉండాలికాని.

ఇంతలో ముసలమ్మగారు "అబ్బాయీ వచ్చావట్రా" అంది.

"ఒంటిప్రాణంతో, ఎంతఉపద్రవం వచ్చిపడింది కొంపమీదకు, అత్తా" అంటో మంచవద్గర కొచ్చాడు.

వెనక డాక్టరు అలుకుడు తగల్గంతో, కుర్చీ డాక్టరుకు వదిలేసి, "పిల్ల లేచినట్టుంది" అంటో అక్కడనుంచే వెనక్కుతిరక్కుండా, లోపలి భాగంలోకి తటిల్లతలా అదృశ్యమైంది కన్య.

నిశ్చేష్టుడై డాక్టరు, "లేచింది ఏపిల్ల? ఎవరిపిల్ల?" అని అడిగాడు అత్తని, గద్గదస్వరంతో.

అతడిభయం అపుడేది. అత్తకేం తెల్సు.

"ఇంకేపిల్ల ఉందిరా, రమణమ్మగారి చంటిదిరా, శేషి. వాళ్ళ ఆలనా పాలన సహాయంచేవాడికి చెల్లకుండా మాట్లాడ్తావు. ఆమధ్యన దానికి చంటిపిల్ల జాడ్యంవస్తే, పట్టుమని పదినిముషాలు కూర్చోలేక, ఎవరో స్నేహితురాలి పుట్టినరోజంటూ పరుగెత్తావు. పైగాడవ లెట్టుకుంటావు గాని, యింట్లోవాళ్ళం చచ్చినా అంతే నీకు. ఇంతకాలానికి యివాళైనా దాని ఏముపు ఆలకించావు నీకడుపు చల్లగా" అంది. అత్త ఏమిచెప్పితేం, ఆపిల్ల రమణమ్మ కూతురేనని చెప్పడంతో, డాక్టరు గుండెలు అప్పటికి కొంత సద్దుకున్నై. కన్యజాట్టు ఇప్పుడూ విరబోసి ఉండడంచేత, అసలు అదుటు యింకా అనుట్టునేఉంది. ప్రతి చిన్నఅంశం గాభరాపెట్టే స్థితికొచ్చాడు. మీద చెయ్యివేశాడు.

డాక్టరు చేతి వణుకు గమనించి, ఆవెర్రియిల్లాలు, "ఏమిరా అబ్బాయి, నాకు దెబ్బతగిలిందని అంతచేటు బెంబేలు పడ్తోన్నావేమిరా. రక్తపాతం అయినా నేను బాగానేయున్నాను. మధ్యన నీముఖంలో రక్తపుచుక్క లేదేమిరా. ముఖం పాలిపోయింది. మాట నీరసపడింది. పెదిమ లెండిపోయినై. కళ్లుఎర్రపడ్డై. అంతచేటు ఏడ్చిపోతార్రా ముసలిముండ కేదో కాస్తదెబ్బ తగిలితే. నీచెయ్యికలవకాడైంది. ఆమనిషి జేకావు. ఇంతేరా, ఎంతబేలగుండె రానీది. పైకి పఠారం లోపల లొటారం అంటారే అలాఉందిరా నీసంగతి. ఈకన్య రాకపోతే రక్తం కారుతోన్నందుకు ఏమగుదునో కాని, బండి బోల్తాకొట్టిన మూడు నాలుగు నిముషాల్లో వచ్చి ఆనుకొని, పొట్టంకట్టినట్టు గుత్తంగా కట్టుకట్టి రక్తం ఆపుచేసింది. ఇప్పుడు తగిలినచోట కొంచెంతీపు కాని నాకేమీ చెప్పదగ్గ బాధలేదు. ఊరికే తల్లడిల్లక. నవ్వుతారు ఎవళ్ళైనా చూస్తే. ఇంతభయస్థుడు ఇంకా రేం వైద్యం చేసి వంగబెడ్తాడంటార్రా, నిన్నీఘళ్ళల్లో చూచినవాళ్ళు. శుభ్రంగా ముఖం కడుక్కో. గట్టిగా భోంచెయ్. సుఖంగా నిద్రతియ్. ఎవరికొచ్చినబెంగా ఏమీలేదని నొక్కిచెప్పింది. తనకోసమే బెంగెట్టుకొన్నాడట పాపం, డాక్టరు! పెంచినచెయ్యి వెర్రిప్రేమ అలా ఉంటుంది. అత్తపిచ్చికిచెప్పా.

నిముషమైనా వదిలిపెట్టి ఉండలేనంత మమకారం ముసలమ్మగారికి కన్యపై కలిగిఉండాలి, కన్యను కేకేసింది. డాక్టరు నెమ్మది నెమ్మదిగా గదిగుమ్మం దగ్గరకు జారాడు. కన్యవచ్చి ముసలమ్మగారికి దగ్గరగా మంచంమీద కూర్చుంది. ఇప్పుడు జుట్టు జారుముడి వేసుకొచ్చింది కన్య. లీలావతి కాదని స్పష్టమైంది డాక్టర్కు. అంతే. పరీక్షపోయిందని విన్నవాడికి, పేపరులో నంబరు కనిపిస్తేనో, వైరొస్తేనో, వెర్రి సంతోషమొచ్చి, నేనే ఫేలే అని ఉబ్బితబ్బిబ్బైనట్టు రెట్టింపయాడు. ఇక తన దుర్మార్గం పైకి పొక్కదని భరవాసా కలిగింది. పెద్ద బరువు దింపుకొన్నవాడు, తెరిపంతా తనదేనని తలచినట్టు తలంటోసుకున్నవాడు శుభ్రమంతా తనదేనసుకొన్నట్టు గర్వపడుతున్నాడు. రెండే రెండు నిముషాల క్రితం రక్తహీనమై, పాలిపోయిన డాక్టరు ముఖంలో పెళ్ళపెట్టుగా రక్తపుష్టి మిసమిస లాడ్తోంటే, ఆ నిముషానికానిముషం తేరుకుంటూన్న ముసలమ్మగారు డాక్టరు ముఖంమార్పుకు తట్టుకోలేక, తికమకపడి, తెల్లబోయింది. తనకు గాయంతగిలిందని ప్రాణావశిష్టుడయాడని భ్రమించి ఉందిగా. ఒక జవ్వని కంటబడ్డంతో ఎంత దుఃఖాన్ని మఱచిపోయి కామోద్రిక్తుడౌతున్నాడు! మరణశయ్యాసాన్నిధ్యంలోకూడా కామేచ్ఛను చంపుకోలేని డాక్టరు తుంటరితనానికి ముసలావిడ నివ్వెరపడి ఉండాలి.

ఇంతవరకు కుక్కినపేనులా పడిఉన్న డాక్టరు, ఉత్తరకుమారప్రజ్ఞలు దంచేస్తున్నాడు. వాడేడ్రా, వీడేడ్రా అని అధికారం చెలగబెడ్తోన్నాడు. ఈయ నెవరో చాలాచాలా పేరుప్రోసిన డాక్టరని కన్య అభిప్రాయపడ్డానికి కావాల్సిన ఆర్భాటమంతా చేసుకుపోతున్నాడు. నిముషం కాలేదింకా ఊపిరివచ్చి. నైజం ఎక్కడికి, పోతుంది గనుక, కన్యపై వలపులు వంకరచూపులు కురిపిస్తున్నాడు. కన్యఏమనుకోవలెననో, గొల్సుని కట్టిన తాళంచెవుల గుత్తిని తెగతిప్పేవాళ్ళలా, స్టెతాస్కోపును వ్రేలిని తిప్పుతున్నాడు. ఒక ఎగుపులో వ్విసిల్కు దగ్గరకు చేరుతోన్న పెదిమెలు అంతలో అత్తను చూచి తగ్గినై. మనలో లేడు. డాక్టరు వికారాలు జుగుప్సాకరంగా ఉన్నా, కార్యార్థియైవచ్చింది కాబట్టి కన్య చూచీ చూడనట్టూరుకుంది. కాని ముసలమ్మగారికో, డాక్టరు కన్యచుట్టూ తిరుగుళ్ళాడడం కష్టంతోచింది. ఆతడి ఆగడం యేవగించుకొంది.

"అబ్బాయీ! యిక్కడే తచ్చాడకపోతే, బండీ, యెడ్లూ యింటికి చేరే యేర్పాటు చేసుకోరాదట్రా" అని రుసరుసలాడింది. హృదయంలో మేనల్లునిపై ఆగ్రహం ఎంతగా రవుల్తోన్నా, కన్యసమక్షంలో, యింతకన్న మారేమి చేయగలదు? ఏమనగలదు?

పట్టుమని పది నిముషాలు కాందీనే, డాక్టరు తిరిగివచ్చినట్టు వీధిగుమ్మంలో నుంచి అతడి కేకలు వినుపించినై. అంతలో ముసలమ్మగారి మంచందగ్గరికే వచ్చాడు. ఏకతొందర. అబ్బాయి తొందర కారణం అత్తకు తెలియందా! అంచేత చికాకుపడుతో, "యింతకు ఎడ్లమాట తెల్సుకొచ్చావా? గుమ్మంలోనుంచే మించిపోయినట్టు వచ్చావా?" అని అడిగింది.

"ఎడ్లూ బండీ యిల్లు చేరాయని పాలేరాడు చెప్పాడులే" అన్నాడు.

"ఎవరు తోలుకొచ్చారో" అంది.

"ఎవరు తోలుకొస్తేం. వచ్చాయి."

"తోలుకొచ్చిన వారెవరో తెల్సుకునీ మర్యాదకూడ నీకు తోచలేదన్నమాట."

"తోచక్కఅలేదు. బండి ఎడ్లు మనవని ఎరుగున్న పార్టీ ఎవడోతోలుకొచ్చి ఉంటాడు. తెలియకబోతే యేమో కాని, ఈ జిల్లాలో యెడ్లు ఏవూరుచేరినా, సెకనాలస్యం చేయకుండా, వంతులుపోతో, హూహూ వాటిని మనకు వప్పగించిపోతారు. యేవూళ్ళోనూ నాపార్టీ లేగా పాతికముప్పైదాకా."

"అవున్లే, పాడిమూడలైతే, గడ్డీగాదం వేసుకొని సెట్టుకునే తటవిట్లు రావచ్చు. యెడ్లయితే పనిలో పెడ్తేగాని గడ్డీకాడా ఖర్చుకాదట్రా, పనిలోపెడ్తే ఎవడికంటనైనా పడ్తాయి. అంచేత వెంటనే ఎడ్లని తోలిపెట్టేస్తారులే ఎవరైనా. పార్టీలే కానక్కఅలేదు" అంది ముసలమ్మగారు. "దానికేంగాని, అంత విసురుగా కేకలేస్తోన్నావు. పేచీ ఎవరితో" నని అడిగింది.

"ఇంకా కేకలంటావా? ఏమైతేం దాటిపోయాడు స్కౌండ్రల్. వాడికిరోజు బాగుంది. ఇక నెక్కడికి వెడ్తాడులే. డిస్ట్రిక్టుసూపరెండెంటు వాడిని పారావేసి పట్టుకొని చర్మం వల్చేస్తాడు. 'డాక్టరుగారి అడం

గల్నే ఆపత్తుంగో పెట్టినవాణ్ణి పట్టుకోలేకపోతే, యింకేం చేయగల వోయి మీపోలీసు పతాలం ' అని డిస్ట్రిక్టుమేజస్ట్రేటు విరుచుకుపడితాడని సూపరెంటెంటు ఒదుగు. నిన్ననేగా డిస్ట్రిక్టుమేజస్ట్రేటు కాలుజారి బాత్రూంలో పడితే, కట్టుకట్టి వచ్చాను. నిజాని కామాత్రానికి నాదాకా అక్కఱలేదు. నాచెయ్యి పడాలి. అదోపిచ్చి ఆఫీసర్లందరికి. చిన్న పాటైనా పెద్దకర్రతో కొట్టాలంటారు. మస్తుగా కొడ్తారు జీతాలు, మస్తుగా పడేస్తారు కాబట్టి సరిపోయింది. "

" పారేస్తారా, ఖుల్లుడాక్టర్లను చుట్టూ తిప్పుకుంటారని విన్నాలే. "

" నువ్వు అలాగే వింటావులే " అని, ఆ, వే నొక్కిపలికాడు.

" నువ్వుతప్ప అంతానన్ను నెత్తినెట్టుకుంటారు. ' నోమాన్ యీజ్ ఎహీరో టూ హీజ్ వేలెట్ ' అని ఇంగ్లీషులో ఒక సామెతఉంది. నిముషనిముషానికి ' డాక్టరుగారున్నారా ' అని ఎవరో కబురు చేశారని మొన్న నువ్వే చెప్పావుగా. వారెవరో తెల్సునా ? సర్కిలిన్స్పెక్టరు కూతురికి వంటో సనిగా లేదు. కాపరాని కెళ్ళనందట. నాకు కబురు మీదకబురు రోజూ పదిసార్లు. ' నామిగతా పేషంట్లేమి కావాలి, రోజూ యిన్నిసార్లు మీయింటికి రావాల్సివస్తే ' అన్నా అక్కడికీ. వింటాడా, పెడ్తాడా యిన్స్పెక్టరు. చివరికేదో పరిష్కారానికొచ్చాంలేఅందు క్కాము.

" ఏమిటా పరిష్కారం ? " అంది ముసలావిడ."

" మీ ఆసుపత్రిలోనే ఉంచి అవసరమైన చికిత్స జరపమన్నాడు. "

" సారి ఎవత్తెనో యిక్కడ దింపుతానని చావుకబురు చల్లగా జేరేస్తున్నావా ? మానాయినే, అయిందీ ఆ తర్వాయి కాస్తా " అంది ముసలమ్మగారు ముఖం చిట్లించి.

" ఏమిటాతర్వాయి ఆత్తా అలా కరకరలాడ్తావు ? ఎవరూ చేరకపోతే ఆసుపత్రిగదు లెందుకనుకున్నావు ? అంతకన్న వెల్తి ఏమైనా ఉంటుందా ప్రాక్టీసుకు గదులు ఖాళీగా ఉంటే. "

" ఇల్లాగట్రా వెల్తిపుడ్డం. చక్కగా పెళ్లిచేసుకోవాలి. ఓయింటివాడవవాలి కాని. "

" ఇదేమిటమ్మా పెడర్థాలు తీస్తావు. గదుల్లో పెట్టినవాళ్ళకో, రిజిస్టరుంటుంది. వాళ్ళను ఇన్పేషంట్లంటారమ్మా ఖర్మం. "

"షేకేం పెడితేంలే నాయినా, అసలర్థం తెల్సినపుడు. నీవరసకు చెప్పా. అయితే అబ్బాయి, మనవూళ్ళో రోగాలు ఆడంగులకే కాని మొగాళ్ళకు రావేమిట్రా ? అందులోను ఇరవైలోపువాళ్ళనే వరిస్తాయిరా రోగాలు, రొచ్చులున్నూ."

"ఏమో నువ్విపరీక్ష చేస్తావని నేనేం స్టాటిస్టిక్సు తయారు చేయలేదు" అన్నాడు.

'స్టాటిస్టిక్సు' అంటే అదేవో ఇంగ్లీషుమందు అనుకొంది ఆవిడ

"ఇంగ్లీషుమందులూ పని చెయ్యవు తెలుగుమందులూ పని చెయ్యవు ఆడపిల్ల రోగానికి, రానేకూడదు గాని అరోగం. వెనక మా రయితుకూతురు, కాపురానికి పంపుతారన్నప్పుడల్లా బిగుసుకు పోయి, చాపచుట్టుగా పడిపోయేది. ఎంతమందో డాక్టర్లు, నాటువైద్యులు, ఓమిస్సమ్మా కూడా ఏమీ చేయలేకపోయారు. ఏవైద్యుడొచ్చినా చప్పరించేవాడు రైతు. ఆతడికి వాతల వెంకయ్య అంటే గురి. పొట్టమీద సూదేసి పదేళ్ళకడుపు నొప్పిని పోగొట్టాట్ట, తనకి. పేరుమోసిన పశువైద్యుడు వెంకయ్య. రైతు ఆతడ్ని రహస్యంగా రప్పించాడు. ఇవ్వాళకీ యిస్తేనే పిల్ల వేయించుకోనంటుందని, పిల్లను మాటల్లో పెట్టి, ఆమె పరధ్యాన్నంగా ఉండగా యిట్టే పెట్టాడు వాత ఎడంచేతిమీద, 'రేపొట్టే, యెల్లుండొట్టే యిక రెండు చాలం'టో. 'ఎంపేశాడే చచ్చినాడు' అంటూ ఎగిరిపడి, ఆ అమ్మాయి అత్తారింటికి పరుసుచ్చుకొంది. పదిమంది పిల్లలతల్లి అయింది. వెంకయ్య పిల్లలని యిప్పటికి మురిసిపోతారు వాళ్ళపిల్లలను చూచుకొని. ఆ వైద్యాలే వేరు చెప్పి గుణమిచ్చేవి. వాళ్ళజోలి మనకెందుకు గాని కేక లేసేది ఎవరిమీదో చెప్పావు కాదం"ది ముసలావిడ.

"సైకిల్ కు ఎడ్లు బెదిరి బండిబోల్తాకొట్టిందిటగా, ఆ సైకిల్ మనిషి మాట నేనన్నది" అన్నాడు డాక్టరు.

"అయ్యో! అదేం దారుణంరా ? సైకిల్ మనిషిని కొంపతీసి పోలీసాళ్ళు పట్టుకోలేదుగద" అందావిడ, ఆదుర్దాగా.

"ఇంకా లే ద"న్నాడు.

"మరి పోలీసుగాథ అంతగా చెప్పావు" అంది.

"నేను రిపోర్టుచేస్తే జరిగేమాట చెప్పా" నన్నాడు డాక్టరు.

కన్య నవ్వాపుకొంది.

కన్య నాకర్షిస్తోన్నాననుకున్నాడు కాబోలు."దురుసుగా సైకిల్ తొక్కుతో ఎడ్లను రాచుకుపోతాడా! ఎడ్లు బండిని పల్లానికిలాగేశాయుటగా. అంత దూరం సైకిల్ దిగగూడదేం. సీరియస్సుకేసు కెళ్ళేటప్పుడుకూడా నేనాపు తాను మోటారు. ఈబైతు కొచ్చిన తొందరేమిటి? కనుక్కుంటా. కనుక్కుంటా. పైలాపచ్చీసుగా తొక్కుకుపోతాడూ! తనసుఖమే నా. ఇవతలవాళ్ళు చచ్చినా అంతే నన్నమాట. తనసైకిల్ మూలాన మీరు మృత్యువుకళ్ళచూస్తే పాటిపోతాడా, పిటికిబెధవ, తనకీసాంఘిక బాధ్యతా లేనట్టు. చెవడాలెక్క తీతును. ఏమైతేం దాటిపోయాడు. ఇట్లాంటి బెధవలకు బుద్ధిచెప్పాలి. వీడిని నేనా వదలిపెట్టడం!" అని టపాపాటు కొట్టోన్నాడు.

"జరిగిన విషయం ఏమి తెల్సుకున్నా వనిరా అబ్బాయి, ఆతొందర పాటు" అంటో ముసలమ్మగారు, వచ్చేకునుకు, పోయేకునుకు, ప్రయాస పడి ఉందేమో, కస పడింది. గుర్రట్టింది.

సైకిల్ మనిషి సాంఘిక బాధ్యతల నెఱుగని మూరుడని చెలరేగి పోతున్న డాక్టరేమాత్రం బాధ్యతా నిర్వాహకుడైందీ, లీల బ్రతుకే చెప్తోంది. తానీ ప్రాంతాల కొచ్చిందీ ముఖ్యంగా, డాక్టరుకు బాధ్యతా నిర్వాహణావశ్య కతను నచ్చచెప్పి లీలను వప్పచెప్పటకే కద. అంచేత సైకిల్ మనిషి సాంఘిక బాధ్యతల నుపేక్షించి పారిపోయాడని ఈ పెద్దమనిషి ఆక్షేపిస్తే, కన్యకు, అరికాలిమంట తలకెక్కింది. ఉన్నతవిద్య నభ్యసించా డే కాని ఉన్నతలక్షణ మేదీ కానరాదు. ఉన్నతాశయాలేవీ ఉన్నట్టగు పడదు. సరస్కారంలోటు, మాటమోటు. బడాయికోరు, చపలచిత్తుడు. పిటికిమనిషి, విషయలంపటుడు. అవివేకులైన కన్యల నాకర్షించి, కులా సాగా రోజు గడపడమే కాని, కితనికి జీవితలక్ష్య మన్న దేదైనా కలదా? ఎంతసేపూ, తనడిగ్రీ లైన పలుకుబడి, ఒకటే స్వోత్కర్ష. స్వోత్కర్షతో డిగ్రీకి పూతబెట్టి, ఒక కొంతమూపసి, మేకప్ తళుకుబెళుకులతో ముఖానికి పూతపెట్టి, కన్యలను మిఱుమిట్లు గొలిపి గొప్పవాణ్ని అయిపోయానని

బాధపడి పోతున్నాడు. అమాయకురాలు, అల్పసంతోషి, లీలను మోహాంధకారంలో పడేసి మోసంచేశాడంటే ఏమీ చిత్రంలేదు. నేటి కాలేజీ తయారీ యువకుల లక్షణాలన్నీ ఈతనిలో మూర్తీభవించినై. ఆపిజీకి సరకున కేతడు మచ్చుతునకే. యూనివర్సిటీ విద్యార్థు లొకపర్యాయం మా స్వాములకు వైభవాన్వితమగు స్వాగత మొసగిన తరి, ఆధునిక ఆర్థిక దృక్పథాన్ని నిరసిస్తో స్వాము లిచ్చిన సందేశం మొదటిభాగంలోని అక్షరమక్షరము ఈతడికి అతికేదే.

“నైతికప్రమాణాలను విలువలను ఉపేక్షించి, యేదో ఒకప్రత్యేక శాస్త్రంలో ప్రజ్ఞానిధులను చేసి, కాలేజీలు ప్రజలమీదకు విడుదలచేస్తోన్న యువకు లెందరో, తమతోటే లోక మన్న సంకుచితభావంతో, స్వార్థ బుద్ధితో, అహంకారంతో ధర్మాధర్మవిచక్షణ లేకుండ, లేనిదానికొరకు, కానిదాని కొరకు పరుగులిడి, మానవపరమార్థాన్ని, మానవవిశేషతను విస్మరించి క్షుద్రజీవితమునకు పాల్పడుతున్నారు. స్వసౌఖ్యానికి యిబ్బంది కలుగకుండా కాపాడుకోవడమే వారి జీవితలక్ష్యం. స్వసౌఖ్యానికి అడ్డ మొచ్చే ఏ సాంఘికబాధ్యతను, సత్కార్యాన్ని మీద పెట్టుకోలేని పిరికితనం. స్త్రీ సుఖ మపేక్షించినా, సంసారబాధ్యత లన్న భయం. పెండ్లంటే భయం. పిల్లలంటే అదివరకే భయం. మంది ఎక్కువైతే మజ్జిగపల్చనవుతుం దన్న భయమేగా, ‘స్టాండర్డ్ ఆఫ్ లివింగు’ స్మరణకైనా, సంతాన నిరోధ సమస్యకైనా, మూలకారణం. నేటి విద్యావిధానంవల్ల ముఖ్యంగా మనకు కల్గుతోన్న ఐశ్వర్య మీఆర్థికదృక్పథమే. చివరకు పెండ్లికూడా, అధమం చదువుఖర్చు అయినా రాబట్టుకునే చతురోపాయమైంది.

“లీలను మోసంచేసిన ఈమనుష్యునకు గుణపాఠంచెప్పాలి. ‘చాలాగొప్ప వాణ్ణి, నే నేంచేసినా చెల్లుతుంది’ అన్న మైకంలో కన్నుగానక కొట్టుకుంటోయున్న డాక్టరు పొగరణచాలి. అతడి డిగ్రీని, పలుకుబడిని చులకన చేసి సామాన్యమనిషినే నన్న కనువిప్పు కలిగించాలి. ఇపు డాతడున్న గర్వపుపీటమీద, ప్రాధేయపూర్వకంగా లీల రక్షణకోరితే చెవినిపెట్టేట్టులేడ” నుకుంది.

“అయ్యో! అయ్యో! డాక్టరుగారూ, ఆగ్రహపడకండి. మీరు సైకిల్ మనిషినీ వదలి పెట్టవద్దు. నేను మిమ్మల్నీ వదలను. సైకిల్ మనిషి ఏం

చదువుకున్నాడని, వాడికి సాంఘిక బాధ్యతలవరకూ తెలుస్తై? ఎంత సంస్కారముంటే మాట సాంఘిక బాధ్యతలను పట్టించుకోవడం. మాటల మీద ఉందా అది? సాంఘిక బాధ్యతల ఊసుఎత్తారు కాబట్టి బండిబోల్తా కొట్టినచోట బాట నేను చూచినపుడు, నాకు కల్గిన చిత్తక్షోభ జ్ఞప్తికివచ్చి, మీకు అపరిచితురాలనైనా, కలుగచేసుకుంటున్నా. పరప్రభుపరిపాలన రోజుల్లో, ఇంగ్లీషు వాడిమీద నేరంవేసో, భారం వేసో, మనం నల్గురం తలో తట్టెడు మన్నుపోస్తే పూడేగొయ్యి అయినా, ఆ కాస్తపనీ చేసుకోకుండా తాటస్థ్యంవహించి గోతిని మీకుకట్టి పెట్టే దురభ్యాసానికి అలవాటుపడ్డాం. స్వపరిపాలన రోజుల్లోనూ అదేనాటకం ఆడుతున్నాము. మీకు ఒక్కమైల్లో ఉండి, బండి బోల్తాకొట్టిన మడుపు. మీరు పరిసర గ్రామాల్లో పేషంట్లను చూడవెళ్ళినపుడు, ఆదారినే వెళ్ళాలని తోస్తుంది. అమూల్యమైన మీ చేతి చికిత్స కోరి, నిత్యం మీఆసుపత్రికి వచ్చే వందలాది బళ్ళు, మోటార్లు, సైకిళ్ళు ఆదారినే రావాలనుకుంటూ, ఆ దారిని కాస్త వెడల్పుచేసి, నిమ్నోన్నతాలను సరిచేస్తే ఈబాపతువారీ బోల్తాలుండవు. తగిన ప్రోత్సాహం, సారథ్యం యిచ్చేమోగా డొక్క డీ ప్రాంతాల నుంటే, చుట్టుప్రక్కల రైతాంగ మెంతమందో శ్రమదాన మిచ్చి, ఆవోరకందారిని ఒక్కపూటలో రాజాకోడ్డుచేసి చూపెట్టగలరు. ఇంతసేపటిగా మీ మాటలు వింటోంటే, మీరీ ప్రాంత్రాల చాలా పలుకుబడిగల డాక్టరని, అధికార్లకు తలలో నాలుకని తోచింది. పరహింసకు జిల్లాపోలీసుదండు నంతను లేవనెత్తగల్గినవారు, పరహితానికే మీరు పూనుకుంటే, ప్రపంచానికి దిగ్భ్రమ కలిగించే ఏమహత్కార్యాన్ని చెయ్యలేరు? మీ వంటి పలుకుబడిగల ప్రతిభాశాలి, సాంఘిక బాధ్యతలను గుర్తించిన పెద్దమనిషి, గట్టిగా నడుంకడితే, న్యూఢిల్లీనుంచి ప్లానింగుకమీషనువారు పథకం పంపించి, భారతప్రభుత్వం అమెరికానుంచి అప్పుతీసుకొని ప్రారంభించేవరకు ఆగనక్కరలేదనుకుంటూ. ఈమాత్రంపని. సాంఘిక బాధ్యతల నటుంచి, స్వోపయోగంచూచుకొన్నా సునాయాసంగా మీరాపనిని నిర్వహించవచ్చే! అదిగదా పలుకుబడి పరమార్థం. విద్యాధికులై ఉండీ మీరా కాస్తపనినీ ఎందు కుపేక్షిస్తున్నారో తెలియకుంది. సాంఘిక కార్య

మొచ్చేసరికి. ' మిగతావాళ్ళేమి చేస్తారు, దాన్ని చూచుకోక ?' అని ఎవరం తటువారు, పక్కవాడిమీదకు దాన్ని నెట్టేసి, లాఘవంగా తప్పుకోవడం మనజాతి లక్షణమైందా అని నిర్వేదన కల్గుతుంది, మీవంటివాళ్ళే తూష్ణీ భావం వహిస్తే, ఈ సైకిల్ ఆసామీ చేసిన నేరమూ అదే. తన తర్వాత దారంటవచ్చే వాళ్ళెవళ్ళో మరోసు అయుకోక పోతారా, చూస్తో వాళ్ళ దారిని వాళ్ళు పోయేటంత మూర్ఖత్వముంటుందా ? అని ఆశ్చర్యపోతో చక్కా పోయియుంటాడు. మీరు చేస్తున్న నేరమే అతడూ చేసినా అతడు క్షమార్హుడు కాదని మీ అభిప్రాయం. అతడు విద్యాహీనుడు, సామాన్యమనిషి కావడంచేత మీమాట చెల్లుతుందని మీధైర్యం. ప్రజా ప్రజాభిప్రాయం తీరువేరు. విద్యావిహీనుడు, జ్ఞానశూన్యుడని అతడు చేసిననేరాన్ని అంతగా లెక్కపెట్టదు. విద్యావంతునికి జ్ఞానం ఆపాదిస్తుంది కాబట్టి, విద్యావంతుడు చిన్న నేరం చేసినా దాన్ని పెద్దనేరంగా జమ కడ్తుంది.

"మరోరహస్యం, విద్యావంతుడు, విద్యావిహీనుడు జవాబ్దారీఅయిన నేరాల స్వభావాల్లోనే ఒకప్రధాన విభేద ముంటుంది. ద్యావిహీనుడు బుద్ధిలేకనో, అనుద్దేశ్యంగానో, తాత్కాలిక కారణంగానో సామయిక భావోద్రేకంలోనో ఒరులకు ఘాతకల్గించవచ్చు. ఘాతననుభవించినవాళ్ళు పరాయివాళ్ళో, పగతురో అవుతోంటారు. ఆఘాత వాళ్ళ బాహ్యేంద్రియాలకు తగిలేదిమాత్రంగానే ఉంటుంది. విద్యావంతుని నేరవిధానం, స్థాయీ, పెద్దెత్తుమీద జరుగుతోంటై. విద్యావంతుని నేరాల్లో ఒకి చక్కని పన్నుగడ, చక్కనిపూనిక గోచరిస్తై. నమ్మికస్వామిద్రోహం. మోసం, స్థాయీ, తెల్వి ఉట్టిపడే నేరాలై ఉంటాయి. ఘాత ననుభవించిన వాళ్ళు అప్తులు. ఆత్మబంధుగులు, స్నేహితులు, సన్నిహితులు అవుతోంటారు కాబట్టి, రసం చిమ్ముతోంటుంది నేరం. అంచేత గాయపడేది ! పేమపూరితహృదయం, పేగుసంబంధం కావడంగా, కలిగేక్షోభ యెంతదురంత దుర్భరదుఃఖదవానలమో కాస్తదృష్టి పారిస్తే, విద్యావంతుని విపత్కరచర్యకు, అల్పుడు సైకిల్ మనిషి స్వల్పచర్యకు, వ్యత్యాసమెంత హస్తిమశకాంతరమో తమకు స్పష్టమవుతుంది. తమవంటి ప్రయోజకులు,

జ్ఞానసంపన్నులు, విద్యావిహీనుణ్ని శిక్షింపబూనడం, పోలీసు దళాల నాయత్తం చేయడం. పిచికమీద బ్రహ్మాస్త్రప్రయోగమే మోనని తమరే నవ్వుకుంటూ" రంది కన్య.

ఈమె భావతైక్ష్ణ్యం, బుద్ధినైశిత్యం, యదార్థవస్తుపరిజ్ఞానం, సాంఘిక దృక్పథం, వైద్యశాస్త్రపరిచయం, ఈమె బహుముఖప్రతిభగల వ్యక్తిగాని, తనకు పరిచయులైన సామాన్యకన్యలసాటిది కాదని, చెప్పక చెప్తున్నై. సాంఘిక సమస్యలు, రాజకీయాలు సంప్రదిస్తుంది కాని, శృంగారసంభాషణలకు సందిచ్చేటట్టులేదు. తన అలవాటు అల్పప్రసంగాలు, ఆషామాషీ చనువులు ఈమెవద్ద పనిచెయ్యవు సరికదా, ప్రమాదకరమనికూడా అబ్బాయికి తోచింది. అరె! కన్యలు, కన్యాప్రదాతలు తనడిగ్రీకింత మోజు చూపెడ్తున్నారు. ఎంతమంది స్త్రీలు తనప్రేమదృక్కులకు పరితపిస్తున్నారు. ఇంతడిగ్రీ ఉప్పూ ఊరగాయ కాదన్నట్టు సామాన్యమనిషి కిల్ ఆసామీతో నన్ను బ్రాకెట్టు చేసి చులకనచేసింది. వాడికన్న నేఎక్కువ ఎక్కడని చులకనచేసిందని మనసులో దేవుతోంది డాక్టరుకు.

"ఎవరమ్మా నీవు? చిత్రమైన భావసామగ్రి పోగుచేశావెక్కడో. ఏదైన వికాసకేంద్రయాజమాన్యం వహిస్తున్నావా, సేవాసదనం నడుపుతున్నావా? కాక మరేసంఘసంస్కారణోద్యమంలోనైన పనిచేస్తున్నావా? నీవ్యవహారం నాకేం బోధపడ్డం లే"దన్నాడు.

"నాగురించి మీమనసు పరిపరివిధాల పోవడానికి నేనేం వివాదాంశం చెప్పాను స్వామీ! ఏమి విరుద్ధాభిప్రాయమిచ్చాను? గురువిందపూస తనలోపాన్ని తాను గుర్తించలేదన్నాను. పరులకు దోషమారోపించేవాళ్ళు కించె దాత్మపరీక్ష చేసుకోవడం సముచితమన్నా" నని డాక్టరు కళ్ళల్లోకి నిశితంగా చూచింది.

లీలకు తాను కావించిన అపకృతిని ఎత్తి పొడుస్తోందని గ్రహించేటంత వాడి చాలదు డాక్టరు మనసుకు. ఒక్క స్త్రీవశీకరణోపాయాల్లోనే వల్లమాలిన చతురుడు. ఆ కిటుకులు మట్టుకు పట్టుబడ్డై. ప్రస్తుత వాదచక్రం మీదే తిరుగుతోండాలి అతడిబుర్ర. "బండిదారి బాగుచేయించక పోవడమూ నేరమవుతుందా" అన్న ఒక్కటిక్క ఉండి ఉంటాడు.

"ప్రజోపయోగకార్యాలు వెతికి చెయ్యబోతే లక్షలుంటాయి. పరిశీలన చాలకో, కాక నేప్రత్యేక శాస్త్రవిషైకపైనో బుద్ధిని లగ్నంచేసి ఉండో కొన్నిటి నుపేక్షించడమూ, స్వయం కృతదోషఫలితంగా పరుల కాపత్తు కలిగినపుడు, వారి నా మర్యోగంలో వదలేసి పారిపోవడమూ, ఈ రెండూ సమానంగా నేరాలని మీకేలా తోచిందో! ఇంతకు మొదటిదాన్ని నేరంక్రింద జమకట్టబోతే నేరస్థుడు కాని వాడు సృష్టిలో దొరుకుతాడా" అన్నాడు, డాక్టరు.

"తెలుక్కుంటో వెళ్ళి పరోపకారం చేసొచ్చేటంత ఉదార స్వభావులు సృష్టిలో దొరుకుతారా అన్న సందేహంతోను, సాకుమీదా, సత్కార్యాల నుపేక్షించకపోతే ఒకసత్కారంచేసి చూపెట్టి, అట్టి సత్పురుషు లుంటారని నిరూపించే కాంక్ష మీకెందుకు కలగకూడదు డాక్టర్జీ పక్కను పదిబారల్లో ఉన్న విపత్కరపరిస్థితిని చూచీ కళ్ళు మూసుకొన్నందు కన్నానుగాని మిమ్మేమీ సర్వాంతర్యాములు కాలేదని నే నాక్షేపించ లేదే. ప్రజాసేవకు, పాపం, కార్యక్షేత్రం కొదువ అయినవారు నేటికి మీరు కనిపించారయ్యా స్వామీ. పుష్కలంగా విద్య, ధనం ఉండె సంసారేతిబాధలు దరికి రాకుండా మెలివగా సుఖపడ్డం నేరిస్తిరి. ఇంతకు లోకం గొడ్డోయిందని ఎవరనుకోమన్నారు? అజిజ్ఞాస పెట్టుకున్న కళ్ళకు పరోపకార ధురీణులు కన్పిస్తారు. సాంఘిక సమస్యలపట్ల జాతిలో పేరు కున్న నిర్లిప్తతను నిర్మూలం చెయ్యాలన్న ఆశయ మొక్కటే విద్యాధికు లైన మీబోటియువకులకు కలుగనినాడు నురి విద్యల గోల ఏల? స్వోప యోగానికేనా విద్యలు నేర్వడం? ఉదరంభరత్వమేనా జీవితపరమావధి? సరికొత్త వేషభాషల దిగుమతీయేనా మీ మహదాశయం? మీరు తెచ్చే ఆటవస్తువులు ప్రజలకు కళ్ళు మిఱుమిట్లు గొలుపుతాయేమో కాని వారికి కడుపునిండదు. మరి వాటిని గురించి డప్పు కొట్టుకోవడం, హాస్యాస్పదంకాదా" అంది.

డాక్టరుకు చుఱుకు సాలని సంకల్పించే కుండ బ్రద్దలుకొట్టినట్టి పోటు మాట రాణిచ్చిందని తోస్తుంది.

దాంతో డాక్టరుముఖం కందగడ్డయింది. ఆగ్రహావిష్టుడై, "కన్యవని ఓర్మి చూపినకొద్దీ, నన్నవమానించడమే ప్రధానంగా పెట్టుకొని, కొలది

మీాతి మాట్లాడుతున్నారు. నీ అంతర్యమేమో, తెలీకుంది. నీమిస్సమ్మ బోధతో నాకేంపని. ఎక్కడనుంచో, ఎక్కడికోపోతో, మాముపలమ్మకు కట్టు కట్టినట్టేకట్టి వాటంగా ఆవిడవెంటబడే వచ్చావో, కాక యిచ్చటికే రాబూని వచ్చావో చాలసేపు సంశయించాను. ప్రసక్తానుప్రసక్తంగా నావిద్యావిషయం, వృత్తివిషయం నానోట వచ్చినంతమాత్రన నాకు స్వోత్కర్ష శోష మారోపించావు. నావిద్యావిషయమెత్తి దాని ఉపయోగా నుపయోగాల మీాద తీర్పుచెప్ప సాహసించావు. నాపలుకుబడి చిల్లిగవ్వ చేయదని నోరుచేసుకున్నావు. ఒకతుచ్ఛునితో నాకు సాదృశ్యం తే స్వతంత్రించావు. కళ్ళకుకట్టినట్టు కన్పిస్తోన్న వాడినేరాన్ని, వాడిదీ ఒక నేరమే నాఅని నాలుకమీాద దాటించేశావు. రెండోమానవునికి స్ఫురించని కార్యమేదో చేయక నేను ఉపేక్షించానని, శ్రమపడి, యెదర నామీాద అభియోగం తెచ్చావు. నీవరస, శైఖరి చూస్తే నిశ్చయంగా నీవేదో, పూర్వవైరస్మరణ కలుషితహృదయంతో నన్ను పరాభవించి పగ తీర్చుకొందుకు వచ్చినట్టు కన్పిస్తోంది. ఆవైర కారణమేదో నాకు అను చిక్కటలేదు. ఏమనుకొనుటకు నిన్ను యిదివరలో చూచిన పాపాన్నే పోలేదు నేను. నాకన్న చిన్నదానవని, కన్యవని చనువుచెయ్యబోతే నన్ను ములకనచేశావు. లాలనచేసినకొద్దీ బిగిసి నన్ను తూలనాడావు. కన్నె హృదయలక్షణాలైన కోమలత్వం, కలిసికట్టుతనం, మాట మార్దవం మచ్చిక మర్యాదలు యిరిగిపోయిన కఠినచిత్రవు. ఏమైనా స్త్రీవి, మాఅత్త కారణంగా అతిధి స్థానంలోనున్న దానివి. నీదుష్ప్రవర్తనకు ప్రతీకారం తలపెట్టడం నాగరికలక్షణం కాదని ఊఱుకొన్నా, ప్రొద్దుట మర్యాదగా నీదారిని నీవు పోవచ్చు'' నన్నాడు కటువుగా,

“ జై , అదృష్టమంటే నాదేనన్న మాట. తియ్యతియ్యని చూపులతోటీ, కమ్మకమ్మని కబుర్లతోటీ చక్కగా పూనిన కన్నె ఉటులేవో మీావద్ద ఉన్నాయని విన్నా. మీా చనువు పింపులు స్ఫురిమించి రాగాన్ని పడకుండా, మీారునా కాపాదించిన, ఆ నా కాఠిన్యమే, నన్ను కాపాడియుండాలి. నన్ను మర్యాదగా పంపేయతలచుకొన్నారు కాబట్టి. ఒక్కసహాయం మీారుచేయాల్సిఉంది. బహుశ్య ఈరాత్రో రేపుదయానికో సైకిల్ ఆసా

మిని అరెస్టు చేయుటకు మీపనుపునవచ్చే పోలీసు దళాలు దాష్టికానై వచ్చి, ఆపోలీసులు నామీద ఏమీ జులుంచెయ్యకుండా, మీరు మీచేత్తో నాకు పాస్పోర్టు ఒకటి దయచేయించాలి. పలుకుబడిగల పెద్ద డాక్టరుగారి చీటీముక్క, చాలుకదండీ'' అంది నవ్వుతో.

కుర్చీలో ఎడంచేతికేసి, కుడిచేతికేసి కనుల్తో, లయయుక్తంగా చూస్తా చూస్తానని, "నేను సైకిల్ ఆసామిని ఏమీ చెయ్యలేనన నీ పరిహాసం'' అన్నాడు.

చేయలేనివాళ్ళు చూస్తోంటారు. లేండి. వాదంలో అతడు నేరస్థుడని స్థిరపర్చలేక ఓడి, పక్కవారి పడ్తున్నారా'' అంది చిరునవ్వు రానిచ్చి.

"నేను వాదంలో ఓడానని ఎవరన్నా'' రన్నాడు రుద్ధకంఠంతో.

"ఎవ్వరూ అనక్కరలేదు. వాద ప్రతి వాదాల్లో కోపం రావడమే ఓటమికి నిదర్శనం అది. ముఖంలో కన్పించేదే. నాలుక చెప్పనక్కరలేదు. నాతో వాదించలేక నేను మిమ్మల్ని పరిభవించుటకు పగతీర్చుకొనుటకు వచ్చానని చిందులు త్రొక్కరుగా''.

"నాకు కోపం వచ్చింది కాబట్టి నీవు నెగ్గాననుకుంటున్నావు కాబోలు. వాదంలో తీసిపోయి కాదు. నీ అసభ్యప్రవర్తనకు కోపమొచ్చింది. నాప్రశ్నకు సమాధానం చెప్పలేక నేనే ఓడిపోయానని బుకాయిస్తావు''

"ఏమిటండోయ్ ఆ కీలకప్రశ్న ''. అని వికటంగా నవ్వింది.

"ఇహ నవ్వులు, వంకరమాటలు వప్పుకునేవాణ్ణిగాను. ఇప్పుడు తేలాలి నేనోడింది నువ్వోడింది. సూటిగా సమాధానం చెప్పు. చెప్ప లేకపోతే నోరుమూసుకువెళ్ళు''.

"సభ్యత జాస్తీ చేస్తున్నారు. అదిమూసుకోండి పరువుకు పెనుగు లాడే వారు పాపం. మాతని బిగించేముందు, ధావ్యపు బస్తాను మరో సారి కదిపి, కుదిపి, కుదించినట్టు యిది నాకో మీకో పర్యవసాన నా గ్రంథం వాదం కాబట్టి మరోసారి చూచుకొని, ప్రశ్నకు అతివ్యాప్తి దోషం పట్టకుండా, గొడవెట్టకుండా, నిర్దిష్టంగా సెలవియ్యండి''

"సైకిల్ ఆసామిని తన్నిస్తానంటే, దారిబాగుచేయించక పోవడం నాదీ నేరమేనన్నావు. నాది ఉపేక్షామాత్రం. వాడిది చెయ్యిచేతలా చేసిన

ఒకపని, రెండూ నేరా లేలా అవుతాయన్నా అక్క డుంది వాదం, మరి ?" అని పెదిమెలుబిగించి పట్టుదలగా కూర్చున్నాడు.

"అయ్యో డాక్టరుగారూ యింకా నేను వాదించడం మొండుకండీ, నాపని గుమ్మాలోనే అయింది. వాదంలో నే నెగ్గితే జరగాల్సింది ముందేజరిగింది. అనగా మీ పెదిమలు బిగుసుకుపోయాయి. అదే వాగ్బంధనంటే. ఇంకేం కావాలి ?

డాక్టరుకు నవ్వొచ్చింది, కోపమూ తగ్గలేదు చురుక్కు-చురుక్కు-మనే తిట్లమధ్య ఒక పహాస్యంమాట పడితే, నవ్వుకోనందుకు తిల్లు తింటోన్న పిల్లకాయ, నవ్వు అపుకొంటో, కోపం ముఖం, బుంగమూతి పెడ్తాడు చూడండి, డాక్టరుముఖంలో అమిశ్రమభావం కన్పిస్తోంది. దాన్నే ఊహకు మోత్సన మాటాగా బుద్ధిమంతులు.

డాక్టరు కళ్ళెర్రచేసి, "వేళాకోళాలు. వెక్కిరింతలు వద్దన్నా కావల్సింది నాప్రశ్నకు సమాధానం," అని కళ్ళుమూసాడు. మనఃకేంద్రీకరణాభినయం కాబోలు

"నల్ల అద్దాలు పెట్టుకున్న వాళ్ళతో, ముందు వాటినితీయిస్తేగాని మాట్లాడనని నావ్రతం. వారి హావభావాలు తెలియవు. కళ్ళుమూసుకున్నా అంతటిదే అందికన్య.

"సరే అయితే, కానీ" అనికళ్ళుతెరిచి చురచుర చూస్తున్నాడు.

"అయితే మీ కాబులబాటం, తీరుస్తా వినండి ఒక సత్కార్యాన్ని చెయ్యక ఉపేక్షించినవాడు, చెయ్యిచేతలా ఒక మండగ కార్యంచేసినవాడు ఏలా సమాన నేరస్తులు కాగలరని మీఆవేదన. నేరంతూకంకట్టి చూపాలన్నమాట. నేరం తూకం, నేరమని మనం పరిగణించే ఘటన మీదే కాదు. నేరస్తులస్థాయి స్తోమతులమీద కూడా అధారపడి ఉంటుందని మనవిచేసి యున్నా. ఇదరు కాడిగట్టు వ్యవసాయకూలీలు బహుజుగుప్సాకారమైన మాటలతో తిట్టుకుంటున్నారండి. ఆవిషయం పదినిముషాల్లో మరిచిపోతాం. అదేయిద్దరు మీడాక్టర్ల సందున జరిగితే, ఊళ్ళో, పది రోజుల పాటు అదినిత్య ప్రసంగం అవుతుంది. కులీల సంభాషణతీరే అంత అనికొట్టి పారేస్తాము. డాక్టర్లని అప్రదిష్టపని చేశారంటాం. వాళ్ళని

పాపం. అయినా నేరస్తులవుతాయి, స్తోమతుల మూలంగా నేరంతూకం మారిందా. లేదా! ఉండదు జోడాల మనుష్యులు, ఒకే మాటతో, ఒకేచేష్టతో బాధ్యులైనా, గొప్పవారిది నేరమైంది కొద్దివాళ్ళది కాలేదు.’’ అందికన్య.

“నీఉదహరణలో ఔచితి కనిపించటంలేదు. బుకాయింపు నాదగ్గ సాగదు. ఆరెండు సెట్లమనుష్యులు ఒకపని చేసినవారే. ప్రస్తుత విషయంలో ఒకటి ఉపేక్ష, ఒకటిచేత. ఉన్నత గాయిదానే అక్కడ. ఆసామ్యం ఎలా అతుకింది’’.

“పైన ఉదాహృతమైన సత్యం, నే రాబొయ్యే ప్రధానసిద్ధాంతానికి సోపాన ప్రాయమయ్యా మహానుభావా! నిన్ను ప్రాసాద మెక్కించాలని, గడపవద్దకు తీసుకు వెడ్తే, యిది ప్రాసాదం కాదని తిరుగుముఖం పెడ్తావె. పై ఉదహరణ రీత్యా తేటతెల్లమైన సత్యాన్ని అంగీకరిస్తే యిక నీసందేహానికి సమాధాన మిస్తా’’ నంది.

“సరే, కానియ్యి’’ మన్నాడు.

“పొట్ట మీద ప్రాకుతో, శిశువు వాకట్లోఆడుకొంటోండగా, కొంటె పిల్లకాయ ఒకడు, అచ్చటఎలకలబోను నొకదాని ఎక్కబెట్టి పోయాడు. ఒక పెద్దమనిషి వాకట్లోనే కూర్చున్నాడనుకోండీ. బాలుడు ఎక్కబెట్టిన ఎలకలబోనునూ చూస్తూన్నాడు. దానివద్దకు ప్రాకుతోన్న శిశువును చూస్తున్నాడు. అతను కలగ చేసుకోలేదు. అంతే. బిడ్డవెళ్ళి వెళ్ళి యిట్టేదానిలో చెయ్యిపెట్టింది. పైన చెప్పటానికి నాకు వళ్ళుఝల్లుమంటుంది నాకు కాస్త హృదయం ఉంది. ఇక మీరు చెప్పండి న్యాయం. డాక్టరుగారు! పెద్దమనిషి ఎలకబోను మీటును తీసేసి ఉంచేనో, కాక ఆబోనునే వాకట్లో నుంచి లాగేసి ఉంచేనో, మీఅత్తకు తలరక్తపాతమైనట్టు ఆబిడ్డకు చెయ్యి రక్తపాతం కాకపోను. ఘాత తప్పును. ఆపెద్దమనిషి ఒక సత్కార్యం చేసినవాడగును. ఆసత్కార్యంచెయ్యకుండా ఉపేక్షించాడు అంతే. పెద్దమనిషి బోనును ఎక్కబెట్టినవాడు కాడుగా. వాడిష్టం, చూస్తో ఊరుకో వచ్చనంటారా? బోను ఎక్కబెట్టి పోయిన అభం శుభం యెఱుగని బాలుని, ఫాశావేసి. శెతకిపట్టి తన్నిస్తా నంటారా? ఉపేక్ష చేసిన పెద్దమనిషి నేరస్తుడు కాడనిగా డాక్టరుగారి బడాబడా అభిప్రాయం!!! అంది కన్య పకపకానవ్వుతో!

ఈ ఉపమానం డాక్టరుకు డెక్కట్టింది. అయినా, అడ్డంతగలాలి.

"బిడ్డ ఎలకలబోనులో చెయ్యి పెట్టినపుడు, పెద్దమనిషి బోనుసమీపంలో ఉన్నాడు. బండ బోర్లాకొట్టినపుడు నేను మడుపుదగ్గర ఉన్నానేమిటి?" అన్నాడు.

"నువ్వెక్కడుంటే రెండు చేతులతోను బంధిపడుకుంటూ పట్టుకోము వని కాదయ్యా. చంటికుర్రాడిలా చెప్పావు. ఆ అనుమానం వదుల్తుంది. యిటువిను. బిడ్డ ఎలకలబోను కేసి వెడ్తోండగానే, పెద్దమనిషి వాకిట్లో నుంచి వెళ్ళిపోతే మాత్రం నేరస్థుడు కాడా? ఆస్థితిలో బోనును, బిడ్డ తిరిగేచోట, ఉంచడం అపాయకరమని పెద్దమనిషికి తెల్సునా,? తెలియదా! అని కాని, అవసరవిషయం. బిడ్డ బోనులో చెయ్యిపెట్టినప్పుడు పెద్దమనిషి అచ్చట ఉన్నాడా? లేడా! అన్నది కాదు కాబట్టి బోలా అప్పుడు మీరు లేకపోతేంగనక. మీవాళ్ళుగాని మరోళ్ళుకాని అవేంకపు మడుపుగుండా వెళ్ళాలని మీకు తెల్సునా తెలియదా? ఒప్పుకోండి మిటుకు మిటుకు చూసెక! డాక్టర్జీని వాదనాలో వాంగ్బంధన చేశానని అనుకోవచ్చా, యింకా పేచీపెడ్తారా?" అంది కిన్నె.

లజ్జారుణిత వదనుడయాడు డాక్టరు. పౌరుషం దెబ్బతింది. రోషం వచ్చింది.

"ఓహో! గట్టిదానవే, కాలికేస్తే మెడకు. మెడకేస్తే కాలికి, తగ్గ పాండిత్యం వినుపిస్తున్నావే! సైకిల్ మనిషి నేను ఒకతరహా నేరమే చేశామని మొదట్లో నళిగావు. ఇప్పుడు తాడుబారి, తీంద్రించి, వాడ్డ నేరమే లేదంటున్నావు. పైగా అభం శుభం ఎరుగని బాలుడంటూనే అనుష్టుణ్ని. నేరనిర్ణయం చేయవచ్చేసరికి ఏవేవో, కథలు, కార్పణ్యాలు, ధర్మపన్నాలు, ఉపమానాలు, సామ్యాలు, సుభాషితాలు దొర్లించుకొచ్చి, విషయాన్ని కమ్మిత్రచేసి నాలుక మడతేశ్తావ్. వాడేల నింద్యుడు కాడో ఏమి చెప్పి బోర్లించావని కఅతిశయం:"

"మాతిబిగించేసి ప్రక్కన పడేసినబస్తా మాతిమళ్ళా విప్పమంటారా. గుడుగుడుగుంజం గుండారావం అనే పిల్లల ఆటలాగుంది మీవైఖరి. నేనే నెగ్గానని ఆఖరకేక వేసి పారిపోయేటట్టు కనిపిస్తున్నారు. ఇటువంటిదే

ంపె వాదమనో, మొండి వాదమనో, అనేది. వినేవాళ్ళకు విసుగెత్తుతండ్రీ యీ చర్విత చర్వణం. వాదం ఆపుచేతామండి, మీకు పుణ్యముంటుంది. లోతునీళ్ళ కెగవద్దన్నారు, పెద్దలు. ఎప్పుడో వెళ్ళి పోయిన సైకిల్ మనిషి బెంగేమొచ్చె మీకు. సుఖానున్న ప్రాణం దుఃఖాన్ని పెట్టుకోకండి. తీగె కదిపితే డొంక అంతా కదుల్తుంది. నామాట వినండి, పది మందిలోను మసిలేవారు". అంది కన్య, డాక్టరు బాగుకోరి బ్రతిమాలుతోన్నట్టు పెదిమలు గానిచ్చి.

డాక్టరు ఉగ్రుడైపోయి, చర్రునలేచి నిప్పులుకక్కుతో "ఆలుచ్చా మీద నేను నేనారోపణ చేస్తే, నేను సుఖానున్న ప్రాణం దుఃఖాన్ని పెట్టుకోవడం, ఏమిటి? తీగె కదపడమేమిటి? డొంక కదిలేదేముంది. పదిమందిలోకి వెళ్ళేవాడినని ఆ జాలేమిటి? న్నే నేదో నేరం చేసినట్టు, వాడ్ని కదిపితే దాన్ని వాడు పైకితీసి, నన ల్లరి పెట్టగలడన్నట్టు ధ్వనిస్తోంది నీమాట. నాతో వాడికేం పరిచయ ముందనగలడు. నేనేం నేరం చేశాన నగలరు రోగీవిలన్" అన్నాడు, ఇంగ్లీషుతిట్లు ఘాటుఎక్కువ అనుకున్నాడేమో డాక్టరు.

"అయ్యో, డాక్టరుగారూ, బద్ధితప్పిన రైల్లా అయిపోతున్నారండీ. వాడ్ని తిట్టడం మరీం ప్రమాదం కాదండీ. ఒరులను తిట్టి కార్యం సాధించిన వాళ్ళున్నారటండీ ఏనాడైనా, పశ్చాత్తప్తులై ఇహపరాలను సాధించారు కాని" అంది, ఆచాచి, నిమ్మకు నీరోసినట్టుగా.

పరవళ్ళుతొక్కుతోన్న డాక్టరు కీపె ప్రశాసాంతత, పుండుమీద కారం చల్లినట్టుందేమో. "అదుగో, మళ్ళాఅదేమాట. పాపం చేసినవాడికిగాని. నాకెందుకు పశ్చాత్తాపం" అన్నాడు.

"అన్నా! ఆమాట మీరనవలసింది కాదండి, చిన్నదాన్నైనా చెప్తున్నాను" అంది మంచంమీదనుంచి లేచి, ఆఫీసుగుమ్మంలో కడ్డొస్తో.

తిట్టిపోతున్న దాన్ని కలబడి ఆపుచేసి కసితీర్చుకుంటాడా అన్నట్టు, డాక్టరు దూకుడుగా అడ్డంతగిలి, "ఆగు అక్కడేముంది, మొదటి నుంచి ఈధోరణిలోనే మాట్లాడుతున్నావు. ఇదంతా, ఏదో బ్లాక్ మైయిల్ వాటంలో ఉంది. మీ రుభయులు ఏదో దుర్వృత్తితో, ఏక కార్యార్థులై

వచ్చిన కుట్రదార్లు కావాలి వాడెవడు ? నువ్వెవరు ? మాటమాటకు వాణ్ని వెనకేసుకువస్తావు. దాస్తే దాగేది కాదు. వాడితో నీకు సంపర్కం లేకపోతే వాణ్ని అయినదానికి కానిదానికి సమర్థించడానికి ఇంతగా పూనుకోవు. వాడు బ డి బోల్తాకొట్టించిన మరునిమషంలో నీవు ప్రత్యక్షమయావంటే ఏమనుకోవాలి ? అడదీమొగాడూ, ఎందుకు ఒకళ్ళకోసం ఒకళ్ళు యింతగా ప్రాకులాడ్తారో ముఖంమీదే కన్పిస్తోంది'' అన్నాడు.

స్వయకృంతదోష ఫలితంగా వచ్చిపడ్డ విషమసంఘటనను ధైర్యసాహసాలతో నెదుర్కొనలేక, పశ్చాత్తాపుడూ కాలేక, యిక చేతనైంది, తన్నవమానించి, ఒక కొంత సంతృప్తి చెందుటకు, తనకు శీలభంగ మాపాదించి కాలుదూసిన డాక్టర్ను చూచి, క్రోధమూర్తిత వ్యాఘ్రి పోలిక రోజుతో, "ఎంతనైచ్యానికి పాల్పడితివయ్యా డాక్టరు ! ఇది నీగతచరిత్రకు, చిత్తవృత్తికి, సంపూర్ణంగా సమన్వయిస్తోన్న లక్షణమే కాబట్టి, అందాశ్చర్య విశేష మేమీలేదు. వంచకుని నడవడి దాల్చే పర్యవసానరూప మిదే. నేరంనిండి పాపం పండే వరకు భగవంతుడు ఓర్మి వహిస్తాడు. అఓర్మని ద్రోహి అపార్థం చేసుకొని, కన్నుమిన్ను కానకుండా, అతఃకూపంలోకి దొనదొన దొర్లుకు పోతాడు. ఇది నీపాపం పండినప్పుడియు కాకపోతే, శారదాపదాంబుజద్యాయిని, ఒక ఆశ్రమ కన్యపై యింతదారుణమైన ఆరోపణ చెయ్యవు. సరే, నేనూ సైకిల్ ఆసామీ. ఏకఫలాపేక్షులమైన కుట్రదార్లమని గ్రహించావు కాబట్టి, ఇక నేరం, సైకిల్ మనిషితో పాటు, నీపోలీసుళాదలకు నన్ను కూడావప్పచెప్పు. నీఘూాః తిన్న మాతాశిశువులు, —వింటోన్నావా, గుడ్లు అంత చేశావు. విను నీకు మంచిమాటే చెప్తున్నా —ఆ మాతాశిశువులు, నిరపరాధులు, నోరునావిలేని వాళ్ళు, నీవాతను పడి, నీపుణ్యాన, సంఘదూరులై, వెలివాండ్రై, హతాశులై అలో లక్ష్మణా అని నిముష మోయుగంగా మృత్యువుకు నిరీక్షిస్తున్నారు. ఆజీ వచ్చివా లిప్పు డెక్కడున్నా నీకువచ్చిన భయంలేదు, వాళ్ళభయం, డొక్కలో పెట్టుకొని యిచ్చటి సుఖజీవితం పాడుచేసుకోకు. నీమేలు కోరి చెప్పవచ్చాను. ఇక వాళ్ళొచ్చి నీదౌష్ట్యాన్ని పదిమందిలోను పెట్టి, వీ మూల ప్రాణప్రదంగా నిర్మించుకుంటోన్న పరువుకు, పలుకుబడికి

అవరోధం కల్గిస్తా రన్న అదటు నీకక్కఱలేదు. ఆ అజ్ఞాత జీవుల కిపుడు కదలివచ్చే జవసత్వాలు కూడా లేవని నీకు ధైర్యం చెప్పడానికేనా వచ్చింది. మరిచదువుకున్న వాడివి కాబట్టి అందులోనూ పరమాధునికుడవు కాబట్టి వాళ్ళ ఉసురేదో నీకుతగుల్తుందన్న పాతకాలపు భయాలు నీకెలాగూ లేవుకద. ఇక్కడా, దండించేదాత, మర్దించే మామ నీకెవ్వరు లేరుగా. ఇక నన్నొక్కర్తెను ఇనపఊచల వెనక బిగించేస్తే, ఇక నామాతశిశువుల ఊసు ఎత్తే ప్రాణి పైన ఉండదు. నీకు సంసారబాధ్యత, బాదరబందీ తొలగుతై. నీభోగలాలస ప్రక్రియ కది రాచబాట. బందీలో యున్నా, యెప్పుడేం తోచి, నోరు జారి నిజం బైట పెడ్తానో. ఎందుకొచ్చింది నీకు నన్నక్కడ పెట్టుకుని కూర్చోవడం. వృత్యానుసారంగా ప్రాణం పొయ్యగలవు, తియ్యగలవు. నీవృత్తి అది. మనః ప్రవృత్తి కూడా అదేననీ రుజూపిచ్చావు. నాకంఠంలోది గుక్కెడు ప్రాణం. అదుగో ఆ లేబెల్ అంటించిన బీరువా. పైఅర, సీసాలో, గుక్కెడు కాలకూటం. హంతకుని మనసులాంటి అంధకారావృతమైన రాత్రిసమయం హృదయంలేని వాడవని తెల్సి యుండే, మానవమాంసభక్షణకు మరిగిన శార్దూలపు జిత్తుల ప్రయోగించి కన్యల నాకర్షించి గంగ కర్పింపగల కర్కశ హృదయుడవని తెల్సుండే, నీగుహలో నీతో సంభాషింప సాహసించానంటే, ప్రాణహానికి సంసిద్ధ నయ్యే, మృత్యుసన్నిహితత్వ మపేక్షించే వచ్చానని నమ్ము. స్త్రీలను భోగ పదార్థాలగా, జమకట్టి, నీవీప్రాంతాన సాగిస్తోన్న దుర్వ్యాపారాన్ని అరికట్టి, స్త్రీప్రతిష్ఠా పరిరక్షణార్థం. అవసరమైతే, ఆహుతి కాడానికి నిశ్చయించుకొనే వచ్చా. లీల ఒకటి, నేను రెండు అని తెంపు చేసుకొనే వచ్చా. నీ వామాతా శిశువులకు చేసిన అపకృతికి ప్రకృతి కంపిస్తోంది. మానవీ మానవ ప్రపంచం నీరాక్షసకృత్యం, విన్నంత మేర, మహాగ్ని స్ఫులింగాలను క్రక్కుతుంది. మీకొక మాటజ్ఞప్తికి తెచ్చి నాదారిని నేను పోతా. "సైకిలీ పైలాపచ్చీసుగా తొక్కుకుపోతాడా, తనసుఖమేనా, ఇవతలవాళ్ళుచచ్చినా అంతేనన్నమాట" ఇవి మీమాటలు. పరులకష్టాల కెంతగా పరితపించే హృదయమో మీది, ఇవి వాక్కులా సైకిల్ మనిషి ప్రాణానికి బాకులు కాని. మరిముక్కుపచ్చలారని ఒక అమాయకురాలి.

ఆమరణాంత అధఃపతనానికి కారకుడైన ఒక రాగాంధుని హేయప్రవర్తనను ఖండించాల్సివస్తే, మీరైతే, ఏనిష్పత్తిలో, ఎంత నైశిత్యం కల మాటలు ప్రయోగిత్తురో! నాకు భాషచాలదు. నా చేయగలిగింది ఒక్కటే. పశ్చాత్తప్తులై, యికనైనా సన్మార్గవర్తులై, శిలయేదో, సిద్ధమణియేదో యను గ్రహణశక్తి కలవారేగాన, లీలను స్వీకరించి, యిహపరాల కయ్యేట్టి సంసారసుఖం పొందమని కోరుతా''నంది.

మొదలు నఱికిన చెట్టులా పడక్కుర్చీలో కూలబడ్డాడు డాక్టరు. ఇనుపకడ్డీ కాల్చి హృదయంలో గ్రుచ్చినట్లు సంకటపడుతున్నాడు. తలగిర్రున తిరిగిపోతోంది. కన్నులశ్రుపూరితమైనై. అవమానభారంతో తల వంచాడు. బాధాపూరిత ఉచ్ఛ్వాసనిశ్వాసాలను తీస్తున్నాడు. గట్టిగా ప్రసంగిస్తే దుఃఖ సముద్రంలో మునిగిపోవడం, ఆఉద్ధృతం తగ్గాక, తిరుగా ఎప్పటిఆట. రోజులు త్రోసేయడం, ఆరకం మందగాడి మనస్తత్వమేమో డాక్టరుది. ఈ పనులలోనే డాక్టరు నోటంట అంగీకారాన్ని పుచ్చుకొని, ఇక నాతడు వెనుతీయడానికి వీలులేని కార్యక్రమంలో యిరుక్కునేట్టు చెయ్యాలని సంకల్పించింది. "అయ్యా! డాక్టరుగారూ మరొక్కమాట. నేను వాళ్ళను వదలివచ్చిన పరిస్థితి చూస్తే, సెకనాలస్యానికి కూడా వేచియుండని కార్యభారం మనమీద ఉంది. దీపంలో చమురునిండుకొంటోంటే వచ్చి పడ్డాను. ఆరిపోతే తిరుగా వెలిగించుకొనే జ్యోతి కాదుకద ప్రాణం. క్షోభపడియున్న జీవి, ఏనిముషంలో ఓర్మిసళ్ళినా ప్రమాదమే. నేను మీఅంగీకారాన్ని సంపాదించినా, లీలకు దాన్ని అందుపనె స్థితితప్పితే నేనాపె పాదాలవద్ద తలబ్రద్దలు కొట్టుకోవాలి. అది మరీ తీరని దుఃఖం. స్వాగతాలకు సంప్రతింపులకు విషయం వేచియుండేటట్టులేదు. ఆవరణకే కాని ఆలోచనకు సమయం కాదిది. చెప్తోన్నా'' నని చికాకు నభినయించ సాగింది.

డాక్టరు నిలువెల్లా వణికిపోతో, కుర్చీలోంచి దిగ్గునలేచి, కన్య చేతులు పట్టుకొని, "నేను లీలను చూడగలనా? లీల నన్ను క్షమిస్తుందా?'' అని తలవంచుకునే కొంకుపోయిన గాత్రంతో వాపోతున్నాడు.

"లీలపట్ల తిరస్కారభావం జనిస్తే ఏమోకాని లీలను చూడకలనా

అన్నదీ ఓసమస్యేనా? ఇంతకన్న వైపరీత్య ముంటుందా? లీలను చూడలేక చంపుకోదలచుకున్నావయ్యా, మహాత్మా! ఎప్పటికపుడు, అవసరమైన పర్యవసానంమాట, అక్కయ్య పైకి చెప్పే తెగువలేక, కంఠంలో దాచుకొని, ఎంతమందిని నరకంలో పెట్టావయ్యా స్వామీ! ఈ తుదినిముషంలోనైనా సరే, 'సై' అని మీరు తలఊపితే, లీలతో, మీఅత్తతో, మీఅక్కయ్యతో తగురీతిని సంప్రదించి సరిదిద్ది, పరిణయ ప్రయత్న మంతా నేచక్కపెట్టి వెడ్తా. మీ అంగీకారాన్ని నాతో చెప్పడమూ భిడియ మైతే, మీ లెటరు హెడ్డు పేపరోటీ, కలమూ నాకివ్వండి. ఇప్పుడు లీలకు వ్రాసిపడేస్తా. మీకు లీలఅడ్రసు యిస్తా. ఉదయమే మీరు 'Forgive–Letter follows' అని తంతి పంపండి. నిరంతరాశ్రుధార లతో మీ ఆహ్వానానికి నిరీక్షిస్తోన్నలీల మన అదృష్టం బాగుండి, మీతంతిని చూచుకొనే స్థితిలోఉంటే, యింకేం కావాలి? కోటలో పాగా వేశామన్న మాటే. లీల జీవించినట్టే. నాఉత్తరం ఎల్లుండిచూచు కొని అంతులో ఆదేశించినట్లు చేస్తుంది."

కీళ్ళు పొదిగించిన కొయ్యబొమ్మలా కదలి, మూరు మాటలేకుండా డాక్టరు లెటరు హెడ్డు కాగితం, కలం కన్య కిచ్చాడు.

అంతలో "భోజనానికి రమ్మ" ని రమణమ్మగారు కేకేసింది.

"భోజనసమయంలో మనం పెళ్ళిమాటలు మాట్లాడాలి. మీరు గతం విస్మరించి, కులాసాగా భోజనానికి లేవండి. అవసరమైనచోట మాట పడేస్తోండండి, నోరు బిగించుకొని కూర్చోక, మీకు పుణ్యముంటుంది. ఈ పసును చెడితే వ్యవహారం మొదటికొస్తుంది. నేనిచ్చటకు రోజూరోజూ వచ్చేదాన్ని కాను. పెద్దల వప్పుదలలేని వివాహం శ్రేయోదాయకంగాదు. మీరు వారితో స్వయంగా చెప్పుకోలేక యిందాకా తెచ్చారనిపిస్తోంది. భోజనసమయంలో ఈ ప్రస్తావన తెచ్చి నేను మామ్మగారిని వప్పిస్తా" నని చెప్పి, ఆవిణ్ని ఫలహారానికి తీసుకెళ్ళుటకు వాకిట్లోకి వచ్చింది.

'అత్తతో రాయభారం కన్య పొసగించగలదా' అన్నదొకటే డాక్టరు ఆందోళన యిప్పుడు. తనకు లీలతోఉండిఉన్న పరిచయం ఊసుఎత్తితే, ససేమిరా పనికిరాదంటుంది అత్త. అది తథ్యం. అది దాచిపెట్టి కన్య లీల

ప్రస్తావన నేలా తేగలదు? తెచ్చినా శిశువు నేమిచేయదలచుకుంది? పెళ్ళి పీటలమీదను లీల పిల్లను కచ్చబెట్టుకొస్తే, అత్తమాట అటుంచి సంఘం మాత్రం ఒప్పుకుంటుందా! అట్టి వివాహానికి శుభాకాంక్షితలు చల్లేది ఒక్క కుటుంబం ఉంటుందా గ్రామం మొత్తంమీద! చక్కగా జరగాల్సిన పనికి, బిడ్డ అడ్డం పడేటట్టుందని, బిడ్డపై కంటకపడ్డాడు, వాత్సల్యాభిహితుడు, స్వసుఖాపేక్షితుడు డాక్టరు.

తనను కన్నతండ్రి ఆనాడు తన సుఖానికి అడ్డైకూర్చున్నాడు. తాను కన్నబిడ్డ సమస్య ఈనాడు గడ్డై కూర్చుంది. వయోవృద్ధు కాబట్టి తండ్రి వదిలాడు. బిడ్డ నేలా వదల్చుకోవడం! సూక్ష్మమార్గ మేదైనా నేను తలచినా, తల్లిప్రాణమంటూరు. లీల ఒప్పుకోదేమో' అని విధంచెడ్డ డాక్టరు మనసు ఆలోచనకు పడింది. శిశువు కల్పించిన యిన్నితటవట్లు తప్పే మార్గ మేమాలోచించి కన్య అత్తతో రామభారానికి దిగుతోందో, అనుకుంటూ అద్దంలో చూచుకుంటున్నాడు. భోజనసమయంలో కులాసగా ఉండాల్సిందని కన్య హితవు కాబట్టి, కులాసాను రీహార్సల్ వేసుకుంటున్నాడేమో అబ్బాయి!

కన్యకూర్పు నేర్పు లేదేమో కాని పరాయి యిల్లయినా, అంతలో తాను సంకల్పించిన పెళ్ళిమాటలకు శోభాయమానమైన వాతావరణాన్ని తయారుచేసింది. కన్య అంతర్యం ముసలమ్మగారికి తెలియకపోయినా ఆవిడ అననే అంది

"అమ్మాయీ రవణమ్మా! పెళ్ళివారిల్లులా, కలకల్లాడుతోందే మన వంటిల్లు ఇవాళ. ఈ అమ్మాయి పని అందం, పురమాయింపు నేనెక్కడా చూడలేదే" అంది.

"ఏఅమ్మాయి అందం మాటే నువ్వు నేది, అత్తా!" అంటూ వచ్చి డాక్టరు పీటమీద కూర్చున్నాడు.

"ఈ అమ్మాయి అందంమాట కాదురా నేనన్నది పని అందంమాట చెప్పారా. అన్నిమాటలు వినుపించవద్దూనీకు" అంది, డాక్టరు కన్య అందం గొడవను పడ్డాడన్న దిగులుతో.

ముసలమ్మగారు డాక్టరుతో చేసే ప్రసంగాలు మొదట్లోనే మందలింపు

లతో ప్రారంభమవడం కన్య చూసి ఉందిగా, ఆవిడ, అతడిమీద కస్సు బుస్సు మనడానికి పెద్ద కారణా లక్కఱలేదు. వా రిపుడు కరకరలాడ్డం కార్యభంగం కాలదు.

ముసలమ్మగారి దృష్టి మరలించి, "చూచారా దీని కొంటెతనం! తనకు కలిపిన అన్నం నుంచుని నాకు తినిపిస్తోంది" అంటో రవణమ్మగారి అమ్మాయిని శబ్దమయేలా ముద్దుపైముద్దు రెండుముద్దు లెట్టుకుంది కన్య.

"సీత కాదు, నువ్వు ముద్దొస్తున్నావమ్మా నాకు. ఎవరమ్మాయివో! ఏఊరో? చెప్పావు కావు" అంది ముసలమ్మగారు.

"నాకూ తెలియులే" దన్నాడు డాక్టరు.

'నీకు తెలియకపోవడమే మంచి ద' నుకొని ముసలావిడ అతడిమాటనే లెక్కపెట్టకుండా, కన్యవంక చూస్తో, "నీకు అన్నం తినిపిస్తోన్న సీతి ఎంతపెంకిపిల్లో చెప్పలేను. ఒక్కపూటలో దాన్నేలా మచ్చిక చేశావో చిత్రమౌతుంది. రోజూ అది అన్నాలవేళే నిద్రకుపడ్డం, లేపితే మారాం పట్టడం, కంచం తన్నేయడం, తల్లి బాదడం, యిదీ వరస" అంది ముసలావిడ.

"నిజమే! ఎంతచిత్రంగా మచ్చిక చేసిందో అత్తా" అన్నాడు డాక్టరు.

మధ్యమధ్య ఓమాట పడేయుమంటని కన్య, ఏకంగా అన్నిటిలోను కలుగచేసుకుంటోన్నాడు డాక్టరు.

ముసలమ్మగారి అనుమానాలు ముసలమ్మగారివి. ప్రతిమాటకు అతడు పూసుకురావడం చీదరగాఉంది ఆవిడకు. అంచేత డాక్టరు మాటకు అలన చేయకుండా రవణమ్మ వంక తిరిగి "యింత మార్పేలావచ్చిందే మీ సీతకి" అంది.

"అదేనమ్మా అత్తా, బండిదగ్గరే నే నడిగాను, మీవాళ్ళపిల్లనో మరోర్నో పెంచుతున్నావుటమ్మా" అని, అంది రవణమ్మ.

"ఉత్తముల నోటంట ఎపుడూనిజమేవస్తుంది. రవణమ్మగారు అనుకొన్నట్టు, నిజంగా నేను రెండేండ్లనుంచి, నాఅక్కకూతుర్ని పెంచుతోన్నా. మాపింతల్లికూతురుకు, ఈమాసంలోనో, వచ్చేమాసంలోనో పెండ్లి కావాలి. అదోయింటి దవడంతోనే, నేపెంచేపిల్లను దానికి వప్పచెప్తా. కొత్తకాపు

రంలో వాళ్ళకు పిల్లబరువైతే. యథాప్రకారం నేను పెంచలేకపోను''
అంది, డాక్టరువంక సాభిప్రాయంగా చూస్తూ.

ఈమాటలో కన్య పథకం కొంచెం అవగతమైంది కాబోలు, అప్రయత్నంగా "ఆహా!" అన్నాడు డాక్టరు.

ముసలమ్మగారు రమణమ్మ యిద్దరూ అతడి వంక చూచారు. నోరుజారినందుకు తెల్లబోయాడు డాక్టరు. "డాక్టరుగారు నెయ్యి అడగడానికి భిడియపడ్తూన్నారు. ఆయనకు తన యింట్లోనే భిడియంలాగుంది. మిమ్మల్ని పిలవబోయి, మనం మాటల్లోఉన్నామని పలకరించీ కూడా అపుచేశారు. నేతిగిన్నె వారివద్దకు పట్టుకెళ్ళండి రమణమ్మక్కా. పనిలోపని దీనికో గరిటెడు వేసి వెళ్ళండి'' అందికన్య.

"ఎవర్నెలా సవరించాలో, ఎవరి కేమికావాలో, ఆకళింపు చేసుకొంటూ, యింటి కోడలికన్నా ఎక్కువా చాకిరీ చేస్తోన్నావమ్మా. ఎవరమ్మాయివో! ఏఊరో! ఆ ఒక్కమాటా చెప్పనేలే'' దంది ముసలావిడ.

"అయితే నన్ను మీయింటికోడల్ని చేసుకోండి మామ్మగారూ! డాక్టరుగారికి వివాహం కాలేదన్నారుగా, ఇహనేం. ఇప్పుడిప్పుడే ఇంటికి పెళ్ళికళ వచ్చిందన్నారుకూడాను. వర్జమూ వెళ్ళిపోయింది, పనిలోపని, పెళ్ళిమాటలు మాట్లాడదామా డాక్టరుగారూ?'' అని కల కల నవ్విందికన్య.

"అయ్యో తల్లీ! మాకొంపకు అమాత్రం అదృష్టమా! మాది బైరాగికొంపమ్మా'' అంది ముసలావిడ.

"అనుగో మొదలెట్టావు అత్తా! వాడు పెళ్ళి చేసుకోనని ఎప్పుడన్నాడు? ఎవరితో?'' అందిరమణమ్మ.

"చేసుకుంటానని ఎప్పుడన్నాడు? ఎవరితో?'' అంది ముసలమ్మగారు మాటకుమాట.

"అవు ననడానికి, కాదనడానికి పెళ్ళిచేసుకోడంటో మీరే అగావులు. పోనీ అనుకోనీ, అనినేనుకలగ చేసుకోలేను. పెళ్ళివద్ద నేటంత మూర్ఖుణ్ని గాను, ఏమనుకున్నావో. పిల్ల నచ్చితే యిప్పుడు చేసుకుంటాను''
అన్నాడు డాక్టరు.

"పుట్టినంత కాలానికి పురుషుడు యజ్ఞంచేశావని, ఇప్పటికేనా ఆ కాస్త మాటా చెప్పావు. అంతేకాని, నెపం. గడుస్తనంగా మామీదే నేస్తంగనుక. పరీక్షయిచ్చివచ్చి రెండేళ్లుదాటింది. ఇప్పటికి నచ్చులేదు. నేనెళ్ళిపోయే నాటికి నీకు నచ్చును. నీకడుపునో తొడిమి బయల్దేరుతే చూచిమరీపోదామని నేను వేచియున్నా. నేబ్రతికుండగా నీకు నచ్చాలిగద, నాయనా!" అంది ముసలమ్మగారు.

"డాక్టరుగారూ! పెద్దల కాప్యాయత ఆలాఉంటుంది. అందులోనూ. మీఅత్తగారి కెవరున్నారు? ఆవిడ పంచప్రాణాలు మీమీద పెట్టుకుంది. ఆవిడ బాగుండగా, మీకు బిడ్డకలిగితే, తాను ఆడించాలని ఆవిడధ్యాస. కొండెక్కిపోతుంది. ఏమేమో తలచుకొని, నేవచ్చినప్పటినుంచి వింటున్నా. ఎంతసేపూ అదేమాట ఆవిడ. ఇంతకు ఆవిడ మీమీద ఏంబరువుపెట్టిందని. ఆవిడతో నోరువిప్పిచెప్పరు? పెళ్ళాడి సుఖపడమంది. పిల్లలను కనిపెట్టుకునిఉండే పెద్దదిక్కు అమేషా యింటనుండడం, ఎంత అదృష్టమండీ! అమూల్యమైన వసతిగాదండి. ఒక ముసలమ్మగారుండడం. అవున్నేండి. ఉన్నప్పుడు కనిపించదు. కూర్లలో ఉప్పుపడకపోతే గొల్లుమంటారు, పడిఉంటే. ఉప్పుదృష్టికేరాదు. ఆవిడ పెద్దదయిందనేనా మీరీపాటికి తొందరపడాలండి" అంది కన్య.

కన్యమాటలు ఏంతహృద్యంగా ఉన్నాయో, మాటమాటకు ముక్తాయింపుకొడ్తోన్నట్టు, తలఊపుతోంది ముసలమ్మగారు.

"మామ్మగారూ, డాక్టరీవృత్తి చాలా బాదరబందీ కదాండి. డాక్టరు భోజనానికి వేళాపాళా ఉండదు. విస్తరదగ్గరకూర్చునేటప్పటికో, పక్కమీద నడుం వాల్చేసరికో, కొంపమునిగిందంటో యిట్టే వచ్చి పడ్తోంటారు. ఏనిముషమూ ఏదో జీవన్మరణ సమస్య హైరాను పెడ్తోనే ఉంటుంది. అనుద్రాగా యింటికి కొస్తాడు. అంతలో తలుపులు తెరచుకొని పోతాడు. కట్టుకొన్న భార్యతో గాని. కన్న బిడ్డలతో గాని పట్టుమని పదినిముషాలు గడపడం గగనమై పోతుంది. తన అక్కో, అన్నో వచ్చారని గృహిణి కానందం పాలపొంగులా పొంగి పోతుంటే, ఆపొంగుమీద చన్నీళ్ళుచల్లినట్టు ఒక్కసారి ముఖం ఎగరేసి చక్కాపోతాడు. వాళ్ళు

లుకు పోయినతర్వాత గాని యింటికి రాకపోవచ్చు. నుచ్చుకొని భర్త నను, తన వాళ్ళను నిర్లక్ష్యం చేశాడని వ్యథపెట్టుకొనే పిల్ల అయితే, కాపురం పొసగదు వృత్తి సాగదు. ఈచిత్రం చూచారా! కాంపౌండరు ోటీ, నర్సుతోటీ చనువుగా ఉండేవాడు కాకపోతే వృత్తి వర్ధిల్లదు. గడ్డు కిత్సలు చేసేటప్పుడు కూడబలుక్కుంటో జీవికా జీవిగ్గా కలసి మెలసి నిచెయ్యాల్సివస్తుంది. భర్త ప నర్సుతో చనువైందని, అతడి శీలాన్ని ంకించి ం మొదలెడితే ఆసువారా లాగదు ఆభార్యాభర్తల ొత్తు. భర్తమీద భార్య సి. ఐ. డీ కావడంకన్న భార్యాభర్తలకు భూలోక నరకం ఉండదు. నామాత్రమైనా వైద్యజ్ఞానమున్న కన్య అయితే కొంత ాయికారి కాకలదు. వైద్యశాస్త్రవైశారద్యం కలదే అయితే, ిడిగారా, ృత్తి మూడుపువ్వులు ఆరుకాయలుగా చకచక లాడ్తో ఉంటుంది. అం ులో ఈరోజుల్లో ప్రసవాలకు లేడీ డాక్టర్లనే కాని కెకేయుడంలేదు. ార్యాభర్త లిద్దరూ డిగ్రీపొందిన వాళ్ళయితే, ఒండొరులతో ఆలోచించు ంటో. పై డాక్టరు ప్రమేయంలేకుండా, ఎవరుచేసేకేసులు వారు చెయ్య చ్చు. ఎస్టాబ్లిష్మెంటు ఖర్చులు తగ్గుతై, రాబడ్లు హెచ్చుతై. ఇద్దరూ కపనిమీదే ఉంటారు కాబట్టి, కూడా భర్త కూర్చున్నాడు కాడని యింట్లో ొకిగోల ఉండదు. డాక్టరుకు డాక్టరే లభించడం హిరణ్యాక్షవర మం ారా, అయితే ఎంతో విశాలహృదయం, సహనంగల కన్య దొరకాలి. దినిముపాల పెండ్లిచూపుల్లో హృదయాలలోతు లెవరు పసిగట్టగలరు? ంచేత సంబంధనిర్ణయంలో డాక్టర్లు ఎంతో జాగ్రత్తపడాలి. అట్టి న్యలు దొరకడం మాటలమీద ఉందా? అంచేతనే డాక్టరుగారు పెక్కు న్యలతో పరిచయం చేసుకుంటో, విశాలహృదయమో, సహనమో లోప ఐతే, తగ్గుతోన్నారనుకుంటా" నని డాక్టరువంక కీకంటి చూపు ూచింది.

'ఒక్కమాటతో, నా పాపపంకిలమంతా కడిగేసి, నన్ను మావా ృకు వప్పచెప్పావు. నీకు కృతజ్ఞుణ్ని' అన్నట్టు డాక్టరు హావభావాలు చెప్తోన్నై.

"జరిగిన అలస్యానికి కాకపడకండి, మామ్మగారూ. డాక్టరు గారితోనో,

కాస్త ముందు వెనకలుగనో వైద్యవిద్యయందు ఉత్తీర్ణులైన కన్యలుండక పోరు. మహిళలకు రామకృష్ణ మఠస్వాములు సాలుకో ఉపన్యాసమిస్తూంటారు. మెడికల్ కాలేజీ విద్యార్థినులెంతమందో వస్తూంటారు. తద్రీత్యా వారినెంత మందినో నేనెఱుగుదును. ఏకొద్దో డాక్టరుగారికి తెల్సిన వారుండవచ్చు వారిలో. ఏమంటారు మామ్మగారూ! వారిలో నచ్చిన వారిని, మరి ఆలస్యం చేయకుండా, ఆయన పరిణయ మాడితే, మీకు అభ్యంతరం యెప్పుడూ లేదు గా, అనుము మినుమూ అనకుండా ఆయనగారు కూర్చుంటేగాని '' అందికన్య.

" అమ్మా! అమ్మా! అన్నికష్టసుఖాలు విప్పిచెప్పావు. ఒక్కపూట వాడు, ' అత్తయ్యా యింటు కాలస్య మవుతోంద 'ని చెప్పకూడదేం. నేను కాదంటానా? ఏమే రవణమ్మా, వాడికి నచ్చిన పిల్లను చేసుకోకూడదని నే నెప్పుడైనా అన్నా నే? '' అని అడిగింది ముసలావిడ.

" అల్లా, అనలేదు లే '' అంది రవణమ్మ చూరువంక చూస్తో.

" ఆడవాళ్ళతో గొడవ పెంచేదేమిటని నేనూరకుంటే నేపెళ్ళివద్దన్నాననుకున్నారన్న మాట '' అన్నాడు డాక్టరు.

" సరే. గ్రహించావు నువ్వుగాగా ఏమాట అయితేం, ఈఅమ్మాయి పుణ్యాన మంచి మాటే నాచెవిని పడింది. అమ్మాయీ! బండిదగ్గర చచ్చిపోతోంటే ప్రాణం పోశావు. ఇప్పుడీ శుభం చెవినేసి ప్రాణం పోశావు. అన్నివిధాలా మాకొంప నిలబెట్టడానికి దైవం నిన్ను పంపించాడమ్మా. ఇల్లు దిద్దుకొనేపిల్ల నట్టింటికొస్తే నాకు రోజులూ వెడ్తై. రవణమ్మ మమ్మని కనిపెట్టుకొని ఎంతకాలం యిక్కడ కూర్చోగలదు. పిల్లలతో దానింటికది వెళ్ళి తోటా దొడ్డీ చూచుకొంటుంది. అమ్మాయీ! అయితే తెలియు కడుగుతాను. నీకన్నా వైద్యజ్ఞానమున్నవాళ్ళు, కంజాయింపు శక్తికల వాళ్ళూ ఉంటారా? మావాడు నీకు నచ్చక పోతేగాని, బంగారు తల్లిని నిన్ను వదలుకొని మేము పైసంబంధాలెందుక్కు చూచుకోవాలి! ఏవూరో! ఎవరమ్మా యివో? ఆమాట దాటేస్తున్నావమ్మా ఎప్పటికప్పుడు'' అంది ముసలావిడ.

" మామ్మగారూ, యింతక్రితం మాటవరసకి నన్ను మీయింటికోడల్ని

చేసుకోమన్నానే కాని, మాస్వాములు ఆదేశిస్తేతప్ప నేను వివాహం చేసుకోను. అది మా ఆశ్రమధర్మం. మీకోరిక ప్రకారం చేయాలంటే, తొందర్లో ఒనగూడేపని కా దది. ఇంతకు నేను డాక్టరుగారికి నచ్చాలికద," అని డాక్టరువంక చూచి నవ్వింది. "డాక్టరుగారూ,! పగలల్లా మీరు ఆసుపత్రిలో పని చేసుకొచ్చినతర్వాత, మీకు సాంఘికబాధ్యతలమీదా. ఆత్మోద్ధరణమీదా అంతఃపురోపన్యాసాలు రుద్దుతోంటే, మీకింకా సంసార సుఖ మేముంటుంది. విచారించుకోండి, మామ్మగా రన్నారుకదా అని నన్ను మీలిస్టులో వ్రాసుకోకండేం" అంది.

"లిస్టేమిటి?" అని నవ్వాడు డాక్టరు.

"సరి అప్పుడే ఏమిట్లోపడింది! నేను మామ్మగారికి మాట యిచ్చాను. మెడికల్ విద్యార్థినుల లిస్టొకటి తయారుచేసుకొని, నిర్ణయానికొద్దామని అనుకున్నాముగా! నేనుండగా, మీనిర్ణయం తేలాలి. మామ్మగారు ఊరుకొన్నా నేను ఊరుకొనేదానను కాను" అంది కన్య.

"అవునమ్మా అలాపెట్టు వాడికి. నీవు వెళ్ళావంటే, ఎప్పటి ఆటే. శుద్ధ జాప్యం మనిషి" అంది ముసలమ్మగారు.

భోజనానంతరం, అందరూ వాకిట్లోకి చేరారు. వైవాహికములందు ప్రాణవిత్తమానభంగమందు అసత్యానికి దారిచేసారని, నాటకమే ఆడిందో, కాక నిజమే ఆడిందో, అవివాహితలైన మెడికలు విద్యార్థినులంటో, పది పేర్లదాకా కన్య చెప్పింది. మరో పదిపేర్లు డాక్టరు పలికాడు. అవ్వేవి నచ్చలేదు డాక్టరికి.

"వాడికి భూమండలంమీద ఎవ్వరూ నచ్చరమ్మా నీ ప్రయాసే కాని. యిది ఎలాగూ తుదనెగ్గే పని కాదమ్మా. ఇప్పుడు తెలిసిందా కొంటెతన మెక్కడుందో" అంది ముసలమ్మగారు.

"అదుగో మళ్ళా మొదలెట్టావు అత్తా" అంది రమణమ్మ.

"థర్డియర్ యమ్. బీ. లీలావతిని ఎరుగుదురురా?" అంది కన్య అమాంతంగా.

"నేనెరుగున్న కన్యేనా" అంటో, చంద్రహాసలో యాక్టరు రాఘవాచార్యులుగారు, దుష్టబుద్ధి పాత్రమీద, కుమారుని పోలికను సందేహించి

సందేహించి స్థిరపరచుకొన్న ఘట్టంలో పోజులుమార్చి, ముఖకవళికలు మార్చి, జ్ఞప్తిప్రోసెస్సును, పక్కా పావుగంటో అరగంటో ప్రదర్శించే వారే, తన్ప్రేతుగా వాతావరణాన్ని గాఢంచేసి, ముసలమ్మగారి దృష్టి నాకర్షించాడు. కుర్చీలోంచి లేచాడు. కొద్ది పచారుచేశాడు. వ్రేలితో నుదిటిమీద లఘుశబ్దం చేశాడు. తిరిగివచ్చి కుర్చీలో కూర్చున్నాడు. జేబు రుమాలును వ్రేళ్ళకు ఓగిస్తున్నాడు లాగేస్తున్నాడు.

“ఇంకనాకు తెల్సినపేర్లు లే” వని నిరుత్సాహంగా, లోకంఠంతో కన్య ముసలమ్మ రమణమ్మగార్లతో అందేమో. వారు ఆపేరు, కాయో పండో, ఏమి కానున్నదో అన్న కాదామరతో డాక్టరుపై దృష్టి కేంద్రీకరించారు. ఈ పేరు ఫలించకపోతే, యికనింతలో, డాక్టరుకు వివాహం లేదని వాళ్ళ కంగారు.

ఆపేరును తిరగా బోర్లా వేయడంలో, కొంచెం కొంచెం జ్ఞప్తి కొస్తోన్నట్టు సూచిస్తో, ‘లీ—లా—వతి. లైలా, లీలా, ఆ! ఆ! లీల’ అని ఖంగుమనే కంఠంతో పలికి, కుర్చీ బాక్కు (Back) మీద తల ఆన్చిఉన్న వాడు, ఒకే ఒక్క ఊపులో కుర్చీముందుకు వాలి ‘హ్వా! హ్వా!’ అని నవ్వుతో, “అవు నవును, లీలావతి అంటో ఘుడుసుకో కొట్టావు. గట్టి దానవే. క్లాసులో స్నేహితురాండ్రు, స్నేహితులం, లీల అనేవాళ్ళం, లీలావతి అంటే ఎవరో అనుకున్నాను. చూచావా! చనువు పేరు ఇంత దగ్గరా, పూర్తిపేరు అంతదూరమూనా? ఏలా మరిచిపోయానూ!” అంటో స్వగత కాలక్షేప మిస్తోన్నాడు.

“ఒరే, అబ్బాయి! మాకష్టం చూడవురా కాకపోయినా. చివరకు నచ్చిందే అంటావో, నచ్చలేదో అంటావో అని, అట్టుడుగుతున్నామురా యిక్కడ. నీకు ఆటగాఉంది” అని చ్రమంది ముసలమ్మగారు.

“యాస్స్, ఆ అమ్మాయి మంచితెల్వితేటలు కలది, రూపసి, బుద్ధిమంతురాలూనమ్మా అత్తా! నాకా పిల్లనచ్చిందమ్మా. లీలావతి, గుణవతి, విద్యావతి, రూపవతి. అక్కా ఆకన్యను చేసుకుంటానే” అని కుర్చీలోంచి దిగ్గున లేచాడు, ఆనిముషాన్నుంచి యిక నడే ప్రయత్నమన్నట్టు.

ముసలమ్మ రవణమ్మగార్ల ఆనందానికి మేరలేదు.

ముసలావిడ కన్య చేతులుపట్టుకొని, "చిన్నదానివి అనకూడదుగాని, ఇన్ని చేతులు కావమ్మా" అని ఆనందాశ్రువులు రాల్చింది.

అంతలో డాక్టరు కొద్ది తలవాలేసి, "ఆకన్యకు ఈ మధ్య వివాహమైనట్టు ఎవరో ..." అని నసిగాడు.

"ఎవడ్రా ఆ అన్నది! వాడి జిహ్వపడిపోను. ఆ తిరసాపం దొర్లినవాడెవడ్రా" అని ముసలమ్మగారు కస్సుమంది.

"మనం ఖాయపర్చుకున్న సంబంధం మరోడు చేసుకున్నట్టు కేకలేస్తావు, మరీ మతిపోతోంది నీకు అత్తా" అంది రవణమ్మ.

"నా బాధకొద్దీ నేననుకున్నాను. మిమ్మెవళ్ళనీ పల్లెత్తుమాటనలేదమ్మా రవణమ్మతల్లీ" అని ముసలావిడ కళ్ళొత్తుకుంది.

"మరేమరే, లీలావతి మాట కాదమ్మా నే విన్నది. జ్ఞాపకం వచ్చింది. మరో అమ్మాయి అహల్యమాట" అన్నాడు డాక్టరు.

"ఒక్క నిముషం సంతోషంగా బ్రతుకనియ్యవురా. కళ్ళుకట్టినట్టు మాట్లాడ్తావు. నీవన్నీ అపశకునంమాటలురా కాకపోయినా" అంది ముసలమ్మగారు.

"ఎవరి అపశకునమ్మాటలూ మిమ్మల్ని ఏమీ చెయ్యలేవు మామ్మగారూ. మీ సంకల్పదార్ఢ్యం అటువంటిది. లీలావతికి పెండ్లి కాలేదు. లీల నా పినతల్లి కూతురు. ఈ వేసంగుల్లో పెళ్ళి చెయ్యాలని భోజనాల వేళ అన్నాను కాదండి" అంది కన్య.

ముసలమ్మగారి ముఖం చేటంతఅయింది. చాప చిరిగి చదరైందన్నట్టు కుదించుకుపోయింది రవణమ్మ ముఖం.

కొద్దో, గొప్పో ఆడాళ్ళ గుసగుసలుపోని పెళ్ళిళ్ళుంటయా! రవణమ్మ ముసలమ్మగారిని దొడ్డిగుమ్మంకేసి తీసుకెళ్ళి, "ఈ అమ్మాయి తన పినతల్లి కూతుర్ని వీడికి ముడెట్టడానికే వచ్చిందేమోనే, అసలీవూరు, కానలేకపోయాం!" అంది.

"అయితే అది మరీమంచిది కాదటే రవణా. మనకు పిల్ల నచ్చింది. వాళ్ళకు పిల్లాడు నచ్చాడన్న మాట. మరేం కావాలే మనకు?"

“[illegible]ను కొస్తుంటే” అని నసిగింది రవణమ్మ.

“అనసుగు దేనికే!” అని నిలదీసింది ముసలమ్మగారు.

“లేకపోతే యింత మంచితనం ఎక్కడైనా విన్నామా! కన్నామా! నీకు దెబ్బతగిలిందని ఏమి దొర్లిపోయిందే. సాయాలు చేసిన వాళ్ళూ ఉన్నారు కాని ఇంత చేటుఎక్కడా చూడలేదమ్మా!” అని బుగ్గలునొక్కుకుంది రవణమ్మ.

“అదేమిటే రవణమ్మా, అంతా నిర్భాగ్యం నీది. మనకు సాయపడ్డమే తప్పనుకుని అన్నట్టు మాట్లాడ్తావు.”

“అవును, నువ్వు అలాఅనక ఏమంటావు? కట్టుకట్టి, నిన్ను ముందు కట్టేసుకునే పెళ్ళిమాట ఎత్తింది. తలకు కట్టుకట్టిందని తలమీద పెట్టుకున్నావు దాన్ని. ఎక్కడికెక్కడికి తుంది చూచుకో. నువ్వు నిద్రపోతోన్నా విసనకర్ర వేస్తోనే ఉంది. ఎంతదగ్గిరవాళ్ళయిం కానీ, కన్ను మూయడంతర్వాయిగా మానేస్తారు. అతివినయం, ధూర్తలక్షణమని ఊరికే అన్నారా. ఏమాడించింది, ఏమాడించింది నాకిల్లల్ని నన్ను కలియకట్టుకోడానికి. ఎంతపడుపేస్తి మనసంబంధం పట్టేసిందో చూచావా?” అంది రవణమ్మ.

“పట్టేసిందే అను. మనకొచ్చిన అపకారమేముందే ఇందులో?”

“ఆడపెళ్ళివారికి ఉపకారం కావడమే మనకపకారం ఈరోజుల్లో. చడీ, చప్పుడు కాకుండా, వచ్చినట్టే వచ్చి, ఎటువంటి రాజాసంబంధం ఎగరేసుకు పోతోందే! ఎంతలేదన్నా, మనం ఊ అంటే, పది పదిహేనువేలు ఊడిపడే సంబంధంమనది. పెళ్ళికూతురువాళ్ళు ఏం టికాణా ఉన్నవాళ్ళో తెలియదు. మనకేం పెట్టు పోత లుంటాయో తెలియదు. ముందు మాట యిచ్చి కూర్చున్నాము. పైగా పది సార్లన్నావు, నువ్వా అమ్మాయితో, ‘నీకు ఋణపడి ఉన్నామమ్మా’ అని. ఇక వాళ్ళు మనకు లొంగుతారా, పెడ్తారా” అంది రవణమ్మ.

“పెళ్ళిమాట అనుకున్నామో లేదో అప్పుడే ఊరికాడే నీకు ఆడబిడ్డ న్యాయలు.”

“ఆడబిడ్డలూ అందరు, అత్తలూ అందరు ఈ అమ్మాయి గడుస్తనానికి. ఇదే యింత గడసరి అయితే, ఆలీలావతి కాలేజీచదువు చదివింది ఆ దెంత గండ్రోతేనే!”

"చాల్లేవే. నువ్వు, నీమాటలున్నూ. చూపెనిదాన్ని పట్టుకొని గండ్రో తంటావు."

"బండిదగ్గర నువ్వేమన్నావు! అక్కల్లెవర్నో నంగనాచి అనలేదూ, మహా దాన్నెవర్తెనో నువ్వు చూచివచ్చినట్టు. దాన్ని నువ్వు నంగనాచంటే బాగుంది. దీన్ని నేను గండ్రోతంటే బాధగావుందీ? ఎవళ్ళమాటలు వాళ్ళకు బాగుంటాయిలే" అంది రమణమ్మ.

"ఏమోనమ్మా వెనకేమన్నానో, యిప్పుడేమన్నానో, అంత వెనకా ముందులు విలియావేసుకొని మాట్లాడ్డానికి, నేనేం అబద్ధంమాట్లాడతాను కనక నా. అబద్ధాలుచెప్పేవాళ్ళకు కావాలి జ్ఞాపకాలు, జాగ్రత్తలున్ను, నాకెందుకు. కాలేజీఊళ్లో ఎవర్తెతోనో కాపురంచేస్తున్నాడు అబ్బాయి, అని మీనాన్న ఏడ్చిపోతే, అదుగో దాన్నన్నానేమో నంగనాచి అని. గృహలక్ష్మిఅయ్యే కోడల్ని పల్లెత్తుమాట అనే పాపాన్ని ఎప్పుడూ పోలేదు, పోను" అంది ముసలమ్మగారు.

"అప్పుడు నాన్నను ఏడిపించిందీ, మాఆయనకు తన్నులుదాక తెచ్చిందీ, అన్న ఆ నంగనాచే యేమోనే యివ్వాళ గృహలక్ష్మి అని నువ్వు మహా భూషిస్తోన్న ఈ లీల. ఎవ రెరుగుదురు?" అంది రమణమ్మ.

"ఊరుకో, దానికి దీనికి పోలిక తెస్తావు. అదెక్కడ, యిదెక్కడ? నరకమెక్కడ, దేవలోకమెక్కడ? నోటికొచ్చినట్టు అనేస్తే, సరా" అంది ముసిలావిడ.

"నువ్వు దాన్నీచూడలేదు, దీన్నీచూడలేదు. దాన్ని దూషించడానికైనా, దీన్ని భూషించడానికైనా, యీ కన్య, చెప్పింది వేదం నీకు. ఈ మహాతల్లికి పింతల్లి కూతురైంది లీలావతి. అంతే యింకేదోషం పట్ట దావిడగారికి. కాలేజీఊళ్ళో మనవాడిని కట్టేసింది లీలావతేనేమో అనకూడదు నీదగ్గర. మీదకొస్తావు. బండి బోల్తాపేరెట్టి, ఎంతనేర్పుగా బోల్తా కొట్టించిందే మన్నీకన్య. అమ్మ, యిది కాని! ఎంతనాటకమాడింది, ఎంత నాటకమాడింది. అసలు నేననుకోవడం, అత్తా, ఇదీ, లీలావతీ, మనవాడూ, గూఢపుటాణీచేసే ఈఆట ఆడారేమో, కాకపోతే ఆలీలావతే దీని ద్వారా రుక్మిణీరాయబారం నడిపించిందో. ఏమైతేం, వాళ్ళంతా కలిసి,

ఈయింట్లో నీ ప్రేక్ష్యం, నా ప్రేక్ష్యం లేకుండా చేసేస్తారు చూస్తోఉండు. అప్పుడు తెలుస్తుంది నీకు" అంది రవణమ్మ.

"బండిదగ్గర నేనన్నానంటూ ఏదో మాటట్టుకొని నన్నైతే చెప్పావు కాని. అక్కడ నువ్వన్నదేమిటి! ఇప్పుడిక్కడ అంటోన్నదేమిటి? 'వాడికి నచ్చినపిల్లను వాడు చేసుకుంటూ ఉంటే నీకు కంఠశోష యెందుకు'కని నన్ను దులిపేస్తివి. ఇప్పుడు తీరా వాడికి నచ్చినపిల్లను వాడు చేసుకోడానికి ఆయత్తమవుతోంటే, నీకెందుకే ఈకంఠశోష, మనప్రేక్ష్యం ఉండ దంటో. వాడి కాపురమా మనం చూడవలిసింది, మన ప్రేక్ష్యమా?" అని అడిగింది ముసలావిడ.

"ఏమోనమ్మా అత్తా, నేను విడమరచిచెప్పలేను కాని, ఒక్క పూటలో పరిస్థితినంతనూ తారుమారుచేసిందే ఈకన్య. మనందరిమీదా ఏంమత్తు మందు చల్లిందో కాని, ఆమనుష్యులమే, మన అభిప్రాయాలూ, మాటలూ ఒక్క నాలుగు గంటల్లో ఏతంపెట్టు అయినై, పెళ్ళిచేసుకోనని భీష్మించుకుని కూర్చున్న మనవాడు పెళ్ళి, పెళ్ళి అంటున్నాడు. పట్నవాస పిల్ల అంటేనే ససేమిరా పనికిరాదని పళ్ళు కొరికినదానివి, పట్నవాస పిల్లకాని పనికిరాదన్న స్థితికొచ్చావు నువ్వు. వాడికి నచ్చిన సంబంధం వాడు చేసుకోవాలన్నదాన్ని ఏమీ పాలుపోని స్థితిలో పడ్డాను నేను."

"చివరిమాట రవణమ్మా, మనమంతా కోరింది వాడోయింటివాడు కావాలని. నేనూ మీనాన్నా సందేహించామేమో కాని, నువ్వెప్పుడూ వాడికి నచ్చిన పిల్లనే వాడు చేసుకోవాలన్నావు. నీమాటే చెల్లింది. నీకింకేం కావాలి? మన మిపుడు ఏకాభిప్రాయానికి, ఏలావస్తేం, వచ్చాం కాబట్టి, ఈ అమ్మాయితో, తొందరగా పెళ్ళిప్రయత్నాలు చెయ్యాల్సిందని చెబ్దామే. మిగతా మంచిచెడ్డలన్నీ వాడేచూచుకొంటాడు. కుర్రాడా, కుతికాడా, డబ్బు తీపీ, సుఖపడ్డం ఎరుగున్నవాడే. ఆలోపం ఎప్పుడు లే" దంది ముసలమ్మగారు.

ముసలమ్మ రవణమ్మగార్లు యథాస్థానంలో కొచ్చేసరికి, కన్య డాక్టరుతో ఏమి ప్రసంగిస్తోందో, వీర్లనుచూచి. "డాక్టరుగారూ, మాలీలను మీరు పరిణయమాడితే, నేపెంచుతోన్న నా అక్కకూతుర్ని లీలతో పంపిస్తా

ననుకోండి. రెండేళ్ళపాటు మీరు పెంచాల్సి ఉంటుంది. కొత్త కాపురంలో మీకు భారమనితోస్తే పంపను. మొగాళ్ళమాట పుచ్చుకొని, బిడ్డను వప్పగించగలనా? లీల వప్పుకోవాలి. మీ అత్తా, ఆ కొంపా వప్పుకోవాలి" అంది కన్య.

"అయ్యో తల్లీ! దాని కభ్యంతర మేముంటుంది" అందిముసలమ్మగారు.

"పిల్లలను కని పెంచినదాన్ని చంటిపిల్ల బరువా అమ్మా రెండేళ్ళ భాగ్యానికి" అంది రవణమ్మ.

"రెండేళ్ళూ అక్కరలేదేమో లెండి. కులాంపల స్వాములు నన్ను వివాహం చేసుకోమని ఆదేశిస్తే, సరే, బిడ్డను నాకీయాల్సిందని లీలనుకోరి తీసుకుపోతాను. ఆరుమాసాలు పెంచేసరికి డాక్టరుగారికి, లీలకు తమబిడ్డే నన్నంత చనువైతే, మామ్మగారే చెప్తారు న్యాయం. బిడ్డను నా కప్పిస్తారో, లీలనే పెంచమంటారో" అంది కన్య.

బిడ్డసమస్య యింతచక్కగా, చల్లగా, స్వజనాంగీకారంగా పరిష్కృతమవుతుందని డాక్టరనుకోలేదు. "పెండ్లికాని క్రితం పుట్టిన బిడ్డను పెండ్లి అయిన తర్వాత పెంచుకున్నా తమబిడ్డేగా. ఎబ్బెరిక మేముంది! బిడ్డ జనన రహస్యం రెండో మానవుడికి తెలియదు. తెల్సిన ఆ ఒక్కతీయే కదా యీపునస్సమాగమ శుభ పరిణామానికి మూలకందం. లీలపరిణయాని కన్ని అడ్డంకులు తొలిగినై. లీలను రప్పించటమే తర్వాయి" అని డాక్టరు అనుకొంటూండగా "వేగంపెండ్లి సంప్రతింపులు నడిపించమ్మా" అంది ముసలావిడ.

"మామ్మగారూ! సంప్రతింపు లెవరితోటి? లీలావతికి తలితండ్రులు లేరు. ఆపె పేర అయిదువేలు బ్యాంకులో ఉన్నై. దానితో ఒకటేచిక్కు. పూర్వాచార పరాయణురాలు. వరుడుచూచి వప్పుకున్నా, అతడి పెద్దల అంగీకార ఆశీర్వాదాలు పొందితేగాని మాట యివ్వదు. ముందు డాక్టరుగార్ని తీసుకువెళ్ళి మాట్లాడించిన లాభంలేదు. తోడికన్యలు గేలి చేసినా సనాతనధర్మాలకు ప్రాకులాడుతుంది. పాతకాలపు తత్వమే అనండి. అది మనకూ మంచిదేగా మామ్మగారు" అంది కన్య.

"పట్నవాసంపిల్ల అన్న భయంపోగొట్టావు నాకు, ఇంకేం కావా"లంది ముసలమ్మగారు.

"అయితే మేం లీలావతిని కల్సుకోడ మేలా" నంది రవణమ్మ.

"రేపే లీలావతికి ఉత్తరం వ్రాస్తా. లీలావతిని నే వెళ్ళి అగ్రహారం రప్పించి మీకు కబురుచేస్తా" నంది కన్య.

"పోనీ టెలిగ్రామిస్తేనో" అన్నాడు డాక్టరు.

"ఊరుకో నీవన్నీ అపశకునమ్మాటలు, అఘాయిత్యాలూను. పెళ్ళికి ముందు శుభమాఅని టెలిగ్రామా? ముప్పైఏళ్ళయినా ఇవాళకు నాకు తలచుకుంటే వళ్ళు ఝల్లుమంటుంది. ఎవడో బంట్రోతు గుమ్మంలోకొచ్చి మీకు టెలిగ్రాం మొచ్చిందంటేనేగా మాపిన్ని కెవ్వనకేకేసి, కొయ్య అయి పోయింది" అంది ముసలమ్మగారు.

"అత్త కొత్తరం తమ్ముడూ, నీకు? అయ్యో అయ్యో టెలిగ్రాంమాట ఎందుకెత్తావురా శుభసమయంలో" అని రవణమ్మ డాక్టర్ను మందలించింది.

"అత్తను గాభరాపెట్టడానికి అన్నానే" అన్నా డాతడు.

"నాకు ఎముకులకుపట్టిన బెంగోటీ యీకన్య పుణ్యాన వదలేపోయింది యివాళ్ళతో. ఇక చిన్న చిన్న గాభరాలేవీ నన్నేమీ చెయ్యలేవురా" అంది ముసలమ్మగారు.

"అయితే యీఅమ్మాయి ఎవరో? ఎవరమ్మాయో? చెప్పడం దిగ డే ఉందే" అంది రవణమ్మ.

"అగ్రహారం వెడతాంగా. అక్కడా చెప్పకపోతుందా?" అంది ముసలావిడ.

---

# 3. ప్రభ్వీకాదగ్గపడతి పరిచారికా!

సంకల్పించిన సత్కార్యం కొనసాగిందన్న సంతసంతో, సముచిత భంగిని ముసలమ్మ రవణమ్మ గార్లవద్ద సెలవుచ్చుగొని, డాక్టరు వీడ్కోలు యిచ్చిపుచ్చినంత పయనమై, అస్తంగతసూర్యకిరణాలు యిళ్ళమీదా వృక్షాల మీదా పడి విచిత్రశోభ కలిగిస్తోన్న సంధ్యాసమయానికి అగ్రహారం మొగలో వేంచేసియున్న శ్రీరంగేశుని పాదపద్మాలవద్ద సాష్టాంగపడి

సంగాలయాన్ని ఆశ్రయించియున్న యతిగారిని సందర్శించి, వారితో నేమి ప్రసంగించిందో వారి దీవనల నందుకొని, పక్షులు కలకలరవాలు చేస్తూ గూళ్లకు చేరే వేళకు, ఆశ్రమకన్య. వేదవిహితానుష్ఠానాసక్తుడు, నిత్యాన్యయనాగ్ని కార్యాల యందప్రమత్తుడు, నిరతాన్నదాత అని పేర్వడ్డ రామశాస్త్రుల్లగారి గృహప్రాంగణంలో అడుగిడింది. గృహిణి సీతమ్మగారు సమ్ముఖంలోనే ఉంది.

“ఎవరు గడుపుకూడు పెట్టి కట్టజీర
యిచ్చి సాకతమున నేలుదు రట్టి
వారలకు బనులుజేసి మెలగుబుద్ధి”

ని వచ్చానని “తగనైనపనుల నిలచు టభిమతంబని విన్నవించుకొంది. సార్వభౌమ పదవికి సరితూగెడువారు సేవచేస్తానంటే, ప్రభ్వీకాదగ్గపడతి పరిచారికాకృత్యాల కచ్చుగుంటే, యజమానికే మనసు పరిపరివిధాల పోతుంది. ప్రథమావలోకనంలోనే సీతమ్మగారి కాకన్యపై మాతృప్రేమ కలింది.“అన్యాయం, ఇంత తేజస్వినివేమిటి, సైరంధ్రి ఏమిటి?”అనుకొంది.

“మీయింటిపరిచారికాకృత్యాలు చేస్తానంటే ఆయుప్రాణం చివుక్కు-మంది. చిన్నవయసులో ఈకన్యకు ఇక్కట్టులేమికలిగియుండునా అని తలపోస్తూ, కరుణార్ద్రనేత్రాలతో కన్యను దగ్గరకుతీసుకుని, ఊరడిగి, పేరడిగి చనువుచూపింది. ఏమాత్రం తొట్రుపాటులేకుండా, తన పేరు ‘సైరంధ్రి’ అని చెప్పింది కన్య.

కళావిషైకవిజ్ఞత, మంచినడత, అలంకారాది విధులయందు దక్షత అలవడ్డ పరిచారికను రాణివాసాల్లో సైరంధ్రి అంటారు కాని, పేరే సైరంధ్రికావడం వింతగాతోచింది సీతమ్మగారికి. “సేవకావృత్తి పర్యాయ పదాన్ని, కోరి, కోరి, బిడ్డకు పేరెట్టుకునేవాళ్ళుందురా?”అని విస్తుపోయింది సీతమ్మగారు. సంతానక్లేశ మనుభవించినవారిలో, తమబిడ్డల పేర్ల చక్కందనముకూడా వారి ఆయుర్హీనమునకు కారణమైయుండాలని తలచిన ఛాందసులున్నారు. అట్టి సంశయాత్మకులు దృష్టిదోషనివారణార్థం, అనాకర్షణీయమైన, అలసత్వసూచకమైన పేరును పుటకి బిడ్డకిడడంకద్దు. ఏదో అట్టి మూఢాభిప్రాయకారణంగా, ఈకన్యకు సైరంధ్రీనామంవచ్చి పడిందేమోనని సమాధానపడింది సీతమ్మగారు.

నిజపరిస్థితినిబట్టి 'సైరంధ్రినిగాక మరేవరిని!' అని కన్యమనసును కుదుట పరచుకుంది. పరులపంచన పని చేసి కాని తిండితినని పడతి సైరంధ్రీనామం పెట్టుకున్నా పెట్టుకోకపోయినా, సైరంధ్రియే కాబట్టి, తనసమాధానం సత్యదూరం కాదని ఆత్మవంచన చేసుకుంది. ఆత్మవంచన అనర్థదాయకమని కనలేదు. సైరంధ్రినంటే ఎవరికేమి హాని అనుకుంది. తనకేనని తలచలేను. తార్కికంగా సమర్థనీయమైనా, తాత్కాలికంగా మనసు కుదటపడినా, భాషా చమత్కృతి ఫలితంగా రూపొందినసత్యం, దోసగులకు దారితీయక పోదు.

అర్థసత్యంలో అసత్యదోషముండక పోతుందా? పొట్టకూటికి వచ్చి దన్న స్త్రీని చులకనచేసే అల్పమనస్కులుంటారు. సైరంధ్రిజాతి స్త్రీ, సౌందర్య విశేషం, సద్గుణసంపద, ప్రతిభావ్యుత్పత్తులు కలిగింటైతే. కంట్లో కారం పెట్టుకొనే ఈర్ష్యాళువు లెందరో ఉన్నతవర్గాల్లో ఉంటారు, అందకత్తె అయిన పరిచారిక వెంటబడే ఆతతాయిలుంటారు. చివరకు "పరిచారికలకేగాని హృదయార్పణ చేయజాలనినాసిరకం రసికులుకూడా ఉంటారు" అని గోల్డుస్మిత్ వ్రాసిన ఒక ప్రహసనంలోని పెండ్లికొడుకు పాత్ర ప్రమాణం.

"కృష్ణునిదేవి సత్యభామకు పని సేయుచు తొల్లి, ఓకప సాంచాలి కడనే పరిచారికాధర్మములకు నెల్ల జాలివర్తించితి" నని సుధేష్ణకు సందేహ నివృత్తిచేయగలిగిందే కాని, పరిచారికనంటే కలిగే యిక్కట్టులను ద్రౌపతి తప్పించుకోగలిగిందా ?

సీతమ్మగారాపెను 'సైరంధ్రీ' అనిపిలువ ప్రారంభంపప్పుడు, తానానాటికి స్కాంధపురాణంలో కుమారిక చరిత్రను వింటోన్న కారణంగాను, ఆపెను కేవలం కూతురుగానే భావించుట చేతను, 'కుమారిక' అని పేరు పెట్టి, 'కుమారీ' అని పిల్వనారంభించింది. కన్య వచ్చిన మర్నాటినుంచే, కుమారిక, సీతమ్మగారి కూతురు అమ్మాణి, కేవలం ప్రేమపంచుకొని పుట్టిన వాళ్ళలా, అక్కచెల్లెండ్రయారు. భగవంతుడొకప్పుడు, అనుకోని సోదర సోదరీలను వరంగా అందిస్తాడు. అసలు సోదరసోదరీల ప్రేమలో మానవ్వతానికి సంబంధించిన ఒకఅనుబంధం, జీవితస్పర్శ ఉంటాయి. దైవం కల్పించిన సోదర సోదరీల్లో. దివ్యత్వానికి చెందిన అనుభూతి ఉంటుందన్నారు

ఒకటయింది. కుమారిక, అమ్మాణీ ఒకే కాడ కుద్భవించిన జంట పుష్పాలల్లైపడి, సౌందర్య సౌరభం విరజిమ్ముతో షేక్స్పియర్ ప్రస్తావించిన రోజలిండు, సిలియాలను తలపిస్తోన్నారు.

కుమారిక వచ్చినప్పుడు, అమ్మాణీకి పెండ్లిసంబంధాలు వెతుకుతో ఊళ్ళెంట ఉన్నాడు రామశాస్త్రుల్లుగారు. ఏసంబంధమూ మాటల్లోనే ఆగుతోందంటే, కట్నకానుకల పట్టింపు వచ్చో, కులగోత్ర పౌరుషేయాలు సరిపడకనో అయిఉండాలని తోచవచ్చుమనకు. ఈపరిపాటు కారణాలేవీ కావు. వచ్చిన పెద్దచిక్కు, రామశాస్త్రుల్లుగారి తల్తిక్క బహుచిక్కన. మత్స్యయంత్రం కొట్టేవీరుడు దొరకొచ్చు. శివధనస్సువిఱిచేశూరుడూ దొరకొచ్చు. రామశాస్త్రుల్లుగారి పరీక్ష కాగే వరుడు మాత్రం కన్నొద్దుకున్నా కానరాకున్నాడు. ఆయనగారి ప్రశ్నావళియే వేరు. విద్యార్థికావులు వెయ్యానివి, లౌకికులు మానుకొన్నవి, యిక్ష్వాకులనాటివి, వెతకి పైకితీసి, వేసేనేర్పరి. ఆస్తికాదు, చదువుకాదు, ఉద్యోగ మదివరకే కాదు ఆయనగారి ఆరా. ఆయన దృష్టిలో, అవి గణనీయాంశాలు కావు. అవి ఉంటే వద్దనక పోవచ్చు. అది వేరుమాట. పదిహేడు పద్దెనిమిది శతాబ్దాల నాటాలు యిరవయ్యో శతాబ్దంలో వాస్తానంటాడు. కర్మ. ఆయనకు తోచదు, ఒకరు చెపితే వినడు.

ఒకయువకుడు డాక్టరు పరీక్షనిచ్చి, ప్రాక్టీసెట్టి పట్టుమని పది మాసాలు కాందీనే శస్త్రచికిత్సలో బలేఘటికుడని పేరుమ్రోశాడు. ఎలాంటి గడ్డుకేసైనా ఆతడి కత్తుల్లోపడి ముక్కముక్కలై కొత్తరూపం దాల్చాల్సిందే. పేగులుతోడి పైనపడేసి, తిరుగా వాటిని బిగించికట్టి 'ఛలో' అనగలడని, గుండెలు తీసి ఎగరేసి పండట్టుకొని, తిరుగావాటిని యథాస్థానంలో అమర్చి నిశ్చింతగా 'జావ్' అనగలడని, ఆతడిశస్త్రచికిత్స కుశలతను ఎంతగానో శ్లాఘిస్తోన్నారు. ఒక పర్యాయం కోతకొచ్చినపుండును, కొయ్యకుండా సెట్టి, 'దానిజాతిలో సంపూర్ణత్వం సాధించిన పుండిది అన్నపుడూ దొరికేదికా దీనమోనా' అనిదాన్ని ఎంతమంది వద్దనో ప్రశంసించి సంక్రాంతి పండుగలకొచ్చి ఊసుపోక ఊరంట తిరుగుతోన్న కొత్త అల్లుళ్ళనుకూడా పోగుచేసుకొచ్చి చూపించి ఫోటోలుతీసి రోగి మరీ

ఏప్పొస్తుంటే, అతని మూర్ఖత్వానికి చి. శి. వి. తప్పుక, కోయ్యలేక కోయ్యలేక, కళ్ళనీళ్ళెట్టుకొంటూ కోశావని ఆడాక్షరు శాస్త్రి మౌనాన్ని ఉగ్గడిస్తోన్నారు. వట్టివాళ్ళుకూడా ఏదో పేరెట్టి, కోయిచుకు రావాలన్నంతే నిష్ఠాకు శ్రీయనగారి ముందు నిలవలేకపోతే!

“మీగోత్రం పంచార్షేయమా, త్రయార్షేయమా” అని సాచి ఒకే ఒక ప్రశ్న వేశాడు. గూబ గుయ్యుమంది డాక్టరుకా ప్రశ్నతో. గోత్రాలే గుర్తులేని రోజుల్లో వేసేప్రశ్నయేనా అది? కాస్త స్థాయీభేదం చూడవద్దూ? ప్రశ్న వేయడంతోనే సరా? చెప్పలేక కళ్ళువప్పచెప్పాడాతడు. ఆసంబంధాన్ని చప్పరించాడీతడు.

మరో సంబంధం. యువకుడు. శుభ్రంగా పిప్పళ్ళబస్తాలాగున్నాడు. ఆపుష్టికి చాలిన పిత్రార్జితం పాతిక ఎకరాలు. లాకెత్తితే చేలోకివచ్చి కూర్చుంటై నీళ్ళు, గూడెయ్యక్కర్లేదు. యాతం ఎత్తక్కర్లేదు. మరో పాతిక ఎకరం ఒక ముసిలావిడ హరి అంది అంటే వచ్చిపడ్తుంది. అంతకు పదిరోజులనాడు ఒక రాత్రి అంటుందని ఆశపడి సర్వసిద్ధం చేసుకున్నారు. అనలేదు. ఊరుకుంది. ‘ఈదభా ఊరుకునే దాన్ని కాను’ అంటూ నంటోందట. అబద్ధమాడే మనిషి కాదు. ఆరుగురి ఆస్తులు కలిపినా పుట్టెడు భూమి కాని ఈరోజుల్లో యీసంబంధం దొరకడం మాటలా!

ఇట్లాంటియువకుణ్ణి పట్టుకొని, “ఏదబ్బాయి ‘సూర్యశ్చ, మామన్యశ్చ’ చెప్పమ్మా” అని అందించాడు. అతడు మిటుకు చూస్తుంటే, ‘కేశవనామాలైనా’ అని మందహాసం రానిచ్చాడు. వరుడు ‘తాడుబారి వాటికేం’ అంటో, ‘కేశవ, నారాయణ, మాధవా, ప్రమాదీచా, ప్రజోత్పత్తి’ అంటో అడ్డగోలుగా గుక్కత్రిప్పకుండా కొట్టుకుపోతున్నాడు.

“ఆగాగు కడుపునిండింది దిక్కుండకం” టో గభీలున చెవులు మూసుకొని యింట్లోకి దారట్టాడీతడు. దభీలున తలుపు లేసుకొని యింట్లోకి దారట్టాడాతడు.

ఇంకో చోట యువకుడు. అడ్వకేట్టు. చక్కటి ఛాయ, మేడ మిద్దె ఉన్నై. పది ఎకరాలు సుక్షేత్ర కండ్రిక భూమి. పంపుళ్ళు పెట్టవలసిన సోదర్లు కాని, పెళ్ళిళ్ళు చెయ్యాల్సిన సోదరీలు కాని. ఏసాంటూ లేదు.

పట్న గోపిచ పెట్టుకున్నవాడు కాడు, ముఖ్యమైనమాట. సైతంటే ఎగచేసుకు పోయ్యే సంబంధమేనా? అయితే ఏది దాగాదని, అతడాగతాడు రామశాస్త్రులుముందు! అవేం విశేషమేమో, అప్పకేటును క్రిమినల్లో పరీక్ష చేశాడు. అపడి తండ్రి తాతలు వేంకటేశ్వర్లుగారు, సోమయాజులుగారున్ను. వా రుభయులూ గతించారు. రామశాస్త్రులుగారు అప్పకేట్టును సంభావించి, "ఏదీనాయినా 'వేంకటేశ్వర సోమేశ్వర' అన్నపేరు కలిపి చెప్పమ్మా" అని లాలనగా అడిగారు. నిజానికి అప్పకేట్టు గత మూడేళ్ళనుంచి, సాలుసాలూ మాఘబహుళ పాడ్యమినాడు, ఆ నామత్రయం నోటపస్తున్నవాడే. అయితేం వేంకటేశ్వర, సోమేశ్వర వరకు అనగలడు. మూడో పేరు డెక్కడ్డుంది. దానికి పురోహితుని ప్రాంప్టింగు అవసరం. అక్కడ పురోహితుడులేడు పెదిమలైనాకదిపి జ్ఞాపకం చేసును. ఏంచేస్తాడిక. 'నో యిన్స్ట్రక్షన్సు' చెప్పి కేసు కొట్టేయించుకోవల్సివచ్చింది. ముఖంచిట్లించి చిరచిరలాడా డీతడు. సిగరెట్టు ముట్టించి, గుప్పు గుప్పు గుక్కలు లాగా డాతడు.

"మంచిసంబంధం దాటబెట్టావేమి మామా?" అని కావలసినవాళ్లెవరో తర్వాత అడిగితే, "పితృకార్యంమీద నా శ్రద్ధలేని కిరస్తానీని, కిర్సనాయిలోసి అంటిస్తానుకాని, పిల్లనిస్తానా?" అన్నాట్ట ముక్కోపి రామశాస్త్రులుగారు, తనముఖంమీద అప్పకేట్టు సిగరెట్టుఅంటించాడన్నమంట కొంతేమో. 'శ్రోత్రియోత్తములు, ముంగోపుల్' అని ఊరక అన్నారా.

ఈతీరున రాజాసంబంధాల నెన్నిటినో సీమటపాకాయిల్లా పేల్చేసి, ఏసంబంధమూ కుదరక, యిన్సిరోఅంటో యింటికొచ్చాడు రామశాస్త్రులుగారు. 'ఆసంబంధం మాటేమిటి', 'ఈసంబంధం ఏంచేసుకొచ్చినట్టు' అని యింటావిడ ఆరాగా అడిగితే, ఉగ్రుడైపోయి, "ఛీ, వాళ్ళమాట తలపెట్టకు. కులభ్రష్టులు, అపాంక్తేయులు, బ్రాహ్మణకులంలో చెడబుట్టారం" టో కైమని, నూతిదగ్గరకుపోయి రెండుచేదలు పోసుకొచ్చాడు. భోంచేసినంతసేపూ ఛెడేల్ ఛెడేల్మంటూనే ఉన్నాడు. గంపంత ఆశతో ముంగాళ్ళమీద కనిపెట్టుకొనికూర్చున్న యిల్లాలితో పిల్ల పెండ్లివిషయం ఆలోచించడం సొంపు యిది. ఆమనిషిని రచ్చగొట్టడంతప్ప, ఏమడిగి ఏమిలాభమని సీతమ్మగారు ఊరుకుంది అప్పట్లో.

సీతమ్మగారు హతాశురాలై, "అమ్మాయీ! కుమారీ! చూశావుగా మీ అయ్యగారి వరస? ఈయనగారి చాందసపుతిక్క ఏకాంతం సళ్ళటం లేదు. రోజులు మారినై. దేశకాలపాత్రాల ననుసరించి, కొద్దోగొప్పో మారలేనివాళ్ళవి అవహేళనబ్రతుకులవుతై. చక్కటి సంబంధాల నెన్నిటినో చేయిచేతులా కాదనిపించుకొచ్చారు. పైగా వాళ్ళను మన్నీకూడా క్షులు పక్షులు హేళనతిట్టడం. ఈయనవెళ్ళి పెదిమె కదిపితే. వచ్చేవికూడా వెనక్కిపోతున్నాయి అదేం ఖర్మమో. ఎక్కడా దారీతెన్నూ కన్పించడం లేదే. అమ్మాణికి పెండ్లిచెయ్యలేనేమోనే" అని వాపోయింది సీతమ్మగారు.

ఇచ్చటిపరిస్థితులు అవగాహన లేకపోవడంచేత, యజమానురాలికి ఏ ధైర్యం చెప్పడానికీ సాహసించలేకపోయింది కుమారిక. వచ్చిపదిరోజులు కానిదే. కుమారిక సీతమ్మగారికి కార్యాలోచనకు కష్టసుఖాలకు తలలో నాలుక కావడం కారణం మరోటుంది. ఆవిడకు కుమారికయందు ఆదిలో కల్గిన మాతృవాత్సల్యమే కాదు. ఈ పదిరోజుల్లోనుకలిగిన భావబాంధవ్యం కూడా.

రామశాస్త్రుల్లుగారి కెంతసేపూ కర్మానుష్ఠానదృష్టేగాని, సాహిత్యగోష్ఠి ఏకాంతం చెవికెక్కదు. ఆయన సాహిత్యాభిరుచి కాశీమజిలీకథలతోనే ఆగిపోయింది. కాశీమజిలీకథల, సభాసంవిధానంతో ముగ్ధులైపోయి, మరో పుస్తకం ముట్టిఎరుగడు. సాంసారికజీవితంలో ఏకపత్నీవ్రతస్థుడౌనో, కాదో నిష్కర్షగా చెప్పలేముకాని సాహిత్యరంగంలోమాత్రం కాశీమజీలీలకు పుస్తెకట్టాడు. సాహిత్యవాసనల దరిచేరనందునే, మరీ, సంకుచిత స్వభావుడు, ముక్కోపి, తల్తిక్కమనిషి అయిపోయాడని తోస్తుంది. సీతమ్మగారు చదువను వ్రాయను నేర్వకపోయినా, చదివించుకుని విని పురాణేతిహాస రహస్యాలెన్నో గ్రహించినపుణ్యాంగన వేదాంతజ్ఞానోపార్జనాసక్తిమిక్కుటమావిడకు. సాహిత్యగోష్ఠి ఆయమకు సమార్ద్రచిత్తత నలవర్చింది.

కుమారిక రామకృష్ణాశ్రమంలో సద్గ్రంథపరిచయమెంతో గడించిన కన్య. జాతీయజీవనము, ఆస్తికతాబుద్ధిని, భగవద్భక్తిని వీడకుండా, నూతన విజ్ఞానప్రాభవవైభవం సంతరించుకోవాలన్న సంకల్పంతో సనాతనాన్నీ,

ఆధునాతనాన్నీ, ప్రాచీనాదర్శాన్నీ నవీనదర్శనాన్నీ సమన్వయించి, నాటి మాసలలోనే కొత్తలోకాలు పోసినట్టు, భావపావిత్ర్యంగల పెక్కు పురాణగాథలకు, నిశితబుద్ధులు స్వాములు సముచితధంగిని చేసే వ్యాఖ్యానాలను, విమర్శలను ఆకళింపు చేసుకొనిఉంది. అయా పురాణఘట్టాలను ప్రజల హృదయైక్యం చేయుటకు వలసిన ప్రబోధచాతురి ప్రచారపక్కీ నేర్పటం కూడా స్వాములు ఆశ్రమవాసులకిచ్చే శిక్షణలోదే. కుమారిక అత్యంత శ్రద్ధాభక్తులతో అట్టి సుశిక్షణ పొంది ఉంది.

అంచేత, కుమారిక రాకతో సీతమ్మగారికి పెద్ద కొదువ తీరింది. పిపాసార్తునకు చల్లటి మంచినీళ్ళు దొరికినట్టుంది. కంఠం తేనెలూర, చెళ్ళపిళ్ళవారి శ్రీరాగ బాణీలో పద్యాలు చదువుతో, విశదమైన విషయవివరణ, భావోత్తేజకమైన విమర్శ కుమారిక చేస్తోంటే, అత్యాదరముఖవికాసంతో, సజలనేత్రాలతో సీతమ్మగా రామెను ఆశ్లేషించి తన్మయత చెందుతోంది.

రాత్రి భోంచేసి రామశాస్త్రులుగారు వీధిలోకెళ్ళారు. కూతురు పెండ్లి విషయం సీతమ్మగారు దిగులుగా ఉంది. కుమారికకూడా అమ్మాణీ పరిణయ చింతనే ఉంది. అమ్మాణీ వాళ్ళ మహిళామండలి కబుర్లేవో చెప్తోంటే ఊకట్టితేంగనక.

“అమ్మాయీ, కుమారీ! మనఃస్థితి బాగుండలేదు. కాస్సేపు ఏదైన చదివే ఓపిక ఉందమ్మా?” అని అడిగింది సీతమ్మగారు.

కుమారికకేమి జ్ఞప్తికొచ్చిందో, అత్యుత్సాహంగా లేచి, “అమ్మగారూ! అమ్మాణీకూడా శ్రద్ధగా వింటే, బహుపవిత్రం, ప్రయోజనకరం అయిన హాలాస్యపురాణగాథ ఒకటి వినిపిస్తా. ఈ కథను కేవలం మధుకల్ప అని మాస్వాములు ప్రశంసించారు. కవితావస్తువు ధర్మనిష్ఠకలది. కవిత్వము తగినట్లు రసపుష్టమైనది. ప్రయోజన విషయమా, కన్యల పాలిటి కామధేనువు అన్నారమ్మా మాస్వాములు. అమ్మాణీ, చదవనా! మధ్యమధ్యన పెదవులకు చిటికవేయవుగద” అంది కుమారిక.

“ఎందుకు వినను? కానీ అమ్మ” అని సీతమ్మగారు కోరింది.

చక్కగా, శ్రావ్యంగా కదంబమహాత్మ్యం, వ్యాఖ్యానిస్తో చదివింది కుమారిక. కదంబ మధురమీనాక్షీదేవాలయంలో ఉన్న స్థలవృక్షమని

అనేక యుగాలక్రిందట ఇంద్రాదిదేవతల కందరికీ ఈ వృక్షంక్రిందనే శ్రీ సుందరేశ్వరలింగం ప్రత్యక్షమైందని, పార్వతీదేవి పరమేశ్వరుణ్ని పరిణయమాడే అభిలాషతో ఈ వృక్షాన్ని గాఢభక్తితో అర్చించిందనీ, ఆదేవి అభీష్టం సిద్ధించిందనీ, ఆతర్వాతనే ఆమె శ్రీ మీనాక్షీదేవిగా అవతరించిందని, కదంబ కన్యల పాలిటి కల్పవల్లి, వరప్రదాత అని విశదంగా చదివి వ్యాఖ్యానించింది. "కదంబ కన్యల కారాధ్యదైవం సుమా" అని మరోపర్యాయం అమ్మాణీని హెచ్చరించి, కుమారిక 'స్వస్తిప్రజాభ్యాం' అంటూ హాలాస్యపురాణం మూసి ప్రక్కన పెట్టింది.

"అమ్మాయీ కుమారీ! సమయోచితమైన కాండను వెతికిపట్టి చదివావమ్మా, మనసులోని మబ్బులు విడ్డాయి. కాని వ్రతం సంకల్పించడానికి మన కిప్పుడు కదంబ ఏలా లభ్యమవుతుంది? ఈనాటున ఎక్కడా దర్శించలేమమ్మా" అంది సీతమ్మగారు.

"అమ్మగారూ, మీయతిగారి పుణ్యాన కదంబను మీరు వెతుకుళ్ళాడనక్కఱలేదు. రంగాలయంలో మల్లెపందిరమాటున కదంబ, దాని కనతిదూరంలో మందారుచాటున నాగలింగ రెండు పసిమొక్కలు ధృవతపస్సు చేస్తున్నై" అంది కుమారిక.

"ధృవతపస్సేమిటి అక్కా?" అని అడిగింది అమ్మాణీ.

"అడుగెత్తులేవు, చిటికనవ్రేలువాసి వొళ్ళు చెయ్యలేదు. పట్టుమని పదిఆకులు తొడగలేదు. ఎంతంత వృక్షాలవుతాయనుకొన్నావ్? యిపుడు కోవిలకొచ్చే వాళ్ళందరూ వాటిని ఉపేక్షిస్తేంగనక, తండ్రిచేత ఉపేక్షితుడై, అవమానితుడై, తండ్రితొడ నెక్కజాలని అయిదేళ్ళ అర్భకుడు ధృవుడు ఏకపాదస్థితుడై, మధురవనంలో తపస్సుచేసి సప్తర్షి మండల స్థాన మధిష్ఠించాడని స్వాములు ధృవోపాఖ్యానం చెప్పారమ్మా, అలాగే ఈ వృక్షాలు తారామండలానికంటా పెరుగుతాయమ్మా" అంది కుమారిక.

"పేరే అంత వినసొంపుగానుంది. నాగలింగ ఏలాగుంటుంది? దాని మహత్మ్య మేమిటి?" అని అడిగింది అమ్మాణీ.

"నాగలింగపుష్పం కంటబడడం, శివసాక్షాత్కారం కావడమే.

నీకు చిత్రలేఖనమంటెంతో అభిరుచిగా. ఏనుగబొమ్మను సంకల్పించి గీసి, పదంపడి అది గున్న ఏనుగ అని అక్షరాలా వ్రాశావుగా, ప్రజలకు మరే భ్రాంతికల్గుతుందో అన్న భయంతో" అని నవ్వింది కుమారిక.

"నీవు చెప్పినా గీయలేకపోతానా, నాగలింగపుష్పస్వరూపం చెప్పు" అంది అమ్మాణీ.

ఎంతో ఔత్సుక్యంతో కుమారిక అందుకొని, "కరిగిపోయో, కగ్గిపోయో కాంతితగ్గిన ఆకుపచ్చకాషనంటి, కలంకారీ అద్దకపుచీరల ముతుకకుంకుమరంగు నమూనా రంగురేఖలతో కూడిన కమలాన్ని ఊహా చిత్రం వ్రాస్తున్నామనుకో. ప్రతిరేకుకు మొనగట్లో చూపువాసి మేర తెలుపు రంగు ఉండనీ. ఆ కమలంమధ్యనుంచి ఉద్భవించినట్టు, అచ్చు శివాలయాల్లో సాక్షాత్కరించే లింగం, పానవట్టం వ్రాసి వాటికి ఒక్క ఛాయ తక్కువగా పసిడిపూతపెట్టు. వాటివెనుకనుంచి, వాటికి గొడుగుపట్టినట్టుగా, ఒక లేకొబ్బరిముక్క చిక్కనగల, చక్కని గులాబీరంగుతో నిగనిగలాడే సుస్నిగ్ధమైన దళాన్ని సర్పాకృతిలో చిత్రించు. ఆసర్పానికి నాలుకలు మిక్కిలిగా ఉండాలి, మఱువకు. అదే నాగలింగపుష్పం చిత్తరువు. ఆ పుష్పాన్ని చూస్తున్నంతసేపూ, అమ్మాణీ, ప్రకృతికి నకలు శిల్పితీసి శివాలయంలో ప్రతిష్ఠించాడా? కాక, శివాలయంలో శిల్పి ప్రదర్శించిన కళావిశేషాన్ని ప్రకృతి పుణికిపుచ్చుకుందా? అని భ్రాంతి కల్గుతోనే ఉంటుంది. ప్రకృతి పరమ దైవాల సన్నిహితత్వానికి, నాగలింగ ఉదాహృతం. ప్రకృతికి బుద్ధీంద్రియాలు అభిరుచులు లేకుంటే, ఒక పుష్పంలో సంపూర్ణ శివస్వరూపం ఏలా సాక్షాత్కరిస్తుంది? మరో అత్యద్భుత శివసాదృశ్యం చెప్పనా! గరళకంఠుడు గళమున దాల్చిన విషం, నాగలింగ పుష్పదళాల నాశ్రయించింది నాగలింగదళం పంటి క్రింద పడితే నాలుక జివ్వన లాగుతుంది. నాలుగు సమరేకులు ఒక కాడకు కట్టిన రచనా యిది? ఇది ప్రకృతి సాధించిన మహారచన. ఎంతమనోభావ చిత్రణా కౌశలం కనిపిస్తుందీ రచనలో! ఎంత ఉదాత్త భావసముల్లసితం. ఎంత రసభావపరిపుష్ట రచనావైదగ్ధ్యం! తద్రూపభావన మాత్రాన వివశులమవుతామే."

అంతలో సీతమ్మగారు అప్రయత్నంగా కనులుమూసి, అరచేతులు జోడించి బాహ్యస్మృతిరహిత అయింది. అది చూచి కుమారిక "హరిహర శంకర గిరిజాబంధో శివశివశంభో భూతపతే, కైలాసాధిప కరుణాసింధో" అంటూ శివస్తవం చేసింది.

సీతమ్మగారు కళ్ళు విప్పింది. శివస్తోత్రంతో సీతమ్మగారికి ఈశ్వరిమంది రంలో అడుగెట్టినట్టు దివ్యానుభూతి కలిగిందేమో, "ప్రపంచంలో ఎందుకు చేయి చాప నవసరమేముంది? ఈశ్వరునే అర్థించి అమ్మాయికి సంబంధ నిశ్చయం చేయగల" మన్న ధైర్యస్థైర్యాలు ఆమె కళ్ళలో ద్యోతకమయినై.

భక్తుల విశ్వాసదార్ఢ్యం లౌకికబుద్ధుల కర్థం కాదు. అప్పుడే అమ్మాయి పరిణయం సర్వసిద్ధమై తెరిపినిపడ్డట్టు సీతమ్మగారు కుమారికతో ఇష్టాగోష్ఠిలో దిగింది.

"అమ్మాయీ, కుమారీ! కదంబ నాగలింగాలు శివప్రీతికరములైన వృక్షాలంటివి కద, వాటిని యతిగారు రంగాలయంలో నాటడం సబబేమిటే?" అని అడిగింది.

"యతిగారి సహన సంపద్వైభవ విశిష్టతల కది తార్కాణమమ్మా. అది వారి హరిహరాద్వైత సిద్ధాంతానికే కాదు వారి సర్వమత సమరస భావానికి నిదర్శనం. యతిగారికి ఆశ్రమమిచ్చిన స్వాములు సర్వమతాదర్శ సంపూర్ణ సమన్వయ మూర్తులు. సర్వమతగమ్య ప్రాయమగు మహోత్కృష్టమతం వారు బోధించేది. యతిగారి ఆత్మవిజ్ఞానం ఎట్టిక్రమవికాసమును పొందిందో ఆ మొక్కలు ఋజువిస్తై. కమలాలతో కలువలతో నిండియున్న కొలను వద్దున ఉన్న మన కోవెల ప్రథమంలో ఆపుణ్యాత్మునిచ్చట ఆకర్షించింది. వారి ప్రకృతి సౌందర్య విజ్ఞతయే వారి ఆలయప్రాంగణంలో పుష్ప వాటిని పెంచుటకు కారణం. సుగంధయుతము సౌందర్యవంతము అయిన ఈ వాతావరణంలో రంగారాధన చేసుకుంటున్నారు. వీరి రంగారాధన అదో అంతరంగిక తత్త్వవిచారణకు సాధనక్రమం. రంగసాన్నిధ్యం వారికి అవధానచిత్తతను అనుగ్రహిస్తోంది. వారి హృదయ మిచట శాంతి సహనముల సంతరించుకొని నిర్మలానందానుభూతిని పొందుతోంది. అందుచేత వారిభక్తి సంకుచితవైష్ణవమతావలంబనాఫలితం కాదు. ఈ ఆలయంలో శివుడు వేంచేసియున్నా వారిచట తపసు చేసుకొనేవారే" నంది కుమారిక.

"అక్కా, నాదో సందేహం. చెట్టుచేమలకు నీవు చెప్పిన విశేషప్రభావం ఉంటుందంటే నమ్మలేమేమోనే. చెట్లలోకూడా పెళ్ళిళ్ళ పేరయ్యలు పేరమ్మలు ఉంటారంటే ఏలా నమ్మేదీ రోజుల్లో" అంది అమ్మాణీ.

"అమ్మాణీ, మనం గడించిన జ్ఞానం తక్కువ. చేసిన సాధన లేదు. అనుభవశూన్యులం. అయినా సహస్రాబ్దాలుగ వస్తోన్న సంస్కృతిని దానాశ్రయించిఉన్న ఆచార విశ్వాసాలను 'ఊఫ్'న ఊదేయదలచుకొన్నాము. నూతన ప్రపంచాని కనువుగ సమస్తాన్ని సరిదిద్దుకుంటే విఘ్నాలు కావనరు. అన్వేషణజ్యోతి వెలిగించి, సంఘాన్ని ఆచారాలను గుణదోష పరిశీలనము చేసుకుంటే ఎవ్వరూ వద్దనరు. పక్షవిపక్షాలు, తిరుగుమరుగులు అన్నివైపుల నుండి బాగుగా చూచుకొని చేసే సంస్కారణ అపేక్షణీయమే. కాని సంస్కారణకు పూనుకునే ముందు ఆదర్శాలు స్థిరం చేసుకోవాలి. అదే చాలకుంది. మనమొక నూతన ప్రపంచపు వీధి వాకిట నున్నాము. నూతన ప్రపంచ మింకా నిర్మితం కాలేదు. నవీనాదర్శాలు రూపురేఖా రహితంగా ఉన్నై. ఆదర్శాలు నిర్దిష్టం కాకుండా, మిడిమిడిజ్ఞానంతో, వచ్చియురాని మెలకువతో పనులు చేయబూనినచో, దడాలునపడి పోదుము. తత్ఫలితంగా సిద్ధించేది సంస్కారానికి బదులు సంకరం, విజ్ఞాన వికాసాదులకు బదులు విజాతీయపద్ధతులు. మహర్షులు తీర్చిదిద్దిన మన భారతీయ సంస్కృతిని విస్మరించి, మహార్ఘవంతమైన ప్రాచీనాదర్శాలను, ఆచారాలను తర్కవితర్కాలకు లోనుచేసి, స్వధర్మ దూరులము కావడం కాదు సంస్కారణ పరమార్థం. దేశకాలపరిస్థితుల్లో ఎట్టివిప్లవ విపర్యాలు తారుమారులు సంభవించినా మన వనితాలోకమే మన సంస్కృతిని కాపాడుకొస్తోంది. మన ఆచారాల అంతరార్థం గ్రహించి చేసినా, గ్రహించకుండా చేసినా మన మతసంస్కృతులను నేటివరకు అందించుకొస్తోన్నది. పవిత్ర్యాంతం ప్రయిన మన స్త్రీలే పారమార్థికాశయాలతో కూడిన ప్రాచీన భారతజాతీయజీవన గంగాప్రవాహము మన ఉత్తమ స్త్రీయేకద. అజ్ఞానులే అను పూర్వపుస్త్రీలు. పుణ్యాంపేరసే అను, వారు నిలబెట్టుకొస్తోన్న సంప్రదాయాలను, విధ్వంసం చేసి, శూన్యం లోనుంచి ప్రతిసృష్టిని ప్రారంభింపబూనడం కన్న, చదువులు నేర్చినం

నందుకు నేటివిద్యార్థినులు వాటి అంతర్యాన్ని పరిశోధించి, ప్రచురణ చెయ్యడం సబబు కాదా? ఏనోమూ, ఏవ్రతమూ, ఏ నియమమూ మన అభ్యుదయానికే పెద్దలు నిర్ణయించారన్న సత్యం గుర్తించరాదా? గృహిణి, నేర్వవలసిన గృహవైద్యాన్ని నోముల్లోను వ్రతాల్లోను బిగించి, డాక్టరు బిల్లులకు పాల్పడకుండా పెద్దలు నిర్ణయించిన ఆరోగ్యప్రణాళిక, రుచికొత్తకొత్త పదార్థంలోని ఓషధివిలువను గుర్తించి, పెద్దలు నిర్ణయించిన దైనందిన భోజనప్రణాళిక, యివికూడా సంస్కరణవాత నెందుకు పడాలో అర్థం కాకుంది ” అంది కుమారిక.

“ అంచేత లేబరేటరీలో విద్యార్థులవలె మనమీ ఆచారమును తీసుకొని ప్రయోగం చేసి చూచుకొని ఫలితం గ్రహిద్దాము. కార్యసాఫల్యమైందా మంచిది. కాకున్న మనకు చెడ్డది లేదు. పదిప్రదక్షిణలు కదంబకు చేసిన దాన వవుతావు. ఏ మంత్రశ్రమ? ఆమాత్రం చేయలేవా? సందేహానికి మాత్రం తావీయకుండా చూచుకో. సందేహవిచ్ఛేదులై, సంకల్పించిన కార్యమును అనన్యశ్రద్ధతో దానిమీద మనస్సును కేంద్రీకరించినవారే ప్రతిభావంతులగుదురు. విజయవంతులగుదురు. వారినే వజ్ర సంకల్పులంటాము. దానికభ్యాసమును జోడించు. ఎంత కోకిలకంఠమైతేం సాధనచేయనిదే, అభ్యాసములేనిదే రాణింపదు. ఏక్రియనైనను నూటిగా మూడు రోజులు అభ్యసింతువేని నాలుగవరోజుకు మనసు దిట్టపడును. హృదయపూర్వకమైన యత్నమునకు లొంగనిదేదియులేదు. మనస్తత్వశాస్త్రజ్ఞులుచెప్పే సంకల్పబల మదే. కార్యసాధనకు సంకల్పబలం, వ్యగ్రత అవసరమన్నమట్టుకు విశ్వసిస్తావుకద. దృఢసంకల్పముచే కొండలు పిండి చేయనగును. స్థలమహత్యం సంకల్పశక్తిని యినుమడిస్తుంది. రంగాలయమా? అక్కడ కదంబవృక్షమా? ఏభక్తులకు దొరకింది అమ్మాణీ! యింతపావనమైన సన్నివేశం? చిత్తశుద్ధితో, అవధానచిత్తతతో కదంబాన్ని రేపటినుంచే ఆరాధించు. ఒక్కటేషరతు, మరో తూరి చెప్తున్నా. సంశయమనస్కులకు జయం సిద్ధించదు ” అని సహేతుకంగా అమ్మాణీని కుమారిక హెచ్చరిస్తోంటే సీతమ్మగారు ఆమె భక్తియుక్తులకు, పరహితబుద్ధికి అబ్బురపడింది.

కుమారిక పలుకులు అమృతమే వర్షించినట్లయింది సీతమ్మగారికి. మర్నాటినుంచి, బ్రహ్మముహూర్తమని. ప్రాణమునేగాక జ్ఞానమునుకూడా ప్రసాదింపగల ముహూర్తమని పెద్దలు చెప్పిన తెల్లవారుజాముననే లేచి, అమ్మాణీ కదంబను ధ్యాననిష్ఠతో ప్రదక్షిణలు చేసి పూజిస్తోంది.

---

# 4. అమ్మాణీ పూజాఫలం

కదంబ మహాత్యం చెప్పిన నాల్గవనాడు అమ్మాణీనిలేపి "స్నానమాచరించి, సాలంకృతవై, పూజాద్రవ్యాలతో ఆలయానికి అడుగేస్తూ ఉండు, అమ్మగారికి రెండుబిందెలనీళ్లు అందించి నీవెనకనే వస్తోన్నా" నని, కుమారిక అమ్మాణీని రంగాలయానికి పంపించింది.

అమ్మాణీ ఆలయముఖద్వారం సమీపించేసరికి వెనక సైకిల్‌గంట వినిపించింది. అమ్మాణీ ఆలయప్రాంగణంలోని పూతోటలోకి వెడ్తోంటే, సైకిలు, కాలిజోడు లోపలి గుమ్మంలో దిగవిడిచి యువకుడొకడు, అమ్మాణీ వెనకనే, వస్తోన్నాడు. ఆయువకుని అలికిడి తగల్డంతో, తిరిగిచూచి ముఖమండలమంతా అపరిచితి వెల్లడిస్తూ, అమ్మాణీ తికమక పడింది.

"ఏకాంతస్థలంచూచుకొని నీతో ప్రసంగింప వచ్చినవాడను కాను. అట్టి సంశయమేమీ మనసులో పెట్టుకొని బాధపడకు. ఈ అగ్రహారంలో నాకు పరిచితులు లేరు. నాకొక భోగట్టా కావలసి వచ్చా. ముఖ్యంగా అది కన్యలకు తెలిసే విషయం కాబట్టి, పూల్లోకొచ్చినతర్వాత తొలుదొలత నీవే నాకంటబడ్డావు కాబట్టి, నిన్నడుగుతున్నా. అంతకన్న నిన్నడగడానికి విశేషకారణ మేమీ లేదుసుమా!. నీవు పరిహసింపవేని, నాకుతూహలాన్ని పరాభవింపవేని, నాకొక వర్తమానం చెప్పగలవా" అని అడిగాడు.

"ఏమిటావర్తమానం మీకు కావల్సింది?" అని అడగాలికద, ఆ ఒక్క మాట అడగక, ఏమి సబబో, అనిమేష దృష్టితో, ఆపాదమస్తకమూ యువకుని అవలోకిస్తోంది, ముగ్ధముఖరేఖాంచల అమ్మాణీ.

కట్టించి పట్టుచీర, చేపట్టించి పూజాద్రవ్యాల పళ్ళెం, నోట మాటలేసు, మూగనోము పట్టించనున్నాడేమో యువకుడు. అతడూ ఆమెను కళ్ళు వప్పచెప్పి చూస్తున్నాడు.

ఎవరిబాధలు ఎవరికి తెలుస్తై. హృదయాల్లోని ఆవేదనలు, ఆనందాలు వ్యక్తిగతగోప్యాలు. ఆడాళ్ళవి మరీను. పెండ్లి అయినపిల్లలు కాని కన్యలు పట్టేను మూగనోమన్న సామాన్య విషయం, కాలేజీ విద్యార్థి అవడంచేత యువకుడికి తెలియకపోయింది. తద్విషయం తెల్సుంటే, కన్య చూపుల కీలకం తెల్సుకొన్ను. తన ప్రశ్నను వెనకెట్టి, తన అంగసౌష్టవాన్ని అమ్మాయిణీ విలియా వేస్తోందని వెంటనే గ్రహించును.

ఆ ఒకటి, రెండు చూపులతో యువకుని చిత్తరువును సమగ్రంగా తన మనోఫలకంమీద చెక్కుకుంది అమ్మాయిణీ. "ఈయువకుడు వర్చస్వి. సమున్నతాంగుడు. నిగనిగలాడే నుదురు. నొక్కువెంద్రుకలు, ధనస్సులా వంపులు తిరిగి దట్టంగా పెరిగిన నల్లటి కనుబొమలు, సోగగా జారిన కనురెప్పలు. నల్లటి పాపలు. కోసతేలిన ముక్కు. చిన్ని మీసం. పలుచని పెదిమెలు. కమ్మెచ్చు తీర్చివట్టున్న అంగసంపద. అతడు ధరించిన బొద్దంచులధోవతీ, లాల్చీ, మెడలో మడతకండువా, అన్నిటికన్న, మిన్న అమాటపొందిక, సంస్కృతీ సంప్రదాయాలు పాటించే పెద్దమనిషితరహాను ద్యోతకం చేస్తున్నై" అని లెక్కేసుకుంది.

స్నేహితురాండ్రడిగితే ఇంత అంగాంగ వర్ణన చెయ్యడం అలౌకికం. మనం ప్రబంధకవులను అవహేళన చేసినట్టు వారు తనను పరిహసించవచ్చు. అంచేత ఈవర్ణితవిషయాన్నంతను గుణజ్ఞుడు, సుందరుడు, ఆరోగ్యవంతుడు అన్న కసరు, కొసరులులేని మూడుమాటల్లోకి సంక్షేపించుకొంది. 'నీవు పరిహసింపవేని' అన్న అతడి ఎత్తుగడనుపట్టి యువకుడు ఉన్నత విద్య నభ్యసించిన వాడని నిశ్చయించుకొంది. ఒకకించుక శిష్టాచార సంపన్నమైన ముఖాకృతి కలవాడవడంచేత, నాన్నగారి అభ్యంతరం ఉండదని ధైర్యం కలిగింది. కన్నె హృదయాన్ని ముమ్మం దాకర్షించేవి యువకుని రూపురేఖా విలాసాలేమో, మరోనిమిషానికిగాని యువకుని ప్రశ్న ఆమెకు అజకు రాలేదు.

ప్రశ్నదృష్టికి రావడానికైనా కారణం ఆ పాతలో, ఆ పెను కల్గిన ఒక భయం. యువకుడు వివాహితుడే అయితే తాను కట్టుకున్న యింత కోటా, పేకకోటలా గుభిల్లున కూలుతుంది. అందుచేత అతని ప్రశ్నను వీత ర్కించుకొంది. 'కన్యలకు తెలిసే విషయం కాబట్టి నిన్నడుగుతున్నా' నని కాస్త రాల్చేడు. చల్లగా అడిగాడే కాని, ఇదెనుగువు బరువులతో కూడు కున్న చిక్కుప్రశ్న. సాముదాయకంగా కన్నెల మనఃప్రవృత్తి, ఆశయాలు, వాంఛలు. కావల్సింది గమయితలకు కాని అన్యులకు కాదు. అవి ఒకర్ని అడిగి తెల్సుకోనేవా? కన్యలైతే మాత్రం, వాటిని విప్పి చెప్పకోగలరా? ఈయువకుడు ఒక కన్యవిషయం తెల్సుకోదలుచుకున్నాడని తోస్తుంది. అది నామనసుకు ఈత డవివాహితుడన్న ఆనందానికి ఎత్తుకెత్తు, మరోకన్య యీతడి కళ్ళలో మెలమెల్లాడుతో ఉండాలన్న ఆరాటం కల్గిస్తోంది.

"అవును, మహూర్తాల రోజుల్లో ఒకకన్య భోగట్టా కావాల్సి వచ్చిన యువకుని ప్రధానోద్దేశ్య మేమనుకోవాలి? ఒకకన్య విషయం ఆపె పరో క్షంలో మరో కన్య నడగడం తగవా? ఆకన్య లిద్దరు ఏకఫలాపేక్షి లైతే ప్రమాద పరిస్థితులు ఉత్పన్నం కావా? ఆకన్యల యిరుగుపొరుగు అన్యోన్యత ఆనాటితో సరికద. నిజమాడినా నిష్ఠురమవుతుంది. ఒకర్ని శ్లాఘించి, చేచిక్కిన పావురాయిని వదలుకోకలనా? ఒకర్ని నిరసించి తగుపెట్టు కోకలనా! తీరికూర్చుండి నన్నీపరీక్షలో పెడ్తోన్నాడీ యువ కుడు. కన్యవిషయం కన్య నడగడం ప్రాజ్ఞలక్షణం కాదని తెల్సుండే కాబోలు, 'నీవు పరిహసింపవేని' అని ఉపోద్ఘాతం ప్రారంభించాడు. ఏమో పరిహాసాస్పదమైన ప్రసంగమవుతుందని ముందే తెల్సుంటే, ఎందుకు నోరుజారుతాడు, నా భ్రాంతియే కాని ఈత డొచ్చింది వివాహవిషయం కాదేమో! వేరు వ్యవహారమైతే ఆకన్య తలిదండ్రులతోటి, సోదర్లతోటి ప్రమేయ ముండవచ్చు కాని, కన్యాప్రసక్తి ఎందుకు తెస్తాడు? ఎటుచూచినా, ఈతడు పరిణయప్రయత్నంలో వచ్చిన వాడేనని స్థిరం చేసుకుంది.

మరి యువకుని విషయం. ఈతడు శృంగార సంభాషణల కనభ్యస్తుడు. అవయసు కాలేజీవిద్యార్థులను సుపువుగా కుదిపే ఏ ఆశిక్షితావేశం కాని, కదిపే కనువేషము కాని, ఉపశమనమిచ్చే సినీమా ప్రణయాభిరుచి కాని.

త్రికరణశుద్ధిగా ఎన్నడూ కలవరపెట్టలేదు. కాంతా సమ్మితాలైన కబుర్లపట్లా, కాంతాభిలాష కలిగించే సన్నివేశాలుపట్లా, కాంతాలంబనాలైన కావ్యాల పట్లా పరాఙ్ముఖత్వం వహించేవాడు. ఒక నిషేధ ఫలాన్ని అనుభవించ డంలోని కోర్కెగాని, అరహస్యంలోని ఉత్కంపనమూ, ఔత్సుక్యమూ కాని అత నెన్నడూ సోకలేదు. దేహం కామస్వరూపమే ఎరుగని స్థితిలో, చెట్టున పండని పచ్చికాయల్ని కృతకంగా కాపుచేసి పండించిన వాడు కాదు.

'కో యెడ్యుకేషన్' కారణాన, ఎంత అనివార్యమైన అవసరం కల్గినా, కన్యలతో మాట్లాడి రావడం ఒక అనార్య సంప్రదాయంగా గణించే వాడు. ఎప్పుడైనా సహాధ్యాయిని నోట్సు తప్పనిసరిఐయి తెచ్చినా, తిరిగి పంపించేటప్పుడు వాటిలో 'స్లిప్పులు' పెట్టి పంపించే కొంటెతనం ఇంటా వంటా లేదు.

అట్లాంటి దేదో చిన్న పెత్తుచహాల్ కోట్లు చూపించాడని వాణ్ని మందలించాడు కూడా. అతడి ప్రతిఅడుగులోను, ప్రతికదలికలోను పెద్దమనిషితరహా అచ్చుకొట్టి ఉంటుంది. లక్ష్యశుద్ధి కలవాడు.

అయితేం, విభిన్నలైంగిక ప్రవృత్తులు గలవాళ్ళకు పరస్పరాకర్షణ సహజమో, ప్రణయం ప్రకృతి సిద్ధమో, స్థలసమయాల ప్రభావమో, ఆమ్మాయికి కుమారిక హామీయిచ్చినట్టు, కదంబ తనపని తాను చేసుకు పోతోందో, వారివారి స్వజనోద్దేశ్యంలో భిడియస్థులైన వా రిద్దరికు ఇప్పు డొక వినూత్నానుభూతి కల్గుతోంది.

పూదోటలోని దినకాంత వళ్ళువిఱుచుకొని పూలపైట సద్దుకుంటోంది. పక్షులు ప్రాతఃకాల గీతాలను ఆలపించినై. ఝుంమంటో తుమ్మెదజాణలు వీణపాటలు పాడుతున్నై. అప్పైన ఏకాంతస్థలం. పడుచుజంట ముఖ్యంగా. కాలేజీకన్యల కన్నెత్తి చూడనెఱుగని యువకుడు తన ప్రశ్ననే మఱచి కళ్ళను అమ్మాయి మోముకు అంకితం చేశాడు.

పెద్దమనిషి అయినతర్వాత పురుషులను పలకరించి యుండని అమ్మా యికి ప్రణయప్రగల్భమైన చతురోక్తులు స్ఫురిస్తోన్నై.

"మీ ఉపోద్ఘాతమైతే తునితమలపాకు కాడలా సుదీర్ఘంగా ఉండే

గాని, మీకు కావాల్సిన వర్తమానమేదో సుస్పష్టంగా తెలియలేము. ఇక్కడ పరిహసింపవేని' అంటో మీరు వాక్రుచ్చిన కవితాఘోరణిమాటలు, మీరొక కన్యను వలచినట్లు, ఒక ప్రేమోదంతమునకు అన్వయిస్తున్నై. ఆకన్య పేరు చెప్పితే నేనెందుకు మిమ్ము పరిహసిస్తానో, మీ కుతూహలాన్ని నేనెందుకు పరాభవించాలో నాకు అనుచిక్కుట లే" దంది.

"నీజోస్యంలో పూర్వభాగ నిజం. నే నొక కన్యకొఱకు వచ్చిన మట్టుకు వాస్తవం. ఉత్తరభాగలో ఒక జవరాలి భావన తీరుకు నమోనా యిచ్చావేమో కాని, అది నిజం కాదు. నేను పరీక్షలిచ్చి పట్టుమని పది హేను రోజులు కాలేదు. నేటివరకు నేను కాంతాచింత కలిగినవాడను కాను. ఒక యున్మిషిత యౌవనతో ప్రసంగించడం, యిదే నాతొలి అనుభవం. దైవంమేలుచేసి, ప్రేమోదంతం యిక బయల్దేరాలేమో కాని, యింతదనుక లేదు."

అమ్మాణీ కించెచ్చుకిత అయింది.

"నేనుచూడవచ్చిన కన్య నాదృష్టిలో అంగముల కలయిక కాదు. కామమును రేపు కామిని కాదు. ఒక త్యాగాగ్ని జ్వాల. నా కాపె పట్ల భౌతిక వాంఛారహితమైన పూజ్యభావము. భావజగత్తులో నా కాపె అజంతా చిత్రలేఖనము. ఒక అదృశ్య స్వరూపము. నేను అందుకోలేని అంతరిక్షమన్ననూ అతిశయోక్తి కాదు. నీకు సంశయ నివారణ చేశానని నమ్ముతా" నన్నాడు యువకుడు.

ఆతడి భక్త్యావేశానికి నివ్వెరపడి, "అంత పరమపవిత్ర విషయం మీరడిగితే నేనెందుకు మిమ్ము పరిహసిస్తానని మీకు సందేహం కలిగిందో ఆమడి నాకు విడటం లే" దంది అమ్మాణీ.

ఆపె పెదవుల్లో మొలకనవ్వూ , కళ్లంచుల్లో వలపు కాబోలు ఒక వక్రత అంకురించినై, ప్రణయక్రమానికి వక్రత ప్రాదుర్భావ మంటారు లాక్షణికులు.

"నాకు ఊరూ, పేరూ తెలియని ఒకకన్య విషయాన్ని నిన్ను చెప్పమనడంలో, ఏకన్య విషయం నాక్కావాలో నీకు తెలియచెప్ప లేక. ముందు నేను పడేపాట్లు చూచి నీవు నన్ను పరిహసిస్తావేమోనన్న సంశయంతో అన్నమా టది. తనవాళ్ళపేరు, యింటిపేరూ తెలియని

పొరుగూరి ఆసామీ మీవూరువచ్చి ‘మా వాళ్ళయింటికి దారెల్లా’ నని అడుగుతాడు. ‘ఎవరయ్యా మీ వాళ్ళం’టే, ‘మా వాళ్ళంటేనూ’ అని కంఠం హెచ్చిస్తాడు. ‘ఎవరయ్యా మహాత్మా ఆ మా వాళ్ళంటేనూ అన్న వాళ్ళు’’ అని అడిగితే, ‘అబ్బే వాళ్ళే’ నని కసురుకుంటాడు. ‘ఓహో అబ్బే వాళ్ళా మీవాళ్ళు? మా ఊళ్ళో అబ్బే వాళ్ళు లేరబ్బాయి’ అంటారు. నిముషంలో నవ్వుల పాలు కాదూ, ఆ ఆసామీ! కాని నాకు కావాల్సిన విషయంలో అంతయిబ్బంది లేదులే. ‘పాలజాతి మేడ ఉందీ, వాళ్ళూ,’ అన్నాడనుకో ఆ పొరుగూరు ఆసామీ. బాధేముంది. ఆ ఊళ్ళో మరో మేడే లేనపుడు, ఆ చుట్టుప్రక్కల వంద ఊళ్ళలో పాలజాతిమేడ ఉండనపుడున్నూ. వందమంది కన్యల్లోనుంచున్నా, మిగతా తొంబదితొమ్మిది మందిని మఱపిస్తుంది. ఆపె సౌందర్యానికి దేవతాంశ ఉండితీరాలి. ఆ మోములోని జీవన కాంతి, ఉత్తేజశక్తి అప్రతిమానం.’’

పొడిదగ్గుతో కంఠం సవరించుకొంటి ఆమ్మాణీ, స్త్రీకి మరో స్త్రీ సౌందర్యప్రశంస కొలకమార్తుంది కాబోలు.

ఆమ్మాణీ బాధ గ్రహించాడా అన్నట్టు, ‘‘స్త్రీసామాన్యమైన శృంగారలక్షణములకేమి, వాటిలో మినహాయింపైన, వీరవనితాలక్షణ సంపన్నత, ఆపెసౌందర్య విశేష’’ మన్నాడు. ‘‘నేటి నారీలోకంలో కానరాని వీరనారి. అతులబలప్రతాప మహిమాధికురాలు. ఆపత్తులో అపరరుద్రమ. అశ్వారోహణనో, ధనుర్విద్యనో, కత్తిసామునో, మరే వ్యాయమక్రీడనో అభ్యసించిన కన్యకు కాని, ఆ వీరోచిత లక్షణ లక్ష్యాలు పట్టవు. ఆ హుందా, ఠీవి, గాంభీర్యం ఆడవాళ్ళలో కనం, వినం. నీవు హిందీపిక్చర్లు చూచిఉంటే, మీరాబాయి పాత్రధరించిన దుర్గాఖోటేలో ఈమూర్తి పోలిక ఒక కొంత కన్పించవచ్చు. ఆ కన్య సేవాపరజీవితం, ఆదర్శప్రాయం. ఉత్తమ సభ్యతా స్వరూపాని కామె నిల్వుటద్దం. స్టేషన్లో తన ప్రాణానికి తెగించి, మృత్యుముఖాన్నిపడ్డ ఒక వృద్ధునకు ప్రాణభిక్ష పెట్టింది. ఏ భారతీయ మహాసంస్థకో అధికారిణి కాదగ్గ విజ్ఞానఖని సంఘభద్రత, సంస్కృతి రక్షణ సాయీ మహత్కార్య మేదో సాధించుటకు అవతరించిన కారణజన్మురాలు కానోపు, భాగీరథి

పచ్చికగూటిమీదకు ప్రవహించినట్టు, ఆమె ఈపల్లెకు పయనమై వచ్చింది. పునర్దర్శనము చేసుకొని, ఆమెకు నమస్కృతు లర్పింపగోరి వచ్చా. ఆమె యిప్పట ఎవరింటి కొచ్చిందో, ఈగ్రామంలో ఉందో వెళ్ళిందో, అదీ నాకు కావలసిన సమాచారం.”

తత్ప్రశంసను నిర్ఘాంతపోయి వింటోన్న అమ్మాణీతో మరో వైనం చెప్పమఱచానని “ఇప్పటికి రెండు వారాల క్రితం మంగళవారమో, బుధవారమో సాయం సమయానికి మీఅగ్రహారం చేరుకుంది” అన్నాడు.

యువకుడిచ్చిన ఈ ‘క్లూ’తో. తనఊహాచిత్ర మేదో స్థిరమైందన్న ఉద్వేగం ఆమె మోములోను, యిక తన ప్రశ్నకు జవాబు లభిస్తుందన్న కుతూహలం ఆతడి మోములోను ఏక కాలాన విరిసినై. అయితేం, జవాబు కాతడు ఎదురు చూస్తూంటే, మాటామంతీ లేదు సరికద, ఏదో ఊర్ధ్వ లోక పర్యటనానురక్త అయినట్టు, యిట్టే ఆకసంవంక కన్నెత్తి, తృటిలో గిర్రున తిరిగి అట్టే పోతోంది మల్లిపందిరకేసి.

తన నిరీక్ష కామె సమాధానం, ఈ ఉపేక్షా అని, ప్రేమాంకురమై యున్న యువకుని హృదయం చివుక్కుమంది.

అమ్మాణీ హటాగ్గమన హేతువ నాతడు గ్రహించలేదంటే వింతలేదు. కాలేజీ దశలో కన్యల కన్నెత్తి చూడడని ఖ్యాతి గడించిన యువకుడు, ప్రథమ స్త్రీ సందర్శనావసరంలో పడాల్సిన యిబ్బందుల్లోదే యిది. ‘వెళ్తోన్న వెలదిని వెనకనించి చూడ్డం అనార్యప్పని’ అని కాలేజీ దినాల్లో సహాధ్యాయి కోట్లును నివారించిన వాడు. యీనాడు తానాపని చేయగలడా? గొప్పలకుపోతే వచ్చిన ముప్పు యిది. మరేమీ కాదు. ఒక్కపర్యాయం వెళ్తోన్న అమ్మాణీ పాదాలను చూసి ఉంటే తనకు చిత్తక్షోభ కలుగకపోను. వెనకనుంచి స్త్రీపాదాలవంక చూడకూడదేం?

గదాయుద్ధంలో తొడలమీద కొట్టడం యుద్ధనీతి కాదన్నట్టు స్త్రీ పాదాల్ని పురుషుడు చూడకూడదని శృంగార శాస్త్రమేమీ నిషేధించలేదే. తన్నుకూడా తిని త్రిలోకపూజ్యుడైన శ్రీకృష్ణ భగవాన్లు శాస్త్ర మర్యాదల నతిక్రమించిన వాడా. బయల్దేరాడు, నేటికీ సిష్ఠు నవసరపు నిషేధాలు కల్పించుకొని, అవసరసమయాల్లో తెల్లబోయే పెద్దమనుష్యులకు మచ్చుతునుక ఈ యువకుడు.

నిగ్రహం గొప్పమాటే, కాదనం. కాని అతినిష్ఠ వెలిగిస్తే! స్త్రీప్రమేయం వచ్చేసరికి అంతా అయోమయం కాదూ? సాయిలా బాయిలా కుర్రాళ్లు చడీచప్పుడూ కాకుండా దారిని పదును చేసుకుంటారు. ముద్దొస్తారు. సంసార రంగంలోను యింతటివాళ్ళే ఈనిష్ఠజాతి. 'ఆయిలింగు' చాలని యంత్రాలా యింట్లో కరకరలాడ్తోంటారు. కాల్చుకుతింటారు. అనీ అనుమానాలు, అంతా అగ్నిపరీక్ష. కష్టపెడతారు. కష్టాల పాలవుతారు.

కాలేజీదశలో కాస్త సళ్ళొదిలిన కుర్రాళ్ళు, అంతో యింతో లగువు బిగువులు, పట్టువిడుపులు నేర్చి ఉంటారేమో, సంసారరంగంలో సహనం, సానుభూతి చూపగలరు. సుఖపెడ్తారు, సుఖపడతారు. అంచేతనే కుర్రాళ్ళు పెద్దమనిషి తరహాకు దొర్లడం, పెద్దాళ్ళకు కుర్రతనం ఊటకడం, రెండూ సమానంగా ప్రమాదహేతువులే.

అమ్మాణీ పాదాలు నడుస్తోన్నట్టులేవు. సిద్ధిలేపము పూయుండుట చేత అప్రయత్నంగా, ఆమెను తీసుకుపోతోన్నట్టున్నై. దివ్యావేశపూరిత అయి యుండాలామె, ఆక్షణంలో. ఆమాత్రం గ్రహించే సదవకాశం జారపెట్టుకొని యువకుడు బుర్రలో తర్కసంఘర్షణ రేపుకున్నాడు. ఆమె ప్రవర్తనలో దోషనిర్ణయం చేయగడగాడు. పరస్త్రీ ప్రశంసను సహించలేని సంకుచిత స్వభావురాలూ, ఈర్ష్యాళువూ నట. ధర్మకర్మ పరతంత్రుల యింట బుట్టిన బిడ్డే కావచ్చు. మనోవికాసం మృగ్యమట. మాట్లాడుతోన్న పెద్దమనిషిని తడిపిపెట్టి, వస్తానన్న మాటైన విడపకుండా వెళ్ళిపోవడం, కనీస మర్యాదల నెఱుగని అజ్ఞత, అసభ్యతానట. కొద్ది సంభాషణలో కాసంత శృంగార రసోద్దీపన కావడం తర్వాయిగా, 'మొగాడు వెంటపడకపోతాడా' అని మగువ మల్లిపూపొదరింటికి దారట్టడం చిలిపితనమో, నీతిబాహ్యమైన స్వేచ్ఛాప్రవృత్తో కావాలట. ఇక్కడ నిలబడి ఈదోషాల బేరీజు వేస్తో కుములకపోతే, ఒక్క అడుగు లెక్క ఒక్క అడుగు అటు వేసి చూడరాదూ! ఆమె ఏకాంత స్థలంలోకి ఆడపిల్లను వెతక వెళ్ళడం అనార్యప్పని. తన పెద్దమనిషితరహా దెబ్బతింటుంది. 'వెళ్ళడమా, వెళ్ళకపోవడమా?' ఈసమస్యను మెడకుకట్టుకొని సంకట పడ్తోన్నాడు. శృంగారరంగంలోనూ ఉంటారన్నమాట, 'హామ్లెట్టు' పాత్రలు.

చూచాడు, చూచాడు పదినిమిషాలైనా ఆమె జాడా, జవాబు తెలియ కుండేం, మరెవరు చూడ్డ లేదుగా, తెగించి రెండడుగులలు వేశాడు. అహో! ఏమిది? ధ్యానస్థిమితఅయి మోకాళ్ళమీద కూర్చుని, ముకుళిత హస్తాలతో ఏదో మొక్కకు మొక్కులిడుతోంది. ఆశ్చర్యపడి నిలబడిపోయాడు.

అంతలో లేచి అమ్మాణీ మొక్కచుట్టూ ప్రదక్షిణలు చేసింది. ధ్యాన ధారణాదులలో లగ్నమైయున్న కన్యను చూచినకొద్దీ తా నాపె గుణశీల సంపదను శంకించినందుకు పశ్చాత్తప్తుడైనాడు. ఆపె మోములో పరమ పవిత్రకాంతులేవో ప్రసరిస్తోన్నై. ఆపె భక్త్యావేశం పరమశ్రుతి స్వరూ పమై ఆతడి అణువణువునా నిండిపోయింది. హూణవిద్యాభ్యాసి అయినా, ఈయువకుని అంతస్సు వైదికధర్మావలంబిని. ఈతడు పూర్వహైందవ సంప్రదాయాభిమానేమో, అమ్మాణీ పూజాదికముల చూచినంత, ఆతడి హృదయంలో స్వచ్ఛస్నిగ్ధనిర్మల భావతరంగము లుప్పతిల్లినవి. అట్టి సహృ దయత యొక్క రసమయరూపమేగా, ప్రేమ. ఆపె ధ్యాననిష్ఠలో అడుగ డుగునా వ్యక్తమైన అమానసికానుసంధాన మాతడి హృదయానికి ప్రేమ బంధమైంది. ఎట్టి పవిత్ర ప్రేమ!

ప్రేమప్లావిత హృదయుడైన యువకుడు అమ్మాణీ నుద్దేశించి "నన్ని చ్చట నిలేస్తివి. నీదోరణే నీదా?" అని అడిగాడు.

నిద్రనుంచి మేల్కొన్నట్టు చకితయై, "స్వామీ! నాదోరణి కాదిది. దైవసంకల్పం. మిమ్మ్ము దీసుకొచ్చినదాన్నీ నేనుకాను, నిలేసినదాన్నీ నేను కా"నంది అమ్మాణీ యింకా పూర్తిగా విప్పారని కళ్ళతోనే.

ఆతడి కీ మానోసెలిబుల్సు అర్థం కాలేదు. "నీవిషయం నా కాందో ళన కల్గించింది. 'అగండి వస్తూన్నా'ననే నాచెప్పకుండా వెళ్ళి అప్రద క్షిణలేమిటి, నాకేమీ బోధపడలేదు" అన్నాడు.

"క్షమించండి. మిమ్మిచట వీడి వెడ్తున్నానని నాకే తెలియ దపుడు. అప్పటి నామానసికస్థితికి మీరు కీర్తించిన కన్యయే కారణం. ఆకన్య నేను ఏకోదరులము కాకపోయినా, ఆపె నాఅక్క. మీరు సెలవిచ్చిన బుధ వారం ఆపె మాయింటికే వచ్చింది. 'కుమారిక' అంటాం ఆపెను, ఇహనో యిప్పుడో యిక్కడకు వస్తుంది. కదంబాన్ని ఆరాధిస్తే కన్యల అభీష్టం

సిద్ధిస్తు వనీ, కన్యల కావ్యక్షం సంధానకర్తగా సహాయపడి సద్గుణ శోభితుఁ డైన వరుని వెతికి పట్టి తెచ్చి వప్పగిస్తుందని, ఆపెయే నాకు కదంబ మహత్త్యం వినిపించింది. ఆపె ఉపదేశానుసారం నేను మూడురోజులు కదంబను పూజించి. ప్రదక్షిణలు చేసేసరికి, నాకు పూజార్హులైన తమ..." అని, అంతలో 'స్విచ్ ఆన్' చేసినట్టు చటుక్కున నాలుక నొక్కేసుకొంది.

ఆలోచనానిరుద్ధవచనయై, తిరగా అందుకొని, "కదంబ కన్యలకు ప్రత్యక్షదైవమని, మా అక్కవాక్కు వేదముక్కు అని యింతకన్న ప్రమాణ మేమి కావాలి? అన్న భక్తి తత్పరతలో వివశనై మిము వీడి, మీయెడ అపచారము చేసిఉందును. మన్నించమని కోరుతా" నంది అమ్మాణీ.

తాను కోరిన ప్రామాణ్యాలు, ఆపేక్షా నైర్మల్యం, నైతికసౌందర్యం సంస్కార విశేషం, వినమ్రత ఈకన్యలో లభ్యమైనై అన్న ఉత్సాహంలో యువకుడు ప్రణయగీతాలాపన ప్రారంభించునేమో, అంతలో కంఠం మూగ పోయింది. కంఠంముడి సహితం సర్వావయవాలు నేత్రాలై వికసించినవి.

బాలభాస్కరు డుదయిస్తోన్న దెసను, కుమారిక భానుదీప్తితో పూదోట కవాట సామీప్యంలో ప్రత్యక్షమైంది. కొమ్మలో కోయిలజంటలా కలకల్లాడుతో దృఢానురాగపాశబద్ధులైన ఈయువతీయువకు లామెకంట బడ్డారు. కదంబ సాన్నిధ్యంలో తదనుద్దేశిత సమావేశం, అమ్మాణీ పూజా ఫలమేనని కుమారిక హృదయం పున్నమినాటి సంద్రమై పొంగింది, అమ్మాణీ ప్రేమధృక్కులతో కుమారికను వీక్షిస్తో, 'యీావెయే కాదా?' అన్నట్లు యువకునివంక చూచింది.

"అహా! చతుర్వేదిగారు మారంగాలయాని కొచ్చారే, ఇది మాకు పర్వదినం" అంటో హర్షాశ్రులతో వారిని సమీపించింది కుమారిక. .

అప్పట్టున మహోదోల్లాసంగా స్వాగతమిస్తోన్నట్టుంది, కుమారిక హస్తవిన్యాసము.

ఆపెపేరు తెలియక ఎంతోయిబ్బంది పడ్డాడు తాను. తన పేరావెకు ఏలా తెల్సిందని అడుగుతూన్నట్టు ఆపెవంక ఆశ్చర్యచకితుడై చూచాడు చతుర్వేది.

"పేరువ్రాస్తే పెట్టిపోదని, అట్టవేస్తే పుస్తకం గట్టిఅని, విద్యార్థి

వాసనలివి. డిగ్రీసహితం మీరు పెట్టెమీద పేరు వేయించుకున్నారుగా, ఎవరూ మీపెట్టెనూ కాదనలేరు, మీడిగ్రీనీ కాదనలేరు. మీసైకిల్నూ కాదనలేరు. దానిమీద మీపాడి అక్షరాలు చెక్కిఉన్నై. మీపాద రక్షలూ అనవూలే. ఎక్కడపడ్డా మీకు తిరిగొస్తై"

చతుర్వేది సాభిప్రాయంగా ఆమెవంక చూచాడు. 'కృతజ్ఞత' చెప్తోన్నట్లు.

"అమ్మాణీ, నీలాగే వీరు అంతా ఒబ్బిడి అమ్మా!" అంది కుమారిక.

"త్యాగశక్తి జనస్తుత్యం కాని, ఒబ్బిడి ఎంతఎత్తి చెప్పినా, 'నెగటీవు వర్చ్యూ' మాత్రమే" నన్నాడు చతుర్వేది, ప్రశంసాగర్భిత దృష్టితో కుమారికను తిలకిస్తో.

"అక్కా! ప్రాణానికి తెగించి ఒకవృద్ధుకు స్టేషన్లో ప్రాణదానం చేశావట. నాకూ అమ్మకూ అమాటే చెప్పావు కావేమే!" అంది,అమ్మాణీ.

"కర్తృత్వాభిమానం వర్జనీయమని అన్నారమ్మా స్వాములు. పుట్టిన కుటుంబానికీ పెరిగిన సమాజానికి శరీరం ఋణపడిఉంది. ప్రాప్తించిన సేవారూపంలో మనమా బాకీ తీర్చుకోవాలి. శరీరం ఈశ్వరదత్తమైన పనిముట్టుఅనీ,ఈపనిముట్టునుతత్ ఋణవిముక్తికి ఉపయోగించాలనిస్వాముల ఆదేశమమ్మా. అబలలమంటో ఒకపేరు అడ్డుపెట్టుకొని, అపత్సమయాల్లో నైనా, సంఘానికి ప్రయోజనకారులు కాకపోవటం, నాగరికతఅంటో ఒక భేషజభావాన్ని అడ్డుపెట్టుకొని సహజశక్తి సత్తువల వినియోగించకపోవటం ఉన్నత కులాల భారతస్త్రీలకు అభ్యాసమయింది కాబట్టి, నేను మోటు పనికిదిగబూనడమే వింతగాతోచి చతుర్వేదిగారు గోరంతను కొండంతలుగా ఉత్ప్రేక్షించి ఉండాలి. నాచేసింది అంత ఘనకార్యమేమీ కాదు. ఉదారహృదయులు, చతుర్వేదిగారు మనకు చనువిచ్చి ప్రశంసించారు కదా అని మన మా పదవికి అర్హుల మనుకొనరాదు. అది వారియోగ్యతకు నిదర్శనంగాని మనఅర్హతకు కాదు" అంది కుమారిక.

"అది వారి యోగ్యతో అర్హతో కాని, వారు నిన్ను ప్రశంసించిన తీరు భాషలోను, భావంలోను, కాత్యాయనీ స్తోత్రం చేస్తోన్నట్టుందే. చెప్తే నమ్మతావో లేదో కాని అక్కా, స్టేషన్లో నువ్వు సాధించిన ప్రాణ

రక్షణ కార్యం వింటోంటే మొన్న నీవు చెప్పిన మహిషాసుర మర్దనం చూస్తో న్నట్టు జెడిరిపోయిందే గుండె" అంది.

"ఏమండీ చతుర్వేదిగారూ! మా అమ్మాణీని ఒంటిదాన్ని చేసి అల్లాంటి మాటలు చెప్పి జడుసుకోకొట్టడం ఏమిన్యాయమండీ?" అంది కుమారిక నవ్వుతో.

"కాని అమ్మాణీ గడుస్తనం చూచారా? నాకు మహోగ్రస్వరూపిణి మహిషాసుర మర్దని పోలిక అంటగట్టిందీ. 'కదంబసాన్నిధ్యంలో మీ రుభయులు ఉన్నస్థితిలో పార్వతీ పరమేశ్వరులను తలపించారు' అంటానని ఎరుగును అమ్మాణీ. తానేమో సాత్త్విక స్వరూపిణి పార్వతి అయిందిగా! మీసందర్శన ఫలితంగా మా అమ్మాణీ మాటలు నేర్చిందండీ" అంది కుమారిక.

"నాసందర్శన ఫలితం కాదు. అదంతా మీశిక్షణఫలితమేనని ఇప్పుడే అంది" అన్నాడు చతుర్వేది.

ముగ్గురూ నవ్వుకున్నారు.

"అమ్మాణీ, చతుర్వేదిగారికి వనసొచ్చినపూలు కోస్తోండు, త్రుటిలో వస్తా"నని చెప్పి కుమారిక యింటికి వెళ్ళింది.

అమ్మాణీ చతుర్వేదులు విడివిడిగాను. మధ్యమధ్య కలసి పూలుకోస్తోండగా కుమారిక వచ్చింది. కూడా, నెమలికి ళ్ళసురటి, హారతికర్పూరపుబిళ్ళల పొట్లం తెచ్చింది. 'రంగదర్శనం చేసుకుందాము రం' డని, కుమారిక చతుర్వేదిని అమ్మాణీని గర్భగుడిలోకి తీసుకెళ్ళింది. అలవాటు కాబోలు, అమ్మాణీ కుమారిక సరసకు రాబోతే, అమ్మాణీని చతుర్వేదికి ఎడమ ప్రక్కగా నుంచోపెట్టి, కుమారిక వారిద్దరకు ఎదురగా రంగసాన్నిధ్యంలో నుంచుంది. అమ్మాణీకుమారికలు కిన్నెర కంఠంతో రంగస్తవం చేశారు. చతుర్వేది చక్కగా, స్వరయుక్తంగా మంత్రపుష్పం మాలాపించాడు. తన్మయావస్థలోనున్న కుమారిక చిత్తైకాగ్రతకు అచ్చెరువొందాడు. సురటిని, కుమారిక పసుపున, అమ్మాణీ చేతికందీయడంలో, కాడమబుచ కాబోలు, చతుర్వేది ముఖమండలంలో నూత్నవధూస్పర్శానందం తాండవించింది. హారతికర్పూరబిళ్ళల వెలిగించి, అమ్మాణీ కుమారికలు మంగళం పాడారు.

రంగారాధన అయిన వెంటనే, 'మరిసెలవ'ని చతుర్వేది బయల్దేరాడు.

కుమారిక అమ్మాణీని చూచి నవ్వుతో, "గృహిణివి కానున్న దానివి, యిదా నీ నేర్చిన మర్యాద ? చతుర్వేదిగారికి కెబుర్లు చెప్పగలిగావు కాని కాఫీకి ఆహ్వానించలేక పోయావే. అమ్మగారు మన ముగ్గురకోసం ఎదురు చూస్తోంటారు. నీవు తొందరగా వెళ్ళి, వలయు సద్దుబాట్లు చేస్తూ ఉండు. నేను చతుర్వేదిగారిని నీవెనకనే తీసుకొస్తా"నని అమ్మాణీనిపంపి వేసి, అమ్మాణీ స్వభావ సౌజన్యాదులను, నిష్కాపట్యాన్ని ఉగ్గడిస్తూ, కుమారిక చతుర్వేదిని సీతమ్మగారి వద్దకు తీసుకొచ్చింది.

చూపులు గుళ్ళోనే అయి, కథ గర్భగుళ్ళో పాణిస్పర్శన పర్యంతం వచ్చినా, ఇంటివద్ద ప్లానింగు, పెండ్లిచూపుల సన్ని వేశంలా కన్పించిందో, కాక సీతమ్మగారు కనుసంజ్ఞ చేసిందో, అమ్మాణీ పెళ్ళికూతుళ్ళ పోజులో, లజ్జాక్రాంత సర్వాంగయై మూగనోము పట్టింది. అమ్మాణీ చతుర్వేదులకళ్ళు మధ్యమధ్య భాషించుకుంటోన్నాయేమో కాని, పెదిమలు విడలేదు. రివాజుగా పెండ్లిచూపులకు ఆహ్వానితుడైన యువకుణ్ని అవబోయే అత్తగారు పలకరించే తీరుమాటలు యిక్కడ తప్పవేమోనని సీతమ్మగారూ మౌనముద్ర వహించింది. ఇంటివాళ్ళూ, అతిధీ కూడా నిశ్శబ్దప్రేక్షక పరిస్థితిలో పడ్డోన్న యిక్కట్టును బాపుటకు సముచిత సంభాషణను కుమారిక సాగిస్తుంటే, చతుర్వేది కాఫీతంతు కానిచ్చాడు. పెళ్ళిచూపుల వాలాయితీ అయింది.

వీడ్కోలు సమయంలో కుమారికముందు వీధిలోకొచ్చి, చతుర్వేది సైకిల్నుదులిపి కాలితో చైనుసరిచూచి, బెల్ వాయించి, చతుర్వేది మెట్లు దిగ్గానే దాన్ని అతడి కందించింది. కుమారిక చేసింది బహుస్వల్పకృత్యమే కావచ్చు. అంత అవసరమైనదీ కాకపోవచ్చు. కాని స్వపరభేదరహితమైన ఒక సోదర సోదరీ చుట్టరికం, చనువు చతుర్వేది కావె సపర్యలో గోచరించినై. ఊడిగంలో పరిచారికలు లేకనా, సత్యభామ 'ఘష్టుఎయిడ్డు' పరికరాలు భారీఎత్తున తెప్పించకనా, సర్వభూత కోటిబాధా తలనెట్టుకొని చెక్కు చెదరని త్రిజగద్రక్షుడు కృష్ణుడు, వ్రేలి రెండు రక్తపుబొట్లబాధ సైరింప లేడనా, చీరకొంగుచింపి అద్దవలసినంత అగత్యమే మొచ్చింది ద్రౌపది కానాడు? అదే హైందవకుటుంబ సోదరసోదరీల ప్రేమ. కాల

వై పరీత్యంచేత, ఒకప్పుడు శత్రుస్థానంలో పడ్డా, నావాళ్ళని సతతం దేవుళ్ళాడే ఒకదయార్ద్రహృదయసంబంధి సోదరి. అంతట, ఏకకార్యసంసిద్ధికి ఆయత్తపడ్డోన్న అన్యోన్యతతో కుమారికాచతుర్వేదులు మాట్లాడుకొంటూ ఊరుచివర కెళ్ళిన తర్వాత, కుమారిక చతుర్వేదివద్ద సెలవుతీసుకుని యింటికి మళ్ళింది.

పరుగుపరుగున యింటికొస్తోనే, కుమారిక సీతమ్మగారిచేతుల్లో చేతులు వేసి "వరుడు నచ్చాడా అమ్మగారూ! శుభ్రంగా స్వరయుక్తంగా ఆలయంలో మంత్రపుష్పం చెప్పాడు. అమ్మాణీ, చెప్పావా అమ్మగారితో? పేరు చతుర్వేది. అదేమి శుభసంఘటనో. వేదపారాయణులు. అయ్యగారు వంకర్లు పెట్టలేరు. అందుకు చెప్పాను. బియే పరీక్షనిచ్చాడు. రెండుపంటలూ పండే పల్లభూమి అయిదు యకరాలు. అంతా ఒక్క ఫర్లాంగులో గ్రామానికి మరో రెండు ఎకరాలు మెరక ధరిఊళ్ళోనే, అద్దైనా. మరి గుణరూపసంపదలు మీరే చూచారుగా. వక్కటే యిబ్బంది చెప్పుకోవద్దూ. అప్పగారి యాజమాన్యమట. ఆవిడగారు పట్టువిడుపు లెరుగని తిక్కమనిషట. ఆవిడ కేవిషయంలో మనసు నొవ్వకుండా, నేను కనిపెట్టి విడిదలోనే ఉండి చాకిరీ చేస్తే ఆదరసత్కారాలతో ఆవిడను ముంచెత్తేస్తే, తిక్క ఎవరిమీద, ఎందుకు చూపెడ్తుందో చూతాం. మీరు 'ఔ' నంటే ఈసంబంధం నిశ్చయమైనట్టే. రేపెల్లుండి అయ్యగారు పెండ్లిమాటలకు రాగలరని చెప్పేశాను కూడా. కాని అయ్యగారిని మీరు పంపేటపుడు, మనకు ఈతనితో కల్గినపరిచయవృత్తాంత మేమీ పైకి రానీకండి. మనపరిచయ వివరాలు తెల్సీ తెలియకా అయ్యగారచట, వాటినియెత్తి మాట్లాడబోతే, ఔచితభంగం వాటిల్ల వచ్చు. అనుకోని సంశయాలు ఉత్పన్నం కావచ్చు" అంది.

అమ్మాణీవంక చూస్తో, "ఇంతకూ అమ్మాణీ పూర్ణాంగీకారం మనకుంది అని మనం భావించవచ్చేమో! అమ్మాణీ అంతర్యం కనుక్కున్నారా?" అంది కుమారిక.

అమ్మాణీకి సిగ్గేసింది. "గుళ్ళో ఏమైందో యింతసిగ్గూ?" అంది కుమారిక.

"అదీ నీకే తెలియాలి. పెండ్లి కొడుకు మేఘాల్లోనుంచి ఊరికా డను కుంటానా? నీచెల్లాయికి వరుణ్ని తెచ్చింది నీమంత్రశక్తేనని, ఎంత పాత

కాలపుదాని నైనా తెల్సుకోక పోయానా? గుళ్ళోగూఢపురాణీ తెలియలే ననుకుంటున్నావా? రంగడి సాన్నిధ్యంలో ఖాయంచేసే, చతుర్వేదిని నాకు చూపెట్టివాయిరి. ఇప్పుడు నీవా తణ్ని సాగనంప వెళ్ళినపుడు, ఆలయవృత్తాంతం, నీవువొచ్చేరోజున తటస్థించిన స్టేషనువృత్తాంతము, ప్రాసగుచ్చినట్టు అమ్మాణీ నాకుచెప్పింది. కుమారీ, పెండ్లిమాట అటుంచు. దారిపొయ్యేవాడికి ప్రాణంబలేయాల్సినంత అవసరమేమొచ్చిందమ్మా నీకు స్టేషన్లో? తానుబ్రతికిగదా సమస్తపురుషార్థములు సంపాదించుకోవలె. న్నుమాని పరుల రక్షింపవలెననుట, ఏటినీతి? స్టేషన్ పర్యవసానం మరో విధమైతే, మాబోట్లం ఎంత సంపద్వర్షాన్ని కోల్పోదుమమ్మా!" అని అశ్రులురాల్చింది సీతమ్మగారు.

"ఇకనెన్నడూ అట్టిసాహసాలు కొడిగట్టనని చేతులో చెయ్యి వేయాలి" అని సీతమ్మగారు చేయి చాచింది. "ఈ పరిణయం మాట మాత్రం ఏమిచేశావు? అమ్మాణీ నాబిడ్డే అను. నీకూ పెళ్ళి యీడేగా! దానికన్న ఒకటో, ఆరో నీవే పెద్దగా. స్వవిషయం విస్మరించి, అమ్మాణీ కాతణ్ని నీవు సంకల్పించే త్యాగంమాత్రం ఏం బాగుంది? ఇదిమాత్రం తన్నుమాలిన ధర్మం మొదలు చెడ్డబేరంకాదా? చిత్తశుద్ధితో నిన్నడుగుతున్నానమ్మా" అంది సీతమ్మగారు.

అమ్మాణీకి కూడా ఈసందేహం కల్గుతోవచ్చిందేమో కుమారికశంక చూస్తోంది.

"అమ్మగారూ! అదుగో అయ్యగారొస్తోన్న సవ్వడి. వరుడు నచ్చాడా అన్నమాటకు సమాధానం చెప్పారుకా" దంది కుమారిక.

"ఇంకా అడుగుతావా అమ్మాయీ! మితభాషి, పెద్దమనిషి. పండిన బత్తాయి ఛాయ" అంది సీతమ్మగారు.

"అయితే అమ్మాణీ అదృష్టం పండిందనండీ, మరీ సందేహాలూ పెట్టుకోకుండా. కదంబను ధ్యానంచేసింది అమ్మాణీ కాని నేనుకాను. అమ్మాణీపూజాఫలమీ సంబంధం అని నేను మనోవాక్కాయకర్మలా నమ్మా" నంది కుమారిక.

"కుమారీ, కదంబ కథ నిజం చేశావమ్మా. కదంబ మహాత్మ్యం కన్యలకు చాటవమ్మా" అంది సీతమ్మగారు.

---

# ౫. ఇదేదో తయారుతిన్న చెయ్యేనేవ్!

బ్రాహ్మణ్యం శ్రౌతధర్మ దూరులగుతున్నారని, ఆనాటి కానాడు కులాలు సంకరం సర్వంజగన్నాథం అయిపోతోన్నాయనీ ఎపాచ్చి తానూ రావి చెట్టుకింద యింటి అవదాన్లూ మాత్రమే పదహారణాల శ్రోత్రియులం దిగడ్డామని రామశాస్త్రుల్లు గారికో పెద్ద అహంభావం. తిదవగుణ కాని జాన్నే 'కుమారిక బ్రాహ్మణ కన్యేనా?' అని శంక పెట్టుకొన్నాడు కాబోలు, ఆ పెవంక పదేపదే చూస్తూన్నాడు. ఓనాటి స్వర్ణసంధ్యా కాంతుల్లో, కుమారిక శరీరచ్ఛాయ రామశాస్త్రుల్గారి నేమి తబ్బిబ్బు చేసిందో, అన్నాపట రామశాస్త్రులుగారు భార్యతో, కుమారిక వీధిలోకి వెళ్ళగాచూచి.

"పెళ్ళీడు వచ్చిన కుర్రాడు రంగడు, పరీక్షలిచ్చి యింటికొచ్చే సమయం, ఇవెవత్తే దీన్ని యిప్పుడు యింట్లో పెట్టుకు కూర్చుంటివి."

"అది హారతి కర్పూరపు బిళ్ళలాంటి పిల్ల అదేమిటండీ దాన్నలా నోరుచేసుకుంటారు?"

"అదేనే, నేననేదీనీ, దానిసువాసన మనఅబ్బాయికి తగుల్తుందేమోననే నాభయం."

"మనవస్తువు మంచిది. మనఅబ్బాయి యోగ్యుడు. మీభయం లేకపోతే మరెవ్వరిభయం ఆపిల్ల కుండదు. నా పూచీ."

"సారి, సరిపోయింది. మధ్య నా కంటించావ్. ఏభై దాటాయి."

"ఏళ్ళుగడిచై కాని, గుణా లేమితగ్గ లేండి. ఆమాట కొస్తే, ఈమాట మీకుతోచడంలోనే కన్పిస్తోంది, కళ్ళకు కట్టినట్టు కొంటెతనం యెక్కడుందో. ఒక్కళ్ళం అనుకోలేము. అదివచ్చినపుడే నాసందేహం నాకుంది చెప్పవద్దూ. అది యోగ్యురాలు కాకపోతే నాకు ఉద్వాసమే ననుకున్నా."

మాటకు మాట, యింతవరకూ సాగలాగిన సీతమ్మగారు, వెనకటి

యాయనగారి అపత్యాపేక్ష మాటి పైకి తెచ్చేటట్టుందన్న దిగులుతో "పోనీలే, పోనీలే" అంటూ తగ్గాడు రామశాస్త్రుగారు. అదైనా, రామశాస్త్రుగారి అదలే కాని, సీతమ్మగారి కీనాటిదాకా కెళ్ళించదగ్గ పెద్దవిషయ మేమీ కాదు.

ఎప్పటిమాటో. ఆరేళ్ళే క్రితంమాట. అప్పో, కొత్తొచ్చినపిల్ల ఒకర్తుక, అప్పట్లో సీతమ్మగారికి దాసీపనికి కుదిరింది. శ్రావణమంగళ వారం. అది ఊబలాటపడి ముస్తాబై సీతమ్మగారితో, రంగురంగుల జేబు రుమాలును, విస్సాటంగా చేత్తో ఊపుతూ, వాయనాలకెళ్ళడం, యెక్కడున్నాడో, రామశాస్త్రుల్లు చూచాడు. వాళ్ళు యిళ్ళుచేరడం ఆలస్యమై సీతమ్మగారు రాత్రివేళ, మడిగట్టుకోవాల్సివచ్చింది. వంటింటో ఉంది "అన్నం వార్చి సెనగలు సాతాళించి యిస్తాను, వెళ్ళిపోక" అంటే. ఆవయసుకత్తె వాకట్లో ఉంది.

దానిముంపతెగ, వాకిట్లో గుమ్మంఘరేపెట్టిన దీపం, అప్పుడే ఆరిపోనా! అన్నీ అల్లా దాపరిస్తే కష్టకాలానికి. అది బుడ్డిదీపం. దానీది 'కెవ్వు' మంది.

సీతమ్మగారు లోపలినుంచి 'ఏమే, ఏమే' అంటూ దీపంతో వచ్చింది.

"ఎవడో దొంగ మెళ్ళో చెయ్యిపెట్టి పారిపోయా" డంది దాసీపిల్ల.

కాని, ఏమీ తెంపుకు పోయింది లేదు. దానికి సాయం, వీధితలుపు లోపల గడియవేసి ఉంది. సీతమ్మగారు దీపంవెలుగుతో, భయపడ్తూనే, ప్రక్కగదిలోకి చూస్తే, రామశాస్త్రుగారు శుభ్రంగా మంచంమీద చాపినపట్టు వేసుకొని కూర్చుని ఉన్నాడు. నైష్ఠికుడే అయినా మంచం మీద కూర్చుని జపంచేసే అభ్యాసంలేదు.

"అది అలా కెవ్వుమంటే, అనుము మినుము అనకుండా కూర్చోడానికి ఎలాప్రాణం వప్పిందండీ? కాకపోయినా" అంది ఆవిడ.

"తేలు అనుకున్నానే" అని తేల్చేశాడాయన.

సరిగా ఆయన కాలుసాచితే అందేచోట ఆయనగారి కాలిజోడే ఉంది స్మండీ. అంతతో ఊరుకోవచ్చా, "ఈమాత్రానికి యింత అల్లరి ఎందుకే?" అన్నాడు.

"ఈ మాత్రానికి అంటే, ఏమాత్రానికి? దాని మెళ్ళో పరాయి చెయ్యి తగిల్తే, అది కంగారు పడదా? అది కైవ్యమంటే నేను దీపం తేనా. మధ్యన మీకొచ్చిన అల్లరేమిటి! దొంగైనా, తేలైనా ఇంట్లో నే తచ్చాడుతోండాలి" అంటూ సీతమ్మగారు దాసీ పిల్లవంక తిరిగి, "అమ్మాయీ! మాది దొంగలూ తేళ్ళూ మసిలే కొంపమ్మా. ఎందాకా నేను కాసుకు కూర్చోగలను. నువ్వీపాటికి మరోయిల్లు చూసుకో అమ్మా" అంది.

'సిగ్గు సిగ్గు' అంటూ గదిగుమ్మం వంక చూస్తూ దాసీదాన్ని సీతమ్మగారు ఆ రాత్రే మానిపించేసింది.

"అంటే," అన్నాడు రామశాస్త్రుల్గారు.

"అంటే లేదు, గింటే లేదు. ఎవ్వరికీ, ఎవ్వరూ సమాధానాలు చెప్పుకోనక్కర్లేదు" అని ఆవిడ విసురుగా వంటింట్లోకి చక్కాబోయింది.

నాటికి నేటికి వారింట్లో దాసీది లేదు. కాని, భార్యాభర్త లెందుకు రుసరుసలాడినా, ఆనాటి చీకటి చాటుపెల్తి తలెత్తుతోంటుంది.

"పోనీలే, పోనీలె" అన్నారు. పోని అని సరిపెట్టుకోవాల్సిన పిల్లగాదు ఏమనుకుంటున్నారో. కుమారిక మణిపూస. ఏంచేసిందో చూచారుగా. వచ్చిన రెండోరోజున అది చేసిన మొదటిపని, మీరు సంధ్యావందనం వార్చుకునేచోట, తులసికి కోట వేసింది. తులసిచుట్టూ దిమ్మ వేసినట్టుందా? కోటఅన్న మాటను సార్థకంచేస్తోన్న అదోకరకం శిల్పం. మీరు సాయంసమయ సంధ్యావందనం చేసుకొచ్చిన తర్వాత, సైరంధ్రీ, అమ్మాణీ' ప్రతినిత్యం తులసీప్రదక్షిణలు చేస్తున్నారు. అమ్మాణీ కదో దీక్షగా అలవాటుచేసింది. అమ్మాణీని యింట్లోనుంచి కేక వేస్తినికద, మీరిపుడు మాట్లాడకూడదన్నట్టు సంజ్ఞచేస్తే పరిగెత్తుకొచ్చి, 'ఆపనేదో నేచెయ్యకూడదా' అంది. అంత రహస్యమేముంటుందని దొడ్డిగుమ్మంకేసి చూశా. అమ్మాణీ ఏకాగ్రచిత్తతో తులసికి ప్రణామం చేస్తోంది. అమ్మాణీకి ఇదివరకెంతసేపూ మహిళా మండలి పిల్లలతో కులాసాకబుర్లు, క్యేరంసు ఆటలు, సినిమా పాటాలున్నూ. అమ్మాయిని ఎంత స్వల్పకాలంలో భక్తిమార్గాన్ని పెట్టింది, భావవికాసం కల్గించింది! దానిచెప్పడం సాంప్పే వేరు. తులసి, వాతావరణాన్ని శుద్ధిచేసే క్రిమిసంహారటట. దానిఘాటుకు

పోమలూ పాములూ కూడా చేరవట. తులసి జీవన ప్రదాత కాబట్టే విష్ణువుకు ప్రియురాలు అయిందట. ఇహపరాల సొంతచుక్కగా మేళవించి చెప్పిందీ !"

"మేళవించడం కాదు. మేళం కట్టోంది. లేకపోతే ఏమిటిది! బ్రాహ్మ ణింట రాత్రి పదీ, పదకొండుదాకా, యిదొచ్చినతర్వాత పాటలు పద్యాలు, నవ్వులున్ను. నిన్నరాత్రి రావిచెట్టుకింద అవధాన్లు గుమ్మంలో కొచ్చి విస్తుపోయి, వెనక్కిపోయాడు. నేను తలవంచుకున్నాను" అన్నాడు రామశాస్త్రుల్లుగారు.

"అయ్యో! పాపం, మా మూలాన్ని మీకెంత తలవంపులొచ్చె. ఇంట్లో పురాణం చదివిందా కుమారిక ? మీకెంతసేపూ అర్ధధర్మమంటో, మడి మైళ్ళ పట్టింపులూ, గ్రహణచర్చలూ, ఉపవాసదీక్షలూ ఈ శ్రోత్రియప్రతిక్కలే కాని, భాగవత పారాయణ, పారమార్థిక చింత కావాలి కనక నా. ద్రౌపతీగజేంద్రాదులు ఆర్తభక్తులని, ఉద్ధవాదులు జిజ్ఞాసువులని, ధృవాదులు అర్థకాములని. ప్రహ్లాదాంబరీష జనకాదులు తత్త్వజ్ఞానులని, యెన్నో భాగవత రహస్యాలు, అరటిపండు వల్చినట్టు చెప్పింది. త్యాగసేవలే గృహస్థులకు పరమాదర్శాలని తెలుపుతో, మహాభారతంలోనుంచి, కపోతోపాఖ్యానం చదివి వినిపించింది."

"అది చదవడం, మీరు వినడం. మంచి మిడిమేళమే తయారయింది కొంపలో. మీ పుక్కిడిపురాణాలకూ, కథలకూ పుణ్యాలో కాలు దొరికితే మేమీకఠోర కర్మానుష్ఠానాల శ్రమ ఎందుకుపడాలీ!" అన్నాడు అవధాన్లు.

"సాహిత్యోపాసనలూ, కళారాధనలూ అంటారే. అవన్నీ తాత్కాలిక ఐహిక ఆనందాల నిచ్చేవిమాత్రమేనట. ఒక్క వేదవిహిత కర్మానుష్ఠాన పరులకే స్వర్గద్వారాలు తెలుచుకునేది. అవధాన్లుకన్నా తెల్సినవాళ్ళు కాబోలు మీఆడాళ్ళు" అన్నాడు రామశాస్త్రుల్లుగారు.

"సరే, ఆయనే సర్వజ్ఞుడు మీకు మంచిసారథ్యం దొరికిందిలేండి. మీఅవధాన్లుమాత్రం తెలియకనే వ్రాశారుపోతన్నగారు. 'కానని వాని నూతగొని కాననివాడు, విశిష్టవస్తువుల్ కాననిభంగి గర్మములుగాకొని కొందరు కర్మబద్ధులై కానరు విష్ణు.' ఇంట్లో ఆడవాళ్ళు పురాణంచదువుకోవడం మీకు నామోషికీ వచ్చిందీ. మీరేదో మహాచదివి పరగబెట్టారనుకొని,

మీకోసం వ్యాసపీఠం తయారుచేసింది కుమారిక. గురుక్కానింతంతో నమస్కృ చెయ్యవంతర్వాయి. మిమ్మల్నడిగి తులసీమహాత్మ్యం తెల్సుకోవుంది. దానికేం తెల్సు మీతిక్క. దాని బుద్ధి ఎవరికీ రాదండీ. మీరు పూజచేసికొని, చెవులోనో పలకలోనో పెట్టుకోవడం చూచే అంటారా నందివర్ధనంచుట్టూ కలుపు లాగేసి, రెమ్మలనుపట్టినచీడ తీసేసింది. మీరుచెప్పకుండానే తులసి నందివర్ధనం మీకు ప్రీతి అని తెల్సుకొంది అంటారా?" అని అడిగింది.

"గాయిత్రిసాక్షి నేను చెప్పలేదే. ఆపువ్వు పలకలోపెట్టుకోవడం, తులసిదగ్గర నేను సంధ్యావందనం చేసుకోవడం చూసి చేసిందేమో! కాకపోయినా, ఒసేవ్, ఎవరిమాటచెప్తోన్నా, మధ్యనోమాటు పనిగట్టుకు నన్ను అంటోండడం, మా బాగా అలవాటైందే నీకు" అన్నాడు.

"ఊరికే అనను. ఆపిల్లమాత్రం భక్తి, జ్ఞానం యేళ్ళుగడచిన మనకు లేవన్నా. పైగా దానికి పేర్లుపెడతాం" అంది సీతమ్మగారు.

"అవును దాన్ని ముప్పొద్దులా మేపుతున్నావు. పనిలేనిమంగలి సామ్యంగా అది దొడ్డంటమొక్కలు మొటికలు చూస్తో తిరిగితే, అనిర్వాచ్య సారమంతా జ్ఞానమంటావు. కూనిదీర్ఘాలుతీస్తూ కూర్చుంటే భక్తి అంటావు. దాని తోచీతోచని పనులకు పెద్దపేరెట్టి, శ్లాఘించబోతావు. ఊరుకో!" అన్నాడు.

"అన్నా! తోచీతోచని పనులా కుమారిక చేసేవి! దాని కార్యాచరణవిధానంలో ఒకప్రత్యేకపోకడ, పంథిణీ కన్పిస్తై. కాలవ్యయసూచిక వ్రాసిపెట్టుకున్నట్టు, ఆమెచేసేపనులలో సమయపాలనం, క్రమం, నియతత్వం, అప్రమత్తత గోచరిస్తై. దైనందినకార్యక్రమ మంతా నియమబద్ధం. అంచేతనే మధ్యాహ్నకాలం కొంత, మీకుతెలియదులెండి, మీరుగుర్రునిద్రమీదఉండేవేళ, సద్గ్రంథపఠనకు విడదొక్కుకుంది. నిత్యగ్రంథాధ్యయనం దాని నీమాల్లోదే."

"అందుకనే తోచీతోచని పన్లన్నా. ఒక్కకాణీకి కలిసొచ్చ్చేదేముందే దీనిలో" అన్నాడు.

"అదీలేకపోలేదు. ఒకపూజావిధానంగా, సూత్రయజ్ఞమట నూలు వడకుతుంది. రోజుకిన్నిచిలపలని, యేద్రమొక్కుబడిగానో, దానితో

పాటు అమ్మాణీకూడా వడకవలసివస్తోంది. ప్రతీపనికి తేలికమార్గాలు చెప్పి పనివాండ్రకు తలలోనాలుక అయింది. వాళ్ళతో ఎంతకలుపుగోలు తనంగా ఉంటుందో. ఇదివరలో తట్టుతగలేతగా పనిచేసేవాళ్ళు, యిపుడు కుమారికప్రక్కనుంటే, పనిపట్ల ఎంతో ఉల్లాసం చూపుతున్నారు. పని ఏదైతేం, మమకారంగా చెయ్యాలంటుంది. కీర్త్యాపకీర్తుల నిచ్చేది వృత్తి గాదు. దానినిర్వహణాపేక్ష, విధానం అని దృక్పథంమార్చేసింది. దాంతో ఎవరిపనివాళ్ళకు గౌరవప్రదంగా కన్పిస్తోంది. పనిమనుష్యులు తలెత్తుకు తిరుగుతున్నారు. గ్రహచారమంటో ముక్కుతో, మూల్గుతో, కాళ్ళీడ్చుకుంటో వాళ్ళు పనిచేసేవారంటే, కారణం మన చేతకానితనమే నని యిపుడు, ఈవీధియిల్లాండ్రందరకు తెల్సివచ్చింది. దీనిపని మీకంటికి తోచీతోచనిపని అయింది. అది నాఅదృష్టం" అంది సీతమ్మగారు. "తోచీ తోచని పనులని సుళువుగా తోసిపారేశారు. ఇంతలోనే కాళ్ళు అరిగిపోవు. ఇల్లా దొడ్లోకిరండి. ఆదక్షిణదిశను పారిజాతం నాటింది. 'మొదల్లుగుంజితే జలజలా పుష్పవర్షంకురిపించే చెట్టు దొడ్లో ఉండడం అతిశయం కాదండీ' అంటో పరంపదంగా నాటిందా మొక్కను."

"తులసికోటవేసి తులసీమహాత్యం చెప్పమందన్నావు. నేను పురాణ పారాయణ చేయటంలేదని నన్ను నిలేశావు. పారిజాతంవేసింది. తిమ్మకవిగారి పారిజాతాపహరణం చెప్పమని ముక్కుపట్టుకుంటుందేమోనే. యీకాడినుంచి, నీకు నేను శృంగారసాహిత్యం వినుపించటంలేదని మీదడేటట్టున్నావు నువ్వు. నువ్వూ, నీపైకరీని. దాని ఒక్కొక్క ప్రశ్నకు నేను ఒక్కొక్కశాస్త్రమో, సాహిత్యమో చదువుకుని కూర్చోవాలన్నమాట" అన్నాడు.

"ఆగోడకేసి చూడండి. ఎన్నెన్నిరకాల ఎన్నెన్నిరంగుల గులాబీ, చామంతి, మందారం, బంతి వేసిందనుకొన్నారు? వీధిగోడమీదకు ప్రాకుతుందట. వీధంటవెళ్ళేవాళ్ళకు, మారాన్నుంచే ఎంతోనయనోత్సవంగా. రంగురంగుల పుష్పాలు, వత్తుగా చిక్కగా తివాసీపరచినట్టుంటాయట. ఆపేరేదో మనపేరుకాదు 'బోగేంవిలా' లనో ఏదో చెప్పింది. అవి కళ్ళ మొక్కలట అంది" సీతమ్మగారు.

"ఆశ్మీ, యిదెవత్తో గట్టిదేనే, వాటికి భోగంజాతి మొక్కలని పేరెట్టిందన్నావు. భోగంకొమ్మలు కంటికి యింపేగా" అన్నాడు. రామశాస్త్రుల్లుగారు, అంగాస్త్రంతో పెదిమెలు తుడుచుకొంటో.

"మరీపస్రతనమొస్తోంది" అంది సీతమ్మగారు.

"కాదే కళ్ళుమొక్కలంటే ముక్కుమొక్క లంటారాయా అని నవ్వొచ్చిందే" అన్నాడు.

"రాత్రి వికసించేపూలు ఎక్కువ పరిమిళమట. వాటిని పడకగది కిటికీబయట దక్షిణగాలిపాడలో వేసింది. జాజీ, మల్లీ, సంపెగలూ. ఎన్ని జాతుల సంపెగలో చెప్పింది. ఆపేర్లే ముద్దొస్తున్నాయి. కనంగ సంపెగలు, కర్పూర సంపెగలు, సకలగుణ సంపెగలట. ఆపేర్లే విని యెలుగం. అదేమిటండీ, అలా చూస్తారు?" అంది, ఆవిడ, ఆయనముఖంలో ఏంవికారం కన్పించిందో.

"ఏమీ లేదే తెచ్చి తెచ్చి మనవృద్ధాప్యంలో తెచ్చిపెట్టిందే యీపుష్పాల బాధ. పదేళ్ళక్రితం అయితేనా, అడిగావూ?" అని అంగాస్త్రం నడుముకు బిగించాడు శాస్త్రుల్లుగారు.

"మనతోటే ఉందిటండీ సృష్టి. కోడలొస్తే. అబ్బాయీకోడలూ అనుభవించరా? కలకల్లాడుతో ఉంటై. యిల్లూ దొడ్డిన్నీ" అం దావిడ.

"మనయింటి పడగ్గదిబెంగ దీనికేమొచ్చిందే. అశే, కావలసింది, అక్కఱలేంది లేదటే దీనికి?" అన్నాడు శాస్త్రుల్లుగారు.

ఆయనగారి మనోగతాంతర్భావపరిణామాన్ని నిశితంగా గ్రహించని సీతమ్మగారు "యింకా సెమ్మదిగా బెంగ అన్నారా? పూలమొక్కలను కేవలం తల్లిప్రాణంలా వేయికళ్ళతో కాపాడుతుంది. విత్తనం మొలకెత్తినా, మొక్కమొగ్గతొడిగినా, మొగ్గవికసించినా బారసాలంత ఉబలాటపడ్తుందండీ. ఆచిన్నహృదయం ఎంత అలౌకికప్రేమతో నిండి ఉందోకాని" అం దావిడ.

"బారసాల కార్యక్రమంకూడా దృష్టిలోపెట్టుకుందీ, అబ్బో దూరం వెళ్ళిందే, వ్యవహారం" అన్నాడు.

"దూరం వెళ్ళడమేమిటి, పూలమొక్కలమీద ఏదోప్రత్యేకశాస్త్రమే

తెల్సుకోంది అనుకుంటూ. మొక్కల్లో కుటుంబా లుంటాయని, అంట్లు కట్టి శాఖీయోత్పత్తట, బహురమ్యమైన పలురంగుల పుష్పాన్ని పుట్టించ వచ్చనీ యెన్నో చెప్తుంది."

"చెప్పకేం, దూరదృష్టిమీదేవచ్చింది, బారసాలలు, కుటుంబాలు అంట్లు. ఇక్కడ అంటుకట్టడానికే వచ్చిందది. అంటకట్టడానికి సిద్ధంగా ఉన్నావు నువ్వు."

"సిద్ధంగా ఉండకేం, వెటకారంగా మాట్లాడ్తా రెందుకు. పూలు అన్నా పూలమొక్కలన్నా యిష్టంలేనివాళ్ళుంటారా? అది పుష్పజాతుల అందాలు చెప్తోంటే వినాలి, చూడాలి. దానిబుగ్గలకు రంగువస్తుందండీ"

"దాన్ని పొగడ్డానికి నీకంఠానికి ఖంగూ వస్తుంది" అన్నాడు.

"ఎక్కడో లాకులదగ్గర చూచిందట. చెట్టంతా పువ్వేనట కుంకం చల్లినట్టు. మరోచెట్టు చెప్పింది. తంగేడుపొదరులా నిండాపూస్తుందట. పూసినపుడా చెట్టు, పండుముత్తయిదువులా గుంటుందట. ఎంతముద్దుగా చెప్పిందండీ సౌమ్యం."

"వినేవాళ్ళున్నకొద్దీ వస్తోంటాయిలే ముద్దుమాటలు," అన్నాడు శాస్త్రుర్లుగారు.

సీతమ్మగారు మరో రెండడుగులువేసి, "యిల్లారాండి" అంది.

"ఇక్కడినుంచే కన్పిస్తున్నాయే, పోనిద్దూ" అని, అంతలో "తెలియకడుగుతాను, యివ్వెందుకే! ఈమాచరమ్మలు దొడ్డంట. పువ్వాయెఱుగవు. కాయ ఎఱుగవు. నువ్వు తల్లోపెట్టుకోడానికీపనికిరావు, నాకు పూజకూ కావు. పోదుగుసుప్పతైనా విస్తళ్ళకు పనికొస్తై. ఈగొడ్డుమోతుమొక్కలెందుకే, నీళ్ళుతోడడం ఖర్మంకాకపోతే," అన్నాడు రామశాస్త్రుర్లుగారు, క్రోటన్లనుచూచి పెదిమవిఱిచి.

"మాచరమ్మలంటే ఏమిటా అనుకున్నాను. అందం ఎఱక్కపోతేసరి. గొప్పవాళ్ళు మేడచీడీలమీద, కిటికీకుండల్లోను, అపురూపంగా పెట్టి పెంచుతుంటారంటే వాళ్ళేమీ తెలియనివాళ్ళూ, మీరే మహ తెల్సినవారున్నూ. అందం," అంది, వెటకారంగా.

"యేమో. అవ్వి ఫరంగీసంప్రదాయం. కిరస్తానీ మతాలవాళ్ళవి. అవ్వెందుకీ బ్రాహ్మణింట" అన్నాడు. శాస్త్రుర్లుగారు.

"ఇది బాగుంది, ఎవళ్ళైనా వింటే నవ్విపోయేరు. మొక్కల్లోకూడా బ్రాహ్మణమొక్కలు, కిరస్తానీమొక్కలూనా, ఓ శేటిక్క మీకు" అంది సీతమ్మగారు.

"పోనీ, తులసికోట చుట్టూ ఉల్లితోట పెంచండి నువ్వూ ఆదీను. నాక్కూ కావాలి" అన్నాడాయన.

"నాలుగు మొక్కలు మనదొడ్లో వేసినందుకే నా కుమారిక కీరోష్టు. పాపం దానికేం తెల్సు. ఇంకా ఏవో అపురూపపు జాతులను పెంచాలని, వచ్చేటప్పుడు, ఆపూలచెట్ల విత్తనాలను ఒకపూదోటకత్తిర్ని పట్నాన్నుంచి తీసుకురావలసిందిగా అబ్బాయికి ఉత్తరం వ్రాయించమంది. వెర్రిపిల్ల" అంది సీతమ్మగారు.

"ఆ! ఆ! వాడిమాట తలపెట్టిందీ, యిహనేం. ఇది ఎంతకైనా తగిందేనే. వెర్రిబాగులా, పాపం! మనమా, అదా! అనుకున్నంతా అయింది, నా కూరికే 'డా' చేయదే" అన్నాడు.

"విత్తనాలమాట అది అబ్బాయిక్ ఉత్తరం వ్రాయమంటే, మీరు తేలుకుట్టినట్లు అదరిపడ్డా రెందుకండీ?"

"విత్తనాలేనే, నీయిల్లు ఏవో కాను, మొక్కలు, వృక్షాలు, మహావృక్షాలు అయ్యేది, స్త్రీపురుషులమధ్య."

"మనసుఖానికి మనయింటిశోభకు అది పడ్తోన్నశ్రమ ఏమిటి, మీసణుగేమిటి? ఎండలేదు, కొండలేదు, దొడ్లో వేసిన మొక్కలన్నిటినీ, ఏపూట కాపూట, మనదొడ్డివెనకనున్న పిల్లకాల్వనుంచి నీళ్ళుతెచ్చి తడుపుతోంది. ఒండ్రు మొక్కలకు బలమంటుంది ఇంకోటి 'మర్రిచెట్టుసహితం పిల్లకాల్వ వంచ వరకు మనదేనమ్మగారు. మరెవరిఖ్యా ధరినిలేవు. అటుఊరు లేదు. అదెక్కడకూ దారికాదు, పరులొస్తారనడానికి. అదిమనం వాడుకుంటే ఎవరిదేం పోయింది! మూడురుప్పలడ్డం వచ్చాయని అంతసౌందర్య సంపదను వదలుకోడం, ఎంత చేతకానిపని' అని వాటిని కొట్టేసింది. 'ఎందుకే ఎండనుపడి' అన్నా వినుపించుకోదు. నిన్న నీరెండవేళ, యిట్టే అటుచూచా, అమ్మాయియా కుమారికా మర్రిఊడలను ఉయ్యాలలా బిగించి దాల్లో ఊగుతో, మధ్యమధ్య పిల్లకాల్వలనీటిని కాళ్ళతోచిమ్ముతో, కల

కిలనవ్వుతో కబుర్లుచెప్పుకుంటున్నారు. వనకన్యల్లా ఉన్నారంటే నమ్మండి. నెల కింతఖర్చు పెట్టేమాత్రాన అమ్మాయిణీ కిలాంటిసుశిక్షణ గఱపగలం? ఆమఱ్ఱిచెట్టు, దానినీడను లోతురేనిప్రవాహజలం. వేలు లక్షలు పెట్టి కట్టిన జమీందారి యింటికైతేమాత్రం, కావాలంటే వొసుకుతాయా? మనయింటిఅందం నిన్న తెలిసింది. కుమారిక మనకళ్ళు తెఱచిందండీ" అంది సీతమ్మగారు.

"మనఅమ్మాయికళ్ళు మూయగలదే అంతఅందంగానూ" అన్నాడు శాస్త్రుగారు.

"పోనిద్దురూ ఎంతఅందం సొమ్ముచేసుకోలేకపోయాం అనిపిస్తుంది" అంది ఆవిడ.

"అమ్మాయి దీనిఅందం సొమ్ముచేసుకోకుండా మానదు" అని నసిగాడు రామశాస్త్రుగారు.

వినిపించీవినిపించకుండా "అమాటలేమిటి?" అని భర్తనంటూ "'ఇంత అందం ఎప్పుడు తెచ్చావే' అని కుమారిక నడిగా. అమ్మాయిణిమీద ఎంత ఆపేక్షో, 'దీనిఅందం యిప్పు డేమిచూచారు. అమ్మాయిణీతో ఉయ్యాల్లో నెక్కూర్చుంటే అందమేమనంది. పెండ్లిలో ఒకసాయంత్రం వధూవరుల నీఉయ్యాలలో ఊపి వేడుకచెయ్యాలండీ. పెండ్లివారి స్త్రీలనందరిని యిచ్చటకు రప్పించి, ఈవేడుక చేస్తానని మాటయివ్వండి' అని కోరిందిలు 'సరేనమ్మా' అంటే ఆపెకళ్ళు అశ్రుసిక్తాలైనై."

"ఒహో! ఇదేదో తయారుతిన్న చెయ్యేనేవ్. ఒకపూట వధూవరులు ఉయ్యాలలూగి, వాళ్ళదారిని వాళ్ళు బళ్ళుఎక్కినతర్వాత, అమ్మాయీ, తనూ ఊగాలనకలేదు అది చూచుకో" అన్నాడు శాస్త్రుల్లుగారు.

మాట్లాడుతూ వారుభయులు మఱ్ఱిచెట్టుదగ్గరకొచ్చారు. హాయిగా, దక్షిణపుగాలి అందుకొంది. సీతమ్మగారితో మాట్లాడేటప్పుడు, ఒహాపుడు శాస్త్రుగారిబాల్యంలోని చిలిపితనం పొటకరించుచుంకలదు. చెణుకులు, చలోక్తులు చిలకరిస్తోంటాడు.

"చంపేశావే నన్నిక్కడకు తోడుకొచ్చావు, తీరికూర్చుండి. ఇట్లాంటి ప్రకృతి శోభ మృతకాము సంజీవన మవుతుం దట, ఏ కాశీమజిలీ

కథలోనో చదివాను. తరులతాగుల్మాలు, పూలవాసనలు, మలయపవనాలు, సెలయేటిగానాలు, నువ్వు వినిపిస్తున్నావే, యిష్వంటి కాంతామనోహర వాక్యాలు, ఆ వినవస్తోన్న పికకోకిలాలాపాలు, యిట్లాంటిచోట తిరిగితే ప్రవరాఖ్యుడంటివాడికీకూడా మతిపోతుందట.”

“అబ్బో ఏమిప్రవరాఖ్యులండీ! చెప్పి చెప్పి మిమ్మల్నే చెప్పాలి” అంది ఆవిడ.

“ఏనాటిమాటట్టుకొని ఈనాటిదాకా చెప్పుకున్నావే” అని కాస్త తేలిపోయాడు శాస్త్రుల్లగారు.

ముభావంగా ఉండలేకపోవడంకూడా ఈపరిసరప్రభావమే కావచ్చు నేమో!

వెనక్కు తిరిగిరావడంలో ప్రక్కదొడ్లోని పశువులపాకకేసి చూస్తో “అదేమే, పశువు లలాగ గోలచేస్తున్నాయి” అన్నాడు శాస్త్రుల్లగారు.

“ఆ గొడ్లన్నీ లోపలిగుమ్మంలో ఉన్నకుమారిక వాటికంటబడిందేమో. అదికనిపిస్తేచాలు పట్టపగ్గాలుండవు వాటికి. పరుగు పరుగున కుమారిక వాటి దగ్గరకెళ్తే, ముట్టెలామట్టునే దానిచేతులమీద వేసి కళ్ళువప్పగిస్తై. కుమారిక వాటితో మాట్లాడుతోన్నట్టు, అవ్వి ఆలకిస్తోన్నట్టు తోస్తుంది. అది వచ్చినతర్వాత మనబక్కమూపాలు మక్కలైనాయి. రెట్టికిరెట్టి పాలు యిస్తోన్నాయి. సంపూర్ణాహారమిచ్చేగోమాత అంటో మనఆవును ‘సురభి’ అని పిలుస్తుంది. నిత్యం గోపూజ అమ్మాణికి కుమారికకు కార్య కలాపంలోదే అయిందె. ఎంతలో అవన్నీ కుమారికకు మచ్చికైనై. ‘పక్షుల తల్లి వినత’ అంటో అమ్మాణికి కథచెప్పింది. పశుపక్ష్యాదులయందు ఎంత ప్రేమాదరాభిమానాలు చూపుతుందో చెప్పలేను. కుమారిక భూతదయ, చనువుపెంపులు యేమోకాని, మనపశువులు పదిరోజుల్లో నన్నుమఱచి పోనా! పేదవాళ్ళం ఏమిపెట్టి పుట్టామోకాని మనకీపెన్నిధి ఏలా దొరికింది అనిపిస్తుంది” అంది సీతమ్మగారు.

“పిల్లనాణెంచూచే నే వనేదీను, మనఅబ్బాయి మన్ని మఱచిపోకుండా చూడు” అన్నాడు.

ఇక సీతమ్మగారు కోపంపట్టలేక, “గంటనుంచిచూస్తున్నా, ఒక్కవర

సనే కోతిపట్టాడు అబ్బాయిని. పంతంటి కుర్రాడు, గ్రామంఅమేపా వాణ్ణి తలమీద పెట్టుకుంటూరు. ఏదో వాడిమీద పగపట్టినట్టు కన్పిస్తారు. ఇక యీపిల్ల సహృదయత, దైవభక్తి, భూతదయ, జ్ఞానంఏమిటి! దాని కాలిగోటికిసరిపోము, యీసందావాక్యా లేమిటి? మంచిచెడ్డలుహరిస్తేనే గాని శిష్టులం కామనుకుంటున్నారులాగుంది, మీవరస" అని చర్రుమంది.

శాస్త్రులుగారుకూడా, కరకరా చూస్తో "నీకు చెప్పకుండక పోవడం నాదే లోపం. నీవు బెంబేలుపడ్తావని నీకు చెప్పలేదు. అబ్బాయి కాలేజీలో ఏదో వర్ణాంతర, కులాంతర వివాహాలు చేయించాలని ప్రచారంచేస్తోన్న సంఘానికి 'సెక్రటరీ' యట. వాడి ఆధ్వర్యంలో అయిదారు ఆబాపతు వారి సంకరంపెళ్ళిళ్ళు అయాయట. మనవాణ్ణి 'అదృష్టినుంచి మళ్ళించడం ఏలారా దైవమా' అని నేను కాదామపడ్తోంటే, 'ఈపిల్ల పెన్నిధి' అంటో నువ్వు లేవదీస్తివి. నీకుపుణ్యముంటుంది వాడిదగ్గరఅనబోకు. శలవులకింటికొచ్చి, అమ్మగారి ధైర్యంచూచుకొని, 'హైసరుమజ్జా దీన్ని చేసుకుంటా' ననగలడు. యర్రగాబుర్రగా ఉంటేసరా, దీనికులగోత్రాలు మనికి తెలియవు. అసలు వాడే దీన్ని ఎక్కడో ఏరుకొచ్చి, ముందు మన్ని మచ్చిక చేసుకొని మనయింటివద్ద ఉండమని పంపించి ఉంటాడు. అందుకే యి దిక్కుడె యిన్ని లబ్జు లేస్తోంది. ఈగ్రామంలో యింతమంది కోటీశ్వర్లు మేడలుమిద్దెలు ఉన్నవాళ్ళు, భూకామందులు, దాసదాసీజనం కావాల్సిన వాళ్ళు ఉంటోంటే, వెతుక్కుంటూ, మనపర్ణశాలకే ఎందుకు రావాలో కూడా అడక్కుండా, ఇంట్లో పెట్టుకుకూర్చుంటివి. మనకుచచ్చీచావు వచ్చింది. ఇదేదో మనఅబ్బాయి నాటకమే. ఏదోఆదర్శవివాహం, సంకరం, మాలకూడు వెలిగిద్దామని, యీప్లాట్ వేశాడని నా 'డౌటు'. ఆమధ్య ఉత్తరంలో ఏంవ్రాశాడోచదివాగా నీకు. 'అమ్మగారు పెద్దదవుతోంది. చాకిరీచేసుకోలేదు. బ్రాహ్మణ్యం అంటో దూపలకు గ్రాసంకూడా మడిగట్టుకువెయ్యాలంటావు నాన్నా. ఇంటివాడకపునీరంతా, ఆవిడే తోడుకోవడం పెద్దవయస్సులో ప్రమాదం. దేశంలో ఎక్కడామానుకున్న ఈహింస మనయింటినే పట్టి వేళ్ళాడ్తోంది. అర్థరహితబాహ్యాచారాలన్నీ అనర్థంట. అబ్బోభాషవెలిగించాడు మొగాడు. శుభ్రమైనదాసీని కుదుర్చు

కోవడం అవసరం. యీ పాటికి ఆగుష్టి మీద ఉంటే శుభ్రమైన మనిషి చాకిరీకిదొరక్కపోను. శరీరాన్ని హింసపెట్టమని బ్రాహ్మణాదేశం ఎన్నడూ కాదు. మీకు నేను చెప్పగలిగినవాణ్ని కాను' అంటూ వ్రాశాడుగా. ఎప్పుడు వ్రాశాడో తెలుసా? ఆ తేదీలు తర్జుమా చేయించా, రామశాస్త్ర్లం చేత కానివాడు కాదు. రేపు ఫైల్లుండే పరీక్షలనగా వ్రాసిన ఉత్తరం. అదటుంచు. బ్రాహ్మణాదేశమంటూ ఏదో వ్రాశాడు. ఆమాటలోనే వ్యాకరణదోషం ఉంచన్నాడులే అవధాన్లు. వీడికి తెల్సు మహా. బ్రాహ్మణాదేశమేమిటో, ఆచారాలేమిటో. నక్కపుట్టి నాలుగు ఆదివారాలు కాలేదు. వీడు నాకు చెప్ప వస్తాడు. ఆర్షమతప్రబోధానికి ఆదిశంకరులు అవతరించాడు, ఏలాగైతేం, వీడూ, వీడి సంకరంపెళ్ళిళ్ళూనూ.”

“మరీ తల ఆడించకండి. ఆకుందనాలకు చెవిదిగువన చూపువాసైనా పట్టులేదు” అంది సీతమ్మగారు.

“ఇంత సుపుత్రుణ్ని కన్నాక, కుందనాలూ చెవినుంచి లాగేసుకోవాలి. దేవతార్చన సంచీలోంచి సాలిగ్రామాన్నీ లాగేసుకోవాలి. సాలిగ్రామాలగనిలో గులకరాయి పుట్టినట్టు ఎప్పంటి శ్రోత్రియకుటుంబంలో ఏలాంటి అపాంక్తేయుడు పుట్టుకొచ్చాడు! చుట్టూ ఎంతమంది మాలకూడు తింటోన్నా, ఏళ్ళేఏళ్ళు అవ్యవహితంగా, యీగవాలకుండా బ్రాహ్మణ్యాన్ని కాపాడుకొచ్చాను. అగ్నిహోత్రాలు ఆరనీయలేదు కొంపలో. తరతరాలనుంచి పేరెక్కిన నిప్పువంటి వంశం మనది. ఆనిప్పు మీద నీళ్ళుచల్లేవాడు, మనయింటనే ఉద్భవించాడు పుత్రరత్నం. పీడా పాయె” అంటూ కళ్ళల్లోనుంచి స్ఫులింగాలు కక్కాడు. “ఆ! ఆ! ఉత్తరం ఏంమాతృభక్తిపూరితం పైకి. లోపల ప్రతీఅక్షరం వేదనింద కక్కేదే. రాల్చేది రాలుస్తో, నీకు నేను చెప్పదగ్గవాణ్ని కానంటూ, చూచావా అనక్కవినయం. ‘నీకొచ్చినవిళ్ళకు నీకు తెలియాలిగాని ఓళ్ళుచెప్పనా, కుర్రాళ్ళుకూడా చెప్పాల్సిరానా' అని వ్యంగ్యం ఒకప్రక్క. రామశాస్త్రుల్లదగ్గరా వీడి నక్కజిత్తులు! రామశాస్త్రుల్ల పేగులు తోడేస్తాడు. తారీఖులు తర్జుమా చేయించుకొని కూర్చున్నాడు అని ఎరుగడు పాపం. రెండురోజుల్లో కుమారిక వస్తుందనగా ఈ ఉత్తరం వస్తే

ఏమనుకోను ? అప్పటికి ఇంతగ్రంథం ఉత్తరం వెనక పేరుకుందని మనం కానలేము. ఏమైతేం, వీళ్ళఆటలు సాగనిస్తే, బ్రాహ్మణ్యం గంగలో కలుస్తుంది. అదితథ్యం " అన్నాడు రామశాస్త్రుల్లుగారు.

"మీరూ, రావిచెట్టుకింద అవధాన్లుగారూ తీశారు యింతగొప్ప అర్థం వాడిఉత్తరానికి ! ఎవరికతోచను ! నిజమే అనండి తండ్రికిచాలిన కొడుకన్నమాట. ఎవళ్ళవీపుమీదమచ్చ వాళ్ళకు కన్పించదు లేండి. పెళ్ళాం బిడ్డలులేని ఎండిన మాగాయి పేడు ఆ అవధాన్లు. వాడికి కనికరం ఏముంటుంది ? ఒట్టినే పచ్చగానున్నవాళ్ళను చూస్తే కళ్ళల్లో నిప్పులోసుకుంటాడు. వాడేదొరకాలి మీకు సావాసం. కర్మకాకపోతే. అంత గంగలోకలిసే బ్రాహ్మణ్యం, మీరిద్దరు మోకాళ్ళఅడ్డంపెడ్తేఆగుతుందట! అంతవిపత్తే వస్తే కుమారిక శూద్రాంగనే కాదు. పనిగట్టుకు మనం అంటే తప్ప, ఎవ్వరూ కుమారికను శూద్రస్త్రీ అనుకోరు. అగ్రహారంలో ఏబ్రాహ్మణకన్యకు దీని సంస్కారముందో, వేలుమడిచి ఒక్కర్తెను చెప్పండి చూతాం. మనబ్రాహ్మణపిల్లలకు నాజూకులు బలిసిపోయి, అది వళ్ళుపట్టినంతచాకిరీ చేస్తోంటే, 'పనిమనిషి' అనీ, 'సైరంధ్రి' అనీ లేవతీశారు. ఈ కిట్టనిమాట పుట్టించింది మహిళామండలి పిల్లలు. వాళ్ళు ఏమిచదువులు వెలిగిస్తున్నారో, ఒక్కళ్ళకు జీవితలక్ష్యమన్నదిలేదు. ఇదొచ్చిన రెండ్రోజులనుంచే వాళ్ళకు దీనిమీదకంట్రకం. ఇదొచ్చిన తర్వాత అమ్మాణీ మహిళామండలికెళ్ళడం మానేసిందని దీనిమీద కక్ష. ఎదరబడి ఏమీ అనలేరు. దీనిముందు తామంతా నిస్తేజులైయ్యామని వాళ్ళకు ఈర్ష్య. దీని కేవిషయంలో చాల్తారువాళ్ళు ! అంచేత, చేతనైంది చెవులు కొరుక్కోడం. దీన్ని శూద్రస్త్రీ అనడంలో ఉన్నరహస్యమది," అంది సీతమ్మగారు.

"ఎవళ్ళో శూద్రస్త్రీ అన్నారని వాళ్ళమీద కాకపడ్తావు. ఏదో రహస్యాలోచనంటగడతావు వాళ్ళకు. ఈఒడ్డూ, పొడవూ, ఈశరీరం దార్ఢ్యం, ఏబ్రాహ్మణపిల్లకుందే మననాటున. నిశ్చయంగా అవధాన్లన్నట్టు, ఆతడు సాముద్రికంలోఘట్టివాడు, ఛండశాసనుడు. చూస్తోపోల్చెయ్యకలడు. ఇది క్షత్రియకన్యో, వెలమదొరలకన్యో కావాలి. పోనీ మనపంక్తిని దానికి

ఏ సమ్మ్ఫ్టవడ్డించవో ఆరహస్యం నువ్వు చెప్పరామా'' అన్నాడు రామశాస్త్రుల్లుగారు.

"ఒరులు చూస్తుంటే భోంచెయ్యనని దాని నీమం. అది తన నీమమని ముందు చెప్పే ప్రవేశించింది. శూద్రుల పంక్తినీ భోంచెయ్యదు. దాని నీమాన్ని మీ నీమాల్లాగే పాటిస్తున్నాను.''

"ఈ విరుద్ధ నీమ మేమిటే '' అన్నాడు.

"ఏమో నే నడుగలేదు. భోంచేస్తే మాట్లాడనని వాళ్ళను ఎందుకు మాట్లాడేరని అడుగుతానా? ఇవాళ శనివారమంటో, అరడజను రకాల పండ్లను మీరు తెప్పించుకుని కాజేస్తోంటే, 'పాపం అంత బాధపడ్తా రెందుకు?' అని అడిగానా? ఎవళ్ళ నీమాలు వాళ్ళకు సవ్యంగా కని పిస్తై – కావలసిన వాళ్ళయింటికి పెళ్ళికెళ్ళినా, 'స్వయంపాకి'నంటో వాళ్ళ యెముకలు కొరుకడం మీకు సవ్యమున్నూ, దీని నీమము అపసవ్యమున్నూ అయిందా? కులాన్ని పట్టి ఒక్షరా పొడుగు లుంటాయనడం మరీ చిత్రంగా ఉంది. ఈ పేచీలు తెచ్చే మాటలు ఎక్కడా అనకండి మీకు పుణ్యముంటుంది'' అని చెండుకుంది సీతమ్మగారు.

"అయితే, ఈ త్రిశంకుస్వర్గవాసినిని ఏమనుకోవాలే మనం? వచ్చినట్లే వచ్చి ఎంతక్లిష్టసమస్య మనమెడకు చుట్టి కూర్చుందే'' అన్నాడు.

"మనకొచ్చిన సమస్యే ముంది! మీరు చేస్తే రావాలి దానికి త్రిశంకు స్థానం. నెలరోజులో, నెలాపదిహేను రోజులో ఉండి వెళదామని వచ్చింది కాని అగ్రహారంలో ఖాయంగా ఉండేది కాదు, వదలిపెట్ట లేక మనం అపుచేస్తే యేమో కాని '' అంది సీతమ్మగారు.

"సరి యిదోటా? 'వసుల్చుకోవడం ఏలారా భగవంతుడా' అని నే చూస్తుంటే ఆపు చెయ్యడం కూడానా?'' అన్నా డాయన.

"ఏమోలేండి, ఎవరు చూడవచ్చారు. ఏంజరుగుతుందో'' అని ఋచ్చితంగా అంది ఆవిడ, అటుతిరిగి.

రామశాస్త్రుల్లుగారి ధర్మత్వాని కిదో ధిక్కారంలా ధ్వనించి, ఆగ్రహావేశపూరితుడై "మీశషభేషలాట్టే నాయింట్లో వప్పుకు నేవాణ్ని కాను, ఏమను కుంటున్నావో! ఇదిగో చెప్తున్నా వినుకో. ఆహితాగ్నుల కొంపలో పుట్టిన

వానివి. ఆహితాగ్నుల కొంప పెట్టినవానివి. మీ నాన్నగారు వేదం తలక్రిందులుగా చదివేవారు. నిరంతర కర్మకలాప నిమగ్నులు. చత్వారింశత్సంస్కారాలకు ఎంతో ప్రాధాన్యత యిచ్చేవారు! పిల్లలు శోషవచ్చి పడిపోయినా, ఆయన అగ్నిహోత్రాలై అపరాహ్ణం తిరిగే వరకు ప్రాణాహుతులు లుచ్చుకోనే వాడా? కర్మానుష్ఠానంలో దయదాక్షిణ్యాలు ధరిమానా రానిచ్చేవాడా? దినమంతు భోజనా లుండవని ఎంతకీర్తి ఎంతకీర్తి, ఆర్జించి పోయాడు. అబ్బాయిని ఇంగ్లీషుబడిలో వేశానని, 'రామశాస్త్రుర్లూ! మరీ మడీ మైలా లేకుండా పోతున్నావురా' అని, ఆయన నన్ను దండూరా చేస్తే అప్పుడాయనతో తాళం వేశావు. ఇవాళ అబ్బాయి వర్ణాంతర వివాహం చేసుకుంటానంటే వీడికి తాళం వేస్తావు. ఇప్పుడు చెప్పు. మడీ, మైలా లేకుండా పోతున్నది మీరా నేనా?" అని చెప్పాడు రామశాస్త్రుర్లుగారు.

"ఆట్టే నన్నూ మావాళ్ళనూ అనకండి. అంతబాధగా ఉంటే మీ సంతాన్నం ఇల్లా తయారైందని సరిపెట్టుకోండి." అంది.

"అక్కడికి నీసంతాన్నం కాకపోయినట్టు!" అన్నాడాయన.

"నీ, నా, తగవులతోనే అయింది నా ముప్పైఏళ్ళ కాపురమున్నూ" అని సీతమ్మగారు కంటతడి బెటింది.

ఆవిడ అశ్రులు రాల్చడం చూడలేక అస్తమించాడు సూర్యుడు.

పగలు రామశాస్త్రుర్లుగారి మాటలు శృతికి కటువైనా, ఆయనగారు భార్యతో చేసే సాయంసమయ సంభాషణల్లో, పట్టువిడుపులున్న వాడి లాగే కన్పిస్తాడు. ఆవిడ కంటతడిబెట్టడం కీడని ఒక భయంఉంది. కొద్ది రోజులుండి వెళ్ళిపోయే పరాయి పిల్లవిషయం యిపుడు యిల్లాలితో విరస మెందుకొచ్చిందనుకున్నాడో, ఇంతకు భగవద్విలాసం ఏలా జరగనైఉందో, మనం ఎంతతన్నుకున్నా అలాగే జరుగుతుందనుకొన్నాడో, కుమారిక గుణవిశేషాన్ని గురించి భార్య చెప్పిన మాటల్లో ఒక్కమాట పొల్లు లేనపుడు ఆవిడతో కలహించడానికి యిప్పుడు ఏమంత తొందర వచ్చిందనిసరిపెట్టుకున్నాడో, ఆపెతో సమాధానాయత్తంలో ఉన్నాడు. ఎంత కోపమైనా ఆవిడమఱచిపోయే మంత్రం ఈయన దగ్గరుంది. అంచేత అంటాడు.

"మరిచిపోయాను. కబుర్లల్లో పడ్డాం. కందా, బచ్చలి కూడా వేశానని, ఎక్కళ్ళినా వెంకలకడే భోజనానికి రావల్సిందని చెప్పావు. యిందాకా వీధులో కెడ్తుంటే. మరి వడ్డించు లేస్తున్నా. ఈవేళ తెలియాలి సీతమ్మగారి నల భీమపాకం మజా," అంటూ లొట్టలేస్తూ నూతిదగ్గర కెళ్ళాడు శాస్త్రుర్లుగారు.

రివ్వున ఒక్క అడుగులో వంటింట్లోకి వెళ్ళిందావిడ.

భోజనకాలంలో శాస్త్రుర్లుగారు కూర యినమారు వడ్డించమన్న పనులో, "పక్కగ్రామంలో ఫలానివారి సంబంధముందట, ప్రొద్దున్నే వెళ్ళరాదండీ," అనికూరవడ్డిస్తూ అంది.

కూర కలుపుకుని అప్యాయతగా ఆరగిస్తూ "దివ్యచకోరంగా," అన్నాడు శాస్త్రుర్లుగారు.

"కూరమాటకాదండీ నేనన్నదీ" అంది ఆవిడ.

"ప్రయాణం మాటే నేనన్నదీ" అన్నాడు ఆయన.

---

# 6. రామశాస్త్రుర్లుగారి ప్రతాపాలు

రామశాస్త్రుర్లుగారెక్కడికి వెళ్ళివచ్చినా ఫెళఫెళార్భటులతో ప్రవేశం. ఆయనగారి రాకపోకలు, యింట్లో వాళ్ళకే కాదు, వీధిచివరికంటూ తెలుస్తై. శాస్త్రుర్లుగారు తలుపుకొట్టి కేకవేస్తే, చిరకాలాభ్యాసంచేత, శృంగార రౌద్రాది నవరసాల్లో ఏరసవిశేషం అప్పటి శబ్దబ్రహ్మంలో ప్రకాశించి ఉందో, సీతమ్మగారు సునిశితంగా పసికట్టకలదు. చతుర్వేది సంబంధ నిశ్చయానికి వెళ్ళివచ్చిన రాత్రి యింట్లోవాళ్ళకు వీధిగుమ్మంలోనుంచి వినబడ్డవి సాధారణతలుపు చప్పుళ్ళూ కాదు, కేకలూ కావు. కేవలం జయ జయధ్వానాలు. సంబంధనిశ్చయం శాస్త్రుర్లుగారి ప్రయోజకత్వం కాదనీ తెల్సు, కాస్తకు, కూస్తకు దర్పాలు కొట్టే శాస్త్రుర్లుగారి ధోరణీ తెల్సు సీతమ్మగారికి. జయం సిద్ధించిన సంతోషసమయం కాబట్టి, ఈయెదనులో,

శాస్త్రులుగారు ప్రదర్శించబోతోన్న అతిశయాన్ని, పల్కబోతోన్న ప్రతాపాలను పరిహసించాలనే అభిలాష సీతమ్మగారికి గిలిగింతలు పెట్టింది. ఆమ్మాణీ కుమారికలు కూడా ఆపటును గ్రహించినట్లే కన్పిస్తారు. అంచేత, నేటి వాగ్రీతి, సాధ్వి సీతమ్మగారి సహజ ధోరణి కాకున్నుండీ !

"ఏమే, ఏమే, ఏం చేస్తోన్నట్లు, యింటో ఎక్కడ పాతుకుపోయావు" అంటో వీధితలుపు తెగబాదుతోంటే, "లోపలినుంచి వచ్చేలోపలే తలుపులు బ్రద్దలుకొట్టేసే హడావుడి ఏం వచ్చిందండీ, కాకపోయినా" అంటో సీతమ్మగారు గడియతీసింది.

"అవును, తలుపులు బ్రద్దలుకొట్టుకు రావాలికాని, ఏవేళకూ తియ్యవుగా !"

"వంటింట్లో మనిషి వాకిట్లోకొచ్చే వ్యవధేనా లేకుండా అధికారమంతా నామీదే చూపెట్టనా ?"

"పొరుగూరు వెళ్ళొచ్చిన మనిషి, సీతమ్మగారి భాంవేషం శాంతంగా, సుందరంగా తెరమీద కొచ్చేదాకా, వీధిగుమ్మంలో నిలువజీత ముంటా ననుకున్నావా ?"

"గుమ్మానికి అరుగులున్నాయి కదా అనుకున్నాను లెండి"

"వాకిట్లో కుర్చీలు అందాని కా అనుకున్నానులే" అని మాటకుమాట.

"ఇవాళ యిది నాకు కొత్తేమిటి, ముప్పై ఏళ్ళ కాపురం"

"మూడేళ్ళ కాపురమైనా, ముప్పైఏళ్ళ కాపురమైనా ఒకటే, మొగాడికి రొమురుగుండావచ్చి యింట్లోకి తీసుకువెళ్ళే యోగం కలుగక పోయిన తర్వాత."

"పోనీ యిహ యిక్కడనుంచి, మీరువచ్చే రోజున యింటిల్లిపాదీ యింటికి తాళాలేసుకువచ్చి, ఊరి చివర ఏచెట్టుక్రిందో కూర్చుంటాం లెండి."

"మీ రెక్కడా కూర్చోనక్కఱలేదు. నేనే అరుగుమీద అంగాస్త్రం పరుచుకొని, రైలుసంచీ తలక్రింద పెట్టుకొని, మందగమన సీతమ్మగారెపుడు తలుపు తీస్తుందో, అపుడే లోపలి కొస్తాను."

దొడ్డిగుమ్మంలో కాళ్ళుకడుక్కోడానికి నీళ్ళచెంబు దానిపైన తడి

అంగవస్త్రం. లోగడపలో కాశీచెంబుతో మంచితీర్థం పెట్టింది.

రైలుసంచీ పంకకు తగిలించి, "కల్యాణమొచ్చినా కక్కొచ్చినా ఆగదు. వట్టుప్పుడు ఏమితన్నుకుంటే ఏమిలాభం" అంటూ కాళ్ళు కడుక్కుంటున్నాడు రామశాస్త్రులుగారు.

"అయితే యీ సంబంధాన్ని తిన్నేసుకొచ్చి కల్యాణమింకా రాలేదనుకద. యింతకూ వెళ్ళినపని కాయో, పండో. ముందామాటచెప్పండీ. మీకు పుణ్యముంటుంది."

"అవును, నేను తన్నేసుకొచ్చేవాడిని, నీవు మహా నిష్ఠచేసేదానవు. ఇంట్లోకూర్చుని కబుర్లుచెప్పడంకాదు పెళ్ళిమాటలంటే" అన్నాడు రామశాస్త్రులుగారు, చెయ్యి అటూయిటూ ఘూకుడుగా జోకాయిస్తో.

"కబుర్లు కాకపోతే కొట్టుకోడాలు కాబోలు. నాకు తెలీసులేండి. ఇల్లుబయల్దేరినవేళనుంచి, అలా అనుకుంటూనే వెళ్ళారు కాబోలు, చేబోలారితో పెళ్ళిమాటలకు. ఫలితం, జుట్టూజుట్టూపట్టుకొచ్చారుగా. అస ఒంధం, 'ఎందుకు చెడింది!' అనిఅడిగితే, నానాహంగామా చేస్తిరి. దాని కడుపుచల్లగా, వాళ్ళసోపెమ్మ మీ రక్కడ వినిపించిన గ్రంథమంతా చెప్పింది. నిర్ఘాంతపోయాం."

"చెప్పిందీ. ముందు జుట్టట్టుకొన్న దెవరంది !"

"ఇహ పరీక్షిల్లా అముందు వెనక లెవరయినా, మీరు అందాకా ఎందుకు తేవాలి అనికాని. చక్కగా చిలక్కు చెప్పినట్టుచెప్పి పంపించిన సంబంధా లెన్నో యింత అందంగా చేసుకొస్తిరి — అందుకు అన్నాను."

"ఆడాళ్ళు త్రేలుపెట్టిన వ్యవహారాలు అంతకన్న ఏమవుతాయను కున్నావు, ఒహాపుడు ? నీవు కలగజేసుకున్న సంబంధాలన్నీ అలాగయి నాయికాబట్టే, అవి చెడిపోయినై కాబట్టే" అని ఆయన అంటోంటే "చూచావుటే, అమ్మాణీ. తిగువు పెంచుతారు కాని, తుదిమాట చెప్పరు" అంది.

"నానోటంట మొదటిమాటరానిచ్చావు కనకనా, తుదిమాట నీకు నేను చెప్పడానికి" అంటాడాయన.

"ఇంతసేపటికి తీరా నాన్న నాలుకకొసకు అసలుమాటవస్తోంటే నువ్వు అడ్డువచ్చావే అమ్మా" అంది అమ్మాణీ.

"ఛీ. అదీమాట చంటిపిల్లఅయినా ఏవదుప్పులో ఏమాటనస్తుందో, హానిమాత్రం నీకు తెలియలేదు."

"అదేం చిమ్మన్ని మెచ్చుకోలేను. ఏవేళకూ అసలుమాట మీనాలుక మీదకురాలేదండి. అదీ దానిఅర్థం. ముద్దుగా ఒక్కమాట చెప్పడానికి యిన్నిపదువులు, మారామాస్కి, మధ్యవర్తిత్వాలు కావాల్సిరానా, అన్నా." అని బుగ్గలునొక్కుకుంది సీతమ్మగారు.

"ఒక్కమాట వినుకించుకోడానికి నాపిత్రుప్రప్పితామహులంతా దిగిరానా" అన్నాడు రామశాస్త్రుగారు తలదగ్గరనుంచి కాళ్ళకంటా చేతులు లాక్కుంటో.

"పోనీ లేతురూ, మీరు చెప్పనూ అక్కఱలేదు. నేను విననూ అక్కఱలేదు. ఇదో అల్లరికూడా ఎందుకొచ్చిందో. లేనిది ఏలాగూ లేదు."

"అక్కె లేదు లేదని మూలక్కు. పైన తథాస్తుదేవత లుంటారు. లేదో, ఉందో ఏమి విన్నావని, లేదని పరిష్కారం చేస్తావే. నువ్వే తుమ్ముకోవడం, నువ్వే చిరంజీవి అనుకోవడమూనా?"

"శుభప్రదమైనమాట చెప్పుకోడానికి, అసలు తుమ్ముకోవడం ఎందుకండీ నట్టింట, తెలియకడుగుతాను"

"ఎందుకా? యిందుకు, యోగం!" అంటో గంధపుచారతీసినట్టు నుదటిమీద అడ్డంగా వ్రేలుపోనిచ్చాడు.

"మధ్యన మీకొచ్చిన యోగమేమిటి? యింతే పెట్టి పుట్టానని నేనూరుకుంటేను"

"ఇంతే పెట్టి పుట్టానంటావు. నీకొచ్చిన లోప మేమిటే?"

"ఇంకా ఏలోపం కావాలి. మావాళ్ళు తీసుకొచ్చి నన్ను మీకుటుంబంలో పడేయడమే"

"నేనేం మీవాళ్ళలా కాస్తకు కూస్తకు ముఖంచూ చినే వాణ్ని కాను."

"మావాళ్ళమాట ఎత్తకండి. మొవళ్ళవాళ్ళు కజ్జాకోర్లో తెలియనట్టు."

ఈగాడినిపడ్డ భార్యాభర్తల తగాయిదా తద్విషైకవివిధ దృష్టాంతాలతోనూ, అయాసన్ని వేళాల్లో 'యెక్కిబిల్లగా' మార్కు కాబడ్డ మాతి విలువులతోను, మూటిసూట్లతోను, మరే అంతరాయం కలగకుండా సాగితే, అనంతం. అసలువిషయానికి రావడం ఒకరాత్రిలో జరిగేది కాదు.

కానిరామశాస్త్రుల్లుగారి వాడు కొండలు పిండికొట్టి, అనన్యసాధ్యమైన కార్యాన్ని దిగ్విజయంగా నిర్వహించుకొచ్చానన్న ప్రతాప ప్రకటనా సంరంభంతో వచ్చాడు. అంచేత తగాయిదాను, మీవాళ్ళ మావాళ్ళ బ్రాహ్గాజీనుంచి తప్పించి వివాహ నిశ్చయ విషయానికి పోనిచ్చాడు.

“ప్రక్క ఊరిలో సంబంధముందన్న మాట తప్పితే, మీ అప్రమేయం లేకపోయింది కనకనే, నేను స్వశక్తిని సంబంధం ఖాయపర్చుకుని రాగలిగా” నన్నాడు.

దాంతో స్త్రీజనం బొబ్బనవ్వెట్టారు. ‘వివాహం నిశ్చయించుకొచ్చానంటే, వికృతంగా విరగబడి నవ్వుతారెందు’ కనుకున్నాడు కాని, స్వశక్తిని ఖాయపర్చుకొచ్చానన్నందుకు, అవహేళన చేస్తున్నారని యెఱుగడు.

“ఏమిటా సకిలింపులు. ఎంతమందిని కనుగప్పానో, ఎంతమంది నోళ్ళు నొక్కానో, మరెంతమందిని లాఘవంగా తప్పించుకు తిరిగానో, తమ పిల్లల నియ్యాలని పదిమందిదాకా పద్మవ్యూహంలా కాసుకు కూర్చుంటే వాళ్ళను ఏలా ఛేదించుకొని, ఛేదించుకొని బయటబడ్డానో, ‘దేవాంతకుడు రామశాస్త్రుల్లు. వీడికంతా యింద్రజాలం కనుకట్టున్నా. జాడ జవాబు తెలియకుండా యిట్టే అదృశ్యమవుతాడు. యిట్టే మెఱుస్తాడెక్కడో, వాడ్ని ఓకంటితో కాచుకోండి’ అని అక్కడ మనకు శత్రుస్థానంలో ఉన్న ఎత్తుపళ్ళ దీక్షితులుగాడు వాళ్ళకు పుడకలెత్తోంటే, వాణ్ని ఊరికి ఝూడించి, ‘నీవు కలగ జేసుకున్నావంటే పళ్ళూడగొట్టేను. నీగుండెల్లో నిద్రపోతాను సుమా జాగ్రత్త!’ అని ఏలా హడలకొట్టానో, దాంతో వాడెల్లా యిల్లుదూఱడో, సిద్ధాన్నం అనుకొంటోంటే వాడి మంపతెగ, వాడోడు దాపరించాడు. పెళ్ళిళ్ళపేరయ్యట, కమీషన్లు కొడ్తాట్ట, మనం యిల్లా మాట్లాడి ఈగుమ్మాన్ని వచ్చాక, వాడల్లా ఆగుమ్మాన్ని దొరబడి, పందిని నందిగా నమ్మించి అప్పటికప్పుడు, యెంతవాళ్ళనూ మెడవిరిచేస్తాట్ట—వాడికి అరచేతిలో తేనెపోసి మోచేతి కంటా ఏలానాకించానో, పెళ్ళికొడుకు అప్పగారు, అదోలంకిణట, దైవత్వా సిస్తుబకాయి వసూళ్ళకు పొరుగూరు వెళ్ళింది. ఇప్పుడో, ఇహనో

వస్తుంది. అనుకుంటోంటే, అది వచ్చేలోపల రెండ్రోకంటివాడికి తెలియకుండా ఐదుణ్ణే ముఖాముఖీ కల్సుకోని, ఒక్కొక్కమాట లెక్కొక్కమాటతో, మనతో వ్యవహారం కత్తి, బద్దా సంబంధం ఏలార్శైటు చేసుకొచ్చానో, మీకం తెలుస్తుంది, ఇంట్లో కబుర్లేసుకోని కూర్చునే వాళ్ళకు ? ఎహాచ్చి చేతనైంది, అయిన దానికీ కాని దానికీ పకపకలూ, వికవికలున్నూ. ఒక్కొక్క ఘట్టమే తిరగేసి చూసుకుంటే అద్భుతిమవుతుంది" అన్నాడు రామశాస్త్రుర్లుగారు.

"పాము కాటుతప్పించుకొచ్చినవాడు యింటికొచ్చి స్పృహతప్పినట్లు, 'నేనేనా ఇంతపని చేసింది' అని పాపం మీనాన్నగారు యిప్పుడుమూర్ఛబడేటట్టున్నారు చూడవే, అమ్మాణీ!" అని సీతమ్మగారు వెటకారం చేసింది.

"ఔను, నేనే, ఇన కాల నీమూలుగు లేకుంటే, బరినపడి రామశాస్త్రుల్లెంత పనిచెయ్యగలడో తెల్సివచ్చిందా!"

"ఇప్పుడుమాత్రం ఏం చేసుకొచ్చారు? మీకథ వింటే, మీ కేదో మోళీ కట్టివచ్చినట్లో కుస్తీపట్టినట్టో కనిపిస్తోందిగాని పెండ్లిమాటలా లేదు. ఏమి చేసుకొచ్చారో, ఏం మానారో, వరుడి అప్పగారిని కలుసుకోకుండా వచ్చానంటో అదీ ఓఖ్యాతే? ఆవిడదే పెత్తనమయితే ముగ్గులెట్టే మనిషి దిగడే ఉంది. ఆపెళ్ళిళ్ళపేరయ్య కేమి అశపెట్టి వచ్చారో, వాడ్ని నిఘ్మింపెట్టి వచ్చారాయిరి. అన్నీసర్వసిద్ధంచేసుకొన్నతర్వాత వాడేం మారా ముళ్ళు పెడ్తాడో? దుష్టశక్తులను, ఎక్కడవాటిని అక్కడే అమట్టునే ఉంచేసి, ఇంకా స్వశక్తిని కొట్టుకొచ్చానంటో ఏమిటీ బడాయి మాటలు" అంది సీతమ్మగారు.

"మధ్యవాళ్ళలెక్కేముందే బోడిలెక్క, వరుణ్ని నే గుప్పిట్లోపెట్టుకొస్తేను" అని కాశీచెంబుతీర్థం మూరెడెత్తునుంచి ధార తెగకుండా, ఒక్క బొట్టు చిందకుండా గడగడా గడ్గడా, పుచ్చుకొన్నాడు.

ఈస్థాయీని, యీఅసర్గళధాటీని అందుకొన్నవాడు.మళ్ళా ఊరు మొత్తంమీద ఒకఅవధాన్లేనట, ఏ కాఫీహోటేలుసెర్వరూ కప్పులోనుంచి కప్పులోకి యింతయెత్తునుంచి చిందకుండా, దిగబోయడం కానలేదని

శాస్త్రుర్లుగారి మంచినీళ్ళ 'ఫీట్లుకు' కన్ను చెదరిన వాళ్ళెందరో ఆయన్ని ఆశీనందించడం కద్దు.

శాస్త్రుర్లుగారు చెంబును ప్రక్కనెట్టి, "ఇల్లాగే ఉంటై అపభియాలు హాహాహాహా" అంటో నవ్వాడు.

"నవ్వేస్తే పోయేది కాదు అపబిడ్డపేచీ, మీకేం తెలుస్తుంది?" అంది సీతమ్మగారు.

"హెచ్చుతగ్గుప్రవర్తన రానిచ్చిందంటే నే నెక్కడికివెళ్తానే వెర్రి బాగులదానా! దాన్ని నాకు వదలేయి" అన్నాడు.

"మీకువదలేస్తే తేలేపర్యవసానం చూడమకునే నాఅదుర్దా. అల్లుడెప్పుడు మీగుప్పిట్లో ఉంటాడో, ఆవిడగుప్పిట్లో ఉంటాడో" అంది.

"నీకదీ అనుమానమే? భూమ్యాకాశాలు ఏకమైనా, సూర్య చంద్రాదులు గతులుతప్పినా, నామాట కాతడు ఎదురాడేవాడు కాడు. ఏం జరిగిందో వింటే నీకే తెలుస్తుంది. వాకిట్లో కుర్చీలో కూర్చుని ఏదో చదువు కుంటున్నాడు. వెళ్తోనే ఖణుగూ బెణుగూ 'మాది అగ్రహారం నాపేరు రామశాస్త్రుర్లు. మాఅమ్మాయి అపమ్మాణీ' అన్నాను. అంతే, యిల్లంతా ప్రతిధ్వనించేటట్టు చాట్టున పుస్తకం అట్టలుకొట్టి, దభీలున నిలబడి, నన్ను ఒకసేచూడ్డం. ఒడ్డూ, పొడుగుఉన్నవాడే" అన్నాడు శాస్త్రుర్లుగారు.

"చదువుకు అడ్డంవచ్చినందుకు కోపంవచ్చింది కాబోలునే ఖర్మం" అంది సీతమ్మగారు అమ్మాణీతో.

"చాస్సి! అదికాదే, కుర్చీలోనుంచి దిగ్గునలేచి" అని రామశాస్త్రుర్లు గారు యింకా ఏమో చెప్తోంటే, "అయ్యో అయ్యో అమాంతంగా లేవడమే. ఏంచేసునోకద మీనాన్నగారిని, అప్పుడు అతడి చేతిలో ఏముందోనే. ఇంతకూ ఇవాళ లేచినవేళ మంచిది, ఇంటికొచ్చారు. అంతేకాన" అంది సీతమ్మగారు.

"ఓసి నీయిల్లు ఏదో కాను. వినుపించుకోకుండా ఈఘోష ఏమిటే?" అన్నాడు.

"ఘోష కాకేమిటి నాన్నా, నీకంతపని జరిగితే? నువ్వనట్టు ఇంట్లో

కూర్చుని కబుర్లుచెప్పుకునేవాళ్ళం కాయకలమా కాపాడగలమా. గట్టిగా అక్కడ అటువంటిదే సంభవమైతే" అంది అమ్మాణీ.

"ఏమీ సంభవించదు, నన్నేవ డేమి చేయగలడే. తర్వాతమాట విను. ఏమైందో నీకే తెలుస్తుంది. అతగాడిచేత పెళ్ళున పాదాభివందనం చేయించుకొచ్చా" నన్నాడు.

"అమ్మో! చెప్పమంట ఎవరికండీ. అల్లుణ్ని చెయ్యిచేసుకోలేదుగద! కాయశరీరంమీది. ఏమిచేసినా చెయ్యగలరు. మీరేం చేస్తే మీ కాళ్ళమీద పడ్డాడో. అల్లుణ్ని కొట్టివచ్చారంటో యిదో అప్రదిష్టకూడానా! ఈ కాడి నుంచి. మళ్ళీఎవరూ గుమ్మమెక్కకుండా" అంది సీతమ్మగారు.

"కొట్టుకోవడమంటో తుచ్ఛపుమాట యిదేమిటే యిది లేవతీశారు, అతడు నమస్కరిస్తేను" అని కైమన్నాడు రామశాస్త్రుల్లుగారు.

"చేబోలారి సంబంధందగ్గరనుంచి, మీ రెక్కడికివెళ్ళినా ఈ తుచ్ఛపు మాటభయమేమాకు, మీరు నట్టింట అడుగెట్టేవరకు" అంది సీతమ్మగారు.

"నాన్నా. నీకు కోపంవద్దు కాని, 'నన్నేవ డేమిచేయగలడే' అన్నావు. ఆవెంటనే అతడిచేత పెళ్ళునో, పిడేలునో నమస్కారం చేయించు కొచ్చానంటావు. ఏమనుకుంటాం మరి, చెప్పూ" అంది అమ్మాణీ.

"మరే అతల్లికూతురు కావూ. నువ్వ దానిలాగే అనుకుంటావు. అను కోండి, అనుకోండి. ఎవరేం అనుకుంటే నాకేంలోపం. నన్నాతడు నమస్కరించాడు, నమస్కరించాడు. అంతే, ఢంకామీద దెబ్బకొట్టి చెప్తా" నంటో చిందులుత్రొక్కి "అతడికితెల్సు, నాకుతెల్సు అక్కడ ఏం జరిగిందో" అన్నాడు.

"అవును ఏసోదమ్మో చెప్తే మాకూ మర్నాడు తెలియకపో"దంది సీతమ్మగారు.

"ఎవర్తేమి అనగలదే. అంతబ్రాహ్మణభక్తి కలకుర్రవాళ్ళు యిప్పటి కారులో లేరంటుంది. ఎంతమర్యాదగా మాట్లాడాడు! ఎంతగౌరవం చూపాడు!" అన్నాడు శాస్త్రుల్లుగారు.

"రుక్మిణీసందేశం తీసుకునివెళ్ళిన భూసురుణ్ని కృష్ణపరమాత్మ పూజించి నట్టు, పూజించిఉంటాడు అమ్మగారూ" అంది కుమారిక లోకంఠంలో.

" ఏమిటా గుసగుసలు నేచెపోంటే " అన్నాడు శాస్త్రులుగారు.

" ఏమీలేదు. ఆ అబ్బాయికి అంతభక్తి ఎందుకు కలిగిందీ ? అనుకున్నా " మంది సీతమ్మగారు.

" ఏలాకలిగిందా? నాపేరు వేనోళ్ళ విని ఉంటాడు. మనమాట మనం అనుకోవడం కాదుకాని, మన దీనాటున వైదికకర్మానుష్ఠాన పరతంత్రుల కుటుంబమనీ, రామశాస్త్రుల్లు పేరుమ్రోసిన సాంగాధ్యయనపరుడనీ తెలి యనివాడేవడే? ఇంతకూ బ్రహ్మతేజస్సుదాగడి వుండగలదటే" అన్నాడు ముఖమెత్తి మాట్లాడుతో.

" కొట్టవచ్చినట్టు ఆకుందనాలు కనిపిస్తాయిలేండి, ఆ వెక్కిడికిపోతై, బ్రహ్మతేజస్సుమాట ఏమైనా" అంది ఆవిడ.

అమ్మాణీ కుమారికలు పైటకొంగులు నోటికడ్డం పెట్టుకున్నారు.

" అదుగో ఆచిలిపితనమే పనికిరాదన్నా. రాజాసంబంధం తెస్తే, మీకు నవ్వులాటగా ఉందేం " అన్నాడు.

"రాజాసంబంధ మంటున్నారు. మీపరీక్ష కాగే వరుడు ఈరోజులో ఏలా లభ్య మయాడు అంతా విడ్డూరంగా ఉందని నవ్వు వచ్చిం "దంది సీతమ్మగారు.

"ఎవరికేం విడ్డూర్యమైనా నేనాగేవాణ్ని కాను. ఎవరేం సణుకున్నా నేనా సంబంధమే అమ్మాణీకి చేస్తాను. కాదనేవాడెవడో చూస్తా " అంటో ఫెణతలు ఎగరకొడ్తోన్నాడు రామశాస్త్రుల్లుగారు.

"ఎవరేమన్నారని ఖడ్గాలు చదవుతారు. ఇంతకు వరునిపైనం ఏంచెప్పా రనీ కాదనడానికి ఔననడానికి బాగనడానికి ఓగనడానికిన్నీ " అంది ఆవిడ.

" వెయ్యివరహాలు దిగబోస్తే ఆపేరుదొరుకుతుందటే. అతడిపేరు చతుర్వేది " అన్నాడు.

" సరిపోయింది యింటిపేరు కస్తూరివారు యిల్లు గబ్బిలాలవాసన అన్న ట్టుంది మీపరీక్ష. పేరుచూచి పిల్లనిచ్చుకొన్నవాళ్ళ నింతవరకూ వచూలేదు "

" చూస్తావు, చూస్తావు. తొందరపడకు. పదిరోజుల్లో ముహూర్తం

కూడా పెట్టుకొచ్చాను. పాలాత్తు పడ్డంపడ్డా ఆగేవాడిని కాను. విదియ ముహూర్తానికి వివాహం చేసితీరుతా!"

"పెళ్ళిపనులు ఏమిచేసుకునికూర్చున్నామని యింత దగ్గరముహూర్తం పెట్టారు. అబ్బాయి రావద్దా? వాడికి ఉత్తరమైనా వ్రాయవద్దా? వాడు రాకుండా పెండ్లి ఏలాచెయ్యగలం?"

"వచ్చిమాత్రం ఏం వెలగబెట్టకలడని వాడు రావాలి? ఇంగ్లీషుచదువు అన్నయ్యలు యింటిపన్లు ఏంచక్కపెట్టగలరో నాకు తెలియంది కాను. కాలేజీ సావాసగాళ్ళంటో ఏదో కోడేరుమాకను కొట్టుకొస్తాడు. ఆకాడినుంచి మడీ, మైలా లేకుండా, ఆగుడ్డలతోనే భోజనాలు, నానాఅనూంగళ్యమున్నూ. రామశాస్త్రుర్లు పిల్లపెళ్ళి చేస్తున్నాడంటే ఎక్కడెక్కడి సంస్కార్లూ వచ్చిపడతారు. ఈకిరస్తానీలమధ్య ఒక్కపూట ఉండలేరు వాళ్లు. పెళ్ళికి సమస్తప్రయత్నాలు చేసుకుబోయేవాణ్ని నేనుండగా, ఎవ్వడూ అక్కర్లేదు అడుగడుగునా అడ్డాలు రావడానికిగాని."

"అబ్బాయిమాటకేం. పోనీ వధూవరులైనా ఒకర్నొకరు చూచుకోవద్దా, ముహూర్తం పెట్టుకొచ్చానంటారు."

"అటువంటి చాదస్తాలు ఏవీపెట్టుకోని వరుడే లభించాడు. వాళ్ళదంతా సిష్టసంప్రదాయం."

"ఏకోతిని తెచ్చినా వప్పుగుంటారన్నమాట సిష్టులైతే. అందచందాలు తెల్సినవాడేనా? శుద్ధమేదకుడే మోనప్రా, పిల్లను చూచుకోనక్కఅలేదంటున్నాడట"

"మేధకుడో, మేధావో. నేను ఖాయం చేసివచ్చా. ఇక మీరు ఎంతతన్నుకున్నా ఆగదు. వీలైతే నువ్వు పిల్లకు స్వయంవరం చేతామనిచూస్తున్నావు. బ్రాహ్మణింట స్వయంవరం వప్పుకునేవాణ్ని కాను. అది క్షత్రియులకు చెప్పబడిం" దన్నాడు అవధాన్లు.

"ఈరహస్యం తెలియకనే కాబోలు, వధూవరులు ఎక్కడా ఒండొరులను చూచుకుమరీ, చేసుకుంటున్నారు."

కుమారికవంక తిరిగి "జరిగిన సంగతి యీాయనకు చెప్పకపోవడం కల్సి వచ్చింది. అప్పుడు చెప్తే, మొదట్లోనే యీాయన అడ్డుపెట్టు నన్నమాట.

తెలియలేదో, తెరిపిసిపడ్డామో ” అని లోకంఠంలో అంది సీతమ్మగారు.

“ ఏమిటే ఆజరిగినసంగతి ” అని అడిగాడు, అమట్టుకు చెవిని పడింది కాబోలు.

“ అబ్బే ఎవరిమాటో లేండి ” అంది.

“ ఎవరిమాటో ఇక్కడెందుకే. మీధోరణిచూస్తే అంతా ఏదో లోపలి స్వయంపాకంలాగుంది. ఆయ మూడదయేది, మూడు ఆ రయేది నేను ఈసంబంధమే చేసితీరుతా. ఇంకా చెవులుకొరుకోకండి. నాకేమీ భయంలేదు.”

“ పోనీ. నాకేంకావాలి, మీరు కోరితెచ్చిన సంబంధమే కూతురికి చేసుకోండి. నేను చూచేదాన్నే ” అంది సీతమ్మగారు, తాము స్వయంగా ఖాయపర్చినసంబంధం ఈ తిక్కమనిషికి తృప్తిఅయింది అన్న ధిలాసాతో.

“ మంచివిద్యే నేర్చావే. అనీమాట, అనరానిమాటా లేకుండా ఖడ్గ వాదం చెయ్యడం, చివరకు మొగాడు నచ్చచెపితే, వాడిదే న్యాయమని తోచి, యిహ నోరుమెదపలేక, నాకేంకావాలంటో వైరాగ్యం వెళ్ళబెట్టుకోవడమున్నూ.”

“అబ్బో! అక్కడకు మహానచ్చచెప్పినట్టు. కట్నం విషయమైనా యిప్పటికింకా రాల్చలేదు. ఆనచ్చచెప్పిం దేమిటో.”

“ కట్నమా, మనం అనుకుంటూన్న అంకెకు దాటదు సరా.”

“ అమాట ఏదో మీఊహాలాగుంది, నిర్ణయం చేసుకొచ్చినట్టు కన్పించదే ? ”

“ అది మగాడిగొడవ. ఆడాళ్లుతెచ్చేవాళ్ళా యిచ్చేవాళ్లా. నిర్ణయమైందో లేదో మీకెందుకే? ”

“ఇదిబాగుంది. ఇచ్చేది యిచ్చుకుంటో యిరుగమ్మా పొరుగమ్మాఅడిగితే మూగనోము పట్టాల్సిన కర్మమే వొచ్చింది మాకు. ‘అల్లుడికి యింతికట్నం యిచ్చాం’ అని చెప్పుకోడానికి ఋణంలేదూ మాకు. చెప్పండీ, విసిగించక ” అంది సీతమ్మగారు.

మాటలధోరణిలో మరచిపోయా నంటాడా? అనడుగా. పెళ్ళిమాటల్లో కట్నవిషయం మఱచానంటే నవ్వుతారు. నిజానికి జరిగిం దది. ఏక హడావుడి మనిషి.

అంచేత "చెప్తాయలే" అని గదిమాడు. కుమారిక సీతమ్మగారు ఒకరి ముఖం ఒకరు చూచుకొన్నారు.

"లాంచనాలూ ?" అని అడిగింది సీతమ్మగారు. అదీ డొక్కట్టింది శాస్త్రుల్లుగారికి.

"లాంచనాలా, పెళ్ళికొడుకే తలపెట్టనపుడు, పనిగట్టుకుని నే కదిపి తాతకు దగ్గులు నేర్పమంటావా" అని బుఖాయించాడు.

"మంచి గడుస్తనమే చూపెట్టివచ్చారు. మనం నేర్పక్కరలేదు. దగ్గులు. ఊరుకెళ్ళిన దగ్గులమ్మ వచ్చిందంటే, ఏలాగా తేవదీస్తుంది రభస."

కట్నకానుకల విషయం రెట్టిస్తే రామశాస్త్రుగారు చిన్నబుచ్చుకొంటూ ఉన్న అనుర్దాతో, "పోనీ, వాళ్ళ సంప్రదాయంమాట చెప్పారు గనకనా" అంది.

అందుకున్నాడు. "అల్లా అడిగావు బాగుంది. సంప్రదాయమంటో యింకా నానుస్తా వెంటుకే. కృష్ణాగోదావరీ మధ్యప్రదేశంలో ఏబ్రాహ్మణ కుటుంబానికుందే ఆసంప్రదాయం. వరుని తాతగారు వేదార్థంచెప్పే జగద్విఖ్యాతుడు. భాష్యాంతవైయాకర్ణి. పెండ్లికొడుకు తండ్రి గోదానం, వృషోత్సర్జనం, షోడశదానాలు చేసిన కర్మిష్ఠి. ఏమనుకున్నావో వారికోవ. ఒక్కమాటలో చెప్తా. వారికుటుంబం వేదాలుపోసిన గాది" అన్నాడు.

"తండ్రితాత లెంతవారైతేమాత్ర మేముంది, అల్లుడు ఇంగ్లీషు చదువేగా" అని నాలుక తాటించింది సీతమ్మగారు.

"ఇంగ్లీషు చదువుతో సెలవులకొచ్చినపుడు, శ్రీసూక్తం పురుషసూక్తం చెప్పుకున్న మొగాడెవడే ఈనాటున ? ఉంటేగింటే, ఎక్కడో, ఒక్కకోనసీమ గంటివారి కుటుంబానికుంది, ఆవిష్టత. మళ్ళా మన అల్లుడికుంది. నానాటికి కేశవనామాలైనా నోటబట్టలేని జాతి బయల్దేరుతోంది. ఎందాకనో యెందుకు, మన అబ్బాయిమాట చెబ్దూ. నాతరంకాలేదు, వాడిచేత సంధ్యావందనం వార్పించడం" అన్నాడు రామశాస్త్రుల్లుగారు.

రామశాస్త్రుల్లుగారు వ్యవహర్త కాదని యింట్లోవాళ్ళకు తెలిసిందే. వెడ్తోనే వారి కుటుంబసంప్రదాయం, అల్లుడిపేరూ విని ముటీసిపోయి, శాస్త్రుల్లుగారు కట్నకానుకలవిషయం మఱచి వచ్చాడని నిశ్చయం చేసుకొని, ముక్కుమీద వేలేసుకుంది సీతమ్మగారు.

"ఇప్పటికి మనఅబ్బాయి వైఖరి గ్రహించి ముక్కుమీద వేలేసుకున్నావు బాగుంది. వచ్చాక్కైనా శాస్త్ర సంధ్యావందనం చేసుకోమని చెప్పు" అన్నాడు రామశాస్త్రుల్లుగారు.

"ఇప్పుడు అబ్బాయి సంధ్యావందనం బెంగఎందుకు. మంచి సంతోష సమయం. మీకూ, నాకూ, అమ్మాణికి, కుమారికకు, యింటిల్లపాదికీ నచ్చిన సంబంధం నిశ్చయంచేసుకొచ్చారు. ఏవేళ తిన్న మెతుకులో, కడుపున కనక లాడ్తోంది. లేవండి వడ్డిస్తానని" సీతమ్మగారు మహదానందంగా వంటింట్లోకి వెళ్ళింది.

ఎవరైనా 'భేష్' అనేసంబంధం స్వశక్తిని తెచ్చానన్న విజయగర్వంతో శాస్త్రుల్లుగారు స్నానానికి లేచారు. అమ్మాణీ ఈప్సితము సిద్ధించిందన్న హర్షోత్కర్షతో కుమారిక అమ్మాణీని సంశ్లేషించింది.

---

# 7. పెండ్లి సరంజాం

పిల్లపెళ్ళిచేయటం, ఇల్లుకట్టడం గృహస్తుకు మాటలు కాదంటారు. అదేమిచిత్రమో, రామశాస్త్రుల్లుగార్కి మాటలే అయింది అమ్మాణీ పెండ్లి. మాటలు కాకేమిటి? వారంరోజులైంది ముహూర్తం పెట్టుకొచ్చి. నిండా నాలుగు రోజులు లేవు ముందు. ఇక్కడ పూచీపుడకతీసి అక్కడపెట్టిన పాపాని పోలేదు, మహానుభావుడు రామశాస్త్రుల్లు. ఒక్కసరకు కొనలేదు. లైట్లవాళ్ళకు కాని, వంటబ్రాహ్మలకు గాని, బాజాబెంత్రీలకు కాని ఒక్క కాని బజానా యియ్యలేదు. ఎవరు వాకిట్లోకి రానీండి. 'ఏమో' ఏంచేస్తోన్నట్లు యింట్లో? చిమ్మటిలా అవంట యిల్లు పట్టుకువదలవు. అవసరప్పనీ యెఱుగవు. అనవసరం ఎఱుగవు. చూడమ్మా, నాతరగడా క్రింద లగ్న పత్రిక ఉంటుంది. ఈలా యిక్కడున్నట్లు తీసుకురా,' అంటోనే, గోడ మూల చుట్టిపెట్టిఉన్న, భారీతుంగ చాపను, ఫెఢేల్మని శబ్దమయేలా విప్పి, వీధిగుమ్మాని కడ్డంగా, లోపలినడవలో పఱచి, వారిని కూర్చోపెడతాడు.

త్రిపూటల్లా ఆడంగులు వీధిగుమ్మంలోకి రావడానికి అడ్డయితేం గనక, తన పనే తనది.

దైవజ్ఞులతో, ఆలగ్నంలోని సూక్ష్మాతిసూక్ష్మ విషయాలు, చెవాలీగా, సావుకాశంగా చర్చిస్తోన్నాడు. విజ్ఞులకు లగ్నమర్మవిషయాలు విప్పిచెప్పి, భేష్ అనిపించుకుంటున్నాడు. అజ్ఞులకు గ్రహసంచారాల దగ్గర నుంచి ప్రారంభించి, చెమటోడ్చిచెప్పి, ఆమ్మో అనిపిస్తున్నాడు. ఊరంట బొంగరంలాతిరిగి లగ్నరహస్య ప్రాశస్త్యాలను పాఠం చేయిస్తున్నాడు. పైవాళ్ళకు లగ్నమావనం ఎందుకూ, సత్కారాలు పొందడానికి ఏవేళకు పెండ్లివాకిట్లో చేరాలో తెలియడానికి కాని. కాస్తవిపులంగా తెల్సుకో వాలంటే పెండ్లి ప్రయత్నాలు ఎంతవరకువచ్చినై పెండ్లిఎంతదండీగా దశామత్తుగా చేస్తాడు రామశాస్త్రుల్లు, యింతేనా. అదైనా సత్కా-రాలు, సంభావనలూ ఏస్థాయిలో ఉంటాయో అంచనాకేగా. రామశాస్త్రుగారి మేలు కోరి వెళ్ళామా, మన భోగట్టా వదుని అప్ప ఆస్తులు, స్థిరచరాలు, పాడిపంటలు, ఉద్యోగసద్యోగాలు గుణగణాలు కదా. ఏమంటారండి, 'మాఅమ్మాణీకి ఎంతపగనష్టంకి ముహూర్తం పెట్టించానో అది చూడవూయ్ అనవసరపుగొడవ ఎందుకొచ్చిందీ' అని.

'జ్యేష్ఠబహుళ విదియ, బుధవారం, తెల్లవారు ఝామున గం 3-15నిముషాలకు మృగశిరా నక్షత్రయుక్త మేషలగ్నమందు, జామిత్రం శుద్ధిఅయింది, లగ్న అష్టమాలతో పాటు—శుభ పాపగ్రహాలు యెక్కడఉంటే అనుకూలమని పెద్దలు చెప్పారో, సరిగా అక్కడే ఉన్నాయి. ఈముహూర్తం నిర్ణయించాక, దీనిబలంచేత, యెన్నోసుభాలు చేయించే ముహూర్త మైందన్నమాట' ఈతొమ్మిది పదింపత్తులపాఠం మన తల్నేసి వుద్ధాపన్నమాటే. సావకొట్టి వప్పగించుకుంటాడు. శ్రద్ధ చూపలేదో మన్ని నాస్తికులమని తిట్టి పోస్తాడు. శ్రద్ధచూపామా, ఆపూట పనిచెడి కూర్చోవాలి. రామశాస్త్రుర్లు కాఫీ పుచ్చుకొనే మనిషైనా కాడు, తీరా కూర్చుంటే. కొత్తగా పుస్తకం వ్రాసినవాడుకూడా, యింత ప్రమాదకారి కాదు. కూలేసినా, మధ్యమధ్యన యింత కాఫీపోస్తోంటాడు, వాడి పుస్తకం పీడకొంత, వాడివేడి కాఫీతోనే దిగమ్రింగవచ్చు.

ముహూర్తం మూడురోజుల్లోకి గంటకొచ్చినా, వీసమెత్తైనా వాస్తవికదృష్టి లేకుండా, యథాధోరణిలోనే, ఇల్లు దులుపుకోడానికైనా వీల్లేకుండా, యజమాని జ్యోతిశాస్త్ర ప్రసంగాలతోటి ఫెనతలు ఎగర కొడ్తోంటే, ఇంట్లో ఆడంగులకు, అంతకన్న హింస ఏముంటుంది?

పరీక్షలొచ్చిపడి, పట్టుమని పుస్తకానికొక్క రోజైనా విడదొక్క డానికి వీలులేని కాలవ్యవధిలో ప్రథమంగా కన్ను, పుస్తకం విప్పి, ఉన్నంతలోనే ఏవో మూడు ముక్కలు ముక్కున కరచి పేపరు వ్రాశానని అనుపించుకోడానికి విశ్వప్రయత్నం చేస్తోన్న విద్యార్థిని, రూం మేట్లు భావగీతాలతో ఊదరగొడ్తే ఏం చేస్తాడు? కుర్చీబాకీమీద తలవాల్చేసి భవిష్యత్తును తలచుకొని భీతిల్లిపోడూ! అతడింకా, మరో పంచకు పోయి చదువుకునిరావచ్చు. ఇల్లువదలి వెళ్ళి పెళ్ళిపనులు ఏలా చేసేదీ.? క్షుభిత మనసురాలైన సీతమ్మగారు గోడకు తల ఆన్చి కూర్చుంది. లగ్నంకోసం పెళ్ళా, పెళ్ళికోసం లగ్నమా? మంచిముహూర్తం పెట్టి వదలేస్తే, వివాహం అదే చెక్కుకుపోతుందన్న ధీమామీద లేదుకదా. స్వయంగా ఆహ్వానించుకోదగ్గ సంస్కారులున్నారు. రేపు సాయంత్రానికొచ్చేస్తా నంటో సీతమ్మగారితో చెప్పి, ఆవిడ తిరుగుమాట వినుపించుకోకుండా, గడపదాటి అదేపోత రామశాస్త్రులుగారు.

శాస్త్రులగారి అస్తవ్యస్తతకు నిశ్చేరపడి, నిరాశాపూరిత సీతమ్మగారిని సమీపించింది కుమారిక. "అమ్మగారూ, అయ్యగారు నిశ్చింతగా వెళ్ళి తోచినవారిని, బంధుగులను పిల్చుకురావడం మనకు మంచిదే. మనకొచ్చిన లోపమేమిటి, తెలియకడుగుతాను? డబ్బు యిబ్బంది అయితే ఆలోచించుకోవాలిగాని, మరి ఆలోచన దేనికి? కట్నకానుకలకు పెండ్లి ఖర్చులకు డబ్బు సిద్ధం చేసుకొనే ఉంటిరి. ధాన్యాదులు యింట్లో సమృద్ధిగా ఉండనే ఉన్నై. అంచేత చిన్నపనీ, పెద్దపనీ మనం చేసుకోలేకపోము. పట్నాన్నుంచి తేదగ్గ దినుసులు ఒక్కపూట వెళ్ళి ఖరీదుచేసి నేను తేగలను. పురుషసహాయం లేదన్న శంక మీకక్కరలేదు. మోసపడ్తానని భయపడకండి. మోటు పని అని విచారించకండి. అమ్మగారు కలకల్లాడుతో కూర్చుంటే మనం ఎంతపని చేసి చూపెట్టగలమో నువ్వే చూస్తావు

అమ్మాణీ :" అంటో కుమారిక మరు క్షణంలో నడుంకట్టింది. చీరకొంగులు జీరాడకుండా మోకాళ్ళపైకి బిగించి పనిలోకురికింది. ఇల్లంతా దులిపి, వెల్లలు వేయించి, పసుపు సున్నిపిండిలు కొట్టించి, ధాన్యం దంపించి, వివాహమంటపాని కనువుగా ముఖద్వారం ముందర ఎత్తుచేసి, గాడి పొయ్యిలు యిటుకతో కట్టి, నూతిపళ్ళెం బీటలు తీసినట్లో టన్నయంగా సున్నపుపని చేసి, వలయుచోట్ల శుభ్రంగా అలికించి, రంగవల్లికలుతీసి, గడపలకు పసుపురాసి కుంకం పెట్టి, పదిమంది పని ఒక్కర్తే చేసి రెండు మూడుపూటల్లో యింటికి పెండ్లికళ తెచ్చింది.

పెండ్లికి కావలసిన పాత్రసామాను, సీతమ్మగారుతోడురా, నిముషాల పొరుగిళ్ళనుంచి తెచ్చిపడేసింది. ఒకరాత్రల్లా సీతమ్మగారితో సంప్ర తించి, పెద్ద అనుభవశాలినిలా, మెరుగుసన్నాహాల పానకపుబిందెల దగ్గఅనుంచి, వప్పగింతల పెట్టుడుచీర జామార్ల వరకు, పరిణయకార్య కలాపంతో, యిట్టిఅవసరమయ్యే వివిధవస్తువుల పెండ్లిపట్టిఒకటి, వంట్ల పందిరతతంగానికి అవసరమయ్యే వార్పుడుగంపలు, వడ్డనబుట్టలు, తాటాకు చాపలు, చిన్నా పెద్దా విసనకర్రలు, అడ్డాకుదిండ్లు వగైరా సరకులిస్టు ఒకటీ వ్రాసుకొని, వేసవనే బయల్దేరి, సమీపపట్నంలో వాటిని ఖరీదు చేసి వాటివాటి బిల్లులసహితం తెచ్చి సీతమ్మగారికి వప్పచెప్పింది.

కుమారిక సరకు తెచ్చింది తర్వాయిగా, అమ్మాణీ సీతమ్మగార్లు వాటి మీద విఱగబడి, అత్యంత కుతూహలంతో, మూటలను పార్సెల్సును విప్పి, వేరేవేరే ఆయామూర్తులను వస్తువులను తీస్తూ, వాటివాటి ఉప యోగం, నాణెం, నాజూకు, వివరంగా చెప్పుకుంటూ, మధ్యమధ్య ఆయావస్తువులు అమరకపోతే పెండ్లి నిండేఉండదు అనుకుంటూ సంతృప్తిపడుతూ, ప్రతిసామాన్యవస్తువును పదేపదేచూచుకొని పొంగిపో తున్నారు. సీతమ్మగారు పూర్తిగామూట విప్పేలోపలే, అమ్మాణీ ఏ వస్తు వునైనా పెల్లగించబోతే, 'మీనాన్నగారి తొందరపాటు అంతా వచ్చి పడిందే నీకు' అని సీతమ్మగారు కసురుకొంటోంది.

కుమారిక శక్తిసామర్థ్యాలకు, పరిశీలనాదక్షతకు, పనివాడితనానికి, ఆయాపనులలోని సౌందర్యవిజ్ఞతకు, పరిపూర్ణతాకాంక్షకు అబ్బురపడింది

సీతమ్మగారు. ఆలోచనలో పడిందికూడా. ఎప్పటో ఉన్నతకుటుంబానికి యాజమాన్యం వహించిన చెయ్యో, కాక పెక్కుకుటుంబాలను పర్యవేక్షణలో పెట్టుకొన్న ప్రజ్ఞాశాలినియో కావాలి కాని, ఒకరిఆజ్ఞల నందుకొని నౌకరిచేసిన కన్యకాదు. ఆ కంజాయింపు, ఆయుక్తధర్మ సముద్ధరణశక్తి, కర్మానురక్తి, క్రియాకౌశలం, సేవకజనాశ్రితం, మరోటీ—తాను కుమారికకు చేయుగల ప్రత్యుపకారం, ఏమిఊహించగలదని ఆపె యింతశ్రమిస్తోందో అర్థం కాదు. ఆ ఆరాతీస్తే, తానాపెకు ఏవోరహస్యోద్దేశాలు ఆరోపిస్తోన్నట్టు, ఆపెచిత్తశుద్ధిని శంకిస్తోన్నట్టు కుమారిక చిన్నబుచ్చుకోవచ్చు. రోజులు గడచి చనువైనకొద్దీ, యథాలాపంగా, వాటంతటవే తెలిసే విషయాలను, ఈవాళేతాను తేల్చుకోడానికి తొందరపడ్తోన్నట్టు, యెందుకు అనిపించాలి? ఆపెకు ఎందుకు కష్టంతోచాలి? మానవసహజమైన స్వార్థం, కాస్తసొంటుకన్పిస్తేగాని, సత్కార్యాలు ఎందుకు చేస్తారో మనకర్థం కాదు. సరిగదా, వాటినిచూస్తోంటే చీకాగ్గాఉంటుందికూడా. ఆసత్కార్యాలు చేసేవారి స్వప్రయోజనం, చూపువాసైనా కన్పిస్తే, అప్పుడు అర్థమవుతై. బరువుదింపుకుంటాం. ఉన్నతాదర్శ ప్రేరితులైన విశుద్ధాత్ములుంటారని ఓపట్టాన్ని అనుకోలేను. అనుకున్నామే అనండి, ఎంతో బాధపడి కాని అనుకోలేము. అవ్యాజప్రేమ గగనకుసుమం. అబ్బో ఎక్కడిమాట. ఏదోఉంటుంది వెనక. నిజంనిలకడమీద తెలుస్తుంది. ఇప్పుడే కుమారిక నడిగి వెల్లిపడ్డం ఎందుకొచ్చింది. ఉత్తమోత్తమురాలైన సీతమ్మగారికే ఈ సంశయక్లేశం తప్పలేదు.

---

# 9. పెండ్లి పందిరి

## I. కుమారిక ధ్యాస

ముహూర్తానికి వ్యవధల్లా, రెండురోజులుపైన ఒక్కపూట. రామశాస్త్రుల్లుగారు యింటికి వచ్చినట్టేవచ్చి, మగపెళ్లివారి దగ్గరనుంచి కట్నకానుకలవిషయం తాఖీదువస్తే, ఊరువిడచివెళ్ళాడు. వారబ్బాయి, కాలేజీ

నుంచే నేరుగా ఉద్యోగవిషయం యింటర్వ్యూకి వెళ్ళాడు. అతడికి ఉత్తరమందిందో లేదో. అగ్రహారం అనుబంధానికి బంధుబలగమున్న ఊరు కాదు. ఒకరికి చెయ్యిచాచనవసరం లేకుండా నడిచిపోతున్నవాడే కాని. ఆర్థికస్తోమతు కలవాడూ కాడు గాసగాస్తుల్లగాను. అంచేత పనులుపూనుకుని పన్లుచేసిపెట్టి పోవడం ఉండదు. చిన్నస్థాయీ మధ్యమవర్గీయుడవడం చేత ఒకరికి ఉపకారి కాలేడు. గ్రామం ఆయనకు యోగ్యుడని యోగ్యతా పత్రం యిస్తేంగనక, అధికారిముద్రలకేమో కాని, యోగ్యతా పత్రాలకు పన్లయి లొచ్చిపడవు. పందిళ్ళూ పాకలూ దిగడిఉన్నై. ఆవులేవు, వెనుక లేవు ఆయనవస్తే గాని. యేదీయింటికి చేసే దారిలేదు. సర్వస్వం, యజమానివచ్చి అమర్చుకోవాల్సిఉంది. వచ్చిమాత్రం, గంటలమీద ఏమిచెయ్యగలడో తెలియకుంది. గృహిణి ఆయన రాకకు ఎదురుచూస్తోనే ఉంది. వచ్చి, ఒంటిచెయ్యి. భర్త పడాల్సిఉన్న బాధను యజమానురాలు, యజమానురాలు పడ్తోన్న బాధను కుమారికి, వారుభయులబాధను అమ్మాణీ బెంగ టిల్లారు.

‘పోనీ’ అనేదికాదు పెండ్లిపందిరి. పెండ్లికి కళ కాంతులు తెచ్చేదీ, స్లీపరు గౌనులా లొసుగులుకప్పి, లోపాలు కమ్మి నిండుయిచ్చేదీను. వేసగి వేడిమిని బొగుర్ బొగుర్ మంటూన్న నడివీధిని పెండ్లిపందిరి, ఎయిర్ కండిషండు సెలూన్ లాంటి, లతాగృహాంతర సీమలాంటి, చక్కని, చల్లని విశ్రామాశ్రయం కాదా! అడుగిడితే ప్రాణంలేచి వస్తుంది. ప్రొద్దు వాటారుతోంటే వచ్చేముసగ చీకట్లు, ముసురుకున్న చిక్కని పందిరి, ఎండవేళ వంటికీ, కంటికీ ఎంతహాయి? చిక్కగా మామిడితోరణం కూడా పందిరంట కడితే, అడిగారా, “కోకిల వ్రాతంబు గ్రుక్కిళ్ళ మ్రింగించు క్రొమ్మావిచిగురాకు గొడుగు” పట్టినట్టు కాదండీ. పెండి ముంపర పందిరలో దెసను స్తంభాలాట లాడుతో. వివాహోత్సవ సంకులత్వానికి నాందిపాడ్తోన్న బాలబాలికల లేతకంఠాలు ఎంత శ్రుతి పర్వంగా శుకపిక కోకిల స్వరాలను తలపునకు తెస్తోంటై. అప్పుడేగా ఆనందసంరంభాలు వెల్లివిరియడం. ఎందుకొచ్చినమాట, పచ్చితాటాకు పుష్పాడిఘాటు, పువ్వారంసువాసనా ఘ్రాణేంద్రియాలకు, ఘుమ్మని కొడ్తోంటేనేగాని పెళ్ళిఉబలాటం పడమన్నా పడలేం.

ఉబలాటంమాట చూతాం. కాస్త ముందుగా వచ్చిన బందుగు, అరుగు మీద కూర్చుంటే బిక్కుబిక్కు మంటోన్నట్లుంటాడు. పెండ్లికి రెండు రోజులైనా ముందు, పందిరి పడకపోతే, ప్రక్కయిళ్ళ పనిలేని అమ్మలక్కలకు నోటినిండా పని. గుసగుసలు పోతారు. ఇప్పటి మాటా, అప్పటిమాటా బయల్దేరుతై.

ఇక పొరుగింటి ముసలావిడ వచ్చి, 'అమ్మాయీ, సీతమ్మా, విదియ ముహూర్తానికేనటే వివాహం' అంటుంటే, దాంతో పూర్తి అవుతుంది, యింటిల్లపాదికీ నిస్పృహ. పోనీ అని వెడ్తుందా ఆవిడ. మగపెళ్ళివారికి మనకు చెడిపోలేదని ఖచ్చితంగా అనిపిస్తేగాని కదలదు. తనపని తాను చూచుకోదు.

మూడు రోజులక్రితం గ్రామ మునసబుగారింట వివాహమైంది. ఆపందిరి యింకా తీసి వేయలేదు. పందిరి చెంగనున్న కుమారిక కళాహృదిగలకన్య. అదోపూర్వజన్మ సంస్కారాత్తం. నిన్న ఆదారిని వస్తో, ఒకనిమేషకాలం నిలబడి పందిరిని చూచింది. పాదరసపు బుడ్లు పెండ్లిపందిరకు యిస్తోన్నశోభ ఆమె హృదయంలో ముద్రితమైంది. ఒక దినము దినమల్లా గాఢాభ్యస్తమైన తద్రూప భావన వదలి పోలేదు. ఏం చేస్తున్నా కుమారిక బుర్రలో పందిళ్ళు, సుళ్ళు చుట్టుకొని గిర్రున తిరుగుతోంటే వాటిల్లో, అంత నంతన, రంగురంగుల పాదరసపు బుడ్లు జంటలు జంటలుగా, గుత్తులుగుత్తులుగా కన్పిస్తోన్నై. ఆపందిరిబుడ్ల నెట్లైనా తెచ్చి, అమ్మాణీ పెండ్లిపందిరిని సర్వజనసీయనోత్సవంగా చేసి చూపెట్టాలని కుమారిక మనసుకు గట్టిగా పట్టేసింది.

తదుద్దేశ్యం కుమారికకో నూతనోత్సాహమిచ్చింది. ఉత్సాహం సఖుం బలం. బలవీర్యాలను, గుణగణాలను వెలికి తీసి ఉన్నతకార్యాలను చేయించేది ఉత్సాహమేకద. ఉత్సాహవంతులకు అడ్లు అడ్డంకులు అజకు రావు. సీతమ్మగారితో చెప్పకుండగనె, అప్పటిభావావేశంలో, చర్రున మునసబుగారింటికి వెళ్ళింది. సంకల్పబలమనాలో, కాక ఏకైక ఆశయ ప్రేరితులైన కళోపాసకుల నిర్మలశిశుహృదయ లక్షణమనాలో, తన అవసరాన్ని గుర్తించని మానవుడుండడన్నట్లు, లోకరీతులను లెక్కించు

కుంచె, సరాసరి మునసబుగారి పందిట్లోకి వెళ్ళి, 'కళ్యాణివారింట వివాహం. వారిపనిమీద వచ్చా' నని నసుగుతూ లేనిది చెప్పి, పాదరసపుబుడ్లు పుచ్చుకొని, అరుగులు దాటిన ఆ పందిట్లో పసుపుపసుపుగా యింటికొచ్చి, వాటినిగదిలో ఒకమూల భద్రం చేసింది.

అంతసుళువుగా, అడిగిండి తేలికవుగా, రేపుమాపు అనకుండా, పది నిముషాలపాటు నుంచున్నమాత్రాన, మునసబుగారు స్వయంగా బుడ్లువిప్పి, అదివరలో ఏమాత్రం పరిచయం లేనితనకు ఎందుకిచ్చారో, అప్పట్లో కుమారికకు సుతరామూ తెలియదు. తద్విషయం ఎక్కువ ఆలోచించనూ లేదు. అదేదో జన్మాంతర సౌహార్దయమనుకోవచ్చు. మరి కారణం కన్పించదు.

వారిపందిట్లోకి వెళ్ళినిలబడిందా? మునసబుగారు అనతిదూరంలో అరుగుమీద పాలేళ్ళను కూకలేస్తున్నారు కాబోలు, చిన్నవాడు పదకొండు, పన్రెండు వయసు గుంటడు. కన్నీరు కారుస్తున్నాడు. తనవంక చూచాడు. లోకంఠంలో ఏవోఅన్నాడు మునసబుగారితో. మునసబుగారు ఆశ్చర్యచకితుడై, కొంతసేపు తనపై చూపునిలిపాడు. ఆచూపు కుమారిక రూపాన్ని కబళిస్తోన్నట్టుంది. ఆమె చూచిందోలేదో. పెద్ద పాలేరు పాతికేళ్ళుంటై, అంతవరకు ఘాటుగా సమాధానమిస్తోన్నవాడే, తనను చూచినవెంటనే తటాలున కంఠంనొక్కేసుకొన్నాడు. వాళ్ళుభయులు మునసబుగారి పాలేళ్ళని అదివరకెరుగదు. కాని వాళ్ళను అదివరకు చూచిఉంది. ప్రథమంగా తానీగ్రామంవచ్చేరోజున, పైపొలాల్లో మార్గాన్వేషణచేస్తోంటే, పెద్దవాడుతన్ని తప్పుదుదారినిపెట్టాడు. కొద్దినిముషాలకు కుర్రాడు కనిపించి, నేరుగా ఊళ్ళోకి తీసుకొచ్చేబాటను చూపాడు. వాళ్ళేవీళ్ళు. మునసబుగారు వాళ్ళతో మాటలుకట్టిపెట్టి, తనకేదో వ్యవధి చాలనంతతొందరపని తగిలినట్టు, వాళ్ళను అంచలమీద యిళ్ళకు పంపేసి రెండడుగుల్లో అరుగుదిగి, తన్నిసమీపించాడు. అప్పుడు వెళ్ళడానికి ఏంఅయిష్టంచూపాడో పెద్దపాలేరు. 'రేపురామంటే నీకు కాదురా అడుగుతీసి అడుగేయడమే గంటఅవుతోంది' అని మునసబుగారు వాణ్ణి కసురుకున్నారు.

'అవునండి. అల్లాగే ఉంటుందిలెండి. మిమ్మల్ని కాదనగలనాండి. వెడుతున్నానులెండి. వెళ్ళకేం చేస్తానండి,' అంటూ వెనక్కి చూస్తూ ముందరికిపోయాడు వాడు గొణుక్కుంటూ.

తాను పాదరసపు బుడ్లపైకే మంత్రముగ్ధ అయి చూస్తోండడం చేత మునసబుగారి హావభావాలను తిలకించలేదు. వస్తూనే ఆయన పనేమని అడిగారు. బుడ్లవంక చూస్తూనే చెప్పింది. తాను చెప్పిందో లేదో, ఆయన బుడ్లను స్వయంగా దింపి, వగరుస్తూ తన చేత పెట్టాడు.

'నేనుదింపును కాదండి' అన్నాడు పెద్దపాలేరు, కాంపౌండు గేటావలనుంచి.

'ఇక్కడే ఉన్నావన్నమాట వస్తున్నా'నని మునసబుగారటు తిరిగేటప్పటికి వాడుపరుగుచ్చుకొన్నాడు.

పాదరసపుబుడ్లు బహునాజూకైన గుల్లసరకు కాబట్టి మరీబిగ్గా పట్టుకుంటేను, జారవిడిస్తేను పగిలిపోతాయని మునసబుగారు అదుర్దాపడ్తోన్నారనుకొంది. నిజానికి అంత చేటు అవసరంలేని శ్రద్ధతో, తన చేతి వ్రేళ్ళలోకి మునసబుగారు వారివేళ్ళనుపోనిచ్చి, బుడ్లపట్టు విడుపులవిధానం, గ్రుచ్చి గ్రుచ్చి బడిపంతుల్లా చెప్పిందేచెప్తూ, తనచేత పెట్టిపట్టించాడు తనకు తెల్సునన్నా వినుపించుకోడు. ఆయన అంతశ్రమతీసుకోకపోయినా, తాను వాటిని ప్రాణపదంగా తీసుకువెళ్ళేదే. పరద్రవ్యం. ముఖ్యంగా తనపందిరికి కావాలి. తనకు వచ్చిన ప్రమాదం మాత్రంఏముంది; ఆయన అనవసరంగా శ్రమించాడుగాని. కాలహరణమూ కాలేదు. పడితేగిడితే తన వ్రేళ్ళమీద, ముంజేతిమీద గోటినొక్కుళ్ళు రెండుమూడుచోట్ల పడ్డాయేమో. చివరిగాజు ఒకటి చిట్లింది. ఏమంత మహద్భాగ్యం. ఇంతకూ మునసబుగారు వ్యావసాయికుడు, వ్యావసాయకుల వ్రేళ్ళు, వైఖర్లు కొంచెంమోటుగా ఉంటై. దానికేమొచ్చె.

గదిసద్దుళ్ళల్లో అమ్మాణీ పాదరసపుబుడ్లను చూచి, "అమ్మా నాన్న వచ్చాడే" అని కెవ్వున కేకేసింది.

ఆవిడ దొడ్లో నూతిదగ్గరనుంచి శరవేగంగా 'ఏరే ఏరే' అంటూ వచ్చిపడింది. భర్తృసమాగమాకాంక్షతో ఆతురతగావచ్చిన యిల్లాలికి,

భర్త రాలేదని నిజమే చెప్పినా, అది సువేళాన్వితం కాకపోవచ్చు. కాకపోతే మాత్రం కుమారిక ఏం చేస్తుంది గనక, కలహూపు చెప్పక.

"అయ్యగారు రాలేద"ని సవినయంగా చెప్పింది.

"పెద్దదాని తోటచే మీపరిహాసాలు, ముకిసుగ్రతనమొస్తోంది" అని ఆవిడ కాస్త కటువుగా అంది.

భర్త యింకా రాలేదన్న ఆశాభంగ కారణమై యుండాలి. 'పరిహాసం కాకపోతే, మరెందుకు వచ్చారన్నా'నని, అమ్మాణీని అడిగేలోపలే, అమ్మాణీ పాదరసపుబుడ్లను చూపి, "నాన్న రాకపోతే, యివి ఎక్కడనుంచి వచ్చె అంటూ"వని ఎదురడిగింది.

కుమారిక నాలుక కరుచుకొని, "అవి నే తెచ్చినవమ్మా. తేవడంతోనే, నీతో చెప్పకపోతిని, ఊరక అమ్మగారిని ఆయాసపెట్టాం," అని కుమారిక తలవంచుకుంది.

యజమానురాలు రంగురంగుల బుడ్లవంక చూస్తో, నవ్వు ఆపుకోంటో, "కాకపోయినా, నీవు పుట్టనిబిడ్డకు పేర్లెడతావే కుమారీ, అలా చూలాలూ లేదన్న సామ్యంగా చేశావు. పందిరే లేందే, పాదరసపు బుడ్లు ఏమి చేసుకోమే! సరి, వాటిని చితక్కుండా నైనా చూస్తోండండి" అంది.

ఆమాట మీద అమ్మాణీ, "అమ్మా, వెయ్యబోయ్యే పందిళ్ళకు, కట్టబోయ్యే బుడ్లను, మరోచోట పెట్టినా, ఎక్కడైనా కట్టినా, యిక్కడే పెట్టినా" అని, స్ఫుటంగా 'రైమ్' వినుపించే ఆధ్యాత్మరామాయణకీర్తన బాణీని, రెండు చేతులతోను అభినయిస్తో అడిగింది.

అమ్మాణీ మాటలోకూడా, తాను చేసిన పనివెల్తి ధ్వనించినా, కుమారిక నవ్వు ఆపుకో లేకపోయింది. ముభావంగా ఉండే అమ్మాణీకి, కుమారిక సహవాసం బుద్ధి వికాసాన్ని కలుగచేస్తోంది అనే, సంతోషంతో 'పొడుపుకథ కట్టులో అడిగావే అమ్మాణీ' అని సీతమ్మగారు ఒకటేనవ్వు.

యజమాని గ్రామాంతరం వెళ్ళింది లగాయితు, పందిరి పడలేదని ఖేదిస్తోన్న యజమానురాలు, యీ కారణంగానైనా కలకల నవ్వింది. "అంతేచాలు, తర్వాత పందిరి వేశామో, మానామో, దానికేం" అని ఆనందించుకొంది కుమారిక.

తాను కుదిరినవారింటి కష్టసుఖాలు తనవైనాయి పదిరోజుల్లో, ఆతో దాక్షిణ్యం పొందగలిగే ఉత్తమలక్షణం కళాహృదయవిశేషం నిర్మలిన, నిస్వార్థ హృదయంతో ఆకుటుంబాన్ని ప్రేమించింది కుమారిక ససాక్ష్యం.

## 2. శ్రీహరి

ఆనాడు సాయంత్రం కుమారిక వీధి గుమ్మాలకు పసుపు రాస్తుంటే ఎవరో, ఏమో. కుమారికకు తెలియదు, ఒక వికృతాకారం. పదిబారల్లో వీధిలో తచ్చాడ్తోంది. వివాహవేదిక పనిపాపతు పరికరమేదో వీధి నడవలో దిగడితే లోనికి తెచ్చుటకు కుమారిక రోడ్డు పంచకు వెళ్ళేసరికి, ఆమనిషి కుమారికను సమీపించింది. తారుణ్యం తొలిరోజుల్లో, బహువ్యాపృతయై స్వచ్ఛంద జీవితానికి శరీరాన్ని బలిచేసి శుష్కించిన లఘుశరీర, స్వల్పకేశి, పొగచూరిన పెదవులు, మెరుగుచూపిన నీగాళ్ళు. ముప్పై ఏళ్ళనాడు మంచిరోజులు చూసినదేనట. ఎంతమంది విటులనో ఉఱ్రూతలూగించిన సౌయ్యట.

"విటులకు కొంగుబంగరము, వేడుకగాండ్రకు బట్టుగొమ్మ,
యుపకాంతుల జేరువపంట, జారసత్పటలికి బంగదార"

అనేటట్టి స్వైరవిహారిణి. పసకాడి పాపమీనాటికీ, అరసిక జనంలో కాన్నే నమ్మి, జారజారిణులమధ్య రాయభారాలు నడిపి పొట్టోసుకొంటోందిపుడు. ఈమాత్య విద్యాప్రావీణ గంపంత సందేశం యేదో మోసుకొచ్చికూడా, చల్లకొచ్చి ముంతదాచిన విధాన, వచ్చిన విషయం యెత్తకుండా, గంపదింపకుండా.

'ఏది కులము నామ మెయ్యది యెవ్వండ
దాన వేమిపనికి బూని యిప్డు
డెచ్చుట బుద్ధి తలచి యేగెద వింతయు
తెఱంగ చెప్పు నాకు మెఱుగుబోడి"

అనేటట్టి బహు నిరపాయకరమైన ప్రశ్న మాత్రం వేసిందంటే కారణం, ఎంతచెడ్డా శ్రీహరి వృత్తిరీత్యా సూక్ష్మబుద్ధి కావాలి కాబట్టి కుమా

రిక సౌందర్య జ్యోతిస్సులతో సావిత్ర్యం తొణికిసలుతున్నట్టు తోచి, తానొచ్చినపని తనకు తలమీరిన పని అని తెల్సుకొని ఉండాలి. ఆప్రశ్నకు సమాధానంగా కుమారిక 'నీవెవరో నాకు తెలియదు. నావర్తమానం వివరించుటకు మతి లేకుండా ఉన్నాను. ఏమీఅనుకోక నన్ను వదిలిపెట్టు తల్లీ" అని ముక్తసరిగా మూకుమాటలే అంది వెనక్కు తిరుగుతో.

"లేత వయస్సులోనే, నీకంత బాధ ఏమివచ్చిందో చెప్పకూడదటమ్మా" అంది శ్రీహరి.

"ఏముందమ్మా, అవ్వా, మాఅమ్మాణీ పెండ్లి, రేపురాత్రి వెళ్ళగా, ఆ తెల్లవారుఝామున, ఇప్పటికింకా పందిరి పడలేదు. ఎన్ని అలంకారాలో చేసుకోవలసిఉన్నై, యజమాని ఊరలేరు. ఈపందిరి పడాలని వేయి దేవుళ్ళకు మొక్కుకుంటున్నా. ఏదేవుడు కరుణిస్తాడో. అంతదనుక, ఏరితోనూ ముఖంవిప్పి మాట్లాడ బుద్ధి వేయటంలేదు" అంటో కుమారిక లోనికి పోయింది.

'ఆహా!' అంటో శ్రీహరి సంతోషభరాక్రాంతస్వాంతయై వీధిని పడి వెళ్ళింది.

ఆరాత్రి కుమారికకు కలతనిద్ర. పందిరిగుంజలు పాతుతోన్నట్టు, వాటి ప్రక్క మట్టిని తాను గట్టి చేస్తున్నట్టు, కలకని, నిద్దట్లో కాళ్ళధరినున్న పెద్దగుండిగను తన్నింది. ఆ శబ్దానికి అమ్మాణీ సీతమ్మగార్లు ఉలిక్కిపడిలేచి, 'ఆచప్పుడేమి' టని కుమారికను అడిగారు. కుమారిక నిజ స్వప్న వృత్తాంతం చెప్పింది.

"అమ్మాయీ, కుమారి, పందిరిపడకపోతే పెళ్ళిఆడ్డమకద. పందిరి కోసం ఇంతచేటు బెంగపెట్టుకున్న వాళ్ళను ఎక్కడా చూడలేదు. నిద్రహారాలు లేకుండా తపస్సు చేస్తోంటివి. జబ్బుచేసేను పరుండు' అని, ఇట్టి దీక్షాపరతంత్రురాలు తప్పక సద్వంశ సంజాత అయియుండాలి అనుకుంటో నిద్రకు పడింది సీతమ్మగారు.

సీతమ్మగారి దృష్ట్యా పందిరి ఆవశ్యకత అతి స్వల్పమే కావచ్చు. కళోపాసకులు వారి కృషినే, జీవిత సార్థక్య సంసిద్ధిగా భావిస్తారు. ఇతరులకు తమ క్రియాకౌశలం ఉపయోగపడాలని కోరుకుంటారు.

అమ్మాణీ పెండ్లివేదికను అనితరసులభమైన కళా వైదగ్ధ్యంతో అలంకరించాలని కలలు కంటోన్న కుమారికకు, పందిరి ఉపకరణాలైన కంటబడకపోతే జీవితకామమే తునిగిపోయినట్టు కించపడడం సహజం.

అరుణోదయ కాంతులు ప్రత్యక్షమవుతోంటే. కుమారిక తలుపు తీసుకొని వీధిలోకొచ్చి, తనకళ్ళను తాను నమ్మలేకపోయింది. ఇదికలా, కల్లా, కాక నిజమేనా? వీధిగుమ్మం ధరిని గుంజలు, వెదురు, ఆకులు, వదపలు, తడిపలు, పందిరి సామగ్రి అంతా పడేసిఉంది. కళ్ళు నులుపుకొని, మళ్ళాచూచి, గుంజులమీద, ఆకుమీద చెయ్యివేసి, నమ్మకం చిక్కబట్టుకొని ఒక్కపరుగున వాకట్లోకి వెళ్ళి, 'అమ్మగారు' అమ్మగారు ఎల్లావచ్చిందండి, పందిరి సామానంతా వీధిలో ఉంది?" అని, గదిలో పరుండి ఉన్న సీతమ్మగారితో చెప్పింది.

"నేనన్నంతపనీ అయిందే అమ్మాణీ, కుమారిక పలవరిస్తోందో, పరాకు మాటలో చూడవే" అనిసీతమ్మగారు తిరుగా కనుమూసింది.

అమ్మాణీ కుమారికను దగ్గరకుపిలిచి ఒడలు తాకింది.

"చెప్పినా నమ్మకపోతే ఏంచేసేదమ్మా, అకిటికీలోంచి చూడరామా సామానంతా కన్పిస్తుంది," అంది కుమారిక రుద్ధకంఠంతో.

"అమ్మా నిజమేనే!" అంటో అమ్మాణీ పక్కమీదనుంచి ఉరికి, తల్లిని లేపుకొచ్చింది.

ముప్పేరు వీధిలోకొచ్చి 'ఏలావచ్చాయి' అని విస్తుపోతో, చివరికి, అయ్యగారు ఎవరికో పంపిరిపని పురమాయించి వెళ్ళిఉంటారు. మనతో చెప్పి వెళ్ళకపోవడం మూలాన మనం అనుర్ధాపడి పోతిమని గతకేనులైనారు.

ఆనందంతో అందం అతిశయిస్తుంది. నవయౌనపు తొలివెలుగులు కుమారిక సర్వాంగములపై వర్తిస్తున్నై. విసవిసా నడుస్తో, దేవాలయం వద్దనుంచి పూలసెజ్జతో కుమారిక వీధిగుమ్మంలోకొచ్చే సరికి, ఎవరనుంచి మునసబుగారు తన పెద్దపాలేరును, యిద్దరుపని మనుష్యులను వెంటబెట్టుకొని, వీధిమలుపు తిరిగి పెళ్ళివారింటివైపుకు వస్తోన్నాడు. ఇద్దరి చేతుల్లో గడ్డపారలు, ఒకడి చేతిలో రెండుపారలు, నిచ్చెన ఒకడిచేతులోను ఉన్నై, మునసబుగారు, ముస్తాబు మీద, పట్లెటూరు వెళ్ళి కొనుకులా ఉన్నాడు.

## 3. మునసబుగారి కాంతాచింత

మునసబుగారు కమ్మదొర. కలిగిన రైతు. యాభైదాటిన వయసు. వీధి మలుపులు తిరిగేటప్పుడు, ముందు చూపరులకు కన్పించేది వారిబొజ్జ. కమ్మగా నేతిపెరుగు పట్టించి వచ్చే వారిబొజ్జ చూచేవాళ్ళకు కూడా కడుపునిండేటట్లుంటుంది. నిరుపేద మొగకు గుదిబండలా పెద్దకుటుంబాన్ని కడితే, చూచేవాళ్ళకెంత ఖేదకారణమో ఆపాడిపంటలుగల ఆసామికి, భగవంతుడాసైజు బొజ్జను ప్రసాదించడం, అంత ఆహ్లాదకారణం.

బాలభానుని శీతకిరణ ప్రసారంతో కొత్తఅందాలు సేకరించుకొంటోంది బొజ్జ దానివెనక, దానితాలూకు మునసబుగారు గుమ్మంధరికొచ్చారు. వారుధరించిన తిరుమణి తిరుచూర్ణాలు వారిపూర్వాచారపరాయణతకు రుజువిస్తోన్నై. ఎంత కాసు కరిగించికట్టించారో, వారిబంగరుగోపత్రాడు, ముందర భాగాన్ని వారి బొజ్జయిరుకున పెట్టి నొక్కేసి అదృశ్యం చేసినా, మిగతా భాగం వారిమొలను జెర్రిగొడ్డులా కన్పిస్తోంది. పండుగపబ్బాలకు శుభకార్యాలకు మాత్రం పైకితీసే వారిసింహతలాటం మురుగు, ఈనాడు చేతిని శోభిస్తోంది. ప్రశ్నకు పెట్టిన రంగురంగులరాళ్ళ ఉంగరాలు లేత ఎండలో ధగాల్ మంటున్నై. నీలిమంపు నాయులనంపుండు వెదజిమ్ముతోన్న పల్లెటూరుతుకు తెల్లగోచంమసంచె, మొన్నవారింట వివాహంలో వియ్యాలారెట్టిన అత్తాకోడలంచు, కొత్త ఉత్తరీయం, మంచిపోషక్కుమీద ఏపుగా పుష్కలంగా పెరిగిఉన్న గుప్పెడుమీసం, వారికుటుంబంలో తరతరాలుగా, మునసబీతోపాటు అనుగులో అడుగేసుకొంటో వస్తోన్న వలంగల పేపబెత్తం, ఆనాటికీనాడు దేశంలో అస్తమిస్తోన్న పూర్వపు పల్లెటూరు అందాన్ని, 'విక్టోరియన్ యీరా' ఉన్నతస్థాయీ రసికతను సాక్షాత్కరిస్తున్నై.

మునసబుగారు వితరణి, గుణపురుషు, స్థిరభాషి, ప్రశస్తిగన్న శృంగారలీలా వినుతు. వారి శృంగార ప్రవృత్తి బహులక్షణయుక్తమైందని ప్రతీతి. శృంగారలీలల్లో యుక్తాయుక్తవిచారణ దక్షుడు, సమయాసమయభేద, వివేకం కలియత్రొక్కుకొని యెఱుగడు. సిద్ధాన్నమన్న శృంగార సన్నివేశంలో కూడా, ఏకొంచెం బిగుసుపగును పొడగట్టినా

విస్తరముట్టడు కాంక్షసిద్ధికి తీవ్ర పెట్టోన్న బుద్ధికి పట్టిన్న కళ్ళెం వేయగలడు. తనకు ముద్దిక కాలం ఎంత మంది పడుచులతో తన ఖుష్షీన పెళ్ళిళ్ళుచేసి ఓయి టివాళ్ళను చేశాడు కాని, స్వసుఖమపేక్షించి, వాళ్ళ కన్యత్వాన్ని మలినపరచలేదు. ఏసంసారవిచ్ఛిన్నమూ చేసిన పాపాన్ని పోలేదు. శోడఘూ కామందులు వతవత లాడినా, ఖాదరుచెయ్యకుండా, పనివాళ్ళ నూతన వధూవరులు వీరింటికొచ్చి చీరె, జామారు కట్టుకువెళ్ళే సంప్రదాయమొకటి, ఈయన హయాంలో ప్రారంభం చేశాడు. వలచిన వాళ్ళకు వసతులేర్పరచాడు కాని, తనను కానట్టు తప్పుకు తిరిగే కృతఘ్నులకు వడిగట్టినవాడు కాదు. ఎవర్నీ ఆశపెట్టి ఉసురు పెట్టలేదు. కొత్తపిల్లలను చూచి పాతవాళ్ళను చులకనచేయలేదు. 'అంద మెరిగిన రసికప్రభువ'ని అందకత్తెలాయిన్ని శ్లాఘిస్తారు. తత్ప్రతిష్ఠను ఒక గౌరవనీయమైన 'నైట్ హుడ్'లా భావించే మనస్తత్వం. స్త్రీ హృదయాన్ని ఆకర్షించడం, ఒక మహాపురుషలక్షణంగా భావించే బడాయి తప్పితే, యిటీవల చేసి చూపెట్టిన శృంగారవిజయాలు లేవు. లేవని బెంగ లేదు. ఇప్పటి దేవులాట 'వేనిటీ' తృప్తికి కాని, 'సెక్సు' తృప్తికి కాదు.

కథా కాలంనాటికి బాగా పరిపక్వమనస్కుడైనాడు, మునసబుగారి కిపుడు శృంగారరంగంలో కార్యాలుతగ్గినై, కబుర్లు పెరిగినై, కోతల్లో యువతులు పనిచేస్తోంటే, యిప్పుడు గట్టుమీదకూర్చుని వాళ్ళతో సరసాలాడ్డం, మధ్యమధ్య వాళ్ళకుకర్రా, కాలూ, చెయ్యీ ముట్టించి నవ్వించడం, కొంటెమాట అని కవ్వించడం, ఎక్కువగాయిదీ, వారి ప్రస్తుత శృంగార కార్యకలాపం. శక్తితగ్గినా ఆసక్తి ఉడగని ఒకరకం తత్వం కావచ్చు.

భార్యాభర్తలిరువురకు సమానంగా ప్రేమపాత్రుడే. తన కూలినాలి జనం కుటుంబాలు పొచ్చుపొరలు లేకుండా సాఫీసంసారాలు చేసుకునేట్టు తగువులు తీరుస్తాడు. 'అయ్యగారితో చెప్తాను జాగ్రత్తగా మసులుకో' అంటేచాలు, అది ఒండోరులను మందలించుకోవడమే. ఎవరు మంచాన్ని పడ్డా మరోకుంచెడు ముట్టచెప్తోంటాడు. సుతిమించిన రోగాలకు గాని, కూలినాలిజనాలకు వేరేవైద్యుడక్కరలేదు. గృహవైద్య మామాత్రం

సంపెకెట్టు తిన్నవాడు. సత్యాలకు, ప్రపంచాలకు. అవుపాలయిబ్బందీ పత్యపుకూరలయిబ్బందీ వాళ్ళు పడనక్కరలేదు. వారిజొన్నలకు కోతలకు సుందరులు ఎగబడ్తారంటే, కుండపిడిచేస్తేనోట, కుండుకుంచాలు కొలుస్తాడు. ఆయన చేతిపైచారికు సేసుగింజలప్రతాపమని ఉబలాట పడ్డవాళ్ళే గాని, యింటికెళ్ళి 'పిడికిచ్చుకుంటనం కాలిపోను' అని కుమ్మెత్తి పోసిన వాళ్ళు వారికూలీల్లో ఏనాడూలేరు.

ఎవరిపొలాలమీద ఆయన పొలం మరోపుట్టెడు అధికోత్పత్తి చూపెడ్తుంది. అతి అనావృష్టులమూలంగా పంటలు దెబ్బతిన్నా, తన కూలినాలీ జనం పొట్టకు దెబ్బతగలకుండా కాపాడ్తూనేవున్నా, అందుకు కావాల్సిన పొదుపూ యెఱుగును. వారిపొలంపనికెళ్ళడం, ఆటపాటలకెళ్ళినట్టే. వారు గట్టునకూర్చుంటే. వారికమతంలో రైతుకూలీవ్యావసాయిక సమస్యలకు తావులేదు. రాచకీయపాండితికి అవసరంలేదు. బాధ్యతారహితుడైన రాచకీయవేత్త ఒకడు వ్యవసాయకూలీల సభపెట్టి, పరదేశోపమానాలేవో ఏకరబెడ్తో. ఈమునసబును భూర్జువా, 'ఫ్యూడలీలార్డు,' వ్యావసాయి 'కాంట్రపెన్యూరీ' అని ఏవేవో పేర్లుపెట్టాడట!

నిజంగా తెలియకనే కూలీలు భూర్జువాకు అర్థం అడిగారు.

'బలేమోసగాడు' అని అర్థం చెప్పాడు. 'వీరి మోసమేమి' టని అడిగారు.

'కావల్సినవిచ్చి, మీకు రాచకీయపరిజ్ఞానం లేకుండా చేస్తున్నా' డన్నాట్ట ఆ బుద్ధిమంతుడు.

కూలీలు బొబ్బనవ్వెట్టారు.

"మాకు కావల్సినవన్నీ యిచ్చి మీరు మోసంచేసినా, మీతోటే వస్తాం, లేంర్రా" అని హెచ్చరించుకొన్నారట.

"ఓరిబాబో వీళ్ళనెవళ్ళు మేపను" అని పరుగెచ్చుకొన్నాడు రాచకీయవేత్త తన రాచకీయపాండితిని మూటకట్టుకొని. మునసబుగారి పొలంగట్లు, రాచకీయపార్టీలకు పోతగిట్లులాంటి 'ప్రివెంటివ్.'

ఫలనా అని వైనం తెలియక పోయినా, కుమారిక రాక మునసబుగారికి తనపాలేళ్ళ తగాయిదాలో తెల్సింది. మునసబుగారి పెద్దపాలేరు

వాడి స్థాయిలో వాడూ రసికుడు. వాడి అభిరుచికి తగ్గట్టే, పొలాల గట్లంట, కాలవమార్గాన తిరిగే కూలిపడుచులు, పైటలు సర్దుకుంటారు. వాడుకంటబడితే భయవిహ్వలలవుతారు మునసబుగారికి తుంబురి హాయి శృంగారగాథలను వినకపోతేను. వాడి భార్య ఏమైపోతుందని, వీడిని నయానో భయానో బాగుచెయ్యాలని, ఎన్నిఫిర్యాదులొచ్చినా ఓర్మి వహించి, ఉపన్యాసం చెప్పకుండా ఊరుకున్నాడు. యజమాని కాంతా చింత కొంత కారణం కావచ్చునొకవిధంగా వాణ్ణి ఆజ్ఞలలో పెట్టలేకపోవడానికి.

కుమారిక అగ్రహారంవచ్చిన రోజున ఊరుకు దారి దొరక్క పైపొలాలల్లో తిరగడం చూచి, ఈతుంబుర రాగాంధుడై ఆమెను తన పాకకేసి పంపించాడు. తాను వెనకాలే బయల్దేరాడు. కుమారిక తన పేరింటి కుమారిక వలెనే, శివకటాక్షంకల కన్యకాబోలు, మునసబుగారి బహుబలిష్ఠమైన మెద్దోటి, కేవలం అప్పృష్ట భామాధుడే కుమారికా మానసంరక్షణార్థం ఎక్కడ తోస్తున్నాడా అన్నట్టు, బ్రహ్మాదులైనా నిలువరింపజాలని అగణిత వేగంతో, దూర ప్పొలాలకు దవుడు తీసింది. ఎట్టెట్టో దాని కొమ్ము వాతను పడకుండా పెద్దపాలేరు దాన్ని మళ్ళేసుకొని. తనపాక వద్దకు వచ్చేలోపల మునసబుగారి చిన్నపాలేరు, కుమారిక అడిగితే, సరియైన మార్గం చూపాడు. కుమారిక ఊళ్ళోకివెళ్ళిన కొంతపటికి వచ్చాడు పెద్ద పాలేరు. ఈకుర్రవెధవ పానకంలో పుడకలా తనవాంఛితానికి అంతరాయం కల్గించనా అని కలుషించి వాణ్ణి చెంపలువాయగొట్టి, ఊళ్ళోనుంచి ఉడాయించాడు పెద్దపాలేరు.

కుర్రాడు పెద్దపాలేరు దౌష్ట్యాన్ని మునసబుగారితో పితూరీచేసుకోవడంలో కుమారికఊసు ఎత్తాల్సివచ్చింది. కాని కుర్రవెధవ ఆమెఅందచందాలను అభివర్ణించగలిగినంత ఆదాయంచాలక, 'అమ్మామ్మమ్మ, ఆఅమ్మాయి గోరిఅందమండీ దొరగారూ!' అంటూ కొన్ని 'సుపర్లెటివ్' ఆశ్చర్యార్థకాలను మాత్రం వెచ్చించి, కళ్ళుతేలేసుకుంటాడు. ఆపిల్ల ఎవరో మానవాతీతమైన సౌందర్యరాశి అయియుండాలని తలచి, కాని ఊళ్ళో ఎక్కడ చేరిందో 'డేటా' లేక, ఆమెవిషయం తదేకచింతనున్నాడు మునసబుగారు.

పెద్దపాలేరు పడేవాతను పడకుండా ఆ అమ్మాయిని చిన్నపాలేరు కాచి నందుకు ఎంతహర్షిస్తోన్నాడో, ఇంతఅవసర కార్యంలో, ఎక్కడికి వెళ్ళా లమ్మా అన్న ఒక్కప్రశ్న, లెక్కొక్కటి, వేసే తెలివి ఈ కుర్రకుంకకు లేకపోయినందుకు అంత చీదర పడ్తున్నాడు మునసబుగారు. కొద్దిరోజు లకు పెద్దపాలేరు ఊళ్ళోకి రావడం, మునసబుగారు తంయింటి అరుగు మీదకూర్చుని, పాలేళ్ళ తగువు తీరుస్తోండడం, అదేసమయంలో కుమా రిక, పాదరసపుబుడ్లకు మునసబుగారి ఇంటికివెళ్ళడం, తర్వాతవృత్తాంత మంతా చదువర్లకు విదితమే.

# 4. నిర్మాణము

తన చింతనే మునసబుగారున్నారని తెలియని కుమారిక, వారుపని మనుష్యులతో తమయింటిమీదుగా పొలంవెళ్తూన్నారనుకొని, ఒకఅడుగు ముందరకేసి, క్రితం రోజున బుడ్లు యిచ్చినందుకు, కృతజ్ఞతాపూర్వకంగా "దండాలు దొరగారూ" అంది.

మునసబుగారు చకితుడై, ఎంచేతో మాటల్లో దిగడానికి ఇచ్ఛగింపని తొందర నభినయిస్తో, "యింట్లోనుంచి రెండు బిందెలనీళ్ళు తెచ్చి పడే యాలి.ముందాతాటాకు బడిపి తడపాలి. ఆతర్వాతదండాలు" అన్నాడు.

కూడావచ్చిన వాళ్ళు, జవ్వనుల విషయంలో మునసబుగార్కి కలిగే దౌర్బల్యం ఎరుగున్నవాళ్ళే కాబట్టి, మనం బాడ్మింటన్ మాచ్చిని చూచే టట్లు, మునసబుగారి వంక కుమారికవంక. కుమారిక వంక మున సబుగారివంక, మెడనరం పట్టేటట్టు ముఖాలు తిప్పడం మొదలెట్టారు.

"ఏట్రా ఆలామిటుకు మిటుకుచూస్తో నుంచుంటారు, గోతులు తీసి గుంజలు పాతక" అన్నాడు.

కుమారిక, సీతమ్మగారు, ఈపందిరి వేయించడం యజమాని ఎవరికో పురమాయించి వెళ్ళారు అని అప్రొద్దుటే అనుకున్నారుగా. "అహా మునసబుగారికా అయ్యగారు చెప్పివెళ్ళింది. అందుకా నాయినా, నిన్న మునసబుగారు, అడిగింది తడవుగా, బుడ్లు యిచ్చి పంపారు. నాప్ర యోజకత్వమేనని సంతోషించుకొన్నానే," అనుకుంది కుమారిక.

ఉంచేసి మరేమీ ప్రసంగించ నక్కఱలేకుండా నిముషాలలో లోపల కెళ్ళి నీళ్ళు తెచ్చింది.

“పందిరజోక్యం మీకెందుకు కావల్సొచ్చిం”దని ఆమెఅడిగితే ఏమి చెప్పాలన్న పక్క బెదురున నున్నాడు మునసబుగారు. నిజమే చెప్పడం, ఎంత వెర్రి. తన రహస్య ప్రణాళిక ముంచే వీధిని పడ్తుంది. తేలిపోతాడు. తేలికైపోతాడు. గౌరవభంగం ఎప్పుడూ వప్పుకోడు. పైపెచ్చు పతిత శ్రీహరిని పంపించి, నాస్వవిషయం చాటు పరీక్ష చేసి, నాఅవుసరం తెల్సుకొని, అయాచితంగా యీపని చేసినట్టే చేసి. అక్కడనుంచి మర్యాద హీనంగా “నామాట ఏంచెప్పావ”ని నన్ను ఒత్తుడుచెయ్యడానికి యింత పన్నాగం పన్ని. నీచప్పునికి పాల్పడ్డ వాడివి, “నీవూ అక్కఱలేదు, నీపందిరీ అక్కఱలేద”ని కసిరి కొట్టకలదు.

చూస్తే కుమారిక ఒక దాసీవనితలా కన్పించదు. సాదరసపు బుట్ల కొచ్చినపుడు చూచాడుగా. తెల్వి కొట్టవచ్చినట్టున్న ఆమె మోములో శివి పుంజీభవించి ఉంది. ఏమి ఆరాకడ ? అర్థించవచ్చేవాళ్ళ బీద అడుగువేసిందా! ఏమి! ఆమాటపోకడ! ఖణుగు బెణుగు రెండు మాటల్లో అడిగింది. ఏమూలా అవసరం చెప్పుకునేవాళ్ళ మాటనసుగుడు లేదు. ఏమి ఆదృష్టినిలకడ! తానెన్నివిధాల ఆమెదృష్టిని తనవైపుకు తిప్పుకుందామన్నా తన తరంకాలేదు. వచ్చినవేళనుంచి వెళ్ళేదాకా, బుట్ల వంకే నిదానంగా చూసిందే. మాటలో గాని, చేష్టలో కాని బీదరికంలేదు. పట్టుకెళ్ళేటప్పటి ఆనందంలో జేలతనంలేదు. ఇచ్చేవాళ్ళకు పుచ్చుకునే వాళ్ళకుకూడా ఆమెబుట్లు పట్టుకెళ్ళడం శుభదాయక మనిపించిందే, ఈ కన్య దాసీస్థాయిది కాదు. దాసినే అయితే అందులో మహారాజులను కొలచే ఉత్తమశ్రేణి. ఈ పెవశీకరణ నిలకడమీద కాదగ్గపని. వచ్చిన తొందరలేదు. రామశాస్త్రుల్లగారింట వివాహాదికములు పూర్తిఅయ్యేవరకు, తానెందుకు పందిరిపనిమీద పెట్టుకొన్నదీ పైకిపొక్కరాదు.

ఇంతకూ, మూర్తీభవించిన ఈసౌందర్యలక్ష్మి సామీప్యతకన్న తానిపుడాశించేదేముంది? అది లభించింది. పనిగొడవనిపెట్టియీ ఎలప్రాయపు జవ్వని అవయవసౌష్టవాన్ని ఆమె శరీరభంగిమలను తిలకిస్తూ, మధ్యమధ్య పనిలో

తన సలహానుజ్ఞలిస్తో, సంభాషణసాగిస్తో, తనశృంగార రచనకు నేడు నాందీవాక్యం మాత్రం వ్రాయ నుద్యమించాడు. శాస్త్రుల్లుగారింటలేడు, తాను గుమ్మంలోకొస్తుంటే బ్రాహ్మణ స్త్రీలాయింటివారు, బైటకురా భిడియ పడ్డారు. చక్కగా నేడీతన్వి తత్వం అంతో యింతో గ్రహించి, తర్వాత తర్వాత చల్లగామచ్చిక చేసుకోవచ్చు ననుకొన్నాడు వివేకి, మునసబు.

కాని యీడొచ్చినకన్య సామీప్యతలో పురుషుని సదుద్దేశాలు ఎంత సేపు ఆగుతై? బుద్ధి కప్పదాట్లు వెయ్యక మానదు. ఈబీదపాప డీమెను ఎంత కాలం పోషించగలడు. పెరుగుతోన్న పిల్లకు అవసరాలు పెరుగుతై. కూతురుపెళ్ళికే హాతాలాహాతలంఅవుతోన్న బ్రాహ్మడు, దానీకన్యవివాహ మేమిచేయగలడు? ఈతరుణి కీయిల్లు ముఖంమెత్తిన మరుక్షణంలో, ఈపెకు శుభ్రమైన జీవనభృతిచూపి, కోరుతుంటే ఓయింటిదాన్ని చెయ్యడమో, కా కతన్నే కోరుకుంటుందా, పెత్తనమిచ్చి, జై, తన అంటుమామిడి తోపుకు వనలక్ష్మిని చేయడమో జరుగుతుంది. అంటుమామిడితోపు తలపునకువచ్చేసరికి దానివెంటయెన్నో మధురస్మృతులువచ్చిపడ్డై. ఓహో, తాను వయసులో నున్నపుడు "సకలకళల సుఖగోష్ఠి సలుపు నెలవు మగతనంబుల కేకాంతమందిరంబు, పచ్చవిల్తుని కాయుదాభ్యాసశాల" అయిన తన అంటుమామిడితోపు మనోనేత్రంలోను, సర్వాంగసుందరి కుమారిక నిజనేత్రేంద్రియంలోను గోచరించిన ఆసమయంలో మునసబుగారికి యౌవనం తిరుగబెడ్తోన్నట్టు ముఖకళవళికలు మారజొచ్చై. శృంగారనాయకుల హావభావ విలాసాలు వచ్చి పడ్తున్నై. చేతులు పరిష్వంగప్రక్రియారంభులై కుమారిక వంక సాగసాహసిస్తున్నై. అంతలో మునసబుగారు 'అ-ట్టే-ట్టే' అని చెపలిని మనసును దారికి తీసుకొని, 'నుంచుంటే ఏమైనట్టు, మరో రెండు బిందెలనీళ్ళు తీసుకురావాలి. ఇక గుంజలాచుట్టూ మట్టితొక్కి గట్టి చెయ్యా'లన్నాడు. ఆయన గుంజ మొదట్లో నుంచునియుండగా కుమారిక బిందె తెచ్చింది. ఓరగా ఆయనపాదాలపైన నీళ్ళుపోస్తుంటే, గుంజ చుట్టూ మట్టినిత్రొక్కుతో మునసబుగారు ఆనందడోలికల్లో తేలిపోయాడు. 'ఇంతవడగళ్ళలాంటి నీళ్ళు ఎక్కడపుట్టై' అనుకున్నాడు. మునసబుగారి శరీరంలోనుంచి ఈవేళ ఏదో విపరీతమైన వేడి ఆవిర్భవించడానికి కారణం లేకపోలేదు కద.

"పిల్లా! నీ మూలాన మునసబుగారి ఒట్టుతిడుస్తోంది. చెల్లించడానికి కూసిన్ని చిలకరించాలి కాని అమ్మోరికి పోసినట్టే వారెట్టావు. ఆయన ఊరుకున్నాడు కందా అని, గట్టిదానవే" అన్నాడు పెద్దపాలేరు, ఆచివర నుంచి.

"నీకీపరీక్ష ఎందుకోయ్, నీపని నీవుచేసుకుపోక. మరిగంటే పిల్లఏమిట్రా నీకు పొగరమోత్తనం కాకపోతే" అన్నాడు మునసబు.

మరికాస్సేపటికి, ఏదోఅక్కుస్సు పెట్టుకున్నవాడిలా, పాలేరు "ఆరేళ్ళలోపల అయ్యగారెప్పుడూ యెకరాల కెకరాల ఎగసాయంలో కూడా ఇంత ఆయాసపడలేదు. వగురుస్తున్నారు. చెమట్లు కార్తున్నై. కాస్త వడి తగ్గించు పిల్లా" అంటూనే నాలుకకొరుక్కుని "అమ్మగారూ" అన్నాడు మునసబుగారివంక కొంటిగాచూస్తూ.

"ఆ అమ్మాయిజోలి నీకేమొచ్చింది. నీవు అక్కడ గుంజలు పాతవోయ్ ఆట్టేకబుర్లుచెప్పక, తెగబల్సిపోయావు" అన్నాడు మునసబుగారు.

"అపి — పి — అమ్మగారి మాట కాదండీ అయ్యగారు. మీకు ఆయాస మొచ్చిందన్నానండి" అన్నాడు వాడు.

"నువ్వు పనిచెయ్యడానికొచ్చావా నన్ను చూడ్డానికి వచ్చావా?" అని మున్సబుగారంటే, "మీమీదబతికేవోళ్ళం మిమ్మల్ని చూచుకోక ఏమి చెయ్యమండి, నేనెవర్ని చూడనండి, పోనీలెండి" అని కుమారిక వంకే చూడ్డం మొదలెట్టాడు వాడు.

"మాటలునేర్చినకుక్క బొయ్ అంటే బొయ్ అందట. ఏమాత్రంపని వెలగబెట్టావ్రా, చూడనీ" అంటూ వాడిదగ్గరకువెళ్ళి చూసేసరికి వాడి చేతులో గునపం పట్టింది, పట్టినట్టుంది.

"ఒక్కగొయ్యి తియ్యలేదు ఒక్కగుంజ పాతలేదు. "ఆరినీకడుపుడక ఏంచేస్తోన్నట్టురా యింతసేపటినుంచీ?" అన్నాడు మునసబుగారు.

"మీరాయాసపడ్తోంటే చూస్తో, కాదండి, చూడలేకపోయానండి" అన్నాడు వాడు.

వీడ్ని యిక్కడకు తీసుకురావడం అనాలోచితప్పని అయిందనుకొని, కుమారికను భోంచేసిరమ్మని లోనికి పంపించారు. తాను గుంజలదగ్గర

తొక్కుడమూ మానారు. ఇహ పాలేరును, పనివాళ్ళను తొందరలు విడిచేం చేసి, సరిగా పదకొండు కొట్టేసరికి, పందిరఅను కట్టడం, కాగితపు బుట్టలు గొలుసులు కట్టడంసహా యావత్తుపనీ పూర్తిచేయించి, వాళ్ళను యింటికి పంపేశాడు. పెద్దపాలేరును భోంచేసినతర్వాత ఏకో దూరపు పొలం పొమ్మని పురమాయించాడు. 'తర్వాతివచ్చి భోంచేస్తాను నాకోసం కనిపెట్టుకుండవద్దని మాయింటిదగ్గర చెప్పు'మని వెళ్తోన్న పని వాళ్ళతో కేకేసి చెప్పాడు.

"ఏంచేస్తోన్నారంటే ఏంచెప్పనండి యింటికాడ?" అంటో మళ్ళా వచ్చాడు పెద్దపాలేరు.

'ఒకటిరెండు రహస్యాల్లో, తెలివైనవాడవకదా అని, వీడికి చను విచ్చాను. నాదే తప్పు. తలెక్కితొక్కుతున్నాడు. శుద్ధపానకంలో పుడకయాడు' అనుకొని, "వస్తానన్నారు అను. అంతే. వాళ్ళదగ్గర అట్టే వాగక. జాగ్రత్త, తెలిసిందా!" అని అదమాయిస్తో వాడ్ని విరగడ చేసు కున్నాడు మునసబుగారు.

## 5. రసికప్రభువు శృంగారవిజయం

ఎండలావైనట్టే వీధుల్లో జనసంచారం సన్నగిలింది. భోజనాలవేళ. ప్యాసంజర్లు రానపుడు స్టేషన్ ప్లాట్ఫారాలకొచ్చే ఏకాంతత, నడివీధి పందిరైనా, యిక్కడ తాత్కాలికంగా వచ్చింది. తన నాందీవాక్య ప్రస్తావన కిది అనుకూలమైనఘడియ. ఉదయకాలమంతా వెచ్చించినా, శృంగారపోకడలకు కుమారిక ఏమాత్రం సుముఖురాలైందీ, అవగింజంతైనా తేల్చలేదు. అందుకు అంటీముట్టీమాట ఏదీ తానూ రానియ్యలేకపోయాడు. పందిరివిషయం తెప్పించి, మరేం ప్రసంగించినా అనౌచిత్యదోషం చుట్టు పెట్టుకుందనే భీతికల్గేటట్టు చేసోంది కుమారిక పందిరిదీక్ష. ఎంతసేపు చూచినా తాను ఎండనుపడి వగర్చడమే దిగడింది. తాను ఈరీతిని ఆర్రో జులు ఆయాసపడ్డా వ్యవహారం అరంగుళం ముందుకు జరిగేటట్టు తోచడం లేదు. 'కుమారికకు పందిరి, పందిరికోసమే కుమారిక' పని అయింది. తనకు పందిరి మరోఅందుకు. ఆ మరోఅందుకన్నమాట కుమారిక తలలోకి చోటితేగా. మూగబాధ మాచెడ్డబాధ.

పుణ్యకాలం దాటిపోతోంది. ఇకనైనా గ్రంథంలో దిగకపోతే, యింతపనీ చేసి, చేతులు నలుపుసుంటూ యింటికి పోవాల్సిందే. ధైర్యం చేసి, అప్పుడు సరససల్లాపాలు ప్రారంభిస్తోన్నాడు, నిజానికి అంత ఎండవేళ సరసాలకు లాయికి కాకపోయినా.

"పిల్లా, పందిరి ఏలాపడింది అంటూ!" వన్నాడు తొట్రుపాటుతోనే, యిప్పటికే 'పిల్లా' అని సంబోధించడానికి తెగువ తెంపులు చేసుకొని.

అమాత్రమైనా అనడానికి సాహసిస్తేగాని సరసం ఏలా సాగుతుంది? 'అమ్మాయీ' అంటే చెల్లెలో కూతురో లాగుంది. 'అమ్మా' అంటే యింకా సరసమేమిటి? సంబోధన దెక్కట్టువంపల్లనే, ఈ చివర 'నువ్వు, మీరు' అనకుండా ఆచివర నీళ్ళుతే, తేండి. అనకుండా, కోసలు తుంచేసి, 'నీళ్ళు తేవాలి,' 'బడిపి తడపాలి' ఆలా మధ్యగాపోనిచ్చి కత్తిమీద సాముచేస్తోన్నాడు. వినికిడినిపట్టి పనిమనిషి చూపునుబట్టి నిశ్చయంగా గొప్పింటికన్య. ఏకవచనంలో పలకరించడానికి మనసొప్పదు. బహువచనం పనిచెఱుపు ఇంగ్లీషుభాషలో 'యూ' ఈ మర్యాద సందర్గాలను మాచక్కగా తేట్టుకుంటూంది. అందుకే ఏమో మరో పదేళ్ళయినా ఇంగ్లీషును చెక్కుచెదరకుండా ఉంచాలంటున్నారు. నయం నయం కర్మార్థకంలో 'తేబడాలి' అంటో సంభాషణ సాగపెట్టాడు కాదు, వినలేకపోదుము. విద్యార్థులం కనకనా, యీ 'బడు' గుదిబంధను మెణ్నేసుకొని భరించడానికి. పోనీ యిదేదైనా ఖ్యాతికనకనా, 'ఒరే హెడ్మాస్టారుగారు అంతా 'పాశ్శివు వోయిస్సు' లోనే మాట్లాడ్తారా' అని మేం శ్లాఘించినట్టు. అంచేతనే ఓరకం మనుష్యులు రోడ్డుమీద హాఠాత్ గా కంటబడితే, 'బడు' బాధ పడాల్సివస్తుందనే గ్రంథంలో దిగబడకుండా, నేర్పుగా తప్పుకొని కనపడకుండా పోతారు బుద్ధిమంతులు.

మునసబుగారి ప్రశ్నకు "పందిరి పాకాన్నే పడింది" అంది కుమారిక.

"కూర ధప్పళం పాకాన్ని పడ్డై అని పెద్ద వంటమీద బ్రాహ్మలు అనేటట్టు అన్నావే. ఎక్కడ విన్నా" వన్నాడు పనిలోపని యీపె బ్రాహ్మణకన్యేమో అన్న సందేహం ముందు వదల్చుకోవచ్చుననుకొని.

కుమారికి దానికేమీ సమాధాన మీయలేదు.

"మా పందిరి చూచావు. మరి మీ పందిరి సామాన్ని పండించేవంటావు. ఏమిటా తేడా?" అన్నాడు.

"మీరు స్వయంగా నడుంకట్టి వేశింది మా పందిరి. మీ పాలే స్పర్శించినట్లై ఉంటుందిమీది. పనివాడితనంలో, నిర్మాణదక్షతలో ఆ తేడా కన్పించకుండా పోతుందా, స్వామీ!" అంది.

కుమారిక సమాధానంలో, మెళ్ళిగరిమెడు తెల్వి, కృతజ్ఞత చూపెట్టిందేమో కాని అందులో మునసబుగారి దాహాంతీరే రసవృష్టి ఏమున్నది? ఎప్పటిచోటే ఉన్నాడు మునసబుగారు.

ఎంతో చెయ్యాలని వచ్చిన వ్యవహారమంతా స్తంభించింది. రసాస్వాదన మార్గాన్ని అన్వేషిస్తోన్నాడు. సమస్యకు 'సొల్యూషన్' దొరకనపుడు, మనసు 'ఫస్టు కాజెస్సు'కంటూ వెతుక్కుంటూ, వెనక్కి వెడుతుంది. గత్యంతరం తెలియనపుడు గతవిషయాలను జ్ఞాపకంచేసుకుంటుంది. కన్య పరిచయభాగ్యం మొదటకల్గింది పాదరసపుబుడ్లే కారణంగా కద అని అనుకొంటోన్న తరుణంలో, శటాలున ఒక ఫ్లాష్‌లో కుమారిక వక్షస్థలంకేసి చూస్తున్న మునసబుగారికి పాదరసపుబుడ్ల స్నిగ్ధత, సైజు, గుండ్రం పొడగట్టినై, చాలు అనుకున్నాడు.

"మరి దిగడ్డ అలంకారం. పాదరసపుబుడ్లు నీదగ్గరే ఉన్నాయిగా" అని, 'చేత—నోటకవిత్వం' అంటారే ఆవిధానంలో, బహుసున్నితంగా, ఎడంకన్ను చిటకరిస్తో అన్నాడు.

అవును, పాదరసపుబుడ్లను కుమారిక గదిలో జాగ్రత్తపెట్టింది. అంచేత ఆపెకు అందులో విశిష్టార్థమేమీ గోచరించలేదు. సూర్యుడు తూర్పున ఉదయిస్తాడంటే విన్నట్టే, హావభావాల్లో ఏవిధమైన మార్పూ లేకుండా వింది. పైగా సాయంత్రం పందిరికి కట్టేస్తానంటో ఆయనమీద చన్నీళ్ళు చల్లింది. బుడ్లు పందిరికి కట్టదేమో అని బెంగపెట్టుకున్నాడా? పాదరసపుబుడ్లకి వైద్యంకూడా గుణంయివ్వకుండా పోయింది. 'తన్నే వైద్యుండు చికిత్స బ్రోవగలడో, ఏమందు రక్షించునో' అన్నట్టున్నాడు మునసబుగారు. బంగారంకూడా పుటంపెట్టాలేమో.

చివరకు జరిగిందంతే, ఫలితమేమైనా. అయోమయంగా చూస్తుంటే వివాహంవేదికకు ఎత్తుచేసిన స్థలం కన్పించింది. వివాహవేదిక మణిభూషణ చిత్రాంబరాలతో అలంకరించేది కాబట్టి, మునసబుగారి భావనాబలానికి ఇక్కడ తావు చిక్కింది. వధూవరులు పీటలమీద కూర్చున్నపుడు, మనిషిఎత్తుకు అట్టే మించియుండని అచిత్రాంబరాలక్రింద, పెండ్లికుమార్తె వెనక సాలంకృతయై కుమారిక నుంచుంటే, వివాహవేదికకు వేరే కృత్రిమాలంకారాలు కావల్సిరావు అనితోచింది. కూర్చున్న పెండ్లికుమార్తె వెనక కాస్త వరిగి నిలబడ్డ కుమారిక పయ్యెదను చీల్చుకొని, విద్యుత్కాంతి ప్రసరిస్తోంటే 'పదార్వన్నె పసిడిబుడ్లు కడితేమాత్రం అవి ఆపె పయ్యెద సరసని పనిచెడి, వెలవెలబోయి, వెక్కిరించినట్టు కావా' అని తోచింది రసికప్రభువుకు. ముందు మాట తోచక, మస్తిష్కం మధనపడిపోతున్నపుడు, మహాకవి ప్రయోగమేదో మనసుకు తట్టిన నాదారు రచయితమాడ్కి మురిసిపోతో అనేశాడు మునసబు.

"పందిరకు పాదరసపుబుడ్లు కట్టిన దానివి, వివాహ మంటపానికి, మేలింబంగారుబుడ్లు కట్టాలిసుమా" అన్నాడు, తెలిసీ తెలీనట్లు, అతిలాఘవంగా తన వేళ్ళవంపుతో దబ్బపళ్ళసైజు చూపిస్తో.

వేళకు కుమారిక మరెటుచూస్తోఉందో, మునసబు వ్రేళ్ళవికారం చూడలేదు. వ్రేళ్ళకొంటితనం కాస్త తీసేస్తే అది శృంగారరీత్యా నిరపాయకరమైన సలహా అయింది. అది ఆర్థికస్తోమతుతో కూడుకొన్నపని. తేగలిగితే కడ్తారు. లేకపోతే మానారు.

అంచేత కుమారిక, "అయ్యబాబో, మాకెక్కడ దొరుకుతై బంగారుబుడ్లు" అంది.

అపుడు మునసబుగారు, "రా, ఆలారా, దారికొచ్చావులే" అన్నట్టు, వుషారుగా, "నీదగ్గరే లేకపోతే, భూమండలంమీద మరి ఎవరికున్నై పిల్లా, అవిగో" అంటోనే తూపులాంటి చూపోటి గురిపెట్టి కుమారిక వక్షస్థలానికి యిట్టేవేసి, అట్టే వెనక్కితిరిగాడు, కలకల నవ్వుకుంటో, అనుకొన్న పని అయినట్టుగానే.

పోనీ పందిరివేత సర్వేజనాను సుఖాంతమే అయింది. పెద్దమనిషి

మునసబుగారు చిన్నబుచ్చుకోవాలని ఎన్నడూ కోరం. కాని పాపం అలాంటి చూపు శకుంతల దుష్యంతునిపై వేసి వెళ్ళినట్టు కుమారిక తన మీద వేసి వెడితే, అందం, ఆనందం, కొంత పనిజరిగినట్టు కాని, తానే ఆపెపై వేస్తే దానిలో ఏమి పస ఉంటుంది! ఇంతకు ఆమె చూచిందో లేదో మునసబుగారి చూపు, మునసబుగారైతే, అదేదో స్త్రీహృదయ మర్మచ్ఛేదకమైన చూపే నన్న ఎగుపున ఉన్నా. రసికప్రభువు ఎంతసేపూ అద్దంలో తన అందాన్ని తాను చూచుకొని ఆనందించుకొన్నట్టుంది కాని తనను కుమారిక చూచి చకిత అయినట్టు, యింతవరకు అవగింజంత తార్కాణం లేదు. ఓర్పు, నిదానం, ఎంతకంతకే తృప్తి కలవాడు కాబట్టి సరిపోయింది కాని లేకపోతే ఎంత ఖేద పడవలసినమాట. వెళ్ళనీయండి మునసబుగారిని ఆ ఉబలాటంమీదే. పరుల కపకారంలేని ఆనందాన్ని పొందేమనిషిని, అతడి ఆనందం నిర్హేతుకం, నిరాధారం అని మనకు తెల్సినా, పనిగట్టుకొని, అతడికి చెప్పి, అతణ్ణి చిన్నబుచ్చడం సహృదయత కాదు, సరసత కాదు.

మధ్యాహ్నం సీతమ్మగారు అమ్మాణీ కుమారికలు పందిట్లో అలుకులు ముగ్గులు పూర్తిచేశారు. వారు ముగ్గురు సాయింత్రం అయిదారు గంటలవేళ తీరిగ్గా పందిరంట తిరుగుతో బహుళవర్ణసంకీర్ణమైన వివిధాలంకారాలు చూచుకొంటో సృష్టిలోని సుందరవస్తుసముదాయమంతా తమపందిట్లోనే కూడినట్టు పొంగిపోతున్నారు. మునసబుగారి పనిమనుష్యులు మేటెడైతే కాగితపు గొల్సులు, బుట్టలు పందిరికి కట్టి పోయారేగాని వారికి 'కలర్ స్కీము' తెలియదుగ. కుమారిక అమ్మాణీని నిచ్చెన పట్టుకోమని చెప్పి, అలంకారాల్లో అపశ్రుతులు లేకుండా సర్దుబాటు చేసింది. పాదరసపు బుడ్లు స్ఫుటంగా కన్పించేలా, గొల్సుల స్ప్రింగు విషయం శ్రద్ధతీసుకొంది. ప్రతి చిన్న అలంకారమూ మేరుపర్వతంలా గోచరిస్తోంది.

“ వివిధాలంకరణంబుల నవకాంతి వహించి
.........వివాహమహోత్సవ మాధవలక్ష్మికి
లలిత వనంబై యొలమి కలిమికి తావలమయ్యెన్ ” అన్నట్టుంది పందిరి.

“కుమారీ, మీఅయ్యగారీ పందిరి చూసి ఎంత ఆనందపడ్తారోనే,”

అంటోనే, "యింకా రాలేదేమోనే వారు. పదగాడ్పుల రోజులు, సాక్షి భయంగావుండే వారి ఆలస్యం తలచుకుంటేనూ" అంది సీతమ్మగారు.

"అనుగోనండి అమ్మగారు, అయ్యగారు యిప్పుడే వస్తున్నారండీ. అదుర్దా పడనక్కఱలేదు" అంది కుమారిక.

"ఎక్కడే, కన్పించందే వస్తున్నారంటావు" అని సీతమ్మగారంది.

"వినండి కాకికూస్తోంది ఒక్కవరసని. కాకమ్మమాట యెప్పుడూ బోటోలేదండి" అంది కుమారిక.

అమ్మాణీ నవ్వింది.

"ఏమి వెర్రినమ్మకాలే నీకు" అంది యజమానురాలు.

## 6. శాస్త్రుల్లుగారి విస్మయరసావేశం

అంతలో, కాకమ్మమాటా బోటుకాదు. కుమారిక నమ్మకమూ ఓటు కాదన్నట్టు పందిరముఖద్వారంలోంచి యజమాని అడుగిడుతో అక్కడే ఆగిపోయాడు. ముందుకు రాడు. వెనక్కి వెళ్ళడు. పైగా వున్నపళ్ళూ, ఊడినపళ్ళూ అన్నీ కన్పించేలా నోరు తెరచుకొని నుంచేంటే ప్రయాణాయాసం మూలాన ప్రాణం కడంటింది అనుకొని హడలిపోయి, చల్లడానికి నీళ్ళు పట్టుకొచ్చింది యజమానురాలు. అమట్టునే నేలమీద వరిగేటట్టున్నాడని, అమ్మాణీ దభీలున పట్టుకొంది. ముందు చేతిలో సంచీలాగేసి, పెట్టె అరుగుమీద పడేసి, ఒక పరుగున లోపలికి వెళ్ళి, మడతకుర్చీని ఎగ రేసుకొచ్చింది కుమారిక.

"ఏమిటే, ఏమిటే" అంటూ డాయన కళ్ళు తేలేసి కాగితంబుట్టలకేసి ముఖం పెట్టె.

"చూచావుటే, యింటికొచ్చానకూడా ఎఱుగకుండా 'ఏమిటే. ఏమిటే' అంటున్నారు. ప్రాణమే దేఅసలు, ఎల్లాఎల్లాగో ఆపేక్షను యింటి కొచ్చి పడ్డారు కాని" అంటో, కళ్ళనీళ్ళు కుక్కకుంది సీతమ్మగారు.

కాటుకకంటి నీరు కార్చింది అమ్మాణీ.

"అమ్మగారూ, మీరే అలా బెంబేలుపడితే, నేను అమ్మాణీ ఏమి చెయ్యాగలనండి! అమ్మాణీ కడుప్పగిలి పోతోందండీ! అమ్మాణీ!

పెండ్లికూతురు కంట తడిపెట్టగూడదు. కళ్ళనీళ్ళు తుడుచుకొని, ముందు లోపలికెళ్ళి నిమ్మకాయ పిండి దాహం తేవమ్మా. అమ్మగారు పట్టుకుం టారు" అంది కుమారిక.

ఇంతలో యజమాని గ్రుడ్లు మరో ప్రక్కకు తిరిగితే, పాపఆక్షోంది భయంలేదని ఆనందించుకొన్నారు. ఒడుదుడుకు ఘడియల్లో ఆనంద మెంత సేపు, అదుర్దా ఎంతసేపు? "అనుకోలేదు, అంతా ఏమిటో. ఆ!" అన్నాడు యజమాని.

"ఏమీలేదు నాన్నా, నువ్వు యింటికొచ్చావు. ఇది మన యిల్లు. నేను అమ్మాణీని, వీళ్ళు అమ్మా, కుమారికానున్నూ, నిన్ను చూస్తూన్నారు" అంది అమ్మాణీ.

"అదికాదే" అంటాడు అయన.

"అద్భే అదే నాన్నా అదే. ఎంతదెబ్బతగిలి కాదనుకుంటున్నావు. నిజమే నాన్నా, నీతో అబద్ధమాడ్తామా!" అంటూనే అమ్మాణీ లోని కెళ్ళి దాహం తెచ్చింది.

"మీకేమైనా పిచ్చా గిచ్చా. బ్రతుకున్నవాడిని నిలువునా చంపేస్తా రేమే" అని అయన ఏదో అనబోయాడు.

"చూశావే కుమారీ, పరాకుమాటలు, వడగొట్టినవాళ్ళకు నిమ్మరసం, శుద్ధిదాహం యివ్వడం నిల్వునా చంపేయడమటే, పిచ్చి అటే! మంచేదో, పిచ్చేదో తెలియకుండాఉందే. మతేదీ అసలు, నాబ్రతుకు ఏమికానుందో" అంది సీతమ్మగారు.

"తాగించవమ్మా అమ్మాణీ. యింకా చూస్తాఉంటుకమ్మా, మళ్ళీ పాప పైకిపోతోంటేను" అంది కుమారిక.

అమ్మాణీ దాహం అయన పెదిమెలకు పట్టింది. "గుటకడింది" అంటూ కుమారిక పొంగిపోయింది. "గ్లాసే అయిపోయిం" దంటూ ఎగిరి గంతే సింది అమ్మాణీ. చాటంత అయింది సీతమ్మగారి ముఖం.

"అమ్మగారూ, చెమట తుడ్చేయండీ. వేళకు కన్పించదు విసనకర్ర, యిందాకా యిక్కడ చూచానండీ, ఏమైందండీ!" అంటూ కుమారిక విసన కర్ర తెచ్చి వేస్తోంది.

ఆయన ఏదో అనబోతే, "మాట్లాడకండీ కాస్సేపు, మీకు పుణ్యముంటుంది" అంది యజమ్మానురాలు.

"రసం వంటబట్టేదాకా ఆయన మాట్లాడినా, మీరు మాట్లాడకండి" అని ఆంక్ష చేసింది కుమారిక.

తల్లీ కూతురు, కుమారికా పెదిమెలు బిగించుకొని తదేకదృష్టితో ఆయన వంక చూస్తూన్నారు. కళ్ళు పందిరకు వప్పజెప్పి, చిత్రరూపాకృతి ఉండిపోయాడు రామశాస్త్రుల్లుగారు.

దారమ్మట వచ్చినంత సేపూ "పందిరి వేయగలనా! రేపే వివాహము" అని బెంగపెట్టుకొని వచ్చిన యజమానికి, ఒక అనుద్దేశిత సంపద్వర్షంలా గుమ్మంలో బహువిధ వస్తువిన్యాసవైభవంతో విస్తరిల్లిన పందిరి కన్పించేసరికి, భార్య పనుపున శ్రీకృష్ణ సందర్శనం చేసివచ్చిన కుచేలునకు, తన పూరిగుడిసె స్థానంలో దివ్యభవనాలు కన్పించేసరికి కలిగిన ఆశ్చర్యానుభూతి కలిగియుండాలి. ఆ విస్మయ, రసావేశంలో తెఱిచిన నోరేమో కాని వసగొట్టిన నోరు కాదది.

ఆయన పెళ్ళాం బిడ్డలు భయపడ్తే, పెళ్ళికైనా కల్వని రామశాస్త్రుల్లుకోసం మధ్యన మనకెందుకొచ్చిన బెంగ. ఆడాళ్ళు కంగారుపడి పట్టించారు కాని దాహం, లేకపోయినా ఆ గ్లాసుడు ఏలాగా కొట్టేసును. ఊరుకెళ్ళివచ్చిన మనిషి ఊరుకోడు.

చూడండి, కులాసా కబుర్లలో పడ్డారు వాళ్ళు. మునసబుగారు స్వయంగా పనిచేసికూడా, పందిరి ఏలా వేయించారో సవిస్తరముగా చెప్తోంది అమ్మాణీ. ఇంతలో మునసబుగారు యిచ్చిరమ్మన్నారంటూ అరటాకు, అరటికాయ, పనసకాయలు, పెండలం, గుమ్మడికాయలు, తాటాకుబుట్టలు, మోపుడు బచ్చలకాడ, పోకదొన్నెలదండలు, వారింట పెండ్లికి దిగడ్డాయిట, యిచ్చిరమ్మన్నారంటూ, ముగ్గురు మనుష్యులక్కడ పడేసి పోయారు.

వెడ్తూ, నిన్న పందిరి పనిమనిషే, "ఈపెద్ద పనసకాయ ఓమూల దాగడింది ముందు దీనిని కొట్టించమన్నా" రనీ, "పాలు పెర్గులకూ, కాయకూర్లకు ఎక్కడా బజానా యియ్యొద్దని, స్పష్టంగా నీతో చెప్పమన్నారమ్మా" అని కుమారికతో చెప్పిపోయాడు.

మునసబుగారు పంపితే వచ్చాడో, వాడంతట వాడే వచ్చాడో మునసబుగారి పెద్దపాలేరు వీళ్ళవెనకాల యీ వేళా వచ్చి, ఓరగా కుమారిక కేసి చూస్తూ, "పాలకోసం నువ్వొళ్ళక్కర్లేదమ్మా. అరే కావిళ్ళేసి పంపిస్తారుటే" అని చక్కాబోయాడు.

ఇదంతా, ఏదో యింద్రజాలంలాగుంది. ఎందుకు ఇంత అకస్మాత్తుగా తమమీద మునసబుగారికీ అవ్యాజప్రేమ కల్గాలో బుర్రలు కలుపుకొని బ్రద్దలుకొట్టుకున్నా వారికి విడిపోవటంలేదు.

చివరకు సీతమ్మగారు, "ఏమిటండీ! ఒక్కమాటమీదే ఉండటం గొప్ప అనుకుంటున్నారు కాబోలు. మమ్మన్ని ఒక్కవరసని ఆడిస్తున్నారు. మనలో మనమాట, మీరు చెప్పివెళ్ళిందే మునసబుగారి కేమిపట్టిందండీ మండుటెండలో మట్టిత్రొక్కి యింతపని చెయ్యడం? యింత సరకు చేరవేయడము? చంటిపిల్లకు చెప్పినట్టు చెప్తారే నాకు" అంది.

"ఓసి నీయిల్లు బంగారంగాను, చెప్తే వినకపోతే యిహ నేను ఉరిబెట్టుకోవాలి. నూరు నూటయాభై ఎకరమున్న ఆసామీ. దిక్పాలుడులా యీ ప్రక్కంతా కాసేశాడు. గ్రామాధికారి ఆయన, బక్కవాళ్ళం మనం. మనబ్రతుక్కి, ఏమి పలుకుబడి ఉందని నా అవసరం ఆయన కేముందని 'మాపందిరివెయ్యి నేను ఊరికిద్దాను' అని అనగలనే? ఈ కాయా కూరా నేను పంపించమంటేనే ఆయన పంపించాడంటావా? ఇంతకు నాకాయనతో ఓహో అంటే ఓహో అనే మాత్రం పరిచయంకూడా లేదే ఖర్మం" అన్నాడు గృహస్థు.

"నాన్నోయి, నువ్వు అల్లా అంటావుగాని. అమ్మ ఆయనగారిని యివాళ గుమ్మంలో పనిచేస్తోంటే చూడ్డమే కాని యిదివరకు చూచిఎరుగదు. చిన్నప్పుడెప్పుడో నన్ను అన్నయ్యతోపాటు పిల్చి మామిడిపళ్ళు, పనస్తొనలు పెట్టేవాడు. వారింటో కొబ్బరిసాజు తిన్నామని నన్ను అన్నయ్యను కొట్టావే. ఆతర్వాత వారింటి ధరిమానా నేను వెళ్ళనేలేదు. అన్నయ్యంటే ఆయనకు ప్రాణం. కాని వాడిక్కడ లేడుగా, వాడ్డా యిన్ని అడిగా పనడానికి? ఎటొచ్చీ, కుమారిక వారనడిగి పాదరసపుబుడ్డు తెచ్చింది. అంతకన్న ఎవళ్ళం ఏమీ ఎరుగము" అంది అమ్మాణీ.

"పందిరి అలంకారానికి కద పొదరసపుబుడ్లు. అవి తేవడంలో, నీవేమైనా పందిరివిషయం వారితో ప్రసంగం చేశావా?" అని కుమారిక నడిగాడాయన.

"అబ్బే, ఆమాట ఎత్తలేదండీ. ఆయన నన్నూ అడగలేదు, వారితో అంతమాట ఏలా అనగలను? బుడ్లుఒక్కటీ అడిగాను, యిచ్చారు. తెచ్చాను. మారుమాట లేదండీ వారితో" అంది కుమారిక.

"కానండి రాత్రిల్లా కుమారికకు ఒకటే కలలు, పగలుమాటలున్నూ పందిరివిషయం. కునుకులేదు. ఒకటే ధ్యాస. దాని తపస్సు ఫలించింది. దాని వాక్కులో దైవమున్నాడు. అది మనయింట అడుగెట్టింది, పెళ్ళి నిశ్చయమైంది. కోరిన సంబంధం దొరికింది అమ్మాయికి. అది పందిరి పడాలని తలచింది. పందిరి పడింది. ఇప్పుడు మీరు వస్తున్నారండి. క్షణంలో మీరు వెలిసారు. పుణ్యాత్ముల వేగుజాముకలలు నిజమవుతాయంటారు. అది పుణ్యాత్మురాలు, పందిరిగుంజలు పాత్తోన్నట్టు కలకంది. అక్షరాలా అది జరిగింది. దాని కది దైవకటాక్షమనండి, సంకల్పబలమనండి, ఏమైతేం కుమారికపని యిదంతా" అని అంది సీతమ్మగారు.

"ఆడాళ్ళకు సంకల్పబలాలేమిటి కాని, మీరు పందిరికి పరిపరివిధాల తపించి పోయారని వారిచెవిని ఏలాపడిందో, అక్కడేవుండే కిటుకు. ఎందుకొచ్చినమాట, ఆయనతోనే నే ననలేదు. మీ రనలేదు. పోనీ మరెవరితోనైనా అన్నారే?" అని అడిగారు శాస్తుర్లుగారు.

"ఎవ్వరితోనూ అనలే"దన్నారు తల్లీ కూతుళ్ళు.

అప్పుడు కుమారికకు జ్ఞాపకం వచ్చిందది.

"ఆ! అయ్యగారు అవునండోయ్, ఓముసలిది, అంత ముసల్దీ కాదులేండి, నిన్న సాయింత్రం నేను గుమ్మానికి పసుపు రాస్తుంటే మహా పని ఉన్నదానిలా వచ్చి కబుర్లు పెట్టింది. 'పందిరి పడలేదని మేము మతిలేకుండా ఉంటే మే మే దొరికామా ఆమ్మా నీకు కబుర్లకు' అని విసుక్కున్నాను. పోయింది."

"అది ఎవరో చెప్పగలవా?" అన్నాడాయన.

"అదివరకు చూసింది కాదు. తర్వాత వచ్చిందికాదు. ఏవరో ఏలా పోయిందో కూడా నేను వెనుతిరిగి చూడలే" దంది కుమారిక.

"తేలింది!" అన్నాడు రామశాస్త్రుర్లుగారు దిగ్గున లేచి

"చెప్పరాదు నాన్నా ఏమి తేలిందో!" అంది అన్నపూర్ణమ్మ.

అంతా ముందుకు జరిగి ఆతురతగా వింటోన్నారు.

"తేలడాని కేముంది? మునసబుగారి దగ్గర కెళ్ళి, 'మహాత్మా ఎవరడిగితే మీరు మాకు పందిరి వేయించాల్సివచ్చింది అని అడగాలి' అన్నాడు.

"తప్పితే" అని ఆయన చెప్పబోతుంటే......

"ఇంత సామూ చేసి యిదా మీరు తేల్చింది? గొప్పసంగతే తేల్చారు. ఏలాగైతేం!" అని గొల్లున నవ్వారు స్త్రీజనం. దాంతో ఆయనకు కోపం రేగి, "వినిపించుకుంటారా పెద్దారా. ఆమధ్య సంబంధం నిశ్చయించు కొచ్చానన్న మాట వినిపించుకోటానికి నాప్రాణాలు తోడేశారు. ఆడాళ్ళకు మరీ అంత్రడెబ్బ బలిసిందీరోజుల్లో. మీఅమ్మ మీఅత్త వంటిళ్లు పట్టుకు వదలేవారు కారు. అలా పడిఉండక, మీకంతా పురాణాలు, దైవ కటాక్షాలు, సంకల్పబలాలు. అన్నీ పెద్దతత్తుమాటలే. ఉట్టికెగరలేంది స్వర్గానికెగిరిందట. మహ తెల్సినవాళ్ళకూ చెల్లకుండా పుణ్యపాపాల నిర్ణయాలా? ఏం పేట్రేగిపోయారు, ఏం పేట్రేగిపోయారూ! అవధాన్లే పని కొచ్చాడు కాడు మీముందు? బయల్దేరారు జ్ఞానులు. 'ఇల్లా అనుకోవచ్చు, ఇల్లా అనుకోవచ్చు' అని ఆడాళ్ళకు తెల్సేలా చెప్పాలని చక్కగా ప్రారంభించాను. ఏది పూర్వపక్షం చేస్తానో, ఏది సిద్ధాంతీకరిస్తానో ఆగవద్దూ! 'తప్పితే' అని యింకా చెప్తోంటే నె నాలుకట్టుకున్నారు" అన్నాడు.

"పోనీ, ఆతప్పితే ఏమిటో యిప్పుడు చెప్పరాదండీ ఎవరడ్డమొచ్చారు మీ మాటకు" అంది యజమానురాలు.

"ఇహ యిప్పుడు చెప్పబోతేమాత్రం, ఆ అందం వస్తుందా? కుమారికను పలకరించిన ముసిలిదాన్ని పట్టుకోవాలి" అన్నాడు కూర్చుని.

"అదీ అల్లా అన్నావు నాన్నా, బాగుంది' అంది అన్నపూర్ణమ్మ.

"ఇంత గొప్పరహస్యం మీరు నాతో చెప్పినందుకు దాన్ని పట్టుకోడం ఎలాగో అదీ మీరే శెలవీయండి, తెల్సినవారు" అని వెటకారం చేసింది సీతమ్మగారు. "పూనుకుంటే అదేమంత్కకష్టంలోంది కనుక. భూగోళ ఖగోళ రహస్యాలను గోక్కురావడానికి యంత్రం కాడావాళ్ళేదో కుక్కను ఆకా

శాని కెక్కించారని అపఖ్యాతి కెవడో చెప్పాట్ట. అది నిజమే అయితే, కుక్క బ్రతికే ఉంటే, దాన్ని రప్పిస్తా" నన్నాడు శాస్త్రుల్లగారు.

"రక్షించారు, దాన్నైనా రప్పించండి. ముసలిదానిమాట ఏలాఉన్నా మా ముసిలాయన రహస్యాలైనా నాకు తెలుస్తై" అంది ఆవిడ.

"పందిరిపట్ట ఉబలాటాన్ని మూడుపువ్వులు ఆరు కాయలూగా ఉన్నావు. ఏమను నీకీవేళ బారాహుక్కుం, అన్నీ పడ్తా" నన్నా డాయన.

"అక్కడికి ఒకపుడు నేను మిమ్మన్నంటోన్న" ట్టంది, ఆవిడ.

సంభాషణ ఈలా సరళంగా పరిణమించినపుడే అపుచేయకపోతే, శాస్త్రుల్లగారితోపని, మురేం రభస బయలుద్దేరుతుందో అన్నభయంతో, కుమారిక అందుకొని "విడిదెమాట అడగండీ అయ్యగార్ని. వారు కండవా వేసుకడితే నిముషంలో సానుకూలం అవుతుంది. మన పందిరి కన్నుల వైకుంఠముగా చేసుకొని విడిదెను బోసిగా పెడ్తే అదేమి పేచీలు తెస్తుందో. పెళ్ళివారు రేపు యిక్కడే స్నాతకం చేసుకుంటారన్నారుగా. ఎక్కడ స్నానాదులకు దడులు కట్టాలో, ఏమి హంగులు ఏర్పరచాలో, ఈరాత్రి చూచుకోవాలి. అయ్యగారికి తొందరగా వడ్డించండి. వారు స్నానానికి లేస్తున్నారు. నేనూ, అమ్మాణీ ఈలోపల ఆలయానికి వెళ్ళివస్తాము" అంటో మాటలు అపుచేయించి. వారిని పనితొందర్ని పెట్టింది.

---

# 10. పెండ్లిసందడి

చాందినీలు, గులోబులు, తీగెల పండ్లగెలలుకూడా తెచ్చి వివాహ వేదికను కన్నులవైకుంఠముగా అలంకరించింది కుమారిక. దానిచుట్టూ, మంగళసూత్రధారణవేళ, సుధర్మకు మించినసభ. వేదఘోషను, విప్రా శీర్వాదాలకూ ఏమికొదువ రామశాస్త్రుల్లగారింటి పెండ్లిలో! మంగళ తూర్యారావాల సుతిమీద మాట అందాలికాబట్టి, గుమ్మాల్లో సవరింపుల వాళ్ళు కంఠాలు చించుకుంటున్నారు.

"మక్కుసూటుగా మంగళసూత్రధారణ చూసివస్తే పెండ్లి విశేషం ఏమి తెలుస్తుంది, పెండ్లిసందడే అసలుఅందం" అంటాడు మాకోట్లు.

వాడికళ్ళు అద్దాలేవేరు. వాడుచూసొచ్చిచెప్పినమాటలే వ్రాస్తున్నదిప్పుడు,

మొదటిరోజు, అందులో తెల్లవారగట్ల ముహూర్తం, దేనికది హంగు పాటు తక్కువ, సద్దుపాటు ఎక్కువ. కొలికి పట్టింటివోటు, అత్యంతవసరమైన బహుస్వల్పవస్తువేదో వేళకు కన్పించక, అంతా, అందర్నీ కసురుకొంటోండడం, అడిగేవాళ్ళేగాని చెప్పేవాళ్ళు లేకపోవడం. ఎక్కడినుంచి కలిసి కలియద్రొక్కుకోడం, విడిది సరిగా గుమ్మాలు దాటేటప్పుడే అడ్డాలొస్తోండడం, అట్లాంటప్పుడు ఏవో పాతపగలున్నట్లు ఒకర్ని చూసి ఒకరు కళ్ళెర్రచేసి, "మజే" అంటోండడం, అంతలో ఒకగడసరి, "ఏమిటా కావల్సింది!" అని మహా యిచ్చేవాడికే చెల్లకుండా అడిగి అందర్నీ ఆకర్షించడం, నల్గురూ చుట్టూ పోగడ్డ తర్వాత చల్లగా "తెలియద"నో, కాక కాస్త గడుస్తనంగా "యిప్పుడే చూచానండీ ఎక్కడ్నోనూ" అనో అఘోరించడమూ, ఇప్పటికి పెళ్ళిపెద్దకు ప్రాణం కడంటి. చేతులు తలనెట్టుకొని ఏచీకీమీదో చతికలపడ్డం, అప్పుడే మొగపెళ్ళి వారికి యివ్వాల్సిన చిన్న లాంచనం మాట ఏదో యింటావిడ అడగ రావటం, "లేద"నో, "కాద"నో, పెళ్ళిపెద్ద పెణతలెగిరేలా పొలిబొబ్బ పెట్టడం, "ఇంతపెళ్ళీ చేసుకుంటో స్వల్పలాంఛనానికి ముఖం చూసుకోవడం అప్రదిష్ట" అని ఆవిడ అనడం, "లాంచనానికి కాదేవ్"అని మరోరావణాకేక ఆయన వేయడం, ఎవరో కొట్టుకుంటున్నారన్నట్టు, పెళ్ళి పందిట్లోనుంచి వంటపందిట్లోకి జనం విరగబడ్డం, అప్పుడు, బ్రహ్మగారు ఖర్జూరపుపండుకి తమలపాకులో కరక్కాయపెట్టి లాఘవంగా అక్కడ తంతు అయిందనిపించారని వినడం, "అమ్మయ్యా" అని పెళ్ళిపెద్ద లేవడం, ఇవ్వీ చూడ్డం సరదా. కాని కోట్లుక్, పెండ్లిపీటలదగ్గర బోలెడు ముచ్చట్లుంటాయి, ముద్దుగా మూడు ముక్కలు చెప్పడు.

'పెళ్ళిపీటల దగ్గరమాట చెప్పరా'అంటే రామశాస్త్రుర్లుగారి హంగామా వర్ణించాడు. అది వాడి నైజం. పీటలదగ్గర రామశాస్త్రుర్లుగారి వడి వైఖరి చూస్తే వ్యాయామంచేస్తోన్నట్టున్నాడు. పందిట్లోకి వస్తోన్న సంస్కార్లకు అభ్యుత్థానం కాబోలు దూరానుంచే రెండుచేతులూ తలపైకి సాచేసి కలుపుతున్నాడు. అంతలో విసురున దారిచేసుకొని ముందరకొచ్చి, వంగు

తున్నాడు. పరుగుతున్నాడు, పడుతున్నాడు, లేస్తున్నాడు. చేతులలోకి చేతులు తీసుకొని, 'అస్వస్థతగా ఉన్నారనివిన్నా, రాగలిగారు.' 'రామశాస్త్రుల్లుగారంటే మీకు అవ్యాజానురాగం' అంటున్నాడు. పాదాభివందనంచేసి, మరోరని, 'నాజన్మ తరించిం'దంటున్నాడు. బ్రహ్మగారు పీటలదగ్గరకు కేకేయకపోతే, భళ్ళున తెల్లారేవరకు సంస్కార్లతో ఇష్టాగోష్ఠి నుండునేమో.

కోట్లంటాడు: "ఇటువంటి శ్రోత్రియుడింట్లో శుభాశుభాలు చేయించడం, రిటైర్డు డిస్ట్రిక్టుమునసబుగారి ఆస్తికి దావావస్తే ప్లీడరుపని చేసిపెట్టడం, హెడ్డుమాస్టరుగారి అబ్బాయికి ట్యూషన్ చెప్పడం, వైద్యుడికి వైద్యం చెయ్యడం, చాలాగడ్డుపన్లు. వేపుకుని తినేస్తారు, తెమిలి, యివతలపడలేం. మనం చెప్పడం వాళ్ళువినడం కాదు, నిజానికి చెప్పదగ్గ వాళ్ళం మనమేనని కడుపులో కాల్తున్నా, ప్రతివిషయం యక్షపరీక్ష, ఆమేషా ఒక సి.ఐ.డీ, మన్ని పొంచి చూస్తున్నట్టే. వారు సర్వజ్ఞులమనుకోవడంతో ఆగదు. మనమేదో పనికిచాలేస్తున్నట్టు, తంతు దాటేస్తున్నట్టు చూస్తారు."

రామశాస్త్రుల్లుగారికి మగపెళ్ళివారి బ్రహ్మతో మొదట్లోనే జుట్టూ జుట్టూ పట్టుకోడందాకా వచ్చింది. ఆబ్రహ్మగారు మంత్రాలు ధూకుడుగా చదవేయగలడు. మెరాటాను వేగం. ఏమాత్రం వడితగ్గించినా ఆయనకు నాలుక ఆడదు. ఇంకా తగ్గిస్తే మంత్రం ముఖుపొస్తుంది. మరీతగ్గించాడా మతేపోతుంది. అది ఆయనగారి మంత్రపఠనం గ్రాఫ్. 'అయిపోవడమే ఆయన గారి లక్ష్యమా?' అనిపిస్తుంది. 'అయినప్పుడే అవుతుంది, మించిపోయిందేమిటి. ప్రతిపదం. ఆచాచి పల్కడం ప్రధానం, బోలెడు ఖర్చు అవుతోన్నపుడు' అని రామశాస్త్రుల్లుగారి లక్ష్యం. ఇంతే తేడా యిద్దరికీ.

ప్రారంభిస్తోనే ఆబ్రహ్మగారు రెండ్యాని, తలదూరంగా కుడిచేతికేసి గిరాటేసి, అక్కడనుంచి ధూకుడుగా సిగరెట్టుగుక్కలు లాగుతోన్నట్టు, మంత్రాన్ని కొంతకొంత లోపలికిపీల్చేస్తో, కొంతకొంత మింగేస్తో, కొంతకొంత ఏదో అంగుటిసాధనం చూపెడ్తోన్నట్టు ఒహుదురితంగా గుర

గురలాడిస్తో సెంటుసుకొచ్చాక తలను దభీలున ఎడంచేతివైపుకు లాగేసి, అక్కడ, ఎగపీల్పుమీద తెస్తోన్న మంత్రపుముక్కలను తొందరతొందరగా దులిపేసి, తొలివిసురునే మెడ, మొండెం తిరుగా కుడిచేతివైపుకు ఊచలా చాసేయడం, ఈశ్వరసని 'యక్స్నపర్తు అక్రబాట్వ్యి' ధాన అయన చెక్కుకు పోతోంటే చూపటులకు కళ్ళు చిరతలుకమ్మినై, చెవులు ఘుళ్ళడై. అంటే మంత్రంలో ఒక పెద్దపంక్తి అంతా ఎడంకుడి భుజాల మధ్య, దారిలోనే బయటకురాదగ్గది నోట్లోకే పోతోందన్నమాట. పది గుపెళ్ళ మాటకు, ఒక్కగుప్పెడు మాటలు మాత్రం, ఎడంచేతివైపు వాళ్ళను తడుపుతోన్నాయన్నమాట. ఓప్రక్కను మంత్రం ముక్కలు పలుకుతోనే, పీటలుదగ్గరకు ఎవరేవస్తువులు చేర్చాలో, వైయింత్రీలు ఎప్పుడు ఆపాలో, ఎప్పుడు అందుకోవాలో, సంజ్ఞలతోటీ, చప్పట్ల తోటీ అష్టావధానం చేసుకుపోతున్నాడు. దానికి సాయం, మంత్రాన్ని చెక్కలు చెక్కలుగా ముక్కలు ముక్కలుగా కొట్టి పారేస్తోన్నట్టు, ఆయనగారి గాత్రపు వడినే, వారిచెయ్యికూడా వీరవిహారం చేస్తోండడం చేత ఉబలాటంగా పెళ్ళిపీటలమీదకు వరిగినుంచున్న మగువలు ఆచెయ్యి తగలకుండా జాగ్రత్తమీద ఉండాల్సివస్తోంది. 'మామిడాకుతో నీళ్ళు చల్లండి,' 'అక్షితలు వెయ్యండి,' 'ముక్కట్టుకోండి,' యిట్లాంటి 'డిరెక్టివ్సు' శరవేగంగా ఒకదానిమీద ఒకటి పడిపోతోండడంచేత, దేని వెనక ఏదో, అన్నీ ఒకేపర్యాయమో విడతీసుకోలేక, వధూవరులు ఏదీచెయ్యకుండా అలసిపోయి, ఆగిపోయి, మిటుకు మిటుకు చూస్తున్నారు. పోనీ చెబ్దామాఅంటే సఖుంపైకి చూస్తోచెప్తాడు. సఖుంకళ్ళు మూసుకు చెప్తాడు.

అంచేత రామశాస్త్రుర్లుగారు అబ్రహ్మగారి మెడపట్టుకోవలసి వచ్చింది. పట్టుకున్నాడు. "నాయింట్లో ఈకసరత్తేమిటి? పెళ్ళిచేయించడానికి కొచ్చావా, సాము, గరిడీ చేసిపోవడానికా? ఇది పెళ్ళి అనుకున్నావా, అమ్మవారి జాతరనుకొన్నావా? శివాలుతొక్కుతావు" అని కైమని మళ్ళా మొదలెట్టించాడు రామశాస్త్రుర్లుగారు.

"ఉద్యోగస్తులంతా తలమీదపెట్టుకుంటారు నన్ను, నీకు పనికొచ్చాను కానా" అంటాడా బ్రహ్మగారు.

"ఇలా పసుపుతో తేస్తో చేసుకు పోతున్నారాలస్యం. నిస్సహాయ స్థితిలో ఉండిపోయాం పైవాళ్ళం" అన్నాడు కోట్లు.

చివరికి వాడు మంగళసూత్రధారణ చూసాడో లేదో, జేబురుమాళ్ళ వసూళ్ళకే పెళ్ళి పందిళ్ళకొచ్చేవాళ్ళలా.

పోనీ వీడికి సందడి, సరదా అందాం. ఎంతసేపూ పైల్వానూ బ్రహ్మ పెళ్ళిపెద్ద పట్టిన కుస్తీపట్లే చెప్పకపోతే, స్త్రీల పాటలుంటాయి పీటల దగ్గర వాటిమాట చెప్పరాదూ. అదేదీ యెత్తడు. అడిగా అక్కడికీ. "విననుగా" అన్నాడు ఖరాగా. "అదేం వైపరీత్యంరా" అన్నా. "వెనకో పెళ్ళిలో బొప్పికట్టింది. నాటినుంచీ, వినడంమానేశా" నన్నాడు. 'ఏమాటం'టే అనుకున్నాడు అక్కడి విషయం.

"కొల్లలు, స్త్రీలపాటలు, వామనచింతకాయల్లా. పెండ్లితతంగమంతా స్త్రీప్రమేయమే కాబట్టి పసుపు కొట్టిం దగ్గరనుంచి, నిప్పుగింతలవరకు వస పిట్టల్లా వాళ్ళు గానమాధురి వినిపిస్తోనే ఉన్నారు. నాలుగు పాటలు, అలకపాటలు, బూజం బంతులు, వియ్యాలారిమీద హాస్యపుపాటలు గేయ సాహిత్యం పేరు ఏమైతేం, కాఫీహూటేలు గ్రామఫోను ప్లేట్లల్లా, భరిం చాలిగాని, వినండి, వినకపోండి, వయ్యారాలుపోతే మునిమునినవ్వులు మేళవించి. ఆడకంఠాలు అలా మ్రోగుతునే ఉన్నై. విభిన్నశ్రుతిస్థాయిల్లో పందిరిని ఎగరేసే పాటలసరకును కళఅనాలో పరిశ్రమఅనాలో అను చిక్కక, 'ఆయాసపడకండి' అంటే అగరా. మంగళహారతులు మధు రాధరల గానకళకు కంఠపట్టే అయిరి. వధూవరులు పీటలమీదనుంచి లేచి నపుడెల్లా ఆశ్వాసాంతగద్యం తీరున, అవి సిద్ధం. మంగళహారతి పళ్ళెం వసూలు చేసినంత నిక్కచ్చిగాను మంగళహారతిపాటా పాడితీరారు అమ్మాయిలు. "ఈపాటకేనా పళ్ళెంలో నూటపదహార్లు భళ్ళుమనిపిం చేది" అంటో పరవళ్ళుతొక్కాడు పెళ్ళిపెద్ద. 'పెళ్ళి సంగీతాలు అం కన్న ఏముంటై' అని సరిపెట్టుకోలేకపోయాడు. 'పోనీ పాట మరచిపో నన్నుచూచి వేయి' అంది. సౌమ్యంగానే చెప్పిందా అమ్మాయి. 'పాట మఱపురాదమ్మా' అన్నాడు పుల్లనారింజతొన నాలుకమీద పెట్టు కొన్నట్టు మూతిపెట్టి. 'అందరి అమ్మాయిల మంగళహారతి పాటలూ

ఉంటే. నేనేవేనే పిసక్కజాలే' నన్నాడు కోట్లు. "అయితే, వధూవరులు పీటలమీద కూర్చోపెట్టిం లగాయితు తలుపులదగ్గర తతంగందాకా నువ్వు చూడిందేమిట్రా" మరి అన్నాను. "ఆ! ఆ! తలుపులదగ్గర తతంగం చూశాను. ఏవేళకూ వధూవరులు నోళ్ళు విప్పకపోతే, దినమంతు భోజనాలుండక పోతాయేమో నన్నదిగులుతో, ఒకరో యిద్దరో నడుంకట్టి తాత్కాలిక దాంపత్యం వహించి, పేర్లుచెప్పి. దార చేయించి పుణ్యం కట్టుకున్నా" రన్నాడు. అడిగడిగి, ఇంత కంటి జబ్బు మనిషి నడిగానే అనుకొని, నేను నాకొట్టు పెత్తనంపనిలో పడ్డా.



# 11. కుమారిక కూర్పు నేర్పులు

## సుభద్రా పరిణయము

"కలపములు గూర్చి బహువిధ
తిలకంబులు వెట్టి, వింత తెరువున బలు పు
వ్వులు గట్టికట్టి మోద్వగ
తలముడువగ, సఖులు గువ్వ"

ప్రావీణ్యత సేకరించిన కుమారిక పెండ్లివారింట, విడిదలోను ఆ యా కృత్యాలు అభినందనీయంగా చేస్తూ, యిరుపార్శ్వాల పెళ్ళివారి ఆద ణానురాగాలూ చూరగొంది. పరిమళవస్తువుల పరస్పరసమ్మేళనం పలురకాల కలపములు తయారుచేసి, రాయలనాటి పరిమళకారకవిద్య పెండ్లివారింట దింపింది. తాను స్వయంగా తయారుచేసిన సబ్బుబిళ్ళలన విడిదలో అందిస్తూ, స్త్రీజనాలకు గృహోపయుక్తమైన చేతిపరిశ్రమలప అభిరుచి రేకెత్తించింది. ఆమె చుట్టే బహురసరచనా సమ్మిళితాలై 'కప్పురపున్ విడియమ్ముల' కబ్బురపడేవారు. ఆమె కట్టే చే తురాయిలకు, పూమాలికలకు పెండ్లికొచ్చిన నూతనదంపతులు కాచుకు కూర్చునేవారు. ఆ యా కొత్తపెండ్లికొడుకుల ప్రశంసావాక్యాలు, ఆ య పెండ్లికూతుళ్ళకు కంట్లో కలికం పెట్టేవికాబోలు, రెక్కలు ముక్క

చేసుకొని యింట్లో ఏమి చెయ్యి, 'పక్కవాటావాళ్ళ వంకాయ బజ్జికి శరొట్టి వెయ్యడం యివాళ యిదేం కొత్తామిటి నాకు. రాత,' అని మగు ఋక్కుంటే 'ఏదీ చేతావాతా కాదు కాని, కోపంమాత్రం అడ్డబాసలా ముక్కు నుండడమూ కొత్తగాదు రోత,' అని మగడు గొణుక్కుంటున్నాడు.

పెద్దాపబిడ్డకూతురు, సుభద్ర, కుమారిక రచనాకౌశలానికి సమ్మోహితయై, ఆకళావిశేషాన్ని నేర్పుటకు, కుమారికవద్ద శుశ్రూష చేయ సాగింది. ఇంతదనుక సుభద్ర ఒకపనియందు లక్ష్యముకాని, ఒకరిపట్ల భక్తికాని చూపి యెఱగదు. నేటి గురుభక్తిని ఆమె ప్రవర్తనయందు ఒక పెద్ద పరివర్తనగానే పేర్కొనవచ్చు. సుభద్ర పెంకిపిల్ల. పెంకి రణపెంకి అనుకించుకోడానికి ఏమోతాదు మీజాలో తెలియదుకాని, సుభద్రకు రణపెంకి అని కితాబు. ఉన్మిషితయౌవన. అత్యంతభావోద్రిక్త. అవివాహిత. సౌందర్యంలో నిసర్గమాధుర్యలోపం లేకపోయినా కృత్రిమ శోభకెక్కువ శ్రద్ధచూపుతుంది. ప్రాయమంకురించిన కన్యలకు ప్రొద్దుకొకసింగారమైతే సుభద్రకు పూటకు రెండూమూడున్నూ వేషధారణములో సినీమాపోకడలు షికారుచేస్తుంటై. కాస్తకనువేదుఱుగలకన్య. నడవడిలో స్వేచ్ఛాప్రవృత్తి సూచనలు కన్పిస్తోనై, తలిదండ్రులు ఆందోళన పడ్తున్నారు. బంధుకోటి ఛీత్కరిస్తోన్నారు. గజ్జలగుర్రమని, వన్నెలవిసనకర్ర అని కిట్టనిమాట లంటున్నారు. సినిమాలో చేరి రంగతార కానున్నదని కూడా మాటపుట్టింది. సుభద్ర బంధుకోటిని అడవిజాతిమనుష్యులుగా భావించి, పల్లెటూరి అమ్మమ్మలని తూలనాడుతోంది. సంబంధాలు రావడం మానేసినై. ఒక్కర్తెనూ ఇంటివద్ద వదలి వస్తేనే, బాల్యచాపలాధీనయై కాలుజారుతుందేమో నన్న భయమూ, పెండ్లికి తీసికొస్తే పెండ్లిసందడిలో అందుకే దేరే విలాసపురుషులుంటారు, ఏం దుష్పరిణామం దాపరిస్తుందో అన్న భయమూ సమానంగా తల్లిని సంకటపెట్టినై. అల్లరికేం, ఇంతవరకు కన్యాత్వం మాలిన్యంకాకపోవడం అదృష్టమే.

సుభద్ర మనసు తేజస్వంతమైనదే, కాని త్రోవతప్పి బహుముఖంగా తిరుగుతోంది. ఆమె బుద్ధికొక లక్ష్యమూ, ఏకాగ్రత అలవర్చే సుశిక్షణ

పయుడం అంత కష్టంలోది కాదనుకొంది కుమారిక. ఆ పెతల్లి వరస చూచినకొద్దీ సుభద్ర పెంకితనమూ, అవిధేయతా ఆ పెతల్లి గృహపాలనా విధాన దుష్ఫలితమే గాని, సుభద్ర స్వతఃసిద్ధంగా పెంకిపిల్ల కాదనుకొంది కుమారిక. వచ్చిన రెండుపూటలనుంచీ సుభద్రతల్లి భర్తనో, బిడ్డలనో సాధిస్తోనేయుంది. అదో అపశ్రుతి కుటుంబాలాగుంది.

అపశ్రుతికుటుంబం యమలోకం. భర్తపట్ల ఆపెకు తిరస్కృతీ, దూషణ. ఆపెపట్ల బిడ్డలకు తిరస్కృతీ దూషణ. ఎవరూ ఎవర్నీ దార్ని పెట్టుకో లేకున్న మారాముళ్ళకొంప కాబోలు. ప్రొద్దస్తమానం ధుమధుమలాడే తల్లీ, చిక్కుచిక్కుమనే తండ్రీ కన్పించే కొంపపట్ల బిడ్డలకు ఆదరాను రాగా లేలాఉంటై? ప్రేమకు పెన్నిదానం తల్లి. ఆతల్లే భయంకర మూర్తి అయితే బిడ్డ బాల్యంలో జడుసుకు టుంది. వయసు రావడంతో తల్లిని విసిరికొట్టి కసితీర్చుకొంటుంది.

అలా తయారయిందే సుభద్ర, అనుకొంది కుమారిక. ఒక విద్యావిషైక వ్యాసంగంలో, 'బిడ్డల స్వభావ, సౌజన్యాదులు వారు పెరుగుతోన్న గృహజీవిత ప్రభావంగా నిర్మితమౌ'నని స్వాములు చేసిన ఉద్బోధము జ్ఞప్తికొచ్చింది కుమారికకు. జాయాపతు లిరువురునూ పవిత్రులై, ప్రేమ గతచిత్తులై యున్నవారికి కలిగే సంతానం సలక్షణశోభితమై ఉంటుంది. అట్టి బిడ్డలకు శ్రేయోదాయకమైన సుస్నేహము, ఆజ్ఞాపాలనము అబ్బుతై. 'నిష్కలంకమైన సజీవప్రేమకు నిలయంకావాలి గృహం' అన్నారు స్వాములు. చనువుచూపి, దారినిపెడ్తే. వజ్రపుతునకే సుభద్ర అని విశ్వ సించి, ప్రేమార్ద్రహృదయంతో ఆమెను ఆదరించింది కుమారిక.

డబ్బు ఖర్చుపెట్టి తెచ్చినవి లేకపోయినా, అమ్మాణీపెండ్లికి వాటంత టవే. అనుకోకుండా ఏవో వేడుకలు, వినోదాలు సంఘటితనువుతోనే ఉన్నాయి. అంటే పైవాళ్ళేవళ్ళో పని చెడివచ్చి, పెళ్ళివారి వినోదం కొఱకు, నృత్యవాయిద్య సంగీతసాహిత్య విద్యలు పెళ్ళివారి సమక్షాన ఉచితంగా ప్రదర్శించి పోయారని కాదుస్మండీ. పెళ్ళివారు నాబడే వివిధ వ్యక్తులు, ఆహుతులైన గ్రామస్తులు చేస్తోన్న ప్రసంగ ప్రవర్తనలే, వేడు కలుగను వినోదాలుగను పరిణమించినై.

అలాంటిదే. కేవలం బుర్రకథ చెప్తోన్నట్టు ఒక అవధాన్లుగారు పెండ్లి చేయవనాడు వినిపిస్తోన్న స్వవిషయం, ఏదో కష్టాలగోడు. ఈ అవధాన్లు ఒక విచిత్రవ్యక్తి. ఆ వయసు వేడుక లేదన్నలోటు తీర్చాడు. కూతురికి సంబంధాలు చూడ్డానికి కాళ్ళరేటట్టు తిరిగితిరిగి అవిధిపడి ఉన్నవాడు. ఎక్కడికెళ్ళినా లేదు, కాదు, రాదు అన్న చిలకపలుకులే వినిపిస్తోంటే, ఎముకలు చిట్లంగట్టినై. వస్తున్నవాడల్లా వంచకుడని, మొగపెళ్ళివారంటేనే మోసగాళ్ళని ఒక నిశ్చితాభిప్రాయాని కొచ్చాడు. తనయింటకూడా పెళ్ళికావాల్సిన కుర్రాడోడుంటే, తానూ కొంతమంది కన్యాప్రదాతలను, ఔను, కాదు అని తిప్పించంపితే, ఏదీ తేల్చకుండా, దేశకాలపరిస్థితులకు కొంత సహనం చూపును. అంచేత అంటాడు “ఖరాంగా ఒక్కమగపిల్లవాడినే కని కూర్చుండి, మళ్ళా విదపని స్త్రీ, శాఖినీఢాకినీ అయిపోతోంది” అని.

ఒక్క ఆడపిల్లనే కన్న యిల్లాలు శోకరసాధిదేవతవుతోంది. కాలమహిమ. సంఘదౌర్భాగ్యం. ఎవళ్ళమాటో ఎందుకు, శోభనాయి నామేనల్లుడిమాట చూడండి. పదోఏటినుంచి మాపిల్లను వీడు చేసుకుంటాడని మేమే కాదు, ఊరంతా అనుకొంటోన్న విషయం. అంచేత పిల్ల పెద్దమనిషై మూడేళ్ళయినా, నేను సంబంధాలు చూడకుండా ఖరాంగా కూర్చున్నా కాలేజీ జదువుల్లో అవసరం వెంబడిని పాతిక ముప్పై వాడికి పంపుతో ఉండేవాడ్నికూడా. తేడాలేకుండా సెలవులకొస్తే తప్పకుండా యిక్కడకీ వస్తా చేతిలో వేసుకు పోతోండేవాడు.

చదువు పూర్తిఅయింది. ఆమధ్యనే వచ్చాడు. కాస్తముభావంగా ఉన్నట్టు కన్పించాడు. వివాహ విషయం కదిపితేసగద, “తల్లితండ్రులకు యెదురాడ్తానా?” అంటో పితృభక్తి మాతృభక్తి గుమ్మరించాడు. ‘అంతవరకు వీడు, యింట్లో చెప్పినమాట వినక ఏడిపిస్తున్నాడని వాళ్ళు గోలపెడ్తే వెళ్ళి తగవు తీర్చేవాడ్నిస్మండీ. ఇప్పుడు, పెండ్లి విషయం నే నసలు, వాడి తలితండ్రులతో సంప్రదించాల్సిందన్నట్టు మందహాసం చెయ్యడం మొదలెట్టాడు మొగాడు. ఈవికార మేమిటని వాళ్ళ అమ్మనడిగా.

“మీరు, మీరు మగాళ్ళు. మీరు పైసలు చేసుకుంటే నేను కాదం

టాన్రా అన్నయ్యా అపెదాన్ని, ఈరోజుల్లో అథమం అయినవేలేనా అంటేగాని తలవంపుల్రా. నువ్వేరగం దేముంది ? అందులో ఒక్క-బిడ్డ. వాడు చిన్నబుచ్చుకొంటే చూడలేన్రా అన్నయ్యా" అంటూ ఆప్యాయ తంతా వెళ్ళబోసిందది.

మాబావ నడిగితిని కద, "కుర్రాడితోనే మాట్లాడావటగా," అంటూ ఆ "గా" గన్నారందాకా సాగతీశాడు. నే నేదో స్వోపయోగార్థం వాళ్ళ కుటుంబాన్ని చీలదీస్తోన్నట్టు, కుర్రాణ్ణిచేసి, పాతచనువునుబట్టి, మాయచేస్తోన్నట్టు, అమాత్రం ముందుజాగ్రత్త తాము పడకపోలేమనే అన్నట్టు, అయినా యిది నీవు అనుకొంటోన్నంత అషామాషీ సంగతి కాదు బావా, వ్యవహారం సుమా ! అన్నట్టు ధ్వనించింది వాడి ప్రసంగం. "అది నీచెల్లెలు, వాడు నీమేనల్లుడు, మీరంతా ఒకటే, ఎటొచ్చీ నేనే పైవాణ్ణి" అంటూ వాక్చాతుర్యమంతా వలకబోశాడు.

వీడు పరీక్షలిచ్చి వచ్చినరాత్రే, ముగ్గురూ కూర్చుని "చదువుకైన సొమ్మంతా ఈకట్నంతో వాపసు రావాలి. ఈరోజుల్లో ఉద్యోగాలా సద్యోగాలా, ఇప్పుడు మేనరికమని మెత్తపడ్డామంటే దంవగపడ్డాం, మళ్ళా మళ్ళా కూడివచ్చేది కాదు. తర్వాత విచారించిన లాభంలేదు" అని, ఒకటో క్లాసు ఎక్కాల పొస్తకం దగ్గరనుంచీ చదువుకైన ఖర్చంతో లెక్క-తేల్చుకొన్నారట. నాదగ్గర గుంజినవి లెక్క-కొచ్చాయో లేదో! నే పలకరిస్తే, ఎవరేమని సమాధానం చెప్పాల్సిందీ డ్రెస్సు రిహార్సల్ వేసుకొన్నారట. "పాత అలవాటున వాళ్ళింటికి వెడ్తోండకు, బెట్టుపోతే బేరం పలకదు. అదుర్మార్గుడు"— హారహారా ఎవర్నెంచేశానని——— "మెడలు విరచైగలడు. పొంచికూర్చున్నాడు. నీవు ఒంటిగాడివి వాళ్ళింటి కెళ్ళావంటే" అని కుమారరత్నానికి చెవులో చెప్పారట. ప్రక్క-యింటావిడ పిట్టగోడ చాటునుంచి విన్నానని, మా ఆవిడకు పరంపదంగా చెప్పినవిషయం. మాకుటుంబాల మీద ఆవిడకు అంత ఆపేక్షపాపం!

"మామ గుమ్మాన్నెక్కి తల కాయ బ్రద్దలుకొట్టుకున్నా నేను పెదిమి జాలను. మనమంతా ఒక్క-మాటమీద ఉండాల్సిన అవసరం వచ్చింది. మీరు బేరంపెట్టి రాబట్టేదంతా రాబట్టండి. నేను కాదనను. ఇదికాక

బోతే లక్షసంబంధాలు" అని తలితండ్రులను యిసుగొల్పాడు అబ్బాయి. ఈ ఆదర్శప్రాయుడు వీడి కాలేజీలో, కట్నాల మహావ్యాపార నిరోధ సంఘమట ఏదో, దానికి సెక్రటరీయట. వీడి ఉపన్యాసాలు ఏదో దిన పత్రికలో పడ్డాయని, చాలా హాటుగా ఉన్నాయని వినికిడి. ఇదీ నేటి యువకుల మనోవైశాల్యం, ఉదాత్తత సంఘహితైక బుద్ధిన్నీ, వీరూ, మన భారతీయ సంస్కృతికి ప్రతినిధులు. వ్హా! అచ్చొచ్చడీలు".

పెండ్లిపందిళ్ళు సౌందర్యయువతీ విరాజిత శృంగారభూములుకదా. అచ్చటొక చెసగా నుంచున్న మృగాక్షీ నివహం వంక దృష్టిపారించిన ఒక యువకుని కన్ను కుమారికమీద పడ్డది. అదే తొలిసారి చూడ్డమేమో, నిలబడి కుర్చీని కాలితోనే వెనక్కు గెంటేసి, సౌందర్యార్చన చేస్తున్న కళాకారుని కళ్ళతో, ఆమెపై చూపు నిలిపాడు. ఆచేతులూ, వక్షనిధులు, నడుమూ, కటి కాళ్ళూ, పాదాలు — ఆ బ్రహ్మ ఒక దివ్యలలితకళా పారవశ్యకతో సృష్టించియుంటా డనుకున్నాడు. కవితాభావ సమ్మిళితానందం గాని అతని మోములో ద్యోతక మవుతున్నది. శృంగారభావోద్రిక్తతగా కన్పించదు. కనుపించక వెతుకుళ్ళాడ్తోన్న, ఒక అమూల్యద్రవ్య మేదో కంటబడ్డవాని "రిలీఫ్" అతడి భ్రూయుగ్మంమీద కన్పిస్తోంది. టిన్లోది సిగరెట్టుతీసి నోటికందించుకొన్నానని, అగ్గిపుడకతీసి కూడా వేసుకోకుండా ఆమెను చూస్తున్నానని ఎఱుగడు. ఇట్టి వర్చస్విని తన ఇరువది ఒక వత్సరాల వయసులోను నారీలోకంలో కంటబడలేదు.

కుమారిక ఆకృతి నేలనో యువకుడు పోల్చుకుంటోంటే, అతని సౌందర్య గరిమకు నూత్నతారుణ్యశోభావతు లెందరో వివశులవుతున్నారు. ఈ శకంలో యువకుల అందానికి ఏర్పడిన "ఔట్‌ఫిట్" గల షోకేళా. ఇరవయ్యోశతాబ్దోత్తరభాగ నాగరికతకు సోదాహరణంగా ఒకచేత సిగరెట్టుటిన్ను, ఒకచేత హాంఘుకెమరా, చంకను "ఇలస్ట్రేటెడ్ వీక్లీ" సంధించి, బొద్దుచార్ల పైజామా, లేతగులాబీరంగు అమెరికన్ జాకెట్టు, చేతిని రిస్టువాచీధరించి, పలకరిస్తేగాని పలకని ముభావంతో, ఎప్పుడూ ఏదో విజ్ఞానశాస్త్ర విషయపర్యాలోచనా నిమగ్నుడైయున్నట్టు భ్రూయుగ్మం ముడించి, సిగరెట్టుటిన్నుమీద సిగరెట్టుతో మృదుశబ్దంచేస్తో, మధ్యమధ్య

అందకత్తెలపై వృదృష్టి సారిస్తో, మరుక్షణంలో వారిని ఐచ్ఛికంగా చూడలేదన్నట్టు సూచిస్తో, పెండ్లిపందిట్లో ఒకవైపుగా కూర్చుని, పెండ్లి కావల్సిన పిల్లలను తెగ ఆకర్షిస్తోన్నాడు.

ఆ అమ్మాయిల తండ్రులమాట చెప్పనక్కరలేదు. సంతగోదను నఖముఖపరీక్ష చేసేటట్టు, ఆతణ్ని ఎగా దిగా చూచి, చాటుకెళ్ళి, "ఎంతకట్నం పెడితే ఈ బేరం పొసుగుతుందంటావు, నావ బ్రహ్మాం," అని చెవులు కొరుక్కుంటున్నారు. కాలప్రభావం. బీదయింటి కన్యలకు వివాహ విపణివీధిలో తగిన వెల లభించని దుష్కాలం. అవివాహితుడు పెండ్లికొస్తే, ప్రభుత్యోగానికి అప్లికేంట్సు ఎగబడ్డట్టే, కన్యాప్రదాతలు మూగే మాయకాలం దాపరించింది. వరుల విషయంలో "నీలిసంత" వ్యాపారం నిరర్గళంగా సాగుతోంది.

ఈ యువకుని నాన్న పెద్దకట్నం రాబట్టడానికి పదిమందీ చూడాలని ప్రదర్శనార్థం యీ అబ్బాయిని పెండ్లికి పంపించాడు కాని, ఈతడు యిక్కడ ఎవరికీ పేగుసంబంధం కాదని ఒకమాట పుట్టింది. పోనీ అడిగి అనుమాన నివృత్తి చేసుకుందామా అంటే, కూడా నేస్తం ఎవరూ కన్పించరు. ఎవరు ఎవర్ని అడిగినా, యేమో అంటే యేమో. మగపెళ్ళివారు ఆడపెళ్ళివారు బంధుగనుకుంటే, ఆడపెళ్ళివారు మగపెళ్ళివారి చుట్టం అనుకుంటున్నారేమో కూడా. అంతా ముసుగులో గుద్దులాట లాగుంది. అచ్చటి ఏకఫలాపేక్షితుల వ్యవహారం. అడగలేరు ఊరుకోలేరు.

చివరికా మేనరికం బుర్రకథ అవధాన్లుగారే తెగబడి తేల్చడానికి నడుంకట్టాడు. పెళ్ళిగోడవవస్తే మర్యాదలను మరచిపోయి చాలాకాలమయింది ఆయన అంటాడు. "అబ్బాయి! నువ్వూ చూస్తున్నావు. పది పన్రెండుగురు పెండ్లికావల్సిన ఆడపిల్లలు పందిరమ్మట తిరుగుతున్నారు. భర్తకోసం ఉగ్రతపస్సుచేస్తున్న పడుచులు మరో వజను ఊరంటఉన్నారు. నీవు పెదిమి కదపకుండా, బెల్లం కొట్టిన రాయిలా ఆ మట్టునే కూర్చుంటే ఏమైనట్టు? నీభోగట్టా తెలియక గ్రామం అట్టుడికినట్టు ఉడికిపోతుంది. ఎంతమందో క్షోభ పడిపోతున్నారు. నువ్వేమైనా కల్సివచ్చేవాడివా, కాక ఎవరిపన్ను వారిని చూచుకోనున్నావా? చెప్పు" అన్నాడు.

యువకుడు ఉలిక్కిపడి ఆయనవంక చూచి, "అయ్యా! మీరు పెద్దలు, మిమ్మల్ని పితృసమానులుగా భావించి, మీరు కనీసమర్యాదనుకూడా గుర్తించకుండా మాట్లాడినా, అప్రసక్తి మీతో తేవటంలేదు. నాచేసిన నేరమేమో, మీ మాటకటువుకు కారణమేమో తెలియకుంది. పెండ్లికాక తపించిపోతోన్న కన్య లీవూర పాతిక మందిదాకా ఉంటే వారికి నా సానుభూతి. ఒంటిగాణ్ణి, అదనం నేనేమి చెప్పగలను? ముఖ్యవిషయం, నేను నా జీవితాన్ని రసాయనశాస్త్రానికి అంకితంచేశాను" అని అవధాన్లు గారితో సవినయంగా చెప్పాడు. కన్యలవంక తిరిగి "I have no other loves, please" అన్నాడు.

యువకుని సమాధానానికి అవధాన్లుగా రేమనునో, అంతలో కూతుర్ని చూచుకోడానికి, కాకినాడనుంచి పెళ్ళివారొచ్చారు, వెంటనే రమ్మని ఇంటివద్ద నుంచి ఆయనకు కబురొచ్చింది.

"వస్తారొస్తారు! రాకేం, ఇక్కడ ఫలహారాలు మప్పితంగా పట్టించి, తోటా దొడ్డీ కలియదొక్కి చూచుకొని, యింటికెళ్ళి ఉత్తరం వ్రాస్తామనిచెప్పి, ఫీకర్లేకుండా పోతారు. పిల్ల పెళ్ళికని పరంపరంగా జాగ్రత్త పెట్టిన రెండువేలనాల్గువందలూ, నా ప్రయాణాలకీ, వారి ఫలహారాలకీ ఆరిపోయినై. వట్టిచేతులతో నేను, పెళ్ళో. పెళ్ళో అంటో ఒకటేపాట పిల్లా దిగడ్డాం" అంటో వెనకొచ్చినవారినీ. రాబోయ్యే వారినీ శాపనార్ధాలెడుతో, వచ్చిన విసురునే వెళ్ళాడాధూర్తమాత్ముడు.

"వాన వెల్సినట్టుంది వాతావరణం. కాని తానెటు కదల్తోన్నా యువకుడు ప్రొద్దుతిరుగుడు పువ్వులా తనవంకే చూస్తోండడం, మిగతా కన్యలెంతమందో యువకుని దృష్టికెక్కటకు ప్రబల ప్రయత్నాలు చేస్తోండడం, గుణవతి కుమారికకు, ఆందోళన కల్గిస్తున్నై, అహంభావపూరితలైన మహిళామండలి కన్యలున్నారు వారిలో. వారు తనమీద అకారణద్వేషం పెట్టుకోవచ్చు. తాను చల్లగా తప్పుకుందామా అంటే, సీతమ్మగారికి తన అవశ్యకత అనునిముషం కలుగుతోంది. పోనీ, యువకుడు కదలునా అంటే, పెండ్లిపందిరివినా వేరుబస ఏర్పాటు చేసుకున్నట్టు లేదు. రావడమే పెండ్లి పందిరి కొచ్చినట్టున్నాడు. ఇంకా కూర్చుంటే, అవధాన్లుగారిని చూచా

ముగా, కె న్యాప్రదాతలు ప్రశ్నావళితో పొడుచుకుని తినేటట్టున్నారు. వాళ్ళు తప్పుకుంటే అమ్మాయిల యిబ్బంది. ఏ కారణంగా వచ్చినవాడైనా, అతణ్ని సరసంగా సత్కరించే బాధ్యత ఆడపెళ్ళివారిదేకద” అనుకుంది కుమారిక. యువకున కీపెళ్ళి తరద్దీలో సత్కారం చేసేవా రెవరున్నారని ఆలోచనలోపడ్డ కుమారికకు, పెండ్లిచేస్తేగాని నిలకడరాదని తానూహించిన సుభద్ర తటాలున జ్ఞప్తికొచ్చింది.

కుమారిక సుభద్రను చాటుకు పిల్చి, “ఈ యువకుని వైఖరిచూస్తే బహుశః మా అమ్మగారి అబ్బాయిగారిని ఎరుగుండివచ్చి, వారు కనిపించక యిబ్బంది పడ్తోన్నట్టున్నాడు. అవధాన్లుగారితో అతడి సంభాషణ విన్నావు కద. విద్యావంతుడు, సరసుడు అని తోస్తుంది. కాబట్టి నీవు విడిదికెళ్ళి, స్నానాదికృత్యాల కతడికి సర్దుబాటుచేసి, జప ఏర్పాటుచేసి, సమాదరించాలి. మా అయ్యగారు పెద్దలు. యువకుల నాహ్వానించడం పొందు వారికి తెలియదు. మా అమ్మగారికి తెరిపిలేదుకద. నాకు యిచ్చట ఎన్నో తొందరపనులున్నై. రేపు సదస్య తతంగమంతా ఇప్పటినుంచీ చూచుకోవాలి. నాకు ఊపిరాడదు. ఆడపెళ్ళివారికి మాటదక్కిస్తావని ఆశించి, అతణ్ని నీకు అప్పచెప్తోన్నా. ఈ యువకుని సత్కరించే భారమంతా నీదే సుమ” అని సుభద్ర చుబుకం పట్టుకొని చెప్పింది కుమారిక, ప్రేమ విలసిత వాక్యాలతో.

అంత చుబుకం పట్టుకొని చెప్పనక్కరలేదేమో. ఈభార మెంతైనా మోసే బుద్ధిమంతతనం సుభద్ర మోములో కన్పించింది. ఏమైందో ఆపెంకితనమంతా. యువకుని పసిమివర్ణం, కోల నగుమోము, ప్రెంచి మీసం, ఉంగరాలు చుట్టిఉన్న తుమ్మెదరెక్కల్లాంటి జుట్టు, ఆపె పెంకితనానికి చికిత్సాలేపనుయి యుండాలి. కృతజ్ఞతాపూర్వకంగా, కుమారిక కళ్ళల్లోకి చూచి గిర్రున తిరిగి, యువకుని త్వరటిలో విడిదకు తోడుకుపోయింది. కృష్ణుని పనుపున, అన్నపానాది విధులం బరిచరింప వెళ్ళిన సుభద్ర యతిరూపంలో ఉన్న విజయునకు అపూర్వమైన భోజనాలు పెడ్తో, యుక్తులు తెలయిస్తో,

“ముదముతో బెనిచెన్ నెయ్యము కామవికారము సత్యసాచికిన్”

అన్నారే నన్నయ్యగారు అంత అనురాగంతోను ఈ యువకునికి అతిశయు మాపయౌవనగర్వితే, మన సుభద్ర సపర్యలు చేసింది.

ఈనాటి నాగరికతకు పట్టుకొమ్మల్లాగున్న వీరిద్దరిని చూచినకొద్దీ, ఇది సత్ఫలితాలనిచ్చే సంధానమే నని. వారిపందిట్లో సమావేశమవడం దైవప్రేరితమేనని విశ్వసించింది కుమారిక. సుభద్రను సన్మార్గవర్తినిని చేయుటకు సాధనమైన ఈసంధానం ఫలిస్తే తాను సాధించిన విజయాలన్నిటికి తలమానికమగునని ఆనందపులకిత అయింది. కాని, అంతరాంతరాల్లో కుమారికనో సందేహం వేధిస్తోంది. ఆసందేహ ముప్పతిలునపుడు, ఆమె హృదయవీణ అపశ్రుతి పలుకుతోంది తానే వారి ప్రణయభంగ కారణం కాబోను కద అనే ఘోరమైన అపస్వరం వినిపిస్తోంది. సుభద్ర రాజసప్రకృతి. ఇమ్మె తప్పివచ్చెనా, ఆశాభంగం భరించలేక, అనాలోచితంగా తన్నువాస్థం చేసుకోగలదు. పందిట్లో తన్ను వెంబడించిన యువకుని చూపుల్లో తన సౌందర్యాభినుతి గోచరించింది. కొంపత్రవ్వి అది కామేచ్ఛే అయితే, పరాసక్తహృదయుడా యువకుడు సుభద్రను స్నిగ్ధ, స్వచ్ఛ, నిర్మలభావంతో ప్రేమించలేడు. తాను పరోక్షంగా ఉండడమే హితవని వారిని తప్పించుకుని తిరుగుతోంది.

సుభద్ర కుమారికను వెతుక్కుంటూ వచ్చి, ఆశ్లేషించి వెలిబుచ్చిన రహస్యంతో, కుమారిక సందేహం నిర్వృతమైంది. కుమారిక ముఖకమలం వికసించింది. ఆ యువకుడు బి.యస్‌సీ. కథకుడు. కళాహృదిగల పేదకన్యను నాయికగాచేసి కథవ్రాశాడు. అతడి ఊహాచిత్రానికి నకలుగా నుండెగల కన్య కంటబడితే, ఆమె ఛాయాపటంతీసుకొని, తన పుస్తకానికి ముఖచిత్రంగా వేసుకోవాలని అతని ఆకాంక్ష. అమ్మాణీ అన్నకు స్నేహితుడు. అతణ్ని చూడవచ్చి, ఆహూతుడు కాకపోయినా పెండ్లిపందిట్లోకి వచ్చాడు. తాను చిత్తరువుకు కోరిన రసాకృతి అప్రాప్తమనోహారి అని అతడు నిరాశచెందిన ఘడియల్లో తటాలున కుమారికనుచూసి నిలబడిపోయాడు. కుమారికను పోజుయివ్వమనడం భావ్యం కాదేమోనని బాధపడ్తోన్నాడు. ఈ వృత్తాంతం చెప్పి, 'నీ అంగీకారం సంపాదించుటకు నా సాయ మపేక్షించాడు' అని సిగ్గుపడుతో తలవంచింది సుభద్ర.

యువకుని విరుద్ధసంకల్పానికి వెఱగుపడి, "చెల్లీ, సుభద్రా చిత్తరవుకేమొచ్చెగాని, యువకుడు సాహితీపరుడు. నిరుపేదకన్యను నాయికగా

చేసి కథ వ్రాస్తున్నాడు కాబట్టి జాలిగుండె, ధర్మబుద్ధి కలవాడైయుండాలి కాయకష్టం పడే కన్యకు కావ్యంలో గౌరవస్థానమిస్తున్నాడు. కాబట్టి, సాంఘిక వ్యవస్థను గుర్తించిన విజ్ఞుడై ఉంటాడు. అన్నివిధాలా, నీ కాతడు పూజార్హుడుసుమా. నీ పేరింటి సుభద్రను మఱువక'' అని నవ్వుతో బుగ్గగిల్లింది కుమారిక.

అదేమి హెచ్చరికో! క్రొత్త హెచ్చరికేమీ కాదు. సన్యాసికి సేవచేయ మని నియోగించినపుడు కృష్ణుడు చెల్లెలి బిల్పించి 'రావమ్మ, సుభద్ర! నీయభిమతార్థము లెల్ల ఫలించు నియ్యెడనే'' అన్నాడే, ఆ హెచ్చరికే.

---

# 12. పెండ్లి వేడుకలు

## గానసభ

పెండ్లితతంగ మంతలోను సంగీతసభ, సదస్యస్సంభావన చూడవేడుక నాకు మొదట్నించీ. పనసపళ్ళు చేతిలోపడితే నవకాయ పిండివంటల తోనూ రాజభోజనం అమరినట్టు ఆనందించేవాడిలా, నాకివ్వి ఉంటే మరేలోపం కనపడదు. కాని కొట్లుపెత్తనం నాచేతికొచ్చిన కారణాన, వాటి సారస్యం నేను స్వయానా అనుభవించలేక, మీకు నేను 'సెకండరీ ఎవిడెన్సు' యివ్వాల్సివచ్చింది. ఏమైతేం, గానసభకు, 'సదస్య స్సంభావన దృశ్యానికి నోచుకోలేదురా నేను' అన్నాడు కోట్లుతో.

"విచారిస్తున్నావా, సంతోషించు" అని వాడచ్చట మార్కు చేసుకొచ్చిన, చెంపమీద వాపొకటి, మోకాలిమీద చిన్నగాయమొకటి రెండు "యక్జిబిట్లు" చూపి, చెప్పడం మొదలెట్టాడు వాడు. చెప్పిన మాటలు చెప్పినట్టు ఇచ్చట పొందుపరుస్తున్నా.

"పాటకుడు మన పెళ్ళివారి బంధుకోటిలోవాడే. డబ్బిచ్చి తెచ్చినవాడు కాదు. 'డబ్బు ఊడేయని వాడు పాటకుడేమిటి వాడిబొంద?' అనుకున్నాం బుద్ధిమంతులం. 'ఏపుట్టలో ఏ పాముందో!' అని కొందరు, 'ఏమో

పెళ్ళికొచ్చిన కుర్రాళ్ళలాగే హైలాపచ్చీసుగా ఉన్నాడు. వంటిని ఎక్కడా పాటకుల పటాటోపం లేదని కొందరు, ఏమాత్రం శిక్షవిద్యో, సాధక చేసిన చెయ్యో కాదో, తీరా కూర్చుని సుతిస్థాయిలతో నిమిత్తంలేకుండా రెండు సినీమా పాటలు, రెండు నాటకపద్యాలు, ఓ జెంకిపాటా, అని పోయే రకమో, అని కొందరు సందేహాలు వెలిబుచ్చుతోంటే, అతడి సాహ పగాళ్ళే యిద్దరు తైనాయితీగ, అతణ్ణి విద్వాంసుడని ఎత్తేస్తోన్నారు. పాట వింటామో మాన్తామో కాని, పాటకుడు యింతవాడు అంతవాడని పగలు పది గంటలనుంచీ రొదపెట్టడం ప్రారంభించారు. చూడండీ, సాయంత్రం షికారుగా, యిదేం షరతా, కండువా వేసుకొని వెళ్ళి, వినీ వినక రాదగ్గదానికి, ఉదయాన్నుంచీ గొట్టంబూరాలు తర్వాయిగా గోల చేస్తే, పాటవేళకు తలనొప్పి వస్తుందంటే చిత్రంలేదు. బల్ల ఎక్కినతర్వాత గాత్రానికి పక్కవాయిద్యాలు అవసరమేమో కాని, పగలల్లా ఈపక్క వాయిద్యా లెందుకండీ మమ్మల్ని హింసపెట్టడానికి కాని. అసలు పాట పడు నెమ్మదిగానే ఉన్నాడు, మధ్యన వీళ్ళు జేపరొట్ట కట్టుకొని ఊరు మరగతొక్కేశారు.

శంకరాభరణం, కళ్యాణి, భైరవి – ఈమేళకర్తల నందుకుంటే తినే గాట్ట. రాగాలను తినేస్తాడా మాకు వినడానికి ఏందిగడను? మమ్మల్నే నేస్తాడా, వాడి రాగాలు వినడానికి కెవరుదిగడను? జన్యాల్లో పసం దైన పనివాడితనం చూపెడ్తాట్ట. ఆ జన్యాల అరా మాకేమొచ్చింది, వాళ్ళ పేదస్తం కాని. గందరగోళం చెయ్యకుండా ఇందోళ పాడ్తాడంటో అదీ ఖ్యాతే. అసలు గందరగోళం ఎందుకండీ పాటకు? మోహనంటుకుంటే నాదమీద కొచ్చి పడిపోతారట సభ్యులు, అంత సంగీతానికి మొహం చచిలేము మాఊళ్ళో ఏమనుకుంటున్నారో వీళ్ళు! మహా తెచ్చారే గాటకుణ్ణి, ఏలాగైతేం. శవనగా ఉంటుందంటో అదీ చెప్పాలీ శవా కి. శవనగా ఉండకపోతే యింకా సంగీతమేమిటండీ తెలియకడుగు గాను? కామవర్ధిని ఆలపించి అన్నంతపనీ చేస్తాట్ట. ఎగుడు దిగుడుపన్ల చేస్తే ఎవరూరుకుంటారనుకున్నారో, ఏమిటి ఆ అన్నంతపనీ, అందు క్కాదు, వాళ్ళ మాటకుచెప్పా, ఆడుగుదవడ జారిపోకుండా పగపంటి

పాడి నెగ్గించిన కితాబుందట ఈపాటకుడికి దవడ జారిపోవడ మేమిటని అడిగా అపుర్దాగా. అది చాలా ఒడుదుడుకు రాగమట. ఏకొంచెం పరాధ్యాన్నంగా ఉండి, రెండుపెదిమలూ ఓప్రక్కకే పోనిచ్చినా, హరహరా అయిపోయి, యింకో రాగంలో కలిసి కనిపించదట. సరస్వతిని ఎత్తుకునేటప్పటికి చుట్టూ మూగిఉంటాయట యితర రాగాలేవో మింగైడానికో, లేవతీసుకుపోవడానికో, అంచేత యింతసేపూ వేయి కళ్ళతో కాచుకుంటో నోరు అట్టే తెరవకుండా, ఓరువాకలిగా పెట్టి ఈరాగాన్ని నేర్పుగా కాపాడాలట. పాపం ఎక్కడ్డో ఓపాటకుడికి, ఓరువంకలి దవడలు, నరంపట్టేమో ననుకున్నా. ఆసాయింత్రం మళ్ళీ కల్పుకో లేదట. మంగళం మరోరు పాడాల్సివచ్చిందట. పాటకుని కీప్రమాదా లుంటై అన్నమాట. సభ్యుల కుంపడం ఎరుగుదును. మొన్న నో గానసభలో పాటకుని కెదురుగుండా ముందువరసలో వాళ్ళ బాబాయి ఒళ్ళో కూర్చున్న కుర్రగుంట ఒకడు, కెవ్వుమని ఒళ్ళెరుగడు. ఆపాటకుడు అతాణాముక్తాయింపులు మూడు, విసురున గుప్పెడిబిగించి, భావోద్రేకంలో వాడివంకే చూస్తో, చెయెత్తి యిస్తే ఏమనుకున్నాడో కుర్రనాగమ్మ.”

“పాటకుని తైనాయిత్తీలు ఏంకోస్తే మనకేం, పాట ఎల్లాఉందో అది చెప్పవోయి” అన్నా.

“అయితే విను, తగులడిపోయింది” అన్నాడు కోట్లు.

“ఏరా?” అన్నా.

“కొండుబొట్టు అనే బలేతుంటరిఒకడు గానసభను పొట్టపెట్టుకున్నాడు. వాడి మంపతెగ, ఎక్కడనుంచి వచ్చాడో వేళకు, వాడిచరిత్ర ముందే తెలిస్తే వాడి నోకొట్టులో బిగించి మరీ ప్రారంభిస్తురు సభను. ఇప్పు డేమనుకుంటే ఏంలాభం? ముందు తెలియకపోయింది. వీడి కేమీ ప్రమేయం లేనిచోట యిట్టే వాల్తోట్టు. వీడికి ఎప్పుడు దేనిమీద అభిమచి కల్గుతుందో బ్రహ్మకు తెలియదు. అన్నిపరీక్షలు వీడి క్కావాలి.

“ఆమధ్య టవున్‌క్లబ్బువాళ్ళేదో ఫొటోతీయించుకుంటే దాన్ని తగలే శాట్ట. వాళ్ళాహ్వానించుకొన్న క్లబ్‌డే ప్రెసిడెంటు, క్లబ్బుప్రెసిడెంటు

గార్లు చంకలక్రింద వారుభయుల తెల్లకోట్లసందునా, నల్లగా, బిక్కుపిడతలా ముఖం వేసినా, గుడ్లగూబ కళ్ళెట్టుకొని చూస్తోన్నట్టు, వాళ్ళఫొటోల్లో పడి ఉంటున్నాడు. ఫొటోలు చేతికొచ్చినతర్వాత చూచుకున్నారు పాపం. తలమట్టుకు లావుగా, ఎవ్వరికీ అలుకుడు తగలకుండా వాళ్ళ మధ్య, సరిగా కెమేరా క్లిక్కుమన్నపు డేలాదూర్చాడో, అ కాస్తా అయినవెంటనే. అంత సున్నితంగానూ ఏలా లాగేశాడో, అసలెవరికీ తెలియకుండా అంతవరకు దారిచేసుకొని ఏలా వెళ్ళాడో, ఎవరికీ తెలియ కుండా ఎప్పుడు ఏలాదూకేశాడో, నిద్రలేచి కళ్ళు తెరిచేటప్పటికి శోభవ పిల్లి ఏదో మనకుప్పట్లోనుంచి దభీలున మాయేసి పారిపోయినట్టు అందరికీ ప్రాణం చిటుక్కుమంది. అట్లాంటి పన్లు చెయ్యడం వాడి నైజం.

“ఏనక్షత్రాన్ని పుట్టాడో క్రిందపెడితే పంటలుండవు. పైనపెడ్తే వర్షాలుండవు అంటారే, ఆదీరకం అంతా అపశ్రుతి. అపశ్రుతి కాకేమిటి! మహా సంగీతమంటే చెవికోసుకునే వాడిలా ముఖంపెట్టుకొని గాయకుడు బల్ల దగ్గరకు చేరాడు. విడిచె కాంపౌండులో యిసుకేస్తే రాలకుండా జనం. గాయకుడు తన్మయుడై, స్వర కల్పన చేస్తోంటే, ఆతడి కెదురుగుండా సభలో కూర్చుని శాస్త్రీయుల్లా తలలూపే వారిలో బాగా లయ బ్రహ్మానంద రసం అనుభవించగలిగిన కళాప్రియులు, తంత్రీలయస్వర గానవిలోలురు ఏరైనా స్వరసంచారాల్లో హృదయం లగ్నంచేసి, రాగల స్వరపరిణామాన్ని సూచిస్తో లక్షణయుక్తంగా తమ అరచేతులతో తాళంవేసి గాయకుని ఉత్సాహానికి తోడ్పడ్డం, సంగీత సభా సంప్రదాయాల్లోఒకటి. పది నిమిషాలు కాలేదు. అట్లాంటి రసవద్ఘట్టంలో ఈ దౌర్భాగ్యుడు, నిజానికి వీడికి సరిగమలురావు. ఏపోట్లాటలోనైనా ఎవరైనా వీపుమీద చరుస్తో, దధికిణతోం అన్నాడేమో కాని ఒక్క తాళవరస తెలియదు. పడిఉండ వచ్చునా, తగుదునమ్మా అని, ఆపెద్దమనిషి వేస్తోన్న తాళానికి మధ్యమధ్య తోచినపుడు, వీడో అపశ్రుతి చప్పట్లు కలపడం మొదలెట్టాడు. గానకచేరీ తాళమంటే, సూత్రధారణ మైకులో కాని, ఊరేగింపువేళ కాని వినబడే గంద్రగోళపు వాయిద్యమా? ఎంత సున్నితం? ఎంత ‘మాథమేటికల్ యాక్యురసీ’ తో కూడుకొన్నపని? పాపం జాలేస్తుంది. వేళ్ళు లెక్కించు

కొని, కాలవ్యవధ నిర్ణయించుకొని, అపుడుకదా అరిచేతిలో అరచెయ్యి, చెవి కేమాత్రం కలుపు తోపకుండా, చంటిపిల్లను జోకొట్టినట్టు పసనుగా వేస్తారు. తత్కాల వ్యవధుల్లో [illegible] వెళిలి అపశబ్దం వినిపిస్తోంటే, వీడ్ని పబ్బాడు కిన్నరాయిలోని అంటిస్తే దోషముందా ?

"ఇదీ పీకు చేసినపని, గాయకుడికి ఈ తప్పుడు తాళంతో స్వరం తప్పుకారినిబట్టి రసాభాసమైంది. 'ఎవ్వడా ఆ తప్పుడుతాళం వేసే వాడు ?' అని ఎవరో అడిగితే, యిటు తిరిగిఉండి, చల్లగా బొటనవ్రేలుతో తనవెనకాలవాడ్ని చూపాడు. అవతలవాడు వీడి అంగుష్ఠ సంజ్ఞను యిట్టే చూచి, 'నేనట్రా' అని, వీరావేశంతో వీడ్ని మెడేసుకున్నాడు, పాత పగలుకూడా ఉన్నాయేమొ. వాడో బలే పొగరుమోతు. వీళ్ళుభయులు లుంగచుట్టుకొని, ఏకకట్టగా, మట్టగిడసల్లా, తపాతహా కొట్టుకుంట్లో, మధ్యమధ్య అమాంతంగా పడ్తో లేస్తో, అటు పడమరహద్దుకు దిక్కుమార్చి యిటు దక్షిణపుహద్దుకు, దారిలో సభ్యులను రోడ్డుకోలన్నా పచ్చడి చేస్తో, అన్ని సవ్యాపసవ్యమార్గాల్లోను దొర్లుకుపోతుంటే, భయకరం దృశ్యాలెన్నో బయల్దేరె.

"సంగీతపు సరదాని దొరబడ్డంలో పాపమొకడు తీరా బుగ్గనెట్టుకున్న కారాకిళ్ళీని యిట్టేకొరికి, జనమధ్యంలో బిగింపైపోయి, పైకి దారికోసం బిత్తరిచూపులు చూస్తున్నాడు. ఊయలేదు, మ్రింగలేదు. సరే,పైకి ఏలాగూ రాలేదు. అంచేత కంకళప్రవాహాలు కుల్యలు, కుల్యలు స్రోతస్సులై, స్రోతస్సులు స్రవంతులై, స్రవంతులు నదులై, నదులు మహానదులయ్యేటట్టు, కాటుతిన్న కారాకిళ్ళీ ద్రవించడం మొదలిడి పెదిమలఅడ్డుచేత అంగుడికి తాసేసింది. గత్యంతరం లేకపోయినందున అనిముషాని కానిముషం బుగ్గలు దొప్పకట్టినట్టుగా, అరచేతిపొడవున ఊర్ధ్వదిక్కుగా పొంగుతున్నై. అతడి కనతిదూరంలో మరో ఆసామీకి సుమారుగా అబాపతువారీ యిబ్బందే వచ్చింది, అతడికి అతిమాత్రవ్యాధి. అతివ్యాప్తిమీద నున్న ఆబుగ్గకు ఈపొట్టకు, వళ్ళెరక్కుండా దొర్లుతోన్న యిద్దరి మడమల్లో ఎవరివి గుద్దుకున్నాయో అవి జలయంత్రాల్లా చిమ్మేసై. అక్కడ, నావంతుకు ముట్టిన దక్షిణే ఈ చెంపపెట్టు" అని చూపించాడు కోట్లు.

"వెనక మరో గానసభలో చలితేలు పనిచేసి, దాన్ని నిప్పెట్టినవాడూ వీడేనని అక్కడ చెప్పుకున్నారు. ఒక గృహస్థు ఖర్చులుగాక మూడు వందలిచ్చి, తంజావూరి పాటకుణ్ని రప్పించుకుంటే, ఆబల్లదగ్గర చేరాడు. మూడుగంటలపాట. అందులో గంట గంటన్నర మనకు స్వర్గసుఖమియ్యాలని మొదట గంట గంటన్నర సాము, సాధిక చేసి యమబాధపెడ్తాట్ట. ఆ రెండోగంటన్నర ప్రారంభంలో ఒక ఫ్లాస్కు వేడి కాఫీ పట్టించే నీమమట ఆపాటకుడికి. మరే పానీయంగాని, కాఫీ హోటేలు కాఫీగాని ముట్టుకోని శ్రోత్రియుడట. ఆ యింటర్వల్ వేడికాఫీతో ఆయనగాత్రం మువ్వలా పల్కుతుందని రససముద్రం జాలువాలుతుందని, యిహ వినాలని తజ్ఞులు చెప్తే, ఉచ్ఛ్వాస నిశ్వాసాలు తీయకుండా ఆశుభతరుణానికి నిరీక్షిస్తున్నాము.

"అంతక్రితంలో ఎవరుకోరితే వెళ్ళాడో కొండుబొట్లు హార్మోనియం వద్దకు వెళ్ళాడు. పాటకుడే సుతిపెట్టి యిచ్చాడు. హార్మోనియం వెనక చెక్కను గాలితిత్తిని లాగినట్టు లాగుతోండడమే వీడి పని, అంతకన్న వీడు చెయ్యాల్సిందేమీ లేదు. దానికి సంగీతజ్ఞానమక్కర్లేదు. సభ సాంతం అయేవరకు శాంతంగా కూర్చునే ఓపికఉంటే చాలు. కొన్ని కొన్ని మీటింగుల్లో అధ్యక్షులను కూర్చోబెట్టే కారణమేఅదే. అంచేత ముందు నిర్ణయ మక్కర్లేదు. అప్పటికపుడు సభమీద వస్తానన్నవాడిని కూర్చోపెట్టేపని. మొదటి గంటన్నర కొండుభొట్లు చెక్కను లాగుతోన్నేయున్నాడు. ఒకపర్యాయం తెల్లమీట్లకొన్నిటిని, మరోపర్యాయంనల్లమీట్ల కొన్నిటిని నొక్కి వాటి సారస్యం గ్రహించడానికి ప్రయత్నిస్తేం గనక, పాటకుని మొదటిగంటన్నర కసరత్తులో అవి అజకు రాలేదు.

"తన నిర్ణీత వ్యవధిలో గాయకుడు కాఫీపుచ్చుకొందామని, కాఫీ పుచ్చుకొని పాట అందాలు కుప్పించాలని, భాషకందని భావాలతో రాగాలను ఒప్పించి మెప్పించాలని కాఫీఫ్లాస్కు ఎత్తబోతే, అది కాగితంముక్కంత తేలిగ్గా చేతిలోకొచ్చింది. కదిపిచూస్తే చప్పుడులేదు. మూతతీసి చూస్తే ఒక్కచుక్క అందులో లేదు. కొండుభొట్లు బల్లమీద లేడు. దాంతో గానసభ 'శ్రీమద్రమారమణగోవిందోహరి' అయిపో

ఉంది. తీరిగ్గా మడి కాఫీ తయారుచేసి తెచ్చేవరకు, మనమేం దాక్షిణాత్యులంకనకనా, మేకుబందుచేసినట్టు కూర్చోడానికి! పంచాయితీ మొలక్షన్ల ప్రసంగం, పాడిమూడల ప్రస్తావన, కట్నాలగోల, కాల్డోషం పట్టిన పరామర్శలు చేసుకుంటూ, గానకచేరీ వాతావరణాన్ని ధ్వంసంచేసి వదలిపెట్టారు.

“ఆవూరి సభలకు అనుశ్రుతంగా ప్రసిడెంటుగిరీ అచ్చుకునే పెద్దమనిషి, ‘గాయకుడికి కాఫీకస్తోంది, నిశ్శబ్దంగా ఉండండి, ఎంతనిశ్శబ్దంగా ఉంటే పాట అంత బాగుంటుంద’ని హితవాక్యం చెప్దామని లేచి, ఆ ఒక్క మాటా సూటుగాచెప్పి కూర్చోక, ఆ ఒక్కమాటకు ఉపోద్ఘాతంగా పాటకునిగురించి, ఆయనగారి జన్మతిథి దగ్గరనుంచి ప్రారంభించి ప్రశంసావాక్యాలపిచ్చిని పడ్డాడు. అది వందనసమర్పణ అనుకొని సభ సభుం లేచారు. అదే పదునుకొని, పెళ్ళివేడుకల అరణ్యామెంటులు చేసే మొనగాడు ‘శేపటిప్రోగాము’ని అరిచాడు. సభసాంతమైందనుకొని, ఆమూలా ఈమూలా రెండు జీట్చిలైట్లుకట్టి వంటపందిట్లోకి యిక్కడి గాస్లైట్లను విప్పుకుపోయారు, అందుకే ఏర్పడ్డవాళ్ళిద్దరు.

“పాటకుడు తన్నుకుంటేమాత్రం, కచేరీ యింకేం రక్తికట్టి ఏడుస్తుంది? అక్కడికీ అచ్చుకున్నందుకు పాటకుడు ఏదో గొంతుకుపోతోంటే, దిగడ్డ గుప్పెడుమందీ చీకటిచాటున దాటేశారు. పాటకుడు నల్లగా నూనెసిద్దిలాగున్నాడు, తనకు అభినయంపట్టాడని భయపడ్డాడేమో, ఆఖరి ముఖమాటస్తుడుకూడా కళ్ళుమూసుకుని లేచి చీకట్లో కలిసిపోయాడు. పాటకుడికి రానుపోను ఖర్చులు కోసేసి కసితీర్చుకొన్నాడు గృహస్థు. ‘మూడు వందలపాట బులపాటం తీరిందాయిక్కడికి, ఊరివాడికి నెలకు మూడు రూపాయలు విదపలేవు!’ అనిగృహస్థుమీద కసితీర్చుకొన్నాడు ఊరి సంగీతంమాస్టరు.

## 2. సదస్యస్సంభావన

“సదస్యస్సంభావనల మాట చెప్పావుకాద”న్నా కోట్లుతో.

“మరే, మరే, అక్కడా ఈకొండుబొట్టుగాడే. వీరవిహారం చేశాడు. వీడు బ్రహ్మచారట. పెద్దసంభావనకని పెళ్ళిజంధ్యం వేసుకొచ్చాడన్నారు.

బహువ్యాపృతుడైన కారణంగా, సంభావనదొడ్లో చిక్కపడిపోయాడు వెయ్యిమందికి వెనకపడ్డా దోవకు సందుంటే అక్కడే స్థలం చేసుకొని కళేబరాన్ని కుదించి, కాళ్ళల్లోనుంచి దూరి, శరీరం పెంచి వెనకవాళ్ళను ముందుకు రాకుండా కాపుదల చేసుకుంటూ బలిష్ఠుడడ్డుపడితే అతడికి వంకరదండాలెట్టి 'మీరా. క్షేమమా' అని బైహాస్ చేస్తో, కుర్రాళ్ళైతే కరకరా కాలినిరాసేస్తో. అంతలోతొందర పడకండయ్యా, ఏకతొందర అందరికి సంభావన ముట్తుంది పెండ్లిపెద్ద సంపన్నగృహస్థు, పదిమందికి యిచ్చుకుందామని ఈబలాటంగా వచ్చాడయ్యా, బ్రాహ్మణపూజ అంటే చెవికోసుకొంటాడు, కాస్త ఊకిరిసలపనియ్యండయ్యా ఆయనికి. ఖర్మం మొత్తంమీద ఎక్కడకొచ్చినా సంభావనమూక అనిపించుకుంటా రేమయ్యా!' అంటూ తాను చొచ్చుకుపోతోనే, పెద్దకబుర్లుచెప్తో డబ్బుల సంచీ మొగలో ప్రవేశించాడు. ఇహ అక్కడ నుంచి పెళ్ళిపెద్ద ఎవరికి సంభావన ఇయ్యాలన్నా వీడిచెయ్యి అడ్డు. 'పుచ్చుకొన్న వాళ్ళే మళ్ళా పుచ్చుకోవడం ఏమిటురంతం వచ్చిందయ్యా' అని తానే కసురుకోవడం అక్కడ ముట్టవలసిన సంసాక్కర్లకు సంభావన ముట్టకుండా, గోల్మందర గందరగోళం చేసే ఒంటిఆటగాడి వైఖర్ని అల్లరీ, హంగామా పెంచాడు వీడిపీడ భరించలేక. దిమ్మచెక్కలాంటివాళ్ళు నల్గురు కూడబలుక్కొని వీడిని నడుంపట్టుకొని లాగేయబోతే ఆకోలాహలంలో, ఎల్లాపట్టాడో పెళ్ళిపెద్ద చేతులోని నేబులసంచీని ఉడుంపట్టు పట్టేశాడు. ఆ నల్గురు కొండుభొట్లును లాగా, కొండుభొట్లు సంచీని పటలాగా; సంచీ పెళ్ళి పెద్దను లాగా, సంభావనను కాంక్షించిన మిగతా వాళ్ళూ, పెళ్ళిపెద్ద క్షేమం ఆపేక్షించిన పెళ్ళివారూ కలిసి పెళ్ళిపెద్దనులాగా, ఈసంకుల సమరంలో నేబులసంచీ, బహువిధ సమర కర్కశుడు కొండుభొట్లు అం చేతిమేర చిరిగి చిల్లడి పోయింది. జనం కాళ్ళలో రూపాయిలు, అర్ధలు పావలాలు, బేడలు, అణాలు (నయాపైసలు లేనప్పటికి) గలగల్లాడుతో దిగబోసినట్టు దొర్లనారంభించినై. కొండుభొట్లును మోస్తోన్న చతుష్ట యానికి వొళ్ళుమండిపోయి, 'డబ్బు వాళ్ళూవాళ్ళూ ఏరుకుపోనా, మన శవం మోత తప్పకపోనా? ఇంకా చూస్తారెందుకు? వీణ్ణి భూశయన

చేయించక ' అంటూ కొండును దభీమని నేలవేసి కొట్టేసరికి, కొండు పొట్టు ఆ సేబులమీదే లాఘవంగా బోర్లపడి మూర్ఛావతారం దాల్చాడు. సంభావన ముట్టిన వాళ్ళూ, ముట్టనివాళ్ళూ. సంభావన దొడ్డిజనం యావన్మందీ ఉంగచుట్టుకొని కొండుమీద పడ్డారు. ఎవళ్ళగుప్పిళ్ళకు ఏమి అందిందో తెలీదు కాని. మా కాలు చిప్పలు పగిలిన వాళ్ళూ మా చేతులు కొట్టుకుపోయినవాళ్ళూ, పప్పికఅచుకొన్నవాళ్ళూ, ఎంతమంది హత గాత్రులో అవిధపడ్డారు.

“ఒక్కడు కాని తనదనుకుంటే అభీభత్సంలో పచ్చడైపోతానని హడిలి పోయి, పెళ్ళిపెద్ద ఖాళీసంచీతో ఇంట్లో పడ్డాను. శిష్యులు హాహాకా రాలు చేసుకుంటూ వీధిని పడ్డారు. సంభావనదొడ్డి అల్లరి ఊరంట చెవిని పడి తండోపతండాలుగా ప్రేక్షకులు విరగబడ్డారు.

“‘కాస్తమమ్మన్ని కూడా చూడనివ్వండర్రా’ అని పెళ్ళివారి ఆడ వాళ్ళు ప్రాధేయ పడ్డారు.

“‘అక్కడికెడితే పచ్చడై పోతారర్రా’ అని వాళ్ళవాళ్ళ మొగాళ్ళు వాళ్ళకు అడ్డంపడ్డారు.

“‘ఇంత అఘాయిత్యం ఎక్కడైనా విన్నామా, కన్నామా!’ అని పెద్దమనుష్యులు నిష్ఠూరపడ్డారు.

“ఇవిగో చూడు మా కాలుమీద నేను గాయపడ్డాను” అన్నాడు కోట్లు.

సంభావన దొడ్లో ఎవరేమిపడ్డారో కాని, కోట్లు ప్రసంగధోరణికి నేను అబ్బురపడ్డాను.

---

# 13. పెద్దాడబిడ్డ

## 1. ఆడబిడ్డ అలక

అమ్మనో, పెళ్ళివాకిట్లో సువాసినులెంతమందో సపర్యలు చేస్తుంటే కన్నెత్తిఅయినా చూడకుండా, పెదిమెలు బిగించి ‘ఫార్టీడిగ్రీస్‌యాంగిల్’లో మరోప్రక్కకు, ముఖం లక్కపిడతంత చేసుకుని చూస్తోంది. ఆవిడే, పెద్ద ఆడబిడ్డ, శాంతమ్మ.

మంచిశుభసమయంలో, తానుపుట్టుకు ఏదోపెద్దకష్టంలో ఉన్న దానిలా అగుపిస్తోంది. విషయం తెలియనివాళ్ళకు, 'పాపం! అయిల్లాలిని ఎవరేమన్నారో, ఏంచేశారో?' అని అడగ బుద్ధేస్తోంది. అంతలో ఎగతన్నుతోన్న బహు బలవత్తరమైన ఆగ్రహాన్ని అణచిపెట్టుకుంటోన్నట్టు భృకుటీతటాలు అదురుతున్నై. ఆపె కంఠంముడి క్రోధశోకరసాలను దిగమ్రింగుతోన్నట్టు కదలుతోంది. మధ్య, మధ్య, 'అసలు నాకిక్కడ ఎవరితో ఏంపని? ఎవరు ఏలాపోతే నాకేం కావాలి?' అనే వైరాగ్యం నీడలా ట్టే పడ్తోంది అభ్రూయుగ్మం మీద. పోయినట్టేపోతోంది. మొత్తం మీద దురభిమానమాత్సర్యాలేవో, ఆపెను కదిపి కుదిపెయ్యకపోతే, ఆపె ముఖకవళిక చాలాఉంచవని తోస్తుంది.

శాంతమ్మ శాంతం ప్రళయం ముందటి ప్రశాంతతను సూచిస్తోంది. ఏనిముషంలో పేల్తుందో తెలియని 'టైమ్‌బాంబు'లా గోడనానుకుని కూర్చున్న ఆ విరసాధిష్ఠానదేవత, అవిడే మన ప్రఖ్యాత శాంతమ్మక్క. ఏమాట కామాట అనుకోవాలి. ఆడబిడ్డ పదవితో పరిపాటుగా వచ్చిపడే పోకడలను విడతీసి వస్తునాణెం కడితే. ప్రయోజకత్వంలో, తోడబుట్టు మమకారంలో, పాండురంగమహత్యంలో ప్రస్తుతింపబడ్డ నిగమశర్మ అక్కకు ఎందునూ తీసిపోదు శాంతమ్మక్క. ఆడబిడ్డ అర్థమగడైతే, పెద్దాడబిడ్డ ఏంకావాలో, అమ్మాణీకి అట్లాంటి సంబంధి యీవిడే.

'అసలే దుర్భిణీ, అందులో గర్భిణీ' అన్నట్టు, శాంతమ్మ అసలే గడ్డు. దానికితోడు పెద్దాడబిడ్డ అయింది. విడిదెలో కాలుపెట్టిందనే, ఆడబిడ్డపవర్సు, దారంటే చెలాయిస్తో వచ్చింది.

పెళ్ళికూతురు నావేలు విడిచిన మేనకోడలు. నేనెక్కిన రైల్లోనే మగపెళ్ళివారు తర్లీ వస్తున్నారు. ఫలానా అని అప్పటికి నాకు తెలియదు. మధ్య వయస్కురాలు. బహుకయ్యాళీ. ఎరుగున్నవాళ్ళమీదా ఎరగనివాళ్ళమీదా కూడా సవారీ చేస్తోంది. పూనినట్టుంది. స్థలకుశలంచేత, పైవాళ్ళెవరైనా కాస్త కాలూ చెయ్యీ కదిపితే, కైమని మేఘగర్జన చేసి, పెళ్ళివారి పార్టీకి దూరంగా తరుముతోంది.

స్వసైన్యాలను శత్రుస్థావరాల మీదకు దాడి నడ్పించుకొస్తోన్నట్టు పెళ్ళి

వారి బల్లల సందున తిరుగుతోంది. అంతలో తమ పెట్టెలన్నీ రైల్లోకెక్కాయో లేదో, లెక్క చూసుకొంటోంది. ఆదిలో ఆపని భర్తకు వప్ప చెప్పిందట. ఆతడు అధమం రెండు పెట్టెలైనా ఎక్కనిస్టేషన్లో దిగ విడిచి వచ్చే అఘస్మారకుడని ఆమె నిశ్చితాభిప్రాయమట.

తప్పు తెలిశాక్కే దండించవచ్చునని, ఆతణ్ణి అడగకుండానే, విలియా వేసుకొంటోంది.

‘ అన్నీ రైల్లోకెక్కాయే, ఆఃధిపడకే,’ అని అతడేదో చెప్పబోతే,

‘ మీ ఎక్కడం అందం నాకు తెలియందికాదు ’ అంటో ఆతడి నోరు నొక్కింది.

‘ కాకబోయినా చేసుకొనే పనీ చేసుకోనివ్వవోయి. నువ్వు చేతకాని వాడివి చేతకానట్టు ఊరుకోవు, అసలే అది చేసుకోలేక దేవుళ్ళాడుతోంటేనూ,’ అని, యీవిడను పన్నిఅట, శాంతమ్మ మీద తనమమకారమంతా గుమ్మరిస్తూ, ఆతణ్ణి మందలించింది.

శాంతమ్మ, ఆవిడ పిన్నమ్మా కలిసి, నిముషంలో ఆ బ్రాహ్మణ్ణి చేతకాని వాజమ్మ అని, రైల్లోకూర్చున్న వాళ్ళందరికీ రుజువు చేశారు. అక్కడ ఆడంగులు మొగాళ్ళే అంతఅన్నట్టు ఎవరి మగంగుల వంక వారు చూచి పెదిమలు విఱిచారు. దూరాన్ని కూర్చున్న పెద్దమనుష్యులు కూడా లేచి, ఈ తిట్లుతినే రిప్పును చూచి కూర్చుంటున్నారు.

అందరిలాగే ఉన్నాడు కాని నేరంచేసినవాడిలా బిక్కమొఖమేసుకుని కూర్చున్నాడు. ఇంతకూ ఏమీపోలేదు, అతడికి తిట్లేదిగబడ్డాయి కాని. ‘ఏమీ పోలేదుగా!’ అని అడగడానికైనా ధైర్యం చాలకుండా ఉన్నాడు.

ఇల్లా ఒక్కవరసని పరాక్రమనృత్యం చేస్తోన్న, ‘ ఈసింహామధ్య ఎవరై యుండునా? ’ అని, మాధరిగా కూర్చున్న బ్రహ్మగారి నడిగితే, ఫలానా అని ఆయన లోకంఠంలో చెప్పారు. నేను పెండ్లికూతురు మేనమామనని తెలిస్తేనే, ప్రథమ కబళంగా నన్ను తినేస్తుం దేమోనని, చల్లగా మరో దూరపుకానులోకి జరిగి కూర్చున్నా. బండి దిగడంతోనే, ‘పెద్దాడ బిడ్డను ఓకంటితో కాచుకుంటోఁడండి, పిల్లా జల్లా జాగ్రత్త’ అని మాఅమ్మాయి సీతమ్మకు ఉప్పు అందించా.

రెండవరోజు ఉదయం మాసీతమ్మవచ్చి, 'ఇదేమిట్రా అన్న కూతుర్ని శాంతమ్మను ఆలాఅనేశావు, బహుశాంతం పరమ సాధురా' అంది.

నాకు చిత్రంగానే ఉంది. రెండవనాడు సాయంత్రం శాంతమ్మ శాంతం అందరికీ తెలియనే తెల్సింది. వాకట్లో కోలాహలం నాకు స్వయానా చూచే యోగం లేకపోయింది. చెప్పుకుంటే సిగ్గు. నేనో దురవస్థలో పడిపోయా. పెళ్ళిళ్ళల్లో పెళ్ళికూతురు మేనమామకు సాధారణంగా కొట్టుపెత్తనమిస్తోంటారుగా! రాత్రికి పెసరపప్పు పెండలం వేయిద్దామని, పెండలం బుట్టలకు అటకయెక్కాను. అది మూలగది. ఖర్మ అప్పుడే, నేనుఅటకెక్కిన నిముషంలోనే, నిచ్చెన అవసరం ఎవరికేమి వచ్చిందో, పట్టుకుపోయారు. పోతోపోతో పైనగొళ్ళెంపెట్టి పోయుంటారు. అవతల మనుష్యులు పరుగులెత్తుతోన్నట్టు, ఊఅంకులు, పరుగులు వినిపిస్తూన్నై. వంటపందిరి అంటుకుందో, బంధుగుల పిల్ల ఎవరైనా నూతులో పడిపోయిందో తెలియక, నేను అటకమీద విలవిలా తన్నుకుంటున్నా. 'ఏం ములిగందర్రోయి' అని అక్కడనుంచి పేరుపేరు వరసని టిట్టి పోస్తున్నా, 'ఎక్కడ చచ్చార్రోయి' అనికూడా పెళ్ళింట్లో అమాంగళ్యంగా అఱచి ఉంటా. ఆ ఆపత్కాలంలో అక్కడనుంచి ఊటికిలినా పచ్చడై పోతా, ఉఅక్కపోతనా పిచ్చెత్తి పోతోంది. రాత్రి భోజనాలకు నేనూ, నా పెండలం బుట్టా అవసరం కాబట్టి, ఎవరో ఒకరు అక్కడకు వస్తారన్న ధైర్యమే లేకపోతే, నేను అటకను అంటిపెట్టుకుని ఉంటుండగానే, పెళ్ళి అయిదురోజులూ వప్పగింతలు సహా అయిపోయి, యింటికి తాళంవేసి, యావన్మందీ మనుగుడుపులకు బళ్ళెక్కితే, ఎలక మాడినట్టు మాడుదునే అని దుఃఖంవచ్చేసింది. కొట్టుగది, జ్ఞాపకంవచ్చింది, విలక్కేం చక్కగా అన్నీ ఉన్నై, నేనేమి కావాలని బెంగపెట్టుకొని చచ్చిపోదును నిజంగా.

ఇక కేక వెయ్యడానికి కూడా శక్తిలేక, గదిగుమ్మంవంక చూస్తుంటే పెళ్ళికొచ్చిన వారిలో ఎవరితాలూకో, యేమో, అప్పట్లో తెలియదు, ఒక వయ్యారాల హంసయాన, శరీరం వంపుసొంపులు ఊళ్ళోవాళ్ళకు కన్పించే బిగితబ్లౌజు తొడుక్కొని ఉంది. చేతిలో కనకాంబరంరంగు వాయిల్ చీర,

వినిర్మల నీలాకాశం రంగు జాకెట్టు, పెదిమలమీద 'తనగదిలో, తన మదిలో' అంటో యీలస్థాయిలో పాడ్తోన్న సినీమాపాట, వీటితో ఘంగుఘంగున నాకొట్టుగదిలోకి ఉఱుకుతునే, పైటకొంగు విస్సాటంగా వెనక్కు విసిరేస్తో తక్కున గడియేసింది. అడుగున గడియ తక్కుమంది. అటకమీద నాప్రాణం గతుక్కుమంది. పెళ్ళికొంపలో ఏకాంతస్థలం చిక్కక, డ్రెస్సు మార్చుకొందుకు వచ్చిందన్నమాట. సుతి మించుకొచ్చిన ఆవ్యవహారంలో, చేసేదేముంది, కళ్ళు మూసుకొని ఇష్టదేవతా ప్రార్థన తప్పితే.

అంతవరకు వచ్చాక నేను అటకమీద ఉన్నట్టు తెలిస్తే చిక్కు. తెలియకపోతే చిక్కు. ఆపదానితో పని. అందులో స్త్రీ వస్త్రధారణావిధానం, ఒళ్ళు ఝల్లుమంది. సాయంసమయం కావస్తోంది. కొట్టులో మసగమసగ్గా ఉంది. నేను వార్నింగు ఇయ్యడానికి అటకమీదనుంచి దగ్గినా, గర్జించినా. ఆపిల్ల అలిపిరికి అయితే, పైన ఏదో దెయ్యమో, భూతమో తిరుగుతోందనుకొని, కెవ్వున కేకవేసి, కొయ్యబారి పోగలదు. పదిమందీ మూగితే లోపల గడియేసి ఉంటుంది గడియతీసే దెవరు? ఊర్ధ్వలోకాల్లో పరిభ్రమిస్తున్న నేను, భూలోకానికి వచ్చే స్థితిలో లేనుకద! ప్రాణం కడంటి ఆపిల్ల ఉంది. తలుపులు బ్రద్దలు కొట్టడమో, పైవాళ్ళు ఊతకలెత్తి లోపల పడ్డమో జరుగుతుంది.

అపాయస్థితిలో అడుగున ఆఅమ్మాయి, పెండలం బుట్టల చాటునుంచి మిటుకు మిటుకు చూస్తో అటకమీద నేను కన్పిస్తే, ఎంతమంది ఎన్ని ఎథాల నోళ్ళు చేసుకుంటారు? 'నిచ్చెన ఎవరో పట్టుకుపోయారని' నేను మొత్తుకుంటే, 'ఎందుకొచ్చిన మాట?' అని నవ్విపారేస్తారు. ఒక్కడూ వినిపించుకోడు. 'నడవండయ్యా వచ్చినపని గుమ్మంలోనే అయింది, ఈకబుర్లు చాలాచోట్ల విన్నాం' అంటో వెనక్కుతిరిగి, నావంక మందహాసంచేస్తో, పెద్దమనుష్యులు ఒక్కొక్కరే జారుతారు. అక్కడనుంచి దభీలున ఒక్కొక్కడిమీదికే ఉటికి పీకిపిసికినా దోషంలే దనిపిస్తుంది.

మరి ఆఅమ్మాయి ధూర్తే అయితే నేను వార్నింగీయడం మరీప్రమాదం

నావార్నింగును అపార్థం చేసుకొని, ఆ అందకత్తె కొట్టుగదిలో కొస్తుందేమో నే కలకని అటకమీద కొంటెతనానికి పొంచియున్నానని కథను వన్నె చిన్నెలతో వేయినగిషీలెట్టి లక్షమందిని నమ్మించగలము. ఇంత బ్రతుకూ బ్రతికి, జీవితాంతాధ్యాయం, ఈ విరసంతో ముగిసిందంటే ప్రజలముఖం చూడనక్కర లేదు. అటకకాపురమే శేషజీవితం. ఓ కాడికింకా అదృష్టవంతుణ్ణే. ఆ అమ్మాయి ఎంతసేపూ తను, తనచీరసొగసు, జాకెట్టుఅందం, తనగోడవనే ఉండిపోయి పైకి, ప్రక్కలకు చూడలేదు. నిమిషాల చీరకట్టు, జాకెట్టుబిగింపులు పూర్తిచేసుకొని, సీతాకోకచిలుకలా చివ్వున ఎగిరిపోయింది. పాపం తలుపు తెఱచిపోయింది పనిలోపని. మరుక్షణంలో నాకు అటకచెఱా తప్పింది. వాకలి కోలాహాల కారణమూ తెలిసింది.

అఘుడియలో వాకిట్లో శాంతమ్మకు వచ్చిన పేచీ, తీరా పట్టిచూస్తే, ఆడ పెళ్ళివారితో కాని, వారి ఆత్మీయులతో కాని కానేకాదు. అథమం ఆ అగ్రహారం వాళ్ళతోనైనా కాదు, పోనీ అనుకుందామా అంటే, ఆడపెళ్ళివారి వూరికి ఆరామడ అవిడ, పెళ్ళివారింటికి అప్పుడు ఊల్హాగా వచ్చినావిడతో ఖర్మం. ఆవిడ అనాడే ఎవరింటికో, ఏనాటినుంచో దిగడి పోయిన పాతపరామర్శోటి చేసుకుపోదామా అని ఎక్కడినుంచో, ఎక్కడికో వెడ్తో ఇక్కడ పగటిరైలుదిగి, రాత్రిరైలుకు పనిలో పని పలహారం చేసుకునే పోవచ్చునని వచ్చినబాపతు. మూడేళ్ళనాడు కాలంచేసిన ముసలమ్మపేరు పరాకు పడ్తేంగనక, మరోముసలమ్మ తాను వచ్చినయింట్లో లేనపుడు, ఇంతకు పేరెందుకు పరామర్శకి, ఈ వచ్చినావిడ బోలుబోలున ఏడ్వడం, ఈవూరిమట్టమే కష్టంమీద కంట తడిపెట్టడం, అసలు పరామర్శ చేసేవాళ్ళెవరో, చేయుబడే వాళ్ళెవరో తెలియకుండా ఆ తంతు నడవడం, రైలుదిగడంతో స్టేషన్లోనే అయిపోయింది. ఈ ఊరి చుట్టం ఎవర్నో రైలెక్కించి రావడానికి స్టేషనుకెళ్ళడంచేత పలహారమే దిగడింది. వచ్చినావిడ చచ్చిన ముసలిదాన్ని జ్ఞాపకంచేస్తో ఆవిడ గుణగణాలను వర్ణిస్తో చుట్టం వెంటబడి వచ్చింది. కలకల్లాడుతో పక్కయింటి పెళ్ళివాకిట్లో కాలక్షేపంచెయ్యక, గుయ్యాబ్బరంలో యింటిదగ్గర మూడేళ్ళ క్రితం చచ్చిన ముసలమ్మ స్మరణ ఖర్మం ఏమివచ్చిందనుకుందో, వచ్చినా

ఓడ పలహారం ప్రాకులాట గ్రహించుకుందో, ఈ రాంభొట్లమ్మను పెళ్ళి వారి యింటిమీద పడేసి, అక్కడైతే కాస్సేపు కూర్చుంటే, తనకు కాలక్షేపమూ అవుతుంది, వచ్చినావిడకు నాలుకా తడిఅవుతుంది, అంతలో రైలువేళా అవుతుంది అని ఆలోచించిందో, ఈడూరి మట్టం ఎంతో ఆప్యాయతతో, 'అత్తా మా రామశాస్త్రుల్లు అన్నయగారింటికి వచ్చిన పెద్దాడబిడ్డ మా చెడ్డ గండ్రోతమ్మా, వేగలేకుండా ఉన్నారు' అని తగాదా వృత్తాంతం, ఆవిడ చెప్పేసేసి, పెండ్లివాకిట్లోకి తోడుకొచ్చింది.

శాంతమ్మకన్నా గండ్రోతు రాంభొట్లమ్మ. దానికి సాయం ఈమధ్యనే తనచెల్లెలి కూతురు పెళ్ళిలో ఆ పెద్దాడబిడ్డతో పెనుగులాడిన కక్ష యింకా పచ్చిగా ఉంది. అక్కడా వైమనస్యాలకిదే కారణం. మాట సందర్భమే కలిగితే ఓ పట్టాన్ని వదలిపెట్టను.

అంతవరకూ శాంతమ్మ ఆడపెళ్ళివార్ని కాల్చుకుతింటోన్న కారణం తెలియవద్దూ? కట్నం నాలుగువేలు యివ్వడం, లాంఛనాలు పెట్టడం ఆదిలో చేసుకున్న పరిష్కారం. తర్వాత లాంచనాలు రొక్కరూపంలో యివ్వాలని. అవి అయిదువందలవుతాయని రామశాస్త్రుల్లగారికి కబురు చేసింది. ఆడపెళ్ళివారి వప్పుకునల చేరకుండగనే, ముహూర్తానికి రెండు రోజులు ముందు 'మొత్తం నాలుగు వేల అయిదువందలు చేతులో పోస్తే గాని రైలెక్కం' అని భీష్మించారు మగపెళ్ళివారు.

అయినఖర్చు అవుతో, అచ్చట ముచ్చట చేత్తో చేసుకోకుండా జోడీ పెళ్ళి ఏలా చేసేది?' అని ఆడపెళ్ళివారు విలపించినా వినిపించుకోకుండా, నాలుగువేల అయిదువందలు అక్కడే కక్కించి మరీ రైలెక్కింది శాంతమ్మ.

'మాకంటికి నదురుగా కన్పించేవి మేము కొనుక్కోవడమే భావ్యం, మీరు ఒక్కొక్క లాంఛనమే మాకు యిస్తోండడం, మాకు అవి నచ్చక పోవడం, మీకు కష్టంతోచడం, ఎందుకొచ్చిన పేచీంబర మమ్మా, ఈ లాంచనాలు యివ్వడం, పుచ్చుకోవడం ఉన్నా? మీరు కొని యిచ్చినా మేము కొనుక్కున్నా డబ్బుతో పనిగద. ఆ రొక్కం అయిదువందలు మా చేతిలో వెయ్యండి. మావచ్చిన నల్గురికీ, యింతపప్పుఅన్నం పెట్టి సాగ

నంపండి. ఎవరమైనా సంసార్లమే. పెట్టాయపెట్టటలేదు అన్న పేచీ పూచీలు మనకూ మనకూ ఉండవు ’ అని కేవలం ఏదో ఆడపెళ్లివారి బాగు కోరి చెప్పినట్టు, ఈ పెద్దఆడబిడ్డే అప్పుడంది.

తీరా పెళ్లికొచ్చినతర్వాత, ‘ఏం గౌరవం! లాంచనరూపంలో, ఏముద్దూ ముచ్చటా ఆడపెళ్లివారు జరపటం లేదని, కూనిదీర్ఘాలు ప్రారంభించిందీ ఈ ఆడబిడ్డే.

‘ ఆనాడు డబ్బుకక్కుర్తిని రొక్కం పుచ్చుకొని, ఇవాళ లాంచనాలు కావాలంటే, ఏ పెద్దమనుష్యులైనా మన్నే చీవాట్లుపెడ్తారు, ’ అని శాంతమ్మభర్త అన్నాట్ట పాపం, ఆతడిలోపం లేదు.

‘ ఒసేవ్, వీడు ఇంటికి జిట్టా హాయక్కి సిమాలక్ష్మినే ఎప్పుడునూ్నా. ఎప్పుడూ ఎదరవాళ్ళకు కలిసొచ్చే మాటే చెప్తాడేం ఖర్మమే ? ’ అని శేషమ్మపిన్ని ఆలపిస్తే, ఆతణ్ని మలిపేసి, నోరునొక్కింది శాంతమ్మ. అంమకే కాబోలు, ఆతడు పంక్తిభోజనానికి రా భిడియపడ్తున్నాడు పాపం.

రాంభొళమ్మ వాకిట్లోకి వెళ్లిన తర్వాత, ఎవరి పిల్లో, పదిపదకొండేళ్ళుంటై, పచ్చి కలగలపేరు గుచ్చి, తెలిసో తెలియకో, శాంతమ్మ మెళ్ళో వేసింది. వేసిందితడవుగా, శాంతమ్మ దాన్ని ఫాట్టున తెంపేసి, అంత మందీ చూస్తుండగా ఆ పిల్లమొఖాన్నేసి కొట్టి, యథాప్రకారంగా, కోసుగ్గా, అవసరంలేండే చూరువంక ముఖంపెట్టుకొని కూర్చుంది. ఆ పిల్ల వెక్కివెక్కి ఏడ్వడం ప్రారంభించింది. ఆపిల్లను సముదాయిస్తేనే, శాంతమ్మకు కోపం కెచ్చిపోతుందని భయపడి, ఆడపెళ్ళివారంతా అంటీ ముట్టనట్టు ఊరుకొన్నారు. శాంతమ్మ బలగం ఆటుగ్గింజలంత ముఖాలు చేసుకొని కూర్చున్నారు, శాంతమ్మకేదో పెద్దపరాభవం జరిగినట్టు. రాంభొళమ్మకు ఎవరి వదుగు? ఎందుకు వదుగు? స్తిమితంగా ఆ ఏడ్చేపిల్లను వళ్ళోకి తీసుకొని లాలిస్తో ‘ఈమాత్రానికే జడుసుకుంటారటమ్మా? మొన్న మాసీతి పెళ్ళి కొచ్చిన పెద్దాడబిడ్డ అదో సివంగి. ఈవిడంటిది కాదు. దాన్ని చూస్తే మరీ హడలిపోదువు’ అంటో సశేషం సభవారితో చెప్పడం మొదలెట్టింది:

“మావాళ్ళచేత ఇల్లా పొలం అమ్మించి కట్నంక్రింద వసూలు పెట్టు

కుంది. దర్శిలా విశ్వామిత్రుడు హరిశ్చంద్రుడికి పాతబాకీ జ్ఞాపకం చేసి నట్టు, చల్లగా లాంఛనాల మాటేమిటని మా చెల్లెలు గుల్ల లమ్మించింది. మావాళ్ళ చేతుల్లో ఉన్న ఆఖరు కానీ ఊడేసిన తర్వాత, 'జై! సలక్ష ణంగా పెళ్ళిచై! నన్ను మెప్పించుకో' అంది. ఇంతా అయిన తర్వాత 'లాంఛనాలు జరపటంలేదు' అని, వసపోసినట్టులా ఒకటేవాగుడు. అన్నీ అమ్ముకున్న తర్వాత ఈ వెధవ అయిదురూపాయలు రక్షించబోతాయా పోశ్ అని, మారడానికి యిబ్బందిపెడ్తోన్న అయిదు రూపాయల నోటుంటే, దాన్ని బజారులో తిప్పి, నూనెగిన్నెలు వగైరా చిన్నసమా నాలు సెల్లులాయిడ్డుసరకు అతి నాజూకైన కంపెనీ పేకేజీలో కట్టించుకొచ్చి, నలుగుపీటల దగ్గర విప్పా. దాంతో మా పెద్దాడబిడ్డ, తారామండలాల కంటా లేచిపోయి, వాటిని కసవిసా తొక్కి పచ్చడి చేసింది. ఈవిడ ఉత్తమురాలు, ఏం చేసిందని ఏడుస్తావు? నీసెలగలు నీకే యిచ్చింది. శుభ్రంగా సాతాళించుకు తిందాం, నువ్వూ నేనూ. ఊరుకో, ఈ పాటికి ఏష్వకుండా!' అని పిల్లను మందలించింది.

'నువ్వూరుకో ఈపాటికి ఎవరవో కాని, చెప్పవచ్చావు, నువ్వూ నీశ్లేషకవిత్వమున్నూ' అని చుర్రుమంది శాంతమ్మ.

ఆరామడ ఆవిడకు ఏం అవసరమొచ్చింది ఊరుకోడానికి? 'నువ్వు' అంటే 'నువ్వు,' 'ఊరుకో' అంటే 'ఊరుకో' అంటూ తారాస్థాయికి వెళ్ళిపోతున్నారు వారుభయులు. ఈ ధర్మయుద్ధం చూడ్డానికి పరుగులు తీసివచ్చి పడ్డారు పైజనం. ఈలోపల రాంభాయమ్మను తీసుకొచ్చిన చుట్టం దాటేసింది. రైలుకూత విని రాంభాయమ్మ దాటేసింది. శాంతమ్మ మెడ కొట్టికేస్తుం దని సెనగలపేరు పిల్ల చాటేసింది. ఇదీ వాకిట్లో కోలా హలం.

తద్రీతుగా లాంచన లోపమనో, పిలుపు లోపమనో, ఏనెపమైతేనేం, రోజల్లా కోపఘూర్ణితనేత్రయై కరకరలాడ్తోంది. ఆడపెళ్ళివారి గుండెలు తటతట్లాడించింది. వాళ్ళ ఆత్మీయులను కూడా అట్టుడికించింది. వియ్య పురాలు వియ్యంకుడూ కూడా కన్నీరు మున్నీరుగా విలపించారు. వధువు బెంగను కలవకాడైంది. అక్కను నిలవరింపలేక నిస్సహాయుడై వరుడు

వెలవెలబోయాడు. 'వాళ్ళనంత చేటు హింసించడం, ఏమిన్యాయమే?' అన్నట్టు పెండ్లికొమారుని జాలిచూపులు చెప్పక చెప్తోంటే, 'దయాదాక్షిణ్యాలు పెట్టుకుంటే వాళ్ళకు లోకువై పోతావు. వాళ్ళు నిన్ను ముక్కుకు తాడేసి, బరబరా లాగేసారు, వాజమ్మా!' అని ప్రియసోదరుడ్ని మందలిస్తోన్నై శాంతమ్మ చూపులు. మిగతా వాళ్ళు 'పెద్దక్క అనుభవశాలిని. నువ్వంటే ఎంతఅపేక్ష చెప్పలేం. అదిగీసిన గీటు దాటకు అబ్బాయి. తర్వాత పశ్చాత్తాపపడి లాభంలేదు' అని హెచ్చరిస్తున్నారు.

ఆదేసమయంలో, ఆపెభర్తకు ఎందుకో పెట్టితాళించెవి కావల్సి 'పెట్టితా...; అన్నాడండీ' క్తమంది. దాంతో అతడు అదరిపడి ప్రమాదవశాత్తూ తన కాలు, ప్రక్కనున్న లేతదవ్వ తనచిట్టి పాదంమీద ఊతంగా వేశాడు. ఆపిల్ల కెవ్వుమని గుక్కపట్టింది. తల్లిప్రాణం అంటారు. బిడ్డ వంక చూడనైనా చూడదే! ఊళ్ళోళ్ళవాళ్ళు ఆపిల్లను బుజాన్నేసుకోవలసి వచ్చింది. పెళ్ళికొచ్చిన వారిలో యిద్దరు ముగ్గురు పెద్దాడబిడ్డలు చేసివచ్చిన వాళ్ళూ ఉన్నారు కాని, ఇంత ఏకటాకీని, ఏనిముషంలో చిన్న మెత్తైనా టెన్షన్ తగ్గకుండా, యింతపగడబందీగా ఆడబిడ్డ అలకను ఫెళఫెళ్ళాడించి, ఆంధ్ర వైవాహిక రంగానికో ఉన్నతాదర్శాన్ని అందించిన శాంతమ్మ మహోజ్జ్వలచరిత్ర చిరస్మరణీయ మైందంటే చిత్రంలేదు.

వివాహమంటే రెండుకుటుంబాలు, కాల నిర్ణయంచేసుకొని, తమ బలాబలాలు, కులప్రతిష్ఠలు, అవసరమైతే ప్రాణాలైనా ఒడ్డి పోరే ఒక యుద్ధమని 'ఈక్వేట్టు' చేసికొని కూర్చుంది శాంతమ్మ. పరిణయమన్నది బహుప్రమాద సంభరితమైన సమరమే నని, అందులో పెద్దాడబిడ్డ మగ పెళ్ళివారి సేనాని అనిన్నీ, ఆ సేనాని మనోదార్ఢ్యం ఏకొంచెం వీడినా, మగపెళ్ళివారి పేరుప్రతిష్ఠలకు, కుటుంబగౌరవానికి శాశ్వతాపచారం జరిగిపోయి ఆమరణాంతం, బందుజనాల్లో తలవంపులు ఘట్టిల్లుతాయని పూర్తిగా నమ్మేసింది. అది ఒక బాపతు వారి మతమూర్ఖ్యం. అంతేకాని పెళ్ళికొచ్చిన మిగతా నలభై యాభై మందీ కరుణాతరంగితాంత రంగులనే, ఈవిడమాత్రమే కఠినాత్ములని అభిప్రాయపడ్డం ఆవిడకు అన్యాయం

చెయ్యడమే. పాపం తనకూతురు పెండ్లిలో చూడండి, ఎంతయోగ్యత, ఎంతనమ్రత ఉట్టిపడ్తోంటామో! ఆవిడ ప్రతిమాటలోను ఈశాంతమ్మే కాదు.

## 2. ఆడబిడ్డజ్వర ప్రకోపం

పెండ్లిమూడవనాడు మధ్యాహ్నం శాంతమ్మకు ఆడబిడ్డజ్వరం మరీప్రకో పించింది. ఆరోజు గడవదని ఆడపెళ్ళివారు ప్రాణాలు అరచేతుల్లో పెట్టుకు కూర్చున్నారు. ఆనాటి 'క్రైసిస్సు' కు కించిత్ కారణం లేకపోలేదు, పెద్దఆడబిడ్డను వేరే కారణాలే అక్కరలేకపోయినా. మధ్యాహ్నపు పలహారాలకు విడిసకు పంపిన కారాబుందీబుట్టను, శాంతమ్మ తీరా ఆకు తీసి చూచుకుంటే, బుట్టసఖానికి కాళీ. తెచ్చిన వంటమనిషి ఎవడో! దార్లో ఏం కక్కుర్తిపని చేశాడో! శాంతమ్మ కాళీరూపం దాల్చి, అధి కార ధూర్వహత్వంతో కుమారికను కేకవేసి, వంటబ్రాహ్మడి చేత మరో రెండు వాయలు వేయించుకొని యిక్కడున్నట్టు రమ్మని ఆజ్ఞాపించింది. వంటబ్రాహ్మడిదగ్గరకు వెళ్ళాలన్న మాట కుమారిక చెవిని సోకగానే, ప్రశాంతమధురమైన కుమారిక మోములో మిశ్రమభావాలు దయించినై. ఆమె సుందరవదనం అపరాహ్ణవేళ మెట్టతామర పూవులా వాడిపోయింది. 'తెస్తాను' 'తేను' అన్న మాటైనా రాల్చకుండా కుమారిక సీతమ్మగారి దగ్గరకెళ్ళి, ఆడకత్తెరిలో పడ్డట్టు కుందుతో, తాను వంటబ్రాహణ్ని సమీ పించడం ఏఅప్రమాదమని చెప్పిందో, సీతమ్మగారు ప్రచలిత మానస అయిన కుమారిక బాధకు కొంత సాంత్వన కలిగించి, ఆవిడే బూందీబుట్టను తీసు కొనిచప్రున విడిదికెళ్ళింది. తాను కూర్చుండి, అమ్మగారిని పంపవలసి వచ్చి నందుకు చింతించింది కుమారిక.

వియ్యపురాలు, వీధిగుమ్మంలోకి వెళ్ళేసరికే, శాంతమ్మ ఫణతలు ఎగ రేస్తోంది. వియ్యపరాలు ఒనుగుతో మెట్లెక్కేసరికి, ఈవిడను కీకంట చూచి, శాంతమ్మ మరీ రెచ్చిపోయింది.

"అపురవురవురా, ఆడపెళ్ళివారి పనిమనిషికి కూడా అలుసైపోయిందా శాంతమ్మబ్రతుకు!" అని శాంతమ్మ నిప్పులు కక్కుతే, "మంచికిపోతే

వచ్చిన ముష్పమ్మా, మెత్తనిదాన్ని చూస్తే మొట్టబుద్ధేస్తుందే’’ అని శాంతమ్మ క్రోధాగ్నికి ఆజ్యమని ఊదింది శ్రేయోభిలాషిణి, శేషమ్మపిన్ని.

‘‘‘తమ్ముడు పెళ్ళికెళ్ళి దాసీదాని మొట్టికాయలు కూడా తినొచ్చింది శాంతమ్మ’ అని ఊళ్ళఊళ్ళ చెప్పుకుంటారని ఏడుస్తున్నానే, శేషంపిన్నీ!’’ అంటో ఆపత్తులో శేషమ్మమీదికి వరిగింది.

శేషమ్మ శాంతమ్మను వళ్ళోకి తీసుకొని, ‘‘ఆ దాసీదాని మిడిసిపాటు మరచిపోవే, వెర్రితల్లీ!’’ అంటో శాంతమ్మ కళ్ళుఅద్దింది శేషమ్మపిన్ని తనచీరకొంగుతో.

‘‘మరచి పోవాలంటే మరపు వచ్చేనేదటే దాని పొగరుమోత్తనం!’’ అంది శాంతమ్మ, ‘ఖ్ ఖ్ ఖ్’ అంటో తన్నుకొస్తోన్న దుఃఖాన్ని నొక్కిపట్టడానికి నోటిలో చీరకొంగు కుక్కుకోంటో.

శేషమ్మపిన్నిలా కష్టకాలంలో సాయపడేదీ చుట్టంకాని అంతా చుట్టాలవుతారా? శాంతమ్మకు ఎప్పుడు దుఃఖం ముంచుకొస్తుందో ఏంచెయ్యాలో ఒక్క శేషమ్మపిన్నికే తెల్సు. దుఃఖం ఆరిపోకుండా, అవసరంకొద్దీ పొర్లిపొర్లి రావడానికి, శేషమ్మపిన్ని ‘అవునే తల్లీ!’ అనో, ‘కాదటమ్మా’ అనో ‘కడుప్పగిలిపోకమ్మా’ అనో వంతపాడి, మధ్యమధ్య పదునుగా మాటసాయం చేస్తోంటుంది. శేషమ్మ శరీరతత్వమేమిటో కాని, ఆమెకు కళ్ళనీళ్ళు పిలిస్తే పరుగెత్తుకువస్తాయి. పరామర్శకళకు ప్రాణసమానం కాదండీ కళ్ళనీళ్ళు. శేషమ్మశాంతమ్మ లిద్దరూ కంటతడి బెడితే కారుమనడం నేర్చారు శాంతమ్మ సంతానం. అదంతా ఒకబాపతువారీ క్రమశిక్షణా ఫలితం.

‘ఇంకా బ్రతికుండి శాంతమ్మ చేసేదేముందీ?’ అని శాంతమ్మ అంటే, ‘ఒకటేబ్రతుకు!’ అని శేషమ్మ ముక్కుపిండుకుంది, జీవన్మరణవిషైక వేదాంతసారమం తావోసి వడపోసినట్టు.

‘తమ్ముడని వెర్రిమమకారం పెట్టుకొని దొర్లినందుకు, మనకు శాస్తి బాగా చేశాడేవీడు, వాళ్ళల్లో దూరి. అలివంకవారు ఆత్మబంధువులని కానలేకపోయానే. వీడు ఆడపెళ్ళివారి యిల్లుపట్టుకొని వేళ్ళాడితే, మనం పరాయి వాళ్ళమై పోయామే. మిమ్మన్నీ, మిమ్మన్నీ కూడా తీసుకొచ్చి

ఈ పరాయి దిబ్బమీద పడేశానమ్మా. సీతారామ! కష్టాలు పడ్తున్నారమ్మా మా మూలాన్ని!' అని శాంతమ్మ ఎక్కిళ్ళుగుప్పితే, 'ఏడవకే తల్లీ, శైలు వేళ యింది. అందరిపీడా వదులుతుంది' అంది హితకాంక్షిణి శేషమ్మపిన్ని సీతమ్మగారి వంక కోసుగా చూస్తూ.

ఈలా ఒక్కవరసని శేషమ్మపిన్ని వంతపాటతో, శాంతమ్మ క్రోధ శోకరసాలు వినుపిస్తోంటే, వియ్యపురాలు నిర్ఘాంతపోయి, "మీకుజరిగిన అపకృతి ఏమిటి? అ చేసిన వాళ్ళెవరు? ఎక్కడా మొదలు చివరా తెలి యటంలేదు' పొరుగిళ్ళవాళ్ళు కూడా గుమ్మాల్లో మూగారు, అపఖ్యాతి!" అంది వియ్యపురాలు"

"చెయ్యాల్సిందేదో చల్లగా దాసీదానిచేత చేయించి అర్ధంకావటం లేదంటే ఎవర్ని అనం? ఎవర్నీ అనక్కఅలే" దంది శేషమ్మపిన్ని.

"కుమారిక అంటారే, అదీ!" అంది శాంతమ్మ చెల్లాయి రేచులా.

ఎవళ్ళ పార్టీ వాళ్ళు చక్కగా పోషించే మిడిమేళం.

"ఏమమ్మాయి, శాంతమ్మవదినా! మాఅమ్మాణీ ఒకటి, కుమారిక ఓకటీ కాదునాకు. కుమారికను దాసీ అని ఎవరన్నారు? ఎవరటకానీ, దాన్ని ఒక్కమాటంటే నేను వప్పుకునే దాన్ని గాను. పల్లెత్తు పరుసంమాట దాని నోటంట రాదు. ఏ మంది మిమ్మన్ని?" అని అడిగింది. సీతమ్మగారు.

"మాటలు అనడం. కొట్టడం తర్వాయి అయినాయునా అమ్మా! నీమొఖ!" అంది శాంతమ్మ గాజులచప్పుడు కూడా జోడు చేస్తూ.

"పెద్దాడబిడ్డ శాంతమ్మాం తది ఇంటపందిట్లోకి వెళ్ళిరామంటే, అమట్టునే ముఖం చిట్లించి 'చేస్తాను', 'చెయ్యను' అనైనా అనకుండా మాముఖాల మీదనుంచి విసవిసా వెడ్తే, అంతకన్నా యింకేం చెయ్యాలి మానాభిమా నాలున్న వాళ్ళకి! అపని మాలో మరోరెవరైనా చెప్తే ఏం చేసునో కూడా. శాంతమ్మకే యింత పరాభవం చేసినమనిషి! శాంతమ్మ మెత్తనిదని ఇంతపరాభవం చెయ్యనటమ్మా అడపిల్లని చ్చుకొన్నవాళ్ళు!" అని ముక్కు మీద వేలేసుకుంది అనుభవజ్ఞురాలు శేషమ్మపిన్ని.

సీతమ్మగారు తెల్లబోయింది. అల్లరికీ, హంగామాకు యింత తల్లీతోడూ అయిన శాంతమ్మ శేషమ్మగార్ల వంటి రాక్షసులను ఆమెచూసి ఉండలేదు, పాపం!

"పనిలో విసుగులేదు. మాటలో కటువులేదు. వంకలేని వర్తన. మచ్చలేని మనసు. కుమారిక ఎందుకు నిన్ను నిర్లక్ష్యం చేస్తుందనుకుంటూ వమ్మా! విషయాన్ని యదార్థస్వరూపంలో కానలేకపోయావు. ఆమె పరపురుషులతో ప్రసంగించదు. ఆ అవసరం రాకుండా నేను చూచుకొంటాను. నీవద్ద పరనింద చేయుటకు ఇచ్ఛగింపక, వంటబ్రాహ్మడి దగ్గర కెందుకు వెళ్ళుటకు సంశయించిందో నీకు చెప్పలేను. దేవపారిజాతపుష్పం లాంటి పవిత్రతమ్మా, కుమారికది! దాన్ని చులకన చేసిన వాళ్ళకు శుభం కల్గదు. ఈనాటు పిల్లల్లో ఆసామ్యం దొరకదు. త్యాగానికి నిలయం, శీలానికి స్థానం, పవిత్ర ప్రవర్తనకు ప్రత్యక్ష ప్రమాణం. అలాంటి అనింద్య చరిత్ర పావిత్ర్యం మన్నించ గలిగితేగాని, నీపిల్లలకు సుశిక్షణ యివ్వలేవమ్మా?" అని సీతమ్మగారు, శాంతమ్మకు హితోపదేశం చేసింది.

"నేచెప్పలేదటే, ఆపిల్ల యోగ్యురాలని" అన్నాడు, అప్పటివరకు బిక్కు బిక్కుమంటో చూస్తున్న శాంతమ్మభర్త.

"ఆపిల్లపరీక్ష మీకెందుకు కావాల్సి వచ్చిందీ అని అడుగత!" అంటో అతడిమీద కైమంది గ్రుడ్లురుముతో శాంతమ్మ.

శాంతమ్మవదలిన కొస అందుకొని శేషమ్మ, శాంతమ్మభర్తను; "వేషాలకు లోపంలేదు. ఆడది కన్పించడం భయం, ఏం ఖర్మందొర్లిందో కాని..." అని యింకా ఏదో అనబోతోంటే శేషమ్మకు కొలకమాఠింది. ఉబ్బసపు దగ్గుమనిషి. అమట్టునే లుంగచుట్టుకొని వచ్చిపడింది దగ్గు. గుక్కతిరక్కుండా మెలికలు తిప్పేసి దొడ్డిగుమ్మంలో పడేసింది. గంపమీద తలెట్టుకొని శేషమ్మ రోజుతోంటే, ఇక్కడ వేంద్రం తగ్గాకే రావచ్చునను కున్నాడు కాబోలు, శాంతమ్మభర్త చడీ చప్పుడూ కాకుండా తప్పుకొని చాటేశాడు. వాళ్ళిద్దరూ, ధరిలో లేక పోవడంతో, కొరకంచులు లాగేసిన పొయ్యిలా చప్పబడింది శాంతమ్మ. ప్రసంగమధ్యంలో, ఏదో శక్తి మాట, తిట్టుతినే యోగం, యిట్టే అని శాంతమ్మభర్త, అయినదానికి కానిదానికి తాళంవేసి శేషమ్మపిన్ని, రెచ్చగొట్టక పోతే, శాంతమ్మ యింత చేటు విధం చెడేది కాదనిపిస్తుంది.

సీతమ్మగారి హితోపదేశం శాంతమ్మకు హృద్యమే అగునో, వెగట

వుసో, అంతలో యిచ్చట యింతరాద్ధాంతం తన్నిగురించే జరుగుతోందని తెలియని కుమారిక తొందరగా ప్రవేశించి, "అమ్మగారు, అమ్మగారు! అబ్బాయిగారు ఈబండిలో వస్తోన్నానని వైరిచ్చారు. పెద్దఉద్యోగమేదో అయిందట, అయ్యగారు మీకోసం చూస్తున్నారు. శాంతమ్మగారి అమ్మాయిలకు జడలుదిగద్దై జడవేసి, నీళ్ళోసి, వాళ్ళనాటలకు పంపించేసి నేనూ వస్తూన్నా. మంచివాళ్ళకు శుభంలో శుభం ఆలావస్తూనేఉంటుదండీ. మరచిపోకండి అబ్బాయిగారొచ్చిన తర్వాత రంగడికి ఉత్సవం చేయిద్దాం," అని కేవలం సీతమ్మగారి యింటపుట్టిన పిల్లలా పొంగిపోయింది కుమారిక. "మీరు వెళ్ళండి. విడిది అమర్ద్దా మీరేమీ పడనక్కఱలేదు. శాంతమ్మగారికీ శేషమ్మగారికీ రాత్రిభోజనంలోకి ప్రత్యేకంగా ఏమి చేయించమంటారో నేను కనుక్కొస్తాలెండి" అంది.

సీతమ్మగార్ని పంపేసి, అత్యుత్సాహంగా శాంతమ్మగారి పిల్లలను ముద్దాడుతో, కలకల వాళ్ళని నవ్విస్తో, ముగ్గులేయిస్తో, ఎక్కడచూచిన తానే అయి నిముషాల జడలేసి, నీళ్ళోసి, చిన్నపరికిణీలు కట్టి 'పోండి, ఆడుకోండి' అని బుగ్గలు గిల్లి పంపించింది.

"సుభద్ర ఎక్కడండీ?" అని కుమారికఅడిగితే, "ఎక్కడికి ఊరేగిందో!" అంది శాంతమ్మ.

మాటలోనే సుభద్ర దొరసానివేషంలో వచ్చింది వాకిట్లోకి. చిట్లించుకొన్న ముఖమే మరికాస్త చిట్లించుకొంది శాంతమ్మ. సుభద్రనుచూసి, "దేవుడికి మాటతప్పి ఏంచేస్తోన్నట్టమ్మా? మఱచిపోయావా? లే. ఆలయాని కెళ్ళాలను కున్నాంగా!" అంది కుమారిక.

"అయితే, లే," అంటో విసుక్కుంటో బయల్దేరింది సుభద్ర.

"విసుక్కుంటో దేవతాదర్శనం చెయ్యడం లక్షణం కాదమ్మా. మనం వెడ్తోన్నది రాతిపూజకా? రంగడిపూజకా? భక్తిభావంతో వెళ్ళాలి. నామాట మరిస్తివే. ఆలయానికి వెళ్ళినప్పుడైనా మనపెద్దలఆచారం నిలబెట్టాలి. నే చెప్పినట్టు, కుచ్చెళ్ళోసి స్ఫుటంగా ముఖాన్ని కుంకుమబొట్టు పెట్టుకొని వెడదాం. కాళ్ళు ముఖం కడుక్కురా. తలరేగింది. సరిదిద్దుతా. ఇదుగో, ఈ పూలదండ నీకోసం కూర్చిపెట్టా. తలలో తురుముతా. ఆరిబ్బన్లు తీసై, తర్వాత చీరకట్టుకుందుగాని" అంది కుమారిక.

"వస్తానడం నాదే తప్పు" అంటో సుభద్ర కుమారిక చెప్పినట్టు ఆమె పర్యవేక్షణలో అలంకరించుకొంది.

"ఇప్పుడు అద్దంలో చూచుకో" మంది కుమారిక.

సుభద్ర అద్దం వగలిపెట్టలేదు.

"మాఅమ్మాణీ పదిరోజులు రంగదర్శనం చేసుకొంది. ఆమెకు మీమామ చక్కటి వరుడు దొరికాడు. మనబాణీని చీరకట్టేనే పెళ్ళికళ ఉరి కందమ్మా నీకు. ఇవాళ రంగడికి దండంపెట్టుగో. నీఅభీష్టం సిద్ధిస్తుంది" అంది కుమారిక.

"పోనిద్దూ, పెళ్ళికోసం పూజచెయ్యాలట!" అని నవ్వింది సుభద్ర.

"నారీమణికి నాథుడే పూజాఫలం కాకపోతే, మరేమిటి స్త్రీకి? 'పతిరేవ జగత్పతి' అన్నారమ్మా మాస్వాములు. పెండ్లివిషయం అంత తేలిగ్గా మాట్లాడావు. ఈడ్రెస్సులో అగదిలో వారికి కాఫీ యిచ్చిరా. మనం అలయానికి వెళదాం" అని కుమారిక చెప్పింది. కాఫీపట్టుకెళ్ళింది చివర గదిలోకి సుభద్ర. పదినిముషాల్లో సుభద్ర హృదోల్లాసంగా యువకుని గదిలోనుంచి వచ్చి, "మరిపద ఆలయాని" కంది.

"చెల్లీ, సుభద్రా! మీఅమ్మగారితో చెప్పి రావాలని తోచలేదా? అదీ మన ముఖ్యధర్మాల్లోదే నమ్మా" అని కుమారిక చెప్తే, సుభద్ర తల్లితో 'అలయానికి వెళ్ళివస్తా' మని సెలవు తీసుకొచ్చింది.

## 3. శాంతమ్మ ఆత్మపరీక్ష

అరగంటక్రితం మూతి, ముక్కు, కనుబొమలు, నుదుటిమీద పడ్తోన్న జుట్టు కలిపి కుట్టేశారా అన్నట్టు చిట్లించుకొన్న శాంతమ్మ ముఖం, కుమారిక సద్వర్తన, సంభాషణ తీరు, సదాచార సంపన్నత: చూచినకొద్దీ, ఒక్కొక్క దారమే తెగి, ఒక్కొక్క ముడతే పోతోన్నట్టు విశాలమవుతోంది. వియ్యపురాలు ఉత్ప్రేక్షించినట్టు కుమారిక దివ్యపారిజాతమే నని తలచింది. వంటబ్రాహ్మడి దగ్గర కెళ్ళమంటే కుమారిక పడ్డ మనోవేదన శాంతమ్మ కిపుడుఅర్థమైంది. కుమారిక తనను నిర్లక్ష్యం చేసిందని భావించిన

ఆమెపట్ల అపరాధం చేశాననుకొంది. తాను దుష్టగా భావించి కుమారికను మహాపరాధం కావించింది, కాని, కుమారిక తనబిడ్డలపట్ల ఎంత మనోవైశాల్యం, ఆప్యాయత చూపింది, అని తన్మయురాలైంది. తన హృదయ సంకుచితత్వానికి సిగ్గుపడింది. తనమనస్సే తమోదూషిత మైందని గ్రహించుకొని, ఆమెను దానిగా చులకన చేసినందుకు పశ్చాత్తప్తురాలైంది.

కఠినాత్మురాలు శాంతమ్మకు ఈ 'హటాత్తాత్మపరీక్ష సాధ్యమా!' అని సంశయపడనక్కఱలేదు. శాంతమ్మకు నిరంతర మనోక్లేశాన్ని కల్గిస్తోన్న విషయాలు రెండు ఉన్నై: పెండ్లిచూపులకైనా, ఎవరూ ధరిమానా రాకున్న కూతురు సుభద్ర. స్కూల్ ఫైనలు ముమ్మారు తప్పి బ్రతుకు తెఱవు కన్పించకుండాయున్న కుమారుడున్నూ, సుభద్రాపరిణయం తనకు జీవిత సమస్య అయింది. ఏళ్ళు మీదపడ్తోన్నకొద్దీ సుభద్రకు వివాహం కాన క్కఱడుతోందన్న చింత శాంతమ్మకు పేగున పట్టింది. పెండ్లికొచ్చిన ముత్తయిదువులెందఱో, 'ఇంకా పెళ్ళిచేశావు కావు పిల్లకు' అని ముక్కుమీద వేలేసుకుంటున్నారు. చెవులు కొఱుక్కుంటున్నారు. వాళ్ళను తప్పుకుని తిరుగుతోంది. పదిమంది ఆడాళ్ళూ చేరినచోట. తాను కంఠమెత్తితే, ఎవరైనా ఈప్రస్తావన తెస్తుందేమో నని శాంతమ్మకు డొక్క కొడ్తోనే ఉంటుంది.

కొంతమందికి అదే పని అయిర. ఒక అవ్వగారు, "ఏడూరు యిచ్చావమ్మా పిల్లను?" అని నలుగురిలోనూ అడిగిందని ఆ అవ్వమీద కక్ష కట్టింది. 'పిల్లంతల్లి అనుకున్నానమ్మా అమ్మాయిని చూచి. లేకపోతే అడక్కపోదును, అంత కాకపడ్డావు' అని ఆవిడ సద్దిచెప్పింది. అల్లా సఖ్యపడాల్సివచ్చింది. నిన్నటికి నిన్న శాంతమ్మ తీరికూర్చుండి ఆడపెళ్ళివారి యింటికి వచ్చిన ఒకబంధువుతో అమాంతంగా అలిగి, ఆవిడ కులగౌరవాలను, కుటుంబ ప్రతిష్ఠలను మూడుతరాల వెనక్కంటూ తోడి కడిగేస్తే, ఆ యదరావిడ శాంతమ్మను మూడుతరాల ముందుకంటూ కదిపి, కుదిపి, ఉతికి, ఝాడించి ఆరేసింది. ఈ పేచీకోరుకన్నా కజ్జాకోరు ఆ యదరావిడ. సాయంత్రమూ, ఎవరిఅప్రదిష్టవాళ్ళకు తెలియదంటూ, సుభద్రవిషయ

మెత్తి, శాంతమ్మను కొబ్బరికాయను కోరినట్టు ఎటుతిరిగితే అటు కోసేసింది. దానితో పోరిపోరి వేగలేక చివరకు 'వదలిపెట్టమ్మా తల్లీ!' అని, ఈ పేచీకోరు అకజ్జాకోరును కోరింది. చప్పగా జారింది విడిదలోకి. సుభద్ర మాట ఎత్తేటప్పటికే శాంతమ్మకు నడుం విరక్కపోతే, మిగతా మూడు రోజులు కావాల్సిన ధర్మ యుద్ధం అది. సుభద్రకు పెళ్ళి కాకపోవడంచేత ఖ్యాతంతా మంటకల్సిపోతోందని బెంగ పెట్టుకొంది శాంతమ్మ. కావలసినవాళ్ళెవళ్ళూ సుభద్రను ఆపె అలస విలాసాలకు అసహ్యించుకొని, ఆపెతో కై, బాయ్ మంటారే గాని మైత్రితో, సానుభూతితో ఆపెను దారిని పెట్టడం లేదు. ఎవరో ఈకుమారిక! రెండురోజుల్లో సుభద్రను సన్మార్గవర్తినిని చేసిందే! శాంతమ్మ మనసు సుభద్రవిషయంలో వేదనాయుతంగా ఉందికాబట్టి, సుభద్రలో పరివర్తన తెచ్చిన కుమారిక సద్గుణసంపదనుగురించి ఆత్మపరీక్ష చేసుకోగలిగింది. భావోదయానికి బాధ మూలం కద. అంచేత శాంతమ్మకు భావసంచలనం కలిగింది. ఏలాగైనా కుమారికను తనగ్రామం తీసుకెళ్ళి తనయింట పెట్టుకుంటే, సుభద్రకు పెండ్లి అవుతుందని శాంతమ్మకు విశ్వాసంకలిగింది.

ఆసమయానికి శేషమ్మ తెప్పరిల్లి, శాంతమ్మ దగ్గరకొచ్చి, 'అయ్యో మాపిటి బేరాన్నే ఉన్నా' డన్నట్టు, శాంతమ్మ హృదయపరిణామం అవగాహనలేక, "ఆదాసీది వచ్చినట్టుంది. తలవాచేలా పెట్టలేకపోయావే శాంతమ్మా! వేళకీ వెధవదగ్గు దీనిదుంపతెగ, నులిమేసిందే న౨" అంది, నాటకానికి ఆలస్యంగా రావడంవల్ల, మంచి రసవద్ఘట్టమేదో దాటిపోయింది, తాను చూడకుండా పోయానని బెంగపెట్టుకున్న ప్రేక్షకునిలా.

"శేషంపిన్నీ! దాన్ని దాసి అనుకుంటే కళ్ళుపోతాయే. అమ్మమ్మ! దాసిటే అది? మణిదీపమే. దానిపవిత్రత, పరహితబుద్ధి మనమెక్కడా చూడమే. మనం ఎంత అభంశుభం ఎరుగని పిచ్చిపీనుగులం అయిపోయామే. ఎంత అజ్ఞానదశలో కొట్టుకుంటున్నామే. ఎంత చేతకానితనంతో అనర్థం పన్లు చేస్తున్నామే. పిల్లను దారిని పెట్టుకోలేక పోయాం. దాని దొరసానివేషం తీయించలేక పోయాం. కాళ్ళకు పసుపుపారాణీ పెట్టించడం నాతరం కాలేదు. కళ్ళకు కాటుక మోటంటే పడి ఊరుకున్నా. ఏపనికి

దానికి ఓపిక లేదు. ఆ ఎగిరిపాటు ఎందుకో అర్థం కాదు. ఛీ అంటే ఛీ అనడం నేర్పింది. నేతిట్టానని దాన్ని నువ్వు తిట్టావు. నువ్వు తిట్టావని మరోరు. అందర్నీ పట్టుకు అది తిట్టింది. అంతమందిపోగై తిట్లపురాణం చేసి, దాన్ని ఎందుకూ పొందకుండా చేశాం, సిగ్గుసిగ్గు. రెండుపూటల్లో కుమారిక దాన్ని పూర్తిగా మార్చేసి, మనకట్టుబొట్టు సంప్రదాయంలో తయారుచేసి యిప్పుడు ఆలయానికి తీసుకెళ్ళింది. మన అహంకారాలకు లొంగనిసుభద్ర, కుమారిక అనురాగానికి లొంగిందే. కుమారికవంటి ప్రేమ హృదయం గలపిల్ల దొరుకుతుందనే తపస్సు చేసినా, శేషంపిన్నీ!" అంది శాంతమ్మ.

"మీవియ్యపురాలేదో మత్తుమందు చల్లిపోయిందేమోనే నీమీద. ఏదో పొట్టకూటికొచ్చిన దాన్ని మహాయిల్లాలుగా శ్లాఘిస్తున్నావు. మీఏడుపులు మీరు ఏడ్వండి, నాకేం కావాలి!" అంటో దొడ్డిగుమ్మంలోకెళ్ళి తట్టుట్టుకుని కూర్చుంది శేషమ్మ, మళ్ళా దగ్గుశయం తగిలిందేమో కూడా అప్పుణ్యాత్మురాలికి.

---

# 14. రంగారావు కుమారికల సేవాలక్ష్యైక్యత

ఉద్యోగవిషయంలో, యింటర్వ్యూకి వెళ్ళిన రంగారావు, రామశాస్త్రుల్లగారి కుమారుడు, సదస్యంనాడు సాయంత్రం బండిలో దిగాడు. రంగారావు, సంఘోద్ధరణకు ఏర్పడ్డసంస్థలకు శాయశక్తులా తోడ్పడే ఉదాత్తుడు. జాతీయభావపూరిత హృదయుడు. మూఢాచారపరాఙ్ముఖుడు. ఆదర్శసాధనకై ఎంతటి త్యాగానికైనా ముందంజ వేసే సాహసి. మనశ్శరీరాలమధ్య విసంధి లేకుండా శరీరదార్ఢ్యంగల బిడ్డ. కళంకరహితుడని ఖ్యాతికెక్కిన యువకుడు. అతడి కళ్ళల్లో అఖండమైన సత్యసంశుద్ధి

దర్శోత్సాహం బహిర్గతమవుతోంటై. పుణ్యాంగన, సీతమ్మగారి నోముల పంట, రంగారావని బహుజనవాక్యం.

రంగారావునిగురించి విన్నవాళ్ళైనా, అతణ్ని చూచినవాళ్ళైనా, 'అదృష్టవంతుడవయ్యా రామశాస్తుర్లు. రత్నమయ్యా మీఅబ్బాయి. దయ దాక్షిణ్యశీలత గల సులభుడయ్యా! 'ఉదారచరితానాంతు వసుధైవ కుటుంబకమ్' అన్న సత్యానికి ప్రత్యక్షప్రమాణమయ్యా'' అంటే, రామ శాస్తుర్లుగారి ముఖంలో ఓ కొంచెం కించ దృగ్గోచర మవుతుంది. రామ శాస్తుర్లుగారికి, ఈతడు సంసార్రాజు కాలేడని దిగులు. కాస్తో కూస్తో పిసినిగొట్టుతనం, పిటికితనం ఉన్నమాధవయ్యలు కాని, సంసార్రాజులు కాలేరని ఆయన దృఢవిశ్వాసం. మనలో మనమాట, పైకి అనంగాని, మనలో నూటికి తొంభైదాకా, మనకుర్రాళ్ళ విషయమే అయితే రామ శాస్తుర్లుగారి అభిప్రాయంతో ఏకీభవించేవాళ్ళమే.

చిన్నచదువురోజుల్లో అయితే తనకుర్రాడు పరాయికుర్రాళ్ళకు తనదే దైనా విడుపుతున్నాడంటే, వాణ్ని ఎందుకు మందలిస్తోన్నదీ కైనం తెలీనీకుండా, 'పరాయికుర్రాళ్ళతో సావాసాలు చెయ్యబోకు, చెడిపోతావు. జాగ్రత్త. తెలిసిందా, ఊఁ—' అని కళ్ళెర్రచేసి గట్టిగా మందలించుకోవచ్చు. పని జరిగిపోతుంది. కుమారుడు దుస్సావాసాలు పట్టకుండా తండ్రిజాగ్రత్త తీసుకొంటున్నా డనుకుంటాం మనమూ, మనమూ. కుర్రాడో! ఏమను కొనే వయస్సూ కాదు కాబట్టి, తండ్రిని ముదరకించబోడు. జ్ఞానమొచ్చిన కొమారుని ఔదార్యాది సద్గుణాల కాతనిని కసుకుత్తుంటే, తండ్రిపీనాసి గుణం నగ్నరూపంలో, నలుగురి కళ్ళా పడ్తుంది. అది అటుంచి, తండ్రి కోపకారణం తెలిస్తే, కుమారునికి తండ్రిమీదయింకా ఏమి భయభక్తులుం డను! పితృస్థానంలో ఒక తర్కాతీతమైన పావిత్ర్యపదవి నాపాదించ డం వల్లకదా, పితృవాక్యపరిపాలన పుత్రుని ప్రధానకర్తవ్యంగా పాటిస్తు న్నాము. ఉదారతను ఉపదేశించాల్సిన అట్టిపవిత్రస్థానం, స్వార్థపర త్వాన్ని ప్రబోధిస్తే, జనకునిప్రవర్తన జుగుప్సాకరం కాదా! రామశాస్తు ర్లందుచేత ఉన్నబాధను బైటపెట్టుకోలేక, రంగారావు యోగ్యతకు కించ

వస్తోన్నాడు. అక్కడికీ, ఉండబట్టలేక ఒకపర్యాయం తేలిపోయాడు రామశాస్త్రుర్లుగారు.

రామశాస్త్రుర్లుసంతోషిస్తాడని పట్నం పనిమీద వెళ్ళివచ్చిన అలౌకికుడు నూరిశాస్త్రుర్లు చేటంతముఖం చేసుకొని, "మామా! మీవాడిగుణసంపత్తి ఎవడికీ రాదయ్యా. వద్దని అలమటుగుతోన్నా నాకు పలహారం తెచ్చాడయ్యా" అన్నాడు.

"కుర్రాణ్ని చేసి కమ్మగా ఆరగించి పైగా చెప్పవచ్చావా?" అన్నట్టు చూశాడు రామశాస్త్రుర్లు.

ఆయనగారి ఇంగితాన్ని గ్రహించని నూరిశాస్త్రుర్లు అందుకొని, "ఓనాడు ఖాదీవస్త్రాలయమట అక్కడకీ, లఘుపరిశ్రమల కార్ఖానా అట అక్కడికి నన్ను తీసుకెళ్ళి, వివరంగాచూపెట్టి, వీటితో పదేళ్ళలో దేశంబాగు పడ్తుంది అని పొంగిపోయాడయ్యా. వాడిది ఏందేశభక్తి! ఏందేశభక్తి!" అన్నాడు.

"'దేశంబాగేమొచ్చె నువ్వు బాగుపడి ఏడుద్దూ' అని వాడికి గడ్డిపెట్టి రాలేకపోయావా?" అన్నాడు రామశాస్త్రుర్లు ముఖంముడుచుకొని.

ఇంకా రామశాస్త్రుర్లు మనస్తత్వం గ్రహింపు కాలేదు నూరిశాస్త్రుర్లుకు పాపం. అమాయికంగా "మీవాడు బాగుపడ్డానికేమిటయ్యా? తోడి విద్యార్థుల కందరికీ తల్లో నాలుకయ్యా మీవాడు" అన్నాడు.

"కాకనేం? ఎవడు వాళ్ళనాలుకలు తడిచేస్తుంటాడో వాడు తల్లో నాలుక అవుతోంటాడులే, ఆఏర్భాయిగాళ్ళ" కన్నాడురామశాస్త్రుర్లు.

ఇంకా జ్ఞానోదయం కాలేదు నూరిశాస్త్రుర్లుకు. "అబ్బే, అదేంమాట? రంగారావువంటివాడె వడున్నాడయ్యా మననాటున! ఏమి కలుపుకోరు తనం ఎంత భారీఅంతఃకరణ" అంటో అల్లాపోతున్నాడు వెర్రిబ్రాహ్మడు నూరిశాస్త్రుర్లు.

"కూడాఉన్నవాళ్ళుచాలక, పైవాళ్ళనుకూడా కేకవేసుకొస్తాడులే విందులకు మావాడు. డబ్బు తగలైడానికి. భారీ కాక వాడికేం, జమీందారుబిడ్డన నుకుంటున్నాడు. అడ్డమైనవాడికి సువారాలు తోడ్తున్నాడు, ఇంటికొస్తాడుగా" అని, తనది పావలో, అర్థో నూరిశాస్త్రుర్లు పొట్టలో పడనా! అన్న అక్కసంతా తీర్చుకొన్నాడు రామశాస్త్రుర్లు.

దీన్తో సూరిశాస్త్రుల్లకు గూబ గుయ్యిమంది. తెల్లబోయాడు రామశాస్త్రుల్ల వైఖరికి ఇప్పటికీసూరిశాస్త్రుల్లను పాపం గట్టినట్టు చూస్తాడు రామశాస్త్రుల్లు.

ఆరంగారావే, డెవలెప్‌మెంటు బ్లాక్ ఆఫీసరు వుద్యోగము వేయించుకొని ఈనాడు యింటికొచ్చినవాడు. రెండువందలయాభై యిస్తారట. జీతంమాట చెప్పినంత సేపూ, బ్రహ్మానందభరితుడయాడు తండ్రిగారు. "రావడంతోటే సరిగాదు. మిగుల్చుకోవడం నేర్చుకోవాలి"అంటూ నసిగాడాయన. ఆ ఉద్యోగపు హోదాను గురించి, గృహసౌకర్యాలను గురించి, సేవకాజనాన్ని గురించి గుచ్చిగుచ్చి అడిగింది తల్లి. జీప్, నౌకర్లు అతడిచేతుల్లో ఉంటారని విని, 'నన్ను నీఉద్యోగపుఊరు ఎప్పుడు తీసుకెడ్తావు అన్నయ్యా!' అని అడిగింది, అమ్మాణీ. మొదటినెలజీతం ఎవరికిచ్చేదీ తెగలేదు. తల్లీ, తండ్రీ, సోదరీ–ముగ్గురు క్లయిమెంట్సూ అతడివంక చూస్తున్నారు. ఈచిన్న–మాస్తోన్న కుమారిక, సీతమ్మగారికేదో జ్ఞప్తికి తెస్తోన్నట్టు, ఆ పెవంక తిరిగి కంటిపాపలు కదిపింది.

"అవునే, ఇంతక్రితమే అందే కుమారిక, రంగోత్సవంచెయ్యాల"ని అంది సీతమ్మగారు.

బాగుందంటే బాగుందనుకొని ఆనందపడ్డారు తల్లీకూతుళ్ళు. రామశాస్త్రుల్లుగారే మరోవైపుకు తిరిగి ఏమో గొణుక్కున్నాడు. 'తమయింటి నిర్ణయాల్లో ప్రధానపాత్ర వహిస్తోన్న ఈఅమ్మాయి ఎవరా?' అన్నట్టు కుమారిక వంక, ఒకకొంత శ్రద్ధతో చూచాడు, తొలిసారి రంగారావు!

తదుపరి జాతీయవికాస కేంద్రసంస్థాపనోద్దేశ్యాన్ని గురించి, తనయాజమాన్యంలో ఉండే బ్లాక్ పరిమితి, పరిస్థితులను గురించి, తన అధికార బాధ్యతలను గురించి, విపులంగా చెప్పాడు. ఆఉద్యోగానికి చిత్తశుద్ధితో పనిచేసే దేశసేవాభిలాషులైన ఆఫీసర్లు లభిస్తే గ్రామీణులకు సాంఘిక, ఆర్థిక, విద్యా, ఆరోగ్యవిషయిక అభ్యుదయాభివృద్ధులు ఎంతగానో కల్గుతాయని, గ్రామాలను బంగారు మలామా చెయ్యవచ్చునని, సాంఘిక సేవను పరమలక్ష్యంగా పెట్టుకొన్న ఆఫీసర్లకు తనివితీరా పనిఉంటుందని, తనకు చిరవాంఛితం సిద్ధించిందని, ఆయా సేవావివరాలను అత్యుల్లాసంగా చెప్పుకుపోతోంటే, ఆనందపారవశ్యంతో మెఱిసిపోతోన్న కళ్ళ రెప్పలు

వాళ్ళకుండా ముందర ముందరకు జరిగి ప్రాణం వప్పగించింది కుమారిక. కళ్ళుతీయకుండా కుమారికకే చెప్తోన్నట్టు అయిపోయాడు రంగారావు.

కొంతతడవు విన్నాక "జాతీయసౌధపునర్నిర్మాణానికి నెహ్రూపభుత్వం చేస్తున్న విశ్వప్రయత్నాలకు పునాదులే కదండీ. మీ వికాసకేంద్రాలు. ఇంత ప్రబలప్రయత్నాలు తమక్షేమానికి జరుగుతున్నాయని ప్రజ గుర్తిస్తున్నారని మీకు? నమ్మకముందా" అని అడిగింది కుమారిక.

రంగారావు కించెచ్చుకితుడై, "అవునవును, మామూలు మనుజులు తమకుగల అవకాశములను తెల్వితేటలను ఉచితజ్ఞతతో సద్వినియోగం చేసినపుడే శుభం చేకూరేది. మామూలుమనిషి ఉదాసీనతే, ప్రభుత్వానికి ఖేదకారణమవుతోంది. అల్పసంఖ్యాకులగు భాగ్యవంతులకు లాభకారణమవుతోంది" అన్నాడు రంగారావు.

"అయితే స్వాస్థ్యరక్షణ, విద్యాసేకరణ, కుటీరపరిశ్రమల సముద్ధరణ-ఈవిషయాల్లో గ్రామీణులకు శ్రద్ధాశక్తులను కలిగించే పథకమునండి, ప్రచారమనండి, ఆ ఆయువుపట్టు దొరకాలేమోనండి" అని కుమారిక యింకాఏమో చెప్పబోతుంటే, రామశాస్త్రుల్లుగారు చీకాకు పడ్డం ప్రారంభించాడు. మానేసింది,

"సంఘసేవావిషయం యింతశ్రద్ధాభక్తులతో వింది. ఎంతో ఆనంద పడింది. బహుప్రయోజనకరమైన సూచనలను అనుభవజ్ఞురాలుగా చేసింది. ఎవరీ ఈ అమ్మాయి? బాగాజ్ఞానం. అనుభవం సేకరించింది. మనయింటికొచ్చిన బంధుగుల అమ్మాయా? మగపెళ్ళివారితో వచ్చిందా? వివాహమైందా?" అని తల్లినడిగాడు. తద్విషయం సీతమ్మగారు చెప్పేలోపల, అటుఏదోతొందరపనికలిగినట్టు శీఘ్రమృదుపదధ్వనితో కుమారికకదిలింది.

ఇంతలో "కం_గాట్యులేషన్స్! దిగావే ఈబండిలో. పెండ్లికూతురు అన్నగారికన్న నేనే ముందొచ్చాను, పెండ్లిమాటనాకు ఆదిలో తెలియక పోయినా" అని సుభద్రసపర్యల నందుకొంటోన్న యువకుడు రంగారావుకు హాండ్‌షేక్ యిచ్చాడు.

"నువ్వువచ్చావు ప్రాణం లేచివచ్చిందిరా" అన్నాడు రంగారావు.

"వెళ్ళినపని నిర్వహించుకొచ్చావు సంతోషం" అని ఆయువకుడంటే,

"నీవు ఉత్తరమిచ్చిన మీబంధుగు కారే నావహీంలో పెట్టి చూపవలసిన మినిస్టర్లందరికీ నన్ను పరిచయంచేశాడు" అన్నాడు రంగారావు.

"నీకెవరిపరిచయం అక్కరలేదురా. నీవు వికాసకేంద్రనిర్వహణమీద కాలేజీజర్నల్లో ప్రచురంచేసిన నీవ్యాసావళి చూచినవాడెవడైనా, నీకీ ఉద్యోగంకలమీదపెట్టుకొని ఇస్తాడు" అని మిత్రుడు రంగారావును అభినందించాడు.

అమ్మాణీని బ్రహ్మగారు అగ్నిహోత్రాలకు తీసుకువెళ్ళారు. మిత్రులిరువురు అన్యోన్యహితభాషణులై వీధినడవలోకి వెళ్ళారు.

"చూచావుటే! చూచావటే! నేను అనుకొన్నంతపనీ అయిందే! అబ్బాయి కుమారిక ప్రస్తావన తెస్తోన్నాడు. 'వివాహమయిందా?' అని కీలకమాటే అడిగాడే. అమ్మ! యిదేనో జగజ్జంత్రీ, వాడిమీదకు నిముషంలో ఏలాఎగబాకిందో చూచావా? ఇంకేముందే ఇంకా బ్రాహ్మణ్యమేమిటే?" అని చిందులు త్రొక్కాడు రామశాస్త్రుల్లుగారు.

"అబ్బాయి దానిమాట ఎత్తితేనే ఊళ్ళంటుకున్నట్టు అయిపోతారేం ఖర్మం వచ్చిందండీ" అని విసుక్కుంది సీతమ్మగారు.

అత్తమీద కోపం దుత్తమీద తీర్చుకొంది అన్నట్టు ఆవిడ అక్కడ అల్లరిచేస్తోన్నపిల్లకాయులను, 'పోండి, పందిట్లో ఆడుకోండి' అని వీధిలోకి తరిమింది. ఆవిడ విసుగుచూచి అప్పటికి తగ్గాడు రామశాస్త్రుల్లుగారు.

---

# 15. శాంతమ్మ హృదయ పరివర్తన

అగ్నిహోత్రాలు కాంగానే అమ్మాణీ, కుమారికా సుభద్రలు మాల తీలతల్లా అల్లుకుపోయి మాట్లాడుకుంటున్నారు. చతుర్వేది విడిద కొచ్చాడు. మధ్యాహ్నపు పలహారాలు వృత్తాంతం నూసాయగా తెల్సి, ఏదో పెద్దపరాభవం తానే వార్లకు చేయించినట్టు తనపై నెపంవేసి, శాంతమ్మ శేషమ్మగార్లు తన్ని మింగైడానికి విడిదిలో రాహుకేతువుల్లా పొంచిఉంటారని ఒదుగుతో చతుర్వేది విడిదలో అడుగెట్టాడు. కాని

శాంతమ్మను చూచి ఆశ్చర్యచకితుడైనాడు. ఆ పెద్రభ్రూవిలాసంలో వెనుక తీత ఎఱుగనితొల్లింటిపట్టుదల, విరామం ఱెఱుగని తొల్లింటికసి నేడు అదృశ్యమైపై. ఆస్థానంలో ఆత్మవిజయసూచకమైన సంతృప్తి తొణికిస లాడ్తోంది. శత్రుస్థావరాలమీదకు దాడి చేస్తున్న ముఖరేఖాతైక్ష్ణ్యం కానేకాదు. శత్రువీగులకు క్షమాభిక్ష పెడ్తోన్న నైతికగభీరత, ఆమె ముఖంలో ప్రతిబింబిస్తోంది. ఎప్పుడూ కంపగల మనిషేమో, యిదివరలో కాస్తగంభుగా, బంపగా ఉండే ఆ పెవదనంలో, క్షాళితహృదయసూచక మైన, అపూర్వమైన ఒకానొక హంసా వర్చస్సు వింత కాంతుల నీను తున్నై.

చతుర్వేదిని చూడ్డంతోనే, "నీకోసమే ఎదురుచూస్తున్నారా! తమ్ముడూ, కుమారిక మాదొడ్డపిల్లరా" అంది.

కుమారిక ప్రస్తావన ఎందుకు తెస్తోందా అనుకున్నాడు. సుభద్రకు పెళ్ళి కావాలంటే కుమారిక శిక్షణ సుభద్రకు ఎంతఅవశ్యకమో, కుమారిక నేడు సుభద్రకెంత భక్తిభావపరిణామం కల్గించిందో, పూసగుచ్చినట్టు చెప్పింది. ఆ భేధ్యమని తానునిరాశచెందిన తన అప్పగారి మహాధ్యానికి, అవిడకడుపు. చల్లగా, కుమారిక బీజంపెట్టిందని సంతసించాడు. ఈపనులోనే కుమారిక ప్రభావంతో అప్పగారి హృదయంలో పేరుకున్న జిడ్డు ఓడ్చైవచ్చున నుకున్నాడు. శాంతమ్మ స్వలాభాపేక్షను, స్వప్రయోజన పరత్వాన్ని ఊతగా తీసుకునే ఆ పెనుసుపథగామినిని చెయ్యవచ్చున నుకున్నాడు.

కాని సుభద్ర భవిష్యత్తు ఒక్కటే మనసులో పెట్టుకొని, కుమారికను లాలించి, తనపబ్బం గడుపుకొని తర్వాత శాంతమ్మ జైకాళీ అని, అవ పెళ్ళి వారిమీద ఎప్పటిఆటే ఆడితే, అంతమాత్రంచేత ఏమైనట్టు? శాంతమ్మ నాలుక గరుకు, హృదయ కాఠిన్యం తగ్గిస్తేగాని, శాంతమ్మబిడ్డలకు పెళ్ళిళ్ళూ కావు, తనకు అమ్మాణీతో సంసారసౌఖ్యమూ ఉండబోదు. ఈ శాశ్వత ఫలప్రాప్తికి ఉపాయం చూడాలి. కుమారిక సహవాసం సుభద్రకు లభిం చాలన్నా, శాంతమ్మ కొడుక్కి ఉద్యోగం లభించాలన్నా, శాంతమ్మ వియ్యపురాలిని ఉతిమాలవలసిఉందని, వేరు గత్యంతరంలేదని శాంతమ్మకు నచ్చచెప్పి, తద్రీతుగా శాంతమ్మకు వియ్యపురాలితో సఖ్యం చేకూర్చాలి

విద్యాపురాలిని ఆశ్రయించాల్సిన అవశ్యకత, దురభిమాని శాంతమ్మకు కల్గడమే శాంతమ్మ మానసికానారోగ్యానికి ఒక విధంగా విరుగుడు. అక్కడే ఉంది తిరుగుడు,

నాడిపరీక్ష చేసిగదా, తత్సామయిక శ్లేష్మపిత్తవాత, సునిశితావగాహన చేసుకొని కదా చికిత్స ప్రారంభించాలి రోగికి. శాంతమ్మకు అడపెళ్ళి వారిమీదకసి యిప్పుడెన్ని డిగ్రీల్లో ఉందో తెలియాలి.

తదుద్దేశ్యంతో, "రేపు అలకపాన్పుమీద ఏమి లాగాల్సి ఉంటుందే? అదిచెప్పవే ముఖ్యమైనమాట" అన్నాడు.

"అలకపాన్పుమీద ఏమి వడేసిపుచ్చుకొన్నారు అన్న ఆ అంకేరా మగపెళ్ళివారి అతిశయం చెప్పేది, ఈరోజుల్లో. 'అయిదువందలకు ఒక్క పైస తగ్గితే మనకు చుట్టపక్కాల్లో తలవంపులు కాదుట్రా" అంది ధనాశా దూషితచిత్త శాంతమ్మ.

"అలకపాన్పుమీద డబ్బుఅడగడం బాగుంటుందా?" అన్నాడు.

"అన్నీ మొహమాటాలేరా నీకు. ఎక్కడో పుణ్యకాలం మాటలు చెప్తావు. నేను లాంఛనాలకు రొక్కంనిలబెట్టి పుచ్చుకోలేదట్రా? అలకపాన్పెక్కి పెళ్ళికొడుకు ఏదో అపురూపపు వస్తువు అడిగి దర్జాచూపెట్టుకోవడం, 'ఎంతదర్జావస్తువు అడిగాడే మనవాడు, అందరికీ తోస్తాయిటే. బోలుడ్లోసి చదువుకున్న పట్నం చదువు ఊరికేపోతుందటే' అని మగ పెళ్ళివారి ముత్తయిదువలు మురిసిపోవడం, మామగారు అంతకన్నా దర్జాగా 'సరేలేవోయ్' అని ఓకంఠవాలజత మెడకేసి అల్లుణ్ని అలకపాన్పుమీద నుంచి దింపడం, 'ఉదారుడే! దేనికీ మొఖంచూసుకునేనైజం కాదే వాళ్ళ వీళ్ళలా' అని అడపెళ్ళివారి ముత్తయిదువలు మామగార్ని భూషించడం, ఆ అపురూపపువస్తువు అప్పట్లో అడపెళ్ళివారి ఇంట్లోగాని, చుట్టుపట్ల ఆరామడలో ఎక్కడాగాని ఉండేదికాకపోవడం, తర్వాత తర్వాత అర్చిచచ్చినా పెళ్ళికొడుక్కి అది ముట్టకపోవడం, నాపోటి ఏపట్టుదల మనిషైనా కలుగచేసుకొని కదిపితే, 'అదిఅలకపాన్పు ముచ్చట, యింకా జ్ఞాపకం పెట్టుకొని బాధపడ్డావా పాపం మామ్మే. నీజ్ఞాపకశక్తి కనాలి, ఒసే ఒసే చూశావటే' అంటూ అడపెళ్ళివారు ఏవోవిరుద్ధంలా ఒండ్లోరు

లకు చెప్పుకోని నవ్విపారేయడం, ఇక ఈవిడ తీరా అడిగిపోతినని చిన్న బుచ్చుకురావడం, మగపెళ్ళివారు చేతులు ఖాళాక అకులుపట్టరావడం, శాంతమ్మదగ్గర ఈఆటలు సాగవు. రామశాస్తుర్లుని గూబలునలిపి రొక్కం అక్కడ పెట్టిస్తుంది ” అంది.

“ లాంచనాల రొక్కానికే, చచ్చీచెడీ చాయింగల విన్నపములన్నా డాయన, ఇల్లూ వాకలీ అమ్ముకుంటేగాని ఈరొక్కం పూడదని ఏడ్చి పోతాడేమోనే ” అన్నాడు చతుర్వేది.

“ దయాదాక్షిణ్యాలు పెట్టుకోకురా అబ్బాయి ఈ రెండురోజులూను ” అని మొత్తుకుంటూ, “ మబ్బులా అవి వచ్చి పడ్తోంటాయిరా నీకు. అమ్మ కోవాల్సివస్తే అమ్ముకుంటారు. వాళ్ళ క్రయవిక్రయాలకు, కష్టసుఖాలకు మనం కర్తలమట్రా పిచ్చివాడా! పుచ్చుకోదగ్గవాళ్ళే కాని మగపెళ్ళి వారు అన్నాక. అది నుయ్యి యిది చేదా” అంది.

అవసరంపట్ల వేదాంతం వర్షిస్తోంటుంది శాంతమ్మ శేషమ్మపిన్నిగార్ల నోట.

ఆడపెళ్ళివారిమీద శాంతమ్మ అక్కుస్సు ఎప్పటి చోటే ఉందని గ్రహించాడు. ఇంత కఠినచిత్త సీతమ్మగారితో మనసిచ్చి మాట్లాడ్డం అసంభవమని అత డనుకొంటోంటే, “పెళ్ళికి అయువుపట్టు అలకపాన్పు. ఎక్కడికి పోతుందిగాని అబ్బాయి, కుమారిక యోగ్యత ఎవరికీ రాదురా! ” అంది.

“ యోగ్యతెందులోనో నాకు తెలియదు కాని, ఒక్కటిమాత్రం నాకు తెల్సు. అది పెంకిడిప్పకాయి ” అన్నాడు.

“ పెండ్లికూతురుతో మనవూరు వస్తుం దనుకుం టున్నారా ” అంది.

“ నువ్వేమనుకుంటే ఏముంది? ఎన్ని అనుకుంటే ఏముంది ? అది అనుకోవాలి గాని ” అన్నాడు.

“ నీ పెళ్ళామనా నీవనేది ? ” అంది.

“ అఛ్ఛే! కుమారికమాటే. అది సర్వస్వతంత్రురాలు. దానికి తోస్తే రావాలి తోచకపోతే దేవుడితరంకాదు దాన్ని కదపడం. మాచెడ్డ తల బిరుసు ” అన్నాడు.

“ అదేమిట్రా అల్లాఅంటావు. అన్నీ శోద్ధాలు. నీ పెళ్ళాముకు చెలికత్తే

29

కావట్రా. దాన్నికూడా తీసుకురామని నీపెళ్ళానికి నీవుతోడపాశంపెడ్తే గుండెలుంటాయిట్రా కుమారికకు రాననడానికి? మాచక్కగా వస్తుంది వెనకాలే. నీపెళ్ళాం చెలికత్తెమీద నీకామాత్రం స్వతంత్రం లేకపోతే, యింకా నీమగతన మేమిట్రా ” అంది.

“ అక్కడే పొరపాటు పడ్తున్నావు. అది నాభార్యకు చెలికత్తె కాదే, గురువే ఖర్మం. నువ్వు దాన్ని నీకూతుర్కి గురువును చేయదలచుకొన్నట్టే, మా అత్తగారు దాన్ని కూతురుకు గురువును చేసింది. అందుకే దానికంత అంట్రడెబ్బ. అందరిమీదా స్వారీ చేస్తోంది. మూచావుగా, వంటబ్రాహ్మ డితో ససేమిరా మాట్లాడనంది. పైగా పెద్దావిడ అన్నైనా ఆలోచించ కుండా, తాను కాళ్ళు చాపుకుని కూర్చుని. వియ్యపురాలి చేత పంపించింది కారాబుందీ. సుభద్ర తలబిరుసు అని మనమందరము ఎరుగుదుమా? సుభ ద్రను లొంగతీసిందంటే, అది యింకెంత తలబిరుసై ఉండాలి? తీరా నేను కదిపి, అది రానంటంటే, దాసీదికూడా నామాట వినిపించుకుందికా దంటే నే నేడ్వాలి. ఇఖ నాకా ఆ వాలాయం. అంచేత నేనురమ్మంటా నని కలలోనూ అనుకోకు. మామగారిచేత చెప్పిందామా అంటే, పర పురుషునితో ప్రసంగించని పవిత్రురాలట. ఎటొచ్చీ ఎన్నివిధాల చూచినా వియ్యపురాలే కన్పిస్తోంది, కుమారికను కదపగలిగితేమాట.”

“ అయితేయికనేం? ఆకాస్తమాటా అవిడతోనే చెప్పరా తమ్ముడూ!” అంది ఆదుర్దాగా.

“ సారి! అవిడితో నేనసలే మాట్లాడ్డం. నీకు మరీమతి పోతోందేమిటే. వియ్యపురాలి స్థాయిదానివి, నువ్వు. అవిడతో చెప్పడం నీచేతిలోపని. ఈరెండురోజులనుంచీ, అవిడ నన్ను పలకరించబోతే, అక్షరాలా నువ్వు సలహా యిచ్చినట్టు, పెడముఖం పెట్టుకుని కూర్చుంటిని. ఒక్కసారిగా యిప్పుడు అవసరం వచ్చిందని ప్రాధేయపడితే లోకువై పోనూ! అమ్మో. లోకువైపోవద్దనేగా నీవూ శేషంపిన్నీ మొదలునుంచీ చెప్పింది.”

“ ఆదేమిట్రా తమ్ముడూ అల్లా అంటావు? నువ్వు అవిడకు ముఖంచాటే శావు గాని పల్లెత్తుమాట అన్నావట్రా ఆవిణ్ణి? నేను పడతిట్టాన్రా ఖర్మం. అంత తిట్టిపోసి, ఇప్పుడు మాట్లాడమంటే నాకు ప్రాణం చచ్చిపోదురా?

ఏ నక్షత్రాన్ని పుట్టిందో, సుభద్ర, నాకు దీంతో చచ్చీచావు వచ్చిందిరా! ” అంది శాంతమ్మ.

“ అవునక్కా! మానాభిమానాలున్న మనసుకుటుంబానికి విద్యార్థి పురాలిని పలకరించాల్సి రావడం కన్న ప్రాణపోక లేముంటుంది? ఏమి గడ్డు పరీక్ష వచ్చిందే నీకు! వ్యక్తిత్వాన్ని చంపుకోమనలేం, బిడ్డలను వాడు చేసుకోమనలేం. నిజంగా, ఇదిజీవన్మరణసమస్య అయిందే. అయినా సుభద్ర శ్రేయస్సు చూసుకొని బ్రతిమాలాలి, విద్యాపురాలిని. ఏంచేస్తావు, మహా మహావాళ్ళకొచ్చె కష్టాలు ! ” అన్నాడు తమ్ముడు.

‘ విద్యాపురాలిని బ్రతిమాలు ’—

అన్న పలుకులు కర్ణశూలాలమానమై నాయి కాబోలు శాంతమ్మకు. రెండు చేతులా చెవులు మూసుకుంది. ‘ బ్రతిమాలు ’ అన్న క్రియలో దోషం లేదు. మహారాజులే. ఎందుకో అందుకు, ఎవర్నో ఒకరిని బ్రతిమాలాల్సి రావచ్చు. నిత్యకృత్యంలో ప్రతియింట, బ్రతిమాలుకోడాలు చూస్తూనే యున్నాం. శాంతమ్మ వివాదం ‘విద్యాపురాలిని’ అన్న మాటతో. అంచేత బడిపంతులు ఆ వాక్యంలో కర్మను విశదీయించడానికి విద్యార్థిని అడుగు తాడే, “ బ్రతిమాలు ” దేనివి, వేనిని అని, అలాతమ్ముణ్ణి, ‘ ఎవర్తినిరా ! దేన్నిరా ? బ్రతిమాలమన్నావు ’ అని నిలేసి అడిగింది.

విద్యార్థి కర్మను చెప్పినట్టు, ‘ విద్యాపురాలిని, ’ అన్నాడు తమ్ముడు.

శ్రవణవిదారణమైన విరుద్ధం వింటే, అసంభవం అని తలచి, ఇనుడిల మీద పడలేదు, హిమాచలశృంగము ప్రయ్యలు కాలేదు, ద్వాదశార్కులు ఉదయించలేదు, ఇదేలా జరుగుతుం దనుకుంటారే పురాణ పీఠులు, అలా ఏమనుకుందో, బ్రమాన్పడిపోయింది శాంతమ్మ. పెద్దఆడబిడ్డ అనేకర్త, విద్యాపురాలు అనేకర్మను, సృష్ట్యాది నేటివరకు బ్రతిమాలలేదని, బ్రతి మాలబోదని శాంతమ్మ దృఢవిశ్వాసం. నేడు ఈకర్మను బ్రతిమాలాల్సి రావడం ఏజన్మలోనో చేసుకొన్న కర్మ అని దేవుళ్ళాడుతోంది.

ఈపదునులోనే అక్కను దారిని పెట్టడానికి మరోఅస్త్రం పయో గించాడు చతుర్వేది.

"ప్రతిమాలడానికైనా మరోకేమి వచ్చిపడిందో చూచావా, అక్కా! మన కన్నీ మర్నిమిత్తాలు కల్గుతున్నాయే. ఇవాళ వియ్యపురాలు, వియ్యంకుడు నిన్నటివాళ్ళు కారు. మిడిసిపడిపోతున్నారు. వాళ్ళు బాగు పడి పోయారే. మా బావమరదికి పెద్దఉద్యోగమైంది. వినలేకపోయానే. కొడుక్కి గొప్ప ఉద్యోగమైందని పైరు నాకళ్ళపెట్టాడు మామగారు. కంటో కలికం పెట్టుకున్నట్టుందే. 'నీకులేదుగా;' అన్నట్టు ఎగతాళి కన్పించింది అత్తగారి చూపులో."

శాంతమ్మ విస్తుపోయి "అంతపెద్దఉద్యోగమట్రా?" అని అడిగింది.

"మా బావమరది వచ్చాడిప్పుడిప్పుడే. మొదట్లోనే రెండువందల యాభై. అన్నీ కల్పుకుని మూడువందలదాకా దేకే ఉద్యోగం" అన్నాడు.

"ఈ రెండురోజులూ గడుపుకొని పెండ్లికూతుర్ని కుమారికను తీసుకొని యింటికి పోతాం. ఇకవాడి ముఖంచూడనే చూడం. వాడి ఉద్యోగమెంత చేసు? వాడెంత చేసు? వాడిమాట తలపెట్టకు" అంది.

"నాఅభిప్రాయం అంతేగాని, దానికో చిక్కు వచ్చిపడిందే అక్కా!" అన్నాడు.

"మనకొచ్చిన చిక్కేమిట్రా? వాడెక్కడికో ఉద్యోగానికి పోతాడు. మనఊళ్ళో చెయ్యడుకద, మనమీద అధికారం చెలాయించడానికి. ఇంత పిటికివాడవయ్యావేమిరా?" అంది.

"శిక్ష వేస్తాడని కాదే, ఉద్యోగా లిస్తాడనే నాబాధ. డెవలెప్‌మెంటు బ్లాక్కు ఆఫీసరంటే, మా బండఅబ్బాయి వంటి స్కూలుఫైనలుతప్పిన వాళ్ళకు, పదిమంది దాకా శుభ్రంగా బ్రతుకు తెరువు కలిగే ఉద్యోగాలు వెయ్యగల అధికారం అతడి చేతిలో ఉందే. ఉద్యోగం పుట్టక ఏర్బాయి తనంగా తిరుగుతోన్న మాబండాడికి యివ్వాలంటే యిప్పుడివ్వగలడే ఉద్యోగం. అది మరీ కడుపు తరుక్కు పోతూందే అక్కా!" అన్నాడు.

"ఆఁ!" అంది శాంతమ్మ బిగ్గఱగా.

అప్పటి "ఆఁ!" లో మనశాస్త్రజ్ఞులు కూడా విడతీయలేని ఎన్నో మిశ్రమ భావాలు యిమిడి ఉన్నై.

"బండాడి ఉద్యోగం, సుభద్రవివాహం చేతుల్లో పట్టుకు కూర్చున్న గాళ్ళ గుప్పిట్లోపడి పోయాయే!" అన్నాడు చతుర్వేది.

"ఏం చేస్తే బాగుంటుందో శేషమ్మపిన్నితో ఆలోచించుకోవే అక్కా" ంటో 'శేషమ్మపిన్నీ! శేషమ్మపిన్నీ' అని కేక వేశాడు.

"ఇప్పుడెందుకురా ఆ తుడుపులమ్మ!" అంది శాంతమ్మ.

'శాంతమ్మ యుద్ధమార్గం వదలి శాంతిధోరణికి వచ్చిందనడానికి. ఇంత న్న ప్రబలనిదర్శనం ఏంకావాలి!' అని సంతసమందాడు చతుర్వేది. మ కొంపకు, శేషమ్మ సహవాసం సృజించిన విరుద్ధవాతావరణం తొలిగే ూచన కన్పిస్తోందని ఆనందించుకొన్నాడు. "శేషమ్మ పిన్నిని 'తుడుపు మ్మ' అని ఎందుకు అన్నట్టే? ఇప్పుడేం చేస్తే బాగుంటుందో దాని మాపెట్టును కాదే?" అన్నాడు.

"అదృష్టం చూపెట్టేది, ఓ పేదారి గోదారి. దాన్నిపుడు కదిపితే కొంప ుడుంగున ముంచిందన్నమాటే. మంచిచేసుకోదలచుకొంటే, దానికి తెలియకుండా కూడా చేసుకోవాలి. ముగ్గుపెట్టడమే దానిపని. ముందు ీడు చూచావుగా, ఇది మంచం పట్టినపుడు దీని అన్నకొడుకు వివాహం చేసుకొచ్చాడు. రోగం కుదిరిన తర్వాత, యిట్టే అన్నగారింటికి చూడ వెళ్ళి, అన్నకోడల్ని అమాంతంగా పుట్టింటికి గెంటించేసింది. అపిలా తల్లీ ిని ప్రాణాలు ఏడుస్తున్నారు. దీనితమ్ముడు కూతురు కొత్తకాపురం. ల కాగోరువంకలాగున్నారట, 'చూసివస్తానమ్మా!' అని మాతోటీ మాతోటీ చెప్పివెళ్ళింది. అప్పుడే అనుకున్నాము. అక్కడ కాలెట్టిందని. దోరోజుకిల్లా ఆభార్యాభర్తలకు పచ్చగడ్డేస్తే భగ్గుమనేటట్టు చేసి, ఆపిల్లను ిసుకు చక్కా వచ్చింది. 'నువ్వెందుకు ఊరేగావే అక్కడికి?' అని లబో బో మని తమ్ముడు గోల. అదెంగనే మంచంపట్టా డాతడు.

"శేషమ్మభర్త సాధు అయాడంటారు?" అన్నాడు చతుర్వేది.

"అయ్యో నాయిన! ఇది ఘాత్తు అవడంవల్ల ఆయన సాధు అయాడు. నిబంధపుకోత భరించలేక జంధ్యాలు తెంపుకలేచిపోయాడు. దీనికి భయ డి ఆయన కొంపపట్టకపోతే, 'అడుగో ఎవర్తెనో ఉంచాడ' ని అప ాదు వేసింది. పాపం ఆ అపవాదుతో బక్కచిక్కిపోయి, ఓనాడు

ఒక్క కోపంలో జంధ్యాలు తెంపుకున్నాడు వంటింట్లో. నిజానికి అది ఎవరూ ఎరుగరు. మళ్ళా జంధ్యం వేసుకుంటా డని భయపడిందేమో, తానే రెండోకంటి వాడికి తెలియకుండా, కాషాయిగుడ్డలు అప్పటికప్పుడు తెప్పించి యింట్లో పెట్టి, మంగలికి కబురెట్టి, 'తనభర్త సన్యాసం స్వీకరించారు' ని, ఒక్కగంటలో ఊరంతా లుంగచుట్టుకు చెప్పివచ్చింది. వాడికేం తెల్సు. పనిచేయించుకోనేవారెవరో ఇంట్లోనుంచి వస్తారుకదా అని అరుగుమీద మంగలి తపీ, తపీ కత్తి నూరుతున్నాడు. మంగల్ని చూసి వేళకే వచ్చాడని ఆనందించుకొంటూ గ్రామస్థులంతా, ఆశ్రమస్వీకారం చేసినందుకు ఆయన్ను అభినందించారు. శేషమ్మ అంబాకా తెచ్చాక, ఊళ్ళో ఉండడానికి ముఖంచెల్లక దేశాలట్టిపోయాడు పాపం. ఎవరైనా సాష్టాంగపడితే, 'నారాయణా' అనడంకూడా ఎరగడు. అంచేత ఆదిశేషమ్మ యిచ్చిన సన్యాసం కాని, ఆయన పుచ్చుకొన్నది కాదు. ఆయన ఇప్పుడు ఉన్నాడో చచ్చాడో తెలియదు. ఊళ్ళోవాళ్ళు పోయాడంటారు. ఇది ఉన్నాడని వాళ్ళతో కొట్లాడి బుర్ర గొరిగించుకోకుండా కూర్చుంది. సన్యాసిపెళ్ళాం ఎప్పుడూ పునిస్త్రీయే నని ఓ కారిక లేవతీసింది. ఎవళ్ళ అనుమానాలు వాళ్ళవి. అంచేత, యీది శఖున మొస్తే, ఊళ్ళో వాళ్ళకు చచ్చిచావు వచ్చింది" అంది శాంతమ్మ.

శేషమ్మ సల్లక్షణాలను ఇంత పరిశీలనా దక్షతతో విమర్శించిన శాంతమ్మ ఆవిడగారి వరవడే ఎందుకు దిద్దుకోవాలో, సన్యాసాశ్రమం ఇవ్వడం తర్వాయిగా బావకు కొంపను నరకప్రాయం ఎందుకుచెయ్యాలో అనూహ్యమనుకుంటో, మానవుల పాటవప్రవర్తనల మధ్య ప్రత్యక్షమయ్యే విసంధికి నవ్వుకున్నాడు. ఈయదనులో అక్క నామాట అడగడం కాని, ఇంకా ఆమె చేత స్వవచనవ్యాఘాతాలు చేయించడం కాని, ఆమెను అవమానపరచడము వుండి. ఆమె వ్యవహారదక్షత, లోకానుభవం, దీర్ఘదర్శిత్వం, తీవ్రమైన ప్రయోజనదృష్టి నిరాక్షేపణీయం. అక్క యాజమాన్యం వల్లనే తనకు చదువుజరిగింది. బాగుపడ్డాడు. ఆర్థికంగా చూస్తే, తానామెకు పెక్కు విధాల ఋణపడి ఉన్నాడు. తండ్రితాతల ఔదాసీన్యంవల్ల రైతులచేతుల్లో బిల్మక్తాకవులుగా హారాయింపు అయిపోతోన్న ఆస్తిని వాళ్ళ యినపగుప్పి

స్కూల్లో నుంచి పడలాగి ఒన్ను చెయ్యాడమనేది సామాన్య స్త్రీకి అలవి కాని పని. స్వంతవ్యవసాయం పెట్టి, రాత్రిళ్ళు మెరపకళ్ళాలవద్ద ఒక్కర్తే పడుండి కూడా కుటుంబాన్ని పరిరక్షించింది. ఆనాటి శత్రుసంహారంలో రాక్షసి అయింది కాని, నిజానికి అందరివంటిదే. అప్రయోజకులను చూస్తే యేవగించుకొంటుంది. అందువల్లనే బావను గౌరవించలేక పోతోంది.

అక్కకు హృదయపరివర్తన కలిగింది కాబట్టి, అదపెళ్ళివారితో అప్పె సఖ్యపడడాని కిష్టపడు కావలసింది, కించెత్ పరిస్థితుల ప్రభావమనుకు న్నాడు.

"అక్కా! ఎలా మఱచానో చూశావా? కుమారిక వశీకరణమంత్రం నీచేతులోనే ఉందే. నయం, జ్ఞాపకమొచ్చింది" అని అక్కకు తత్క్షణ కర్తవ్యం చెప్పాడు.

వివాహం నాటికే కుమారిక రామశాస్త్రుర్లుగారింటి వెనక పిల్లకాల్వ గట్టుమీద ఉన్నమఱ్ఱికి ఊపలఉయ్యాల కట్టింది. నాల్గవనాడు వధూ వరులను దానిలో ఊపి, వేడుక చెయ్యాలని ఎంతోసన్నాహమో చేసు కొంది. మనకు ఇష్టాలు తక్కువ కావడంవల్ల తనసంకల్పం వ్యర్థమైందని ఖిన్నురాలైంది పాపం. 'ఆవేడుక జరుపమ్మా' అని నువ్వు ఒక్కమాట అన్నావంటే కుమారికకది పండగే. పొంగిపోతుంది. కుమారికముద్దు నీవు చెల్లించిన దానవవుతావు. నీముద్దు కుమారిక చెల్లిస్తుంది. అమ్మాణీ కుమా రిక లిద్దరూ నీ చెప్పుచేతల్లో ఉంటారు. రాజబాట కాదటే అది? కుమా రిక ముద్దు తీర్చినవాళ్ళను తలమీద పెట్టుకుంటుంది వియ్యపరాలు. మరోటి, ఒక వేడుకలో పాల్గొనే సన్నివేశం ఈరీతిగా సమకూడితే, నీవు వియ్యా పురాలితో ఎత్తునాటుగా మాట్లాడినట్లూ ఉండదు. నీఆనందం ఆవిడదీ, ఆవిడ ఆనందం నీదీ అవుతుంది. నీ పని స్వకార్యంలా చూచుకొంటుంది అత్తగారు. మన ఆశయాలు సిద్ధిస్తై. దాని కడుపు చల్లగా కుమారిక మన కంపరికీ దారి చూపింది. శేషమ్మపిన్నిని మాత్రం ఎందులోనూ వేలెట్టకుండా లాఘవంగా కాచుకో" అన్నాడు.

శాంతమ్మ అమితోత్సాహంగా 'సై' అంది. "శేషమ్మపిన్ని కాదు, పిల్లిని ఇపుడు చెంగనాడినా కష్టమేసుమా. ఏవో తంపి పెట్టేస్తుంది.

దాన్ని ఓకంటితో చూస్తోంది మిగతాపని అంతా సానుకూల మవుతుంది''
అని చెప్పి, విడిది వదలి వెళ్ళారు, చతుర్వేది.

---

# 16. ఊడల ఉయ్యాల

తమ్ముడు గుమ్మం దాటటంతోనే శాంతమ్మ కాళ్ళూ ముఖం కడుక్కొని చీర మార్చుకొని, సాలంకృతయై కలకల్లాడుతో వాకట్లో కొచ్చింది. ఆర్రోజులనాడు వియ్యంకుడుకు పట్టుకెళ్ళి యిచ్చిన నాలుగువేల అయిదువందల రొక్కం ఇనప్పెట్టెలో గలగల్లాడిన ఘడియల్లో కలకల్లాడింది. శాంతమ్మ నాటికి నేడు కలకల్లాడుతోంది. శాంతమ్మ పోకచెక్కను పంటిక్రింద తిప్పుతో తమలపాకుల కాడలను తీసుకుంటోంటే, పరస్పరసమాదరణాది సల్లాపాలు సాగిస్తో, సౌందర్య కాంతులు విరజిమ్ముతో, కుమారికా సుభద్రలు విడిద కొచ్చారు. శాంతమ్మ హృదయం, వార్ని చూచిన కొద్దీ, ఆనందపు వెల్లువల్లో మునకలు వేస్తోంది.

కుమారికను చేరంజీటి, తల నిమురుతో 'అమ్మాయీ!' అంది.

అపూర్వమైన శాంతమ్మగారి చనువుకు నివ్వెరపడ్డ కుమారిక మీద ఆపె చెయ్యి పడ్డంతోనే, నఖాగ్రస్పర్శచే కంపించే శాంబురతీవివలె కుమారిక మైతీవ కంపించింది. అంతలో రాత్రి భోజనాలకు ఆహ్వానింపవచ్చిన సీతమ్మగారిని చూచి కుమారిక శాంతమ్మగారి చేతుల్లోనుంచి దిగ్గునలేచి సీతమ్మగారిని సమీపించింది. శాంతమ్మకూడా దిగ్గునలేచి, ఆదరదృక్కులతో సీతమ్మగారిని వీక్షించింది. శాంతమ్మతొల్లింటి నడవడికి యిది విరుద్ధం. అమ్మాణీ భావి ఆశాజనకంగా కన్పించింది సీతమ్మగారికి. ఇంతవరకు ఆమాయకురాలు అమ్మాణీ భవిష్యజ్జీవితాకాశలలో, విషాద నిబిడాంధకారము క్రమ్మినట్లు తలపోస్తో, విలపిస్తో, చిత్తక్షోభ పడ్తోన్న తల్లికి, శాంతమ్మ ముఖంలో కరుణరేఖలు కన్పిస్తే అమ్మాణీ భావి ఆశాజనకంగా కాదా? ఈ హఠాత్పరిణామానికి హేతువు కుమారిక యేనని శాంతమ్మ చూడ్కులే చెప్తోన్నై. తాను కాదు తనభర్త కాదని సీతమ్మగారికి తెల్సిన

విషయమే. కుమారిక లేబ్రాయపుకన్యయే అయినా, తానేమీ ఆదేశించందే కూడా, విడిద వదలకుండా శాంతమ్మ కుటుంబసేవలోనే రాత్రింబవళ్ళు నిమగ్నురాలై యుండటం గాని పరమార్థం సీతమ్మగారు గ్రహించింది. తన చిట్టి కాపురం నిలబెట్టినవారికన్న దగ్గరచుట్టమెవరుంటారు, తల్లికి? వారిని దైవసమానులుగనే భావిస్తుంది. తమకుటుంబానికి ఏమి దోషగులు కల్గినా, నివారింప సంసిద్ధయై శుభచరిత, శుభప్రదాత, తనయింట వేల్పు, ఆ కామేశ్వరియే, ఏ దుర్వాసశాపోదక ప్రభావం చేతనో, భూలోకవాసం చేయాల్సి ఉండి, ఈ కుమారిక రూపంలో తమయింట వెలిసిందని, ఒక లోకోత్తరభావం స్ఫురించింది సీతమ్మగారికి. కుమారికను చేతుల్లోకి తీసుకొంది. ఆపెపై భక్తిప్రేమలు ముప్పిరిగొన తదావేశాతిశయంలో, ఒడలు పట్టుతప్పి కుమారిక చేతుల్లోకి ఒరిగింది.

‘పెండ్లిఅలసట కారణంగా అమ్మగారికి శరీరస్వాస్థ్యం చెడింద’ని కుమారిక చెప్పగా, శాంతమ్మ మడతకుర్చీ వాల్చింది. కుమారికాసుభద్రలు విసిరారు. శాంతమ్మ ఉచితోపచారాలు చేస్తుంటే, సీతమ్మగారు కళ్ళు విప్పి, కుమారిక రెండు చేతులను తన నెమరుకంఠమీద పెట్టుకొని, ‘శాంతమ్మ వదినా, ఈ బిడ్డను భగవంతుడు నాకు యిచ్చాడమ్మా. మీఅమ్మాణీయే రెండోది నాకు. దీనిఋణము ఎలాతీర్చుకో గలనో!’ అంది.

“కుమారిక మీకు వరప్రసాదమైతే, ఆపెను మీరు నాకు యిచ్చారు. మాసుభద్ర ఆపెకు చెల్లాయి అయింది, వయసులో మాసుభద్రే పెద్దఅయినా. వదినా, మనకుమారిక రేపు మట్టిఊపుల ఉయ్యాల వేడుక సంకల్పించింది. అది మనం దశోమత్తుగా చెయ్యాలండీ” అంది శాంతమ్మ.

‘ఎట్టి కర్కశభాషిణి నోటివెంట. యెట్టి తరంగిత, వినయ, సౌహార్ద, మార్దవ, మధురమగు మాటలు వినవచ్చె’ అని విస్తుపోయారా ముగ్గురున్నూ.

‘ఇంత ప్రయోజనమాశించి, నేను ఉయ్యాలవేడుకను సంకల్పించకపోయినా, అది ఉభయపక్షాల పెళ్ళివారికి, అపూర్వ హృదయైక్యత, లక్ష్యైక్యత, అన్యోన్యత సాధించిపెట్టింది. సుహృజ్జనహృదయాలానందిస్తే ఇదేదో గోప్రదక్షిణం చేసి, భూప్రదక్షిణఫలితం దక్కించుకొన్నట్టుంద’ని ఆనందించుకొంది కుమారిక. తద్రీతిగా కయ్యాలను చల్లార్చింది కుమారిక

ఉయ్యాల. శాంతమ్మ దురభిమానతిమిరాలకు సూర్యోదయంగా పరిణమించింది, కుమారిక.

---

# 17. రజకవలల మల్లయుద్ధం

అయిదునాళ్ళ పెండ్లిలో నాల్గవరోజు, పంచమాంక నాటకంలో చతుర్థాంకం తీరున కొద్ది నీరసంగా, చప్పగా ఉంటుంది. మూడవనాటి సదస్యతిలకంగం సంతర్పణ, సంభావనలూ, అయిదవనాటి నాకబలి, పప్పుగింతలూ, నాల్గవరోజును ఇరుకున పెట్టేస్తై. నాల్గవనాడు అందుచేత పెండ్లి పస తగ్గినట్టు ఉంటుంది. వధూవరులు అగ్నిహోత్రహోమాలకు కూర్చోవటం తప్పితే శుభకర్మలు మెండుగా ఉండవు. పడుచమ్మలు వెలపల ఉండే రోజులనో, ముసలమ్మలు ఊరగాయ రోజులనో, విద్యార్థులు రిజిస్ట్రు వచ్చే రోజులనో, ఆ నాటికి, ఎవరికి వారే ఏదో విసుగు నభినయిస్తోంటారు. కాని అమ్మాణీ పెండ్లిలో నాల్గవరోజు కూడా ఘటనాప్రాగ్ణమయింది. కుమారిక సంకల్పించిన ఊసల ఉయ్యాల వేడుకకు చేరని పడుచుజంటలందరూ ఆసాయింత్రము, వధూవరులను మించి, ఉయ్యాల ఊగుతో, ప్రకృతి ప్రణయసమన్వయాన్ని సాధిస్తో, ఒక అపూర్వమైన పెండ్లివేడుకకు వరవడి పెట్టారు. నాల్గవనాటిరాత్రి పాండవాజ్ఞాతవాసనాటకం ప్రదర్శిస్తామని బజానా పుచ్చుకున్న మండపాకభాగవతులు రానిలోపాన్ని, ఆడపెళ్ళి వారింటికి వంటఅచ్చుకొని వచ్చిన వృద్ధరసికశిఖామణి, వలలుడు, మగపెళ్ళి వారితో పాలకీమోత అచ్చుకొని వచ్చిన ఒకరజక రసికుడు, దాసీ స్త్రీల సందున వారికి రేగిన ఏదో విటవృత్తి పోటీని గుండెలో పెట్టుకొని, పెండ్లి పందిట్లో కలిబడి కొట్టుకొని, కమ్మేశారు. తానువలచిన దాసీ స్త్రీ అచ్చటే ఉండడంచేత, దాని సమక్షంలో వీరకృత్యమేదోటి చేసి పారేసి ఆమె మెప్పును పొందాలన్న మధ్య యుగాలనాటి శూరత్వం ప్రేరేపించింది కాబోలు, రజకుడు వలలుణ్ని అమాంతంగా మోదేసుకున్నాడు. కోపాటోపదీప్తాంగుడై వలలుడు, 'ఏనుగు చచ్చినా వెయ్యి బ్రతికున్నా వెయ్యి' అన్న

కోపంతో వయఃపరిపాకం మీరినవాడైనా, రజకుని బట్టపట్టి గర్జించి, జబ్బచరిచాడు. అదరిపడ్డారు స్త్రీపురుషులు.

వలలుడు యాభైదాటినతర్వాత జీవితోత్తరభాగంలో వలలాశ్రమం స్వీకరించినవాడు. నాటకకళకు శేషజీవితాన్ని అంకితం చేశాడు. తొలి అవతారంలో నాట్యకళోపాసన చేసిన టూరింగ్ నాటక కంపెనీ నటుడు. నూనూగు మీసాలనాడు యువరాజపాత్రలు ధరించేవాడు. సారంగధరుడేసి, ఎంతమంది చిత్రాంగులకో చిత్తచోరుడయాడు. కపట చంద్రకాంతుడేసి ఎంతమంది రత్నమాలలనో కనుగప్పాడు. స్థౌల్యం హెచ్చిన కొద్దీ, పాత్రలు మార్చుకుంటూ, చివరకు పాండవనాటకాల్లో భీమపాత్ర ధరిస్తూ, నాటకాలకు భరతవాక్యం చదివాడు. గదతిప్పడం మాని, గరిటె తిప్పడం ప్రారంభించాడు తానువేషం దాల్చిన ఆఖరి పాండవాజ్ఞాతంలో, భీమవేషంమీద

'ఏనువంటలవాడనై అనరేంద్రుగొలిచి గరగరగా
గుండుగూర చిత్తమునకు వచ్చిన చందంబునన
రొనర్చి నేర్చి మెలగుదు గరము వినీతి మెరసి'

అని అన్నగారితో చెప్పగా, ధర్మజపాత్ర ధరించిన నటుడు 'నిత్యసత్య వ్రతుడై యుండాలి ఔగాక' అని దీవించాడు. ఆదీవన బలంగా మర్నాడు ఉదయంనుంచి వలలుడైనాడు. నాటకంలోని బూటకపు వంటవృత్తి నిజమై ఊరుకుంది. ఆరాత్రి విరటుకొల్వులో

'పేరువలలుండు, గూపుం జీరయు నిడి సాకతంబు
సేసిన జాలం, గోరిన వంటకములు నా
నేరిమి దగనెటిపి కొలుతు నిశ్చల భక్తిన్'

అనిచదివిన పద్యమే, మర్నాడు వీరవెంకయ్యగారి పెండ్లిపందిట్లో ప్రోజా ఆర్డరులో చదివి పెళ్ళివంటకు అచ్చుకున్నాడు.

'కత్తిగొడ్డలి యనుగనే కట్టియలకు' అని రాత్రి వెయ్యిమంది సభమీద చేసిన వీరాలాపం, ప్రగల్భాలాపం కాదని, ఉదయం వీరవెంకయ్యగారి వంటపందిట్లో,పదిమందీ చూస్తుంటే, సర్వీపేడును కాలుసెట్టి ఫెళుక్కుమనిపించాడు. వలలుడు యాభైదాటినా, విషయోపభోగాభిలషణ వద

లక యాతనపడ్తోన్న యయాతి. దివమంతా గాడిపొయ్యల పంచాగ్నిమధ్య, రేయంతా దాసీజారిణుల మదనాగ్నిమధ్య కమిలి కందగడ్డై ఉన్నాడు. పిండపుష్టి కలవాడవడంచేత వంటిపొగరు తగ్గటం లేదు. వైరాగ్యం అందుకోటం లేదు. పౌష్టికపదార్థాలను కూడా సేవిస్తున్నాడని, శివాజీ లేహ్యం అతడికి అభిమానభోజ్యమని వినికిడి. ఈతడు విరమించిన కారణంగా నాటకకళ శోభతగ్గిందో, ఈతడు వరించిన కారణంగా పాకకళకు రుచిరెచ్చిందో యిదమిద్ధం కాలేము కాని శృంగారరంగంలో మాత్రం ఈతడు నేటికీ యథాప్రకారంగానే సేవ, చేవ చూపెడ్తోన్నాడని చెప్తారు.

భుజబలం ఉండనీ ఉడగనీ. ఇట్టి.దిట్ట, ఒక కుర్ర, అనభ్యస్త రసికుని హుంకారాలకు బెదరడం, తనశృంగార జీవిత భవిష్యత్తుకు గొడ్డలిపెట్టు కాదా? అంచేత, వెనక తాను వేలాదిప్రేక్షకులయెదుట నిలచి స్టేజిమీద మల్లయుద్ధసన్నద్ధుడై భీమపాత్రనిర్వహణలో చూపిన కుస్తీసంప్రదాయాన్ని స్మరణకుతెచ్చుకొని యుద్ధరంగం మన్ను ఫాలప్రదేశాన్ని ధరించి, శిరముపై చల్లుకుని, రజకునితో కలబడ్డాడు. విడిదెకు కబురువెళ్ళి మగపెళ్ళివారు ఆబాలగోపాలం వచ్చిపడ్డారు. ఈలోన రిటైర్డు జమ్నాస్టిక్సు మాస్టారొకరు, ప్రస్తుతం పండిన స్పోర్ట్సుక్రిటిక్, పేరు రవణయ్యగారు. యుద్ధరంగ కైవారం విశాలమయ్యేలా పెళ్ళివారిని సరిదిద్ది నుంచోపెట్టాడు. మరో గాస్ లైటు తెప్పించాడు. చెయ్యా చెయ్యా కలపటంలోనే, కనుమూసి తెరచి నంతలో వలలుడు మునివ్రేళ్ళతో రజకుని లాగేసి పట్టుబంధం ఒకటి చూపెట్టాడు. 'సెబాస్, వలలా!' అన్నారు రవణయ్యగారు. కరతాళ ధ్వనులు వినిపించారు పెళ్ళివారు. చటుకున చాకలిలేచి వలలునితో వళ్ళు తెలియకుండా, కండలు తిరిగి కన్నుగానని ఆబోతులా కలపడ్డాడు. ముసలి మల్లు పట్టుతెలిసిన గట్టివాడే కాని దమ్ముచాలద న్నారు. కుర్రచాకలికి కుమ్ముడమే గాని పట్టు తెలియద న్నారు రవణయ్యగారు. కథ రక్తికట్టడం ప్రారంభించింది. పెళ్ళివారి సమక్షాన, వలలరజకులు, సవ్యాపసవ్య చిత్రిమండలగతుల్లో,

"కదియుచు దాఁగుచు బట్టుచు
నదలుచుచుం బడుచు లేచుచు డుగుచు
వడిగొంచుఁ గవాక్షకిసుకం
గడు బెట్టిదముగ బెనగిరి గాలంబుడిగింపక కడిమిన్"

యుద్ధరంగం రౌద్రభీభత్సకరుణభయానక హేతువు అంటే, అశుభ పరిణామానికి వెలిచి. తనుమాత్రం దూరం గానే నుంచుంటోన్న రవణమ్మ గారి కర్రఘుళించి, ఊరువడించి, కుస్తీని ఆపుచేశారు. 'సుధనాడైనా పడుగులకు సాటి పడికటపోట్లు వేశాడని, విజయమకుని పలలునిపై పడిపోయాడ'ని కొందరు చాకల్ని శ్లాఘిస్తే, 'వయసు మీరినవాడైనా వెనుకంజ వేయకుండా మాచక్కగా గుప్పించి తప్పించుకొని బలేపట్టు చూపెట్టాడని పలలుని ప్రశంసించారు కొందరు.

---

# 18. లీల పెండ్లి చూపులు

నాల్గవనాటి మూడవ సంఘటన లీలావతి ఆగమనము. ముసలమ్మ రవణమ్మగార్కు, బాస చేసిన ప్రకారం, కుమారిక లీలకు లేఖ వ్రాసింది. లీల రాగలదని కుమారిక అంచనా వేసికొనే ఉంది కాబట్టి, ఏవిధంగా గొడవ కాకుండా, చల్లగా, ముసలమ్మ రవణమ్మగార్లను కూడా ఒప్పించి, లీలను చూపి పంపించాలో ఆ ఉపాయం పన్నుకునే ఉంది. క్రమంతప్పిన లీలవివాహం మాటలు వచ్చినా కంపతో డుసు లాగడం వంటిది. నిజవృత్తాంతం ఏకొంచెం పైకిపొక్కినా, రామశాస్త్రుల్లుగారు నానా రాద్ధాంతం చేసి నాలుక పీక్కుంటారు. లీలసీద పడితేచాలు, ఇంటిడిమందికి ప్రాయశ్చిత్తాలు చేయిస్తారు. డాక్టరు లీలల యావత్తు వృత్తాంతము సీతమ్మగార్కి రంగారావుకు మాత్రం చెప్పి ఉంచడం శ్రేయస్కరమని భావించి ఉంది. కరుణాత్మురాలు సీతమ్మగారు లీలను కడుపులో పెట్టుకొని, గుట్టు కాపాడగలరని కుమారిక నమ్మిక. విశాల

హృదయుడూ, సంస్కారణాభిలాషీ రంగారావు లీలవిషయం అర్థం చేసు కొని, తాను సంకల్పించిన సంధానానికి చేయూత నిస్తాడని భావించింది. తాను లీలకు లేఖ వ్రాసేవరకూ జరిగిన యావద్గ్రంథమూ వారుభయులకు చెప్పి. వారిచేత సై అనుపించుకొని సశేష లీలాపరిణయ కార్యకర్తృత్వ మంతా వారిమీద పెట్టింది. డాక్టరు లీలల పరిణయం చేయించడం, తన కర్తవ్యంగా పరిగణించాడు రంగారావు. అంచేత లీల బెదురుచూపులు చూస్తో గడప ఎక్కుతోంటే, ఆ వేళకు కుమారిక యింట్లో లేకపోయినా, సీతమ్మగారు తప్పిపోయినబిడ్డ దొరికితేనో, బర్తృ పరిత్యక్త అయినకూతురు పుట్టింటికొస్తేనో. చేతులోకి తీసుకునే తల్లి ఆప్యాయతతో లీలను ఆద రించి లోనికి గొంపోయింది.

ఒక్కగంటలో రంగారావు డాక్టరుకుటుంబంవారికి కబురుచేశాడు. ఉదయమే వస్తున్నామని వారు సమాధానం పంపారు. రంగారావు సీతమ్మగార్లు అనుక్షణోత్కంఠులై ప్రతీక్షిస్తోంటే: అమ్మాణీపెండ్లి అయి దవనా డుదయం ముసలమ్మ రవణమ్మగార్లు గుమ్మంలో దిగారు. సీతమ్మ గారు వారికి ప్రత్యుత్థానంచేసి బంధుమర్యాదల నొసగి సమాదరించింది. ‘దంతంబొమ్మ లాంటి పిల్ల, చక్కని చుక్క’ అని సీతమ్మగారు వారికి పరిచయం చేస్తోంటే తల్లిలేని లోపం తీరినట్టు, లీల పులకిత అయింది. సీతమ్మగారి వాత్సల్యానికి కుమారిక ఆనందాశ్రులు రాల్చింది. తల్లిగారి క్షమాగుణవిశేషానికి రంగారావు విస్తుపోయాడు. సరళత, స్వచ్ఛత, మూర్తీభవించిన సీతమ్మగారి మాతృహస్తస్పర్శ లీలకో కొత్తశోభను చేకూర్చిందేమో, ముసలమ్మ రవణమ్మగార్లకు లీల సర్వవిధాలా నచ్చింది., బండి బోల్తా ఉదంతమంతా సవిస్తరంగా చెప్పి తనకు కుమారిక ప్రాణ దానం చేసిందని ముసలమ్మగారు, రైలుస్టేషను వృత్తాంతం చెప్పి బ్రాహ్మణ ప్రాణరక్షణ చేసిందని సీతమ్మగారు, కుమారిక త్యాగసేవలను కీర్తించి మాకు కోడల్ని తెచ్చిందని అవిడ మాకు అల్లుణ్ని తెచ్చిందని ఈవిడ ముక్తాయింపులు కొట్టారు. ఆ ప్రశంసా వాక్యాలను వింటో విస్తు పడయాడు రంగారావు.

తన ప్రశంస ప్రారంభమైనపుడే దాటేసింది కుమారిక. నే వెళ్ళి

డాక్టరుగారిని తీసుకొస్తాను ఒక్కగంటలోనని రంగారావు బయల్దేర పూనితే. 'అమ్మగారూ, మీ అల్లుడికి చిరపరిచితుడాయన అని విన్నా. డాక్టరుగార్ని ఆహ్వానించడంవారికి నప్పచెప్పడం బాగుంటుందేమో ఆలోచించండంది.' కుమారిక వచ్చి.

"కుమారిక చెప్పినమాటే బాగుందిరా" అంది సీతమ్మగారు.

కుమారిక ఏదో సవరింపులకు లోపలికి వెళ్తోంటే, వెళ్ళే కుమారికను ఉపలక్షించి, సీతమ్మగారితో "నీవంటి ఉత్తమురాలికి కావద్గ కోడలమ్మా. వైదుష్యం, చక్కదనం, గొప్పసంస్కారం యిన్నీఉన్న కన్యమ్మ కుమారిక" అంది [illegible]మ్మగారు, [illegible].

"ఏమో అంతఅదృష్టానికి నేను పెట్టిపుట్టాలిగద" అంది పెద్దయిల్లాలు సీతమ్మగారు.

చకితుడైన రంగారావు, భవిష్యద్గార్హస్థ్యజీవితానికి మనసులో బాటలు వేసుకుంటున్నాడు.

అగ్రహారం ఆచారప్రకారం వధూవరులామధ్యాహ్నం రంగదర్శనం చేసుకురావాలి కాబట్టి, తద్విషయం రంగారావు బాజాబజంత్రీలతో ప్రస్తావించుటకు వెళ్ళాడు ముసలమ్మరవణమ్మగార్లు లోపలి గదిలో విశ్రాంతి తీసుకుంటున్నారు. వాకట్లో ఉన్నది కుమారిక, సీతమ్మగారు మాత్రమే. సుభద్ర భావోద్రిక్త, ఆమెకు వివాహేచ్ఛమిక్కుటం. అనుకున్నామేమో, కేవలం భావకవి వ్రాసినట్టు, "కాలానికి కళ్లెం వేసీ—ప్రేమానికి గొళ్ళెం తీసీ" ప్రణయపూరిత హృదయంతో, వికసిత వదనంతో చెంగుచెంగున కుమారికతో ఏదో మాట్లాడవచ్చింది. కుమారికను పక్కకుపిల్చి తొందరతొందరగా ఆమెచెవిలో ఎదో చెప్పి ఆకాశం లోనిపిట్టలా ఎగిరిపోయింది. కుమారిక నవ్వుకుంటూ సీతమ్మగార్ని సమీపించింది.

"ఏమిటే సుభద్ర హడావుడి?" అని సీతమ్మగారు అడిగింది.

రంగారావుమిత్రునికి సుభద్రకు కల్గిన పరస్పరానురాగాన్ని గురించి చెప్పి, "ఈనాడే వివాహనిశ్చయం కావాలని యువకుని అభీష్టమట. మీతోను, శాంతమ్మగారితోను నన్ను చెప్పమని కోరింది" అంది కుమారిక.

"ఆశ్మీ, ఎప్పుడు పెరిగిందే వాళ్ళకింత గాథ! సుభద్ర కాదనటం లేదు కాబట్టి. శాంతమ్మగారి మాటతీసుకొని శుభం శెంబ శుభం చేయించవే. శుభదేవతవే నువ్వు!' అంది సీతమ్మగారు.

"ఎవరే అమ్మా, శుభదేవత?" అంటో రంగారావు కలిశాడు.

"మన కుమారికరా అబ్బాయి. అమ్మాణీపెళ్ళి చేయించింది కుమారికేరా" అని ఆవిడ చెప్తోంటే కుమారిక వెళ్ళిపోబోయింది. "నీ మాట తలపెట్టాటప్పటికి దూరంగా పోతోంటావేమే కుమారీ!" అని కుమారికను చెయ్యిపట్టుకుని ఆపుచేసింది సీతమ్మగారు.

"నువ్వూ మీనాన్నా పూచిపుడకంత పని చేయలేదు. దాని త్యాగశక్తిని అభినందించడానికే చతుర్వేది అగ్రహారం వచ్చింది. చక్కగా అమ్మాణీని అతడికి ముడిపెట్టేసింది. సంధానం, పెండ్లిపనులు. పందిరివేత, పెళ్ళివారికి మర్యాదలు యావత్తూ అది ఒక్కర్తే చేసుకొచ్చింది. డాక్టరుగారిక్కా, లీలకు అది చేసిన వివాహప్రయత్నం నువ్వు చూస్తోన్నదేగా! ఇప్పుడు నీ స్నేహితుడికి సుభద్రను పెండ్లిచెయ్యించటాని సిద్ధంగా ఉంది" అంది సీతమ్మగారు.

"అరిపిడుగా! వాడు పెండ్లిమాటల కొచ్చాడా? నామీద అపేక్షనే వచ్చాడనుకున్నా సుమా. అయితే నా స్నేహితుడికి తన స్నేహితురాలిని చెయ్యాలనుకొంది అన్నమాట!" అని రంగారావు అంటోంటగా కుమారిక కదలి వెళ్ళింది.

కుమారిక అవివాహిత అని క్రితంరాత్రే తెలుసుకున్నాడు.

"అమ్మా, యిందరి పెళ్ళిళ్ళు చేయిస్తోంది. తన పెళ్ళిమాట తలపెట్టదేమే?" అన్నాడు.

"అది రంగడి యిష్టంరా" అంది సీతమ్మగారు.

రంగారావు నవ్వి, "ఏరంగడి ఇష్టమో?" అన్నాడు.

"గుళ్ళో రంగడురా!" అని యిట్టేచెప్పి అంతలో "ఏమిమాటలు నేర్చారురా ఇప్పటి కుర్రాళ్ళు" అని నవ్వు ఆపుకోలేకపోయింది సీతమ్మగారు.

---

# 19. రామశాస్త్రుర్లుగారి అడ్డవాట్లు

మా బావ రామశాస్త్రుర్లుతో ఏపని అయినా 'వళ్ళో పెడుదునా దళ్ళో పెడుదునా' అని. తోచడం భయం. కాళ్ళు విరగ తొక్కేస్తాడు. ఎవరి కాళ్ళు తొక్కితే ఎవరు ఊరుకుంటారు గనుక. అందుకు అమేషా భార్య సీతమ్మను వెతుకుతాడు. పెండ్లి అఖరురోజు మధ్యాహ్నం "ఏమే! ఎక్కడున్నావే?" అని కేకమీద కేక. ఆవిడ ఏం మునిగిందో అని వాకిట్లోకి వచ్చిపడింది. విషయం చెప్పడు. రహస్యం చెప్పడం అందం కాబోలు. మా సీతమ్మ చెయ్యి దొరకబుచ్చుకొని, ఏదో సణుక్కుంటూ, తలుపు గెంటుకొని అక్కడ గదిలోకి విసురున వెళ్ళబోతే, పెండ్లికొచ్చి నావిడే. ఎవరో, అంతకన్న విసురుగా ఓ చేత్తో తలుపు నొక్కిపట్టి, 'తల్పుమీద రవికె కన్పించడంలే. మంచి చెడ్డ ఎఱుగుండాలి, ఎవరో కాని!' అని కైమంది. ఇప్పుడే సింగారాలన్నీ! తొందరపనులన్నీ ఇప్పుడే వస్తై అందరికీ—తనకు పనిగలిగితే అంతా వాళ్ళవాళ్ళ పనులు మానుకొని తనకు దారి యిస్తారేమో—షైరింజినుకు రోడ్డుమీది కార్లన్నీ దారిచ్చినట్టు—గొణుక్కుంటూ మరో గదిలో కాలేశాడు. అక్కడ లోపల నుంచి బరుకు బరుకు శబ్దం. దేన్నో చెక్కుతోన్నట్టు చెవినిపడింది. అంతలో సఖం ముక్కు, కంఠంముడి దగ్గరనుంచి కళ్ళకంటా యిరు సార్శ్వాలా, నుదురు మినహా అంగుళం దళంగా సబ్బునురుగు పట్టించి ఉన్న గండు ముఖం ఒకటి, చేతిలో కత్తిని ఝళిపిస్తూ, 'ఎవరువారు?' అంటూ బుస్సుమంది. దేనికైనా వేళాపాళా ఉండాలి పెళ్ళికొంప కూడాను అని వినిపించీ వినిపించకుండా సణుక్కుంటూ కాలు వెనక్కి లాగేశాడు.

వరాండా మూలగది దగ్గర కెళ్ళేటప్పడికి, అక్కడ, ఈతాకుల చాప, యిత్తడి చెంబు చేత్తోపట్టుకొని నుంచుంది ఒక అమ్మాయి. పొరుగూరు వాళ్ళుకూడా పనిగట్టుకొని ఈడూళ్ళోనే అన్నట్టు, ఆ అమ్మాయివంక

కరకరా చూచి, నిప్పుమీద అడుగేసినట్టు దూరంగా ఉరికి, చివరక గాది దగ్గరకు లాక్కుపోయాడు భార్యను.

అక్కడ మంచాలు నిలువు అడ్డం పద్మవ్యూహంలా, కాలెట్టడాని వీల్లేకుండా పడేసిఉన్నై. కాస్త జాగాకన్పిస్తే అక్కడ అడుగేశాడు ఆనాటి పనసకాయ చెక్కులు, పనితొండర్లు అన్నపు సారబోశారు ఎఱుగడు. రామశాస్త్రుల్లకు అరికాలి మంట తలకెక్కింది. తనయింట్లో తనకు అరంగుళానికి అధికారం లేకుండాపోతున్నానని, వొళ్ళు మండు తోంది. అలా ఖాళీలేకుండా, ఇంటినిండా పెండ్లివారుండడమే పెండ్లి నిండైనా, మరోఅపుడు ఆలోచిస్తే.

"మాట చెప్పరు. ఇల్లంతా తిప్పారు. ఆయాస మొచ్చింది. అంత ఉప ద్రవం ఏమి వచ్చిపడిందండీ, అనుకోందీను?" అంది ఆవిడ.

"అయ్యో! అయ్యో! ఇంకా ఏం ఉపద్రవంరావాలే? మనకొంప నెత్తిట్లో కట్టేసిందే, నీకుమారి! ఇదెక్కడ దాపరించిందే పుత్తనలా మన ప్రాణానికి? నోళ్ళల్లో పడిపోయాం. నూదిమాదిరిగా వచ్చి దబ్బనమై చురకత్తిగా మారిందే. పాపం మునసబుగారు మనపందిర వేసివెళ్ళినమర్నాడే మంచం పట్టాట్ట. పరాకుమాటలట. ఎంతసేపూ కుమారిక మాటేనట పత్యానికొచ్చాడనుకొని వైద్యుడు, 'నీ అభిలాష ఏమిటి?' అని అడిగాట్ట, పొట్లకాయే అంటాడో బీరకాయే అంటాడో, ఏదైతేం అని కాయ అనలేదు, కూర అనలేదు, కారప్పొడేనా అనలేదు. 'కంఠా భరణం అన్నాట్ట', వైద్యుని కళ్ళల్లోకళ్ళెట్టి చూస్తో. వైద్యుడు తృళ్ళిపడి, వీధిగుమ్మంకేసి చూచుకుంటో, వెనక్కాళ్ళమీద తగ్గుతో కుర్చీని చేతులతో పట్టుకుని నుంచున్నాట్ట, దాని అడ్డం ఎందుకైనా మంచిదని. కుమారికకు పెట్టితీరుతానంటో దిగ్గున లేచి, మంచంమీద ఓకాలువేసి, వడుకుడుగ్గా నుంచున్నాట్ట మునసబు. పరుగుచ్చుకొన్నాడు వైద్యుడు. పైవాళ్ళు ఆయనగారి పరాకుమాటలు వినడం ఆయనకు పరువు భంగమని, ఆడవాళ్ళు ఎవర్నీ ఆయన మంచందగ్గిరకు రానీయటం లేదు పందిరి వేసిపెట్టాడని, ఆయన్ని ఆహ్వానించుకొద్దామని వెడితే నన్ను వీధిలోనుంచే సాగనంపారు. వాడికడుపు చల్లగా వాళ్ళ పెద్దపాలేరు

చెప్పాడు నాకీరహస్యం. మునసబును మనం పందిరి వెయ్యమంటిమా పెట్టిమా! 'ఆ బొమ్మడికి పందిరేసొచ్చాడు. మళ్ళా కన్ను విప్పలేదు ' అని వారి ఆడవాళ్ళు ఒకటే గోలట. ఈమాట ఊరుమీద పాక్కడానికి ఎంతసేపు కావాలే? 'రామశాస్త్రుల్ల ఇంట్లోపెళ్ళి మునసబు ప్రాణం పుచ్చుకొంది' అంటారే నల్గురూనూ, దైవానుగ్రహం చాలక ఆయన అష్టా, ఇష్టా అయితేను. ఒకొక్కళ్ళు చూస్తే అరిష్టాలొస్తై దృష్టిదోషం అంటాం. కుమారికను గట్టిగా చూచిన వాళ్ళకు అరిష్టాలొస్తై. ఎవరొస్తే ఏందోషమనాలో? అయ్యబాబో! ఇదేవో శక్తిస్వరూపిణి. త్రాచు పామును పవర కింద పెట్టుకొని కూర్చున్నాము" అన్నాడు.

అనింవా వాక్యాలకు నిర్ఘాంతపోయి "ఈరకం అపనాకు నేను పుట్టాక వినలేదు. కుమారికది చిన్న మొత్తు దోష మేమైనా ఉంటే అనుకోవాలిగాని, ఎవరో ఎక్కడో జ్వరపడితేను, కలకంటేనూ, అదీ ఓ నేరమే దానిమీద' కళలల్లేవాళ్ళకు కలలుకనే వాళ్ళకు కరువుంటుందా ఒహప్పుడు! మునసబుగారికి ఎంతదెబ్బ తగిలుండొచ్చు" అంది మానీతమ్మ.

"గట్టున నుంచుని వందఎకరాలు వ్యవసాయం చేయించేవాడికి ఎంత దెబ్బ ఏమిటే? నీయిల్లు ఏవో కాను! ఇది కుమారిక కొట్టిన గుండె దెబ్బేనే."

"మునసబుగారు దీన్నిచూచి పిచ్చివి పడ్డాడే అనండి అంతవయస్సు వచ్చినవాడు ఆ మన్ని అనాలా, ముప్పైరాలు ఉదాత్తచిత్త దీన్ని అంటారా? నా మతోన్నట్టుంది మీకు. ఏళ్ళువచ్చినకొద్దీ ఇల్లాంటి నిష్కళంక చరిత్రను, శక్తి అనీ భూతమనీ ఆడిపొయ్యడానికి ఏలా ప్రాణంవప్పింతంకే?"

"ఇదేం మన యిలవేల్పు, కామేశ్వరి. మన్ని ఉద్ధరించడానికి మన యింట్లో వెలిసింది అన్నావుగా మొన్నరాత్రి. అప్పుడు శక్తిస్వరూపం కాకపోయిందా నేనంటే అయిందా? ఎందుకొచ్చిన మాట. నువ్వు భూషించావని నేనన్నా, నేను దూషించానని నువ్వన్నా అది సామాన్యవ్యక్తి కాదు. శక్తి ... యిద్దరం వప్పుగుంటోనే ఉన్నాము. మనం సామాన్య కుటుంబీకులం. ... తెడు సంసారం మనది. ఎక్కడున్నామో ఏలా

బ్రతుకుతున్నామో. గుట్టుగా కాలక్షేపం చేసుకొస్తున్నాము. చల్లగా రోజులు వెడ్తోన్నై. మనకు ప్రఖ్యాతీవద్దు; అపఖ్యాతీ వద్దు. హోరూ కోరం, అల్లరీకోరం. ఈరకం మనిషి ఉన్నచోట ప్రశాంతజీవితం దుర్లభం. అక్షరాలా అదేమాట అన్నాడు అవధాన్లు, అది, ఆరాత్రి పురాణం చదువుతోంటే. ఆమునసబుగారు బహుయోగ్యుడు కాబట్టి, దీనికోసం బెంగపెట్టుకొని, రెండోకంటివాడికి తెలియకుండా ఆయనబాధ ఏదో ఆయనే పడ్తున్నాడు. నిగ్రహం కలవాణ్ణి కాబట్టి నేను కొట్టుకుపోతున్నా. అంతా సరసులే ఉంటారా? నిన్నరాత్రి చూచాంగా, వాళ్ళకుంపటెగ-చాకలాడూ, వంటబ్రాహ్మడూ—నువ్వేనా ఉండాలి నేనేనా ఉండాలి అని ప్రాణాలకు తెగించి మన పందిట్లో కలబడి కొట్టుకున్నారు. వాళ్లలో ఎవడు హరీ అన్నా పోలీసాళ్ళు మన్ని కట్టుకుపోదురు. ఊరంతా ఒక్క-మాటమీద ఉందట అవధాన్లు చెప్పాడు. వాళ్ళిద్దరూ ఒక ఈడొచ్చిన పిల్లకోసం ఏక ఫలాపేక్షులై బుర్రలు బద్దలు కొట్టుకున్నారని, అదో పిల్లపితూరీ అక్షరాలా అనీన్ని. 'ఆపిల్ల ఈకుమారికేమో నని ఆలోచించావా రామశాస్త్రుల్లూ!' అన్నాడే అవధాన్లు. వాడిదూరదృష్టి ఎవరికీ రాదే. వాళ్ళు కొట్టుకున్నది దీనికోసమే నని నాకు ఘట్టిగా తోస్తోందే. ఏదో స్వర్ణసుందరో, స్వయంప్రకాశో, స్వయంసిద్ధో, దీని పేరూ కులం కూడా తెలీకుండా రామశాస్త్రుల్లు ఊళ్ళోకి దింపి యింట్లో పెట్టుకుకూర్చున్నాడని చెప్పుకుంటారే. 'రాండా రామశాస్త్రుల్లు కొట్టుకొచ్చిన పిల్లను చూచివద్దాం' అని ఏపోగరపోతులు, ఎప్పుడు యింటిమీద దాడిచేస్తారో అని హడలిపోతో కూర్చోడమా ఈకాడిమంచి? ఏమి ఆఘాయిత్యాలకు గురి అవుతామో గుండెల్లో రాయడ్డోళ్ళు కొట్టినా యిది యింటింట మెసులుతోందంటే."

"ఇదేమిటంటీ! అగ్నిహోత్రం అంటి పిల్లమీద ఇంతకవన మల్లావు?" అంది మాసీతమ్మ తెల్లబోతో.

"నువ్వన్నట్టు అది అగ్నిహోత్రమే కావచ్చునే. అంచేతనే ఆ అగ్నిహోత్రంలో ఎన్నికలభాలు మాడిచస్తాయో, అంటున్నానే. అది పవిత్రరాలే కావచ్చునే, అంచేతనే ఎంతమందికీచకులు, ఉపకీచకులు హతమారాల్సి

ఉందో ఈవిడగారి కారణంగా అంటున్నానే. ఆజీవహింస కంతకీ ఉత్త రోత్తరా మనం బాధ్యులమవుతాం" అన్నాడు

"అదేమిటండీ. మధ్యన మనమెందుకు బాధ్యులం కావాలి? ఎవళ్ళు చేసుకున్న పాపం వాళ్ళే అనుభవిస్తే. ఏకర్రను నిప్పంటే అదే కాల్తుంది. దీపప్పురుగులు పడిచస్తాయని దీపం పెట్టుకోవడం మానేస్తామా? ద్రోహ బుద్ధితో దాన్ని దర్శించిన వాళ్ళు ఫలం అనుభవిస్తే మనకేం జవాబ్దారీ?" అంది ఆవిడ.

"ద్రోహబుద్ధితో దర్శించక్కరలేదు. కొందరి సుందరుల ఉచ్చుల్లో చిక్కుకోటానికి. 'వాళ్ళ కంటబడితేనే గుహ్యవ్యాధిబాధితు లవుతారు పురుషులు' అన్నాడే అవధాన్లు. కత్తిరిబోనులాంటి ఆడవాళ్ళు ఉంటారని దుర్దశ కాల పాశమో, అనురాగబంధమో, పేరేదైతేం. తాళ్ళోని ఈడ్చుకొచ్చినట్టు పురుషులు ఆబోనులోపడి గుటకాయస్వాహా అయిపోతారన్నాడే'"

"మాటమాటకీ నూతిలో ఘారంలా అవధాన్లన్నా డంటావు. అయితే రాత్రింపవళ్ళు మీ ఇద్దరూ యిటువంటి తుచ్ఛంమాటలు చెప్పుకోకపోతే ఏళ్ళుగడిచై. రామా, కృష్ణా అనుకోలేరు ఈ నాటికి? వాడేం అంటేం. అదట్టుకొచ్చి ఏళ్లుగడచిన దానికి నాకు చెప్పడానికి మీకు నోరేలా వచ్చింద'ని తీక్షణంగా అడిగింది.

"అతను చెప్పనక్కరలేదు నేనేచదివా ఈజాతినిగురించి. కాఅవవిలో, భూగర్భంలో. ఏడంతస్తులమేడలో ఉంటుందిట ఆరకం సౌందర్యవతి. ఇద్దరు పురుషులు దాన్ని దర్శించారా, అన్నదమ్ములే కాని, దానికోసం కొట్టుకుచచ్చిపోతారు. సరదాగా చూస్తుండట ఒక్కడే వెళ్ళాడా దాని స్పర్శామాత్రంగా ప్రాణాలు విడుస్తాట్ట విషబాలట అది. దాని ఉచ్ఛ్వాస నిశ్వాసాలే, దానిపరిసరమే దారుణమృత్యు స్వరూపమవుతుం దట" అన్నాడు.

"ఇదేదో కాశీమజిలీకథ వెనకోసారి ఎవరికో వాకట్లో చెప్పారు" అంది.

"అవును. కాశీమజిలీ పుస్తకం కాదా?" అన్నాడు.

"గొప్పపురాణమే. ఇందుకేనా నన్ను పనిచెడిపి యిక్కడకు లాక్కొచ్చింది మీరు" అని వెళ్ళబోయింది మాసీతమ్మ.

"అసలుమాట నీకు చెప్పనేలేదు. ఆరకం ఘాతకి వచ్చిన శ్లేవచ్చి మన యింట ప్రవేశించింది. దీని కళ్ళకొలికలు గేలాలే. చూచాం గా అబ్బాయి వచ్చిన మరుక్షణంలో ఏలా గేలం వేసి, బుట్టలో వేసుకు కూర్చుందో వాణ్ణి. వంటబ్రాహ్మణ్ణి తన్నించింది. శాంతమ్మకు మంత్రం పెట్టి సాధును చేసింది. జగజ్జంత్రి కానటే. నిన్న సాయంత్రం దానితో అబ్బాయికి జోస్తీ ఎక్కువవుతోంటే వాణ్ణి కేకలేశా, రుసరుసలాడావు నువ్వు అభం శుభం తెలియకుండా. నేనేదో గసాభాసగాణ్ణి అన్నట్టు విసుక్కుంటో వచ్చాడువాడు. మన బిడ్డమీద మనకు పట్టుతప్పుతోం దనుకుంటానే. వాళ్ళిద్దరూ ఏదోప్రత్యేక కార్యం సంకల్పించినట్టు వాకటిగుమ్మంలో మాట్లాడుతున్నారు. 'ఆ గొడవేమిటి' ని కుమారిక నడిగా. 'ఏమీ లేదు నాన్నా, ఆఖరు రాట బీదలకు అన్నదానం చెయ్యాలని పెట్టుకున్నాం. కుమారికతో ఆలోచిస్తున్నాను' అన్నాడు అబ్బాయి: అక్కడకు కుమారికతో ఆలోచిస్తే, నీ ప్రేక్ష్యం. నా పేక్ష్యం ఆ మొగాడికక్కడ లేనట్టు. ఎంతలో ఎంతవిషం అబ్బాయి కెక్కించిందో చూచావా. వాళ్ళు ఎగిరిపాటే గాని, బ్రాహ్మణింట బీదలు కన్నదానం ఏలా చేయనిస్తామే! ఇదేం శ్రీరామనవమి పందిరటే? ఊరికాడినుంచి అడ్డమైనవాళ్ళ అంట మెతుకులూ తొక్కుకుంటో స్నానాలు చెయ్యలేం. ఇంతకాలాన్నుంచీ చేసుకొచ్చిన బ్రాహ్మణకర్మలన్నీ కుక్కముట్టుకుపోతై. ఆపైన, వాడు గుమ్మంలో కాచుకొని కూర్చుంటాడు ఈబోషానికి జబ్బట్టుకు పడ గెంటుతాడు. నావల్ల కాదు నరకవాసం. 'అన్నదానం పెట్టుకున్నాం!' ఏమిస్వాతిశయం దాన్ని చూచుకొని, ఆపెట్టుకోవడమేమిటో నేనూ చూస్తా. రామశాస్త్రి శ్లేమీ చేత కానివాడు కాదు. చెప్పవద్దూ, ఉన్న కొద్దీ దీనికి అబ్బాయితో వ్యవహారం ముదురుతోంది. అబ్బాయి దీన్ని చడీచప్పుడూ కాకుండా ఉద్యోగప్రాను తీసుకెళ్ళాడంటే, రామశాస్త్రులిక బ్రాహ్మణ్యంలో తలెత్తుకు తిరగలేడు. ఇక్కడే ఉంటుందా, దీని ఉనికి ముందుముందు ఏంప్రమాదిస్తుందో మనకి. తర్వాత రొష్టు ఎందు కొచ్చింది దీంతో. రేపు ఆపెళ్ళివారు మన పెళ్ళివారు బస్సు ఎక్కినపుడు దీనిక్కూడా ఒకచీరకట్టబెట్టి, 'నీదారి నీవు చూచుకో అమ్మా!' అని

మెల్లగా సాగనంపేయి. తెరిపినపడి మన బ్రతుకు మనం బ్రతుకుతాం. నాతరం మట్టుకైనా కొంపలో బ్రాహ్మణ్యం నిలవాలని ఏడుస్తున్నా. తర్వాత ఏది ఏలాపోతే నాకేం కావాలి?"

సీతమ్మకు దుఃఖం పొర్లి పొర్లి వచ్చింది. "మీకు నేను బ్రతికి ఉండాలని లేకపోతే ఎప్పుడో అక్కర్లేదు ఇప్పుడు చెప్తా" నంది సీతమ్మ.

"నీకు నేను బ్రతికుండాలని లేకపోతే రేప్రా చెప్పకు" అన్నాడు మాబావ.

అంతలో అనుకొన్న ప్రకారం వధూవరులను స్వామిదర్శనార్థం ఆలయానికి తీసుకువెళ్ళేతరుణం సమీపించిందని చెప్పాలని నేనూ మాబావ పింతండ్రికొడుకు కోనసీమశాస్త్రిగారు మాబావను వెతుక్కుంటూ గాది దగ్గరకొచ్చాం.

"అదేమమ్మా అమ్మాయీ! కంటతడి పెడ్తోన్నావు. బావ ఏమిటి అంతనిక్కచ్చిగా చెప్తోన్నాడు నీకు" అని అడిగా.

"ఏమిటోయి అన్నయ్యా! వదినను ఏమన్నావు! ఆవిడ కంట తడి పెట్టడం అమాంగళ్యం కాదటయ్యా" అన్నాడు కోనసీమశాస్త్రిగారు.

శాస్త్రిగారు వయసుకు చిన్నైనా, మాబావకు ఆయనంటే గురుభక్తి. బహుగ్రంథపఠనం చేసిన పండితాఖండుడాయన. అంచేత మాబంధుకోటి కంతకూ పూజ్యుడే ఆయన. మాబావభక్తి కారణం వేరు. శాస్త్రిగారి గ్రంథపఠనకు కాదు నైష్ఠికుడని. ఓదఫా వినాయకచవితి. ఒకప్పుడు పుష్కరాలు. ఎప్పుడు జరపవలసిందీ సిద్ధాంతులు వాదగ్రస్తం చేస్తే, యెకాయెకీ కోనసీమ వెళ్ళి మాబావ శాస్త్రిగారితో సంప్రదించి దారంట అడిగిన వాళ్ళకు అడగని వాళ్ళకు చెప్పుకుంటూ వచ్చాకా, దానిలో వినాయకచవితి అయిపోతేం గనక.

మాబావ శాస్త్రిగారిమాటకు ఇంకానోరు మెదపకుండగనే. మాసీతమ్మ దుఃఖాశ్రులు రాలుస్తో, "చూచావా అన్నయ్యా, మీబావ వరస. కుమారికను యింటోనుంచి తరిమేయాలట. నన్ను కోత బత్తున్నారు. మీబావకెంతసేపూ నీమేనల్లుడు కుమారికను పెండ్లి చేసుకుంటా నంటాడేమోనన్న దిగులు. ఇంతకు అది అనలేదు. వాడు అనలేదు. కుమారికి

చేసిన పొరపాటల్లా అబ్బాయి తన ఉద్యోగంలో తాను చేయగల ప్రజాసేవను గురించి ఉత్సాహంగా చెప్తోంటే — ప్రజాసేవఅంటే అబ్బాయి కెంత ఆనందమో నీకు తెల్సుగా — రెప్పవాల్చక వింది.”

“అవును, సంఘహితమే తనశ్రేయమని, సంఘానందమే స్వీయహర్షమని భావించే విశాలహృదయుడు రంగడు. ఏవేళా అహాటే అనుకొంటోంటాము ఇంటిదగ్గర” అన్నాడు కోనసీమశాస్త్రిగారు.

“ఇదెక్కడి వెర్రిపిల్లో. స్వసుఖం యెఱుగదు. ఒరులకు సేవచేయడమే దీనికి పండగ” అని ఆమె అగ్రహారంవస్తో చేసిన సేవాకార్యాలను చెప్పింది మాసీతమ్మ. తిరిగా అందుకొని, “నా ఉద్యోగంలో ప్రజాహితకార్యాలెన్ని చెయ్యవచ్చునో చెప్తోంటే అంత శ్రద్ధగా విన్న ఈఅమ్మాయి ‘ఎవరమ్మాయే? పెళ్ళి అయిందా?’’ అని అడిగాడు అబ్బాయి నన్ను. అంతే. మీఅన్నగారికి చిరాకులు పరాకులు బయల్దేరినై. ‘వాడాలా ఎందుకడగాలి, ఆపిల్లవిషయం?’ అని నాభగాం పడ్తోన్నారు యీాయన. నేను, అబ్బాయి, కుమారిక-కూడబలుక్కుని తన్ని ఏడిపించడానికి, అప్పుడో మాట, అప్పుడో మాట రాల్చినట్టే రాల్చి. చివరకు ‘ఎప్పుడో నిశ్చయం చేసేశాం వివాహం. తన్నుకు చావు’ అంటామట. ఈ అనుమానానికి ఏమైనా ఆధారముందా? అన్నయ్యా?’’ అంది నాతో.

“ఆయనగారే తుమ్ముకోవడం ఆయనగారే చిరంజీవి అనుకోడం. అనవసరంగా ఆయిన అవిధిపడ్డం చూడలేకుండా ఉన్నాన్రా. నిన్నను అబ్బాయి నేను ఏదో మాటమీద నాకట్లో నవ్వుకొంటోంటే, మీబావ చూచి ‘ఏమిటాపకపకలు’ అని చర్రుమన్నారు. అబ్బాయికేం తెల్సు, యీాయనగారితిక్క. మీబావ వంటతతంగలో ఏదోసర్దుబాట్లు కుదరక చీదరబడ్తున్నా రనుకొని. ‘ఎందుకయ్యా నాన్నా అలా అయాసపడ్తావు? ఎవరికేం అందీయాలో చూస్తోన్నది కుమారిక ఉందిగా!’ అన్నాడు. ‘మ్రరే. ఉంది. దొరికిందే ఏలాగైతేం’ అని చెయ్యి అటు యిటు ఊపుతో అప్పుడు కాల్చేసేటట్టు ‘నావంకచూస్తో విసువిస చక్కాపోయారు. శాపబలాలున్న పూర్వపురోజులే అయితే ఆయినచూపుకు నేను రాయోరప్పో కావాల్సినమాట. ఏంనేరంచేశానని అంతకఠినంగా

చూడాలి నన్ను! చిన్నదాన్నా, చితకదాన్నా! అవజన్మ నికృష్టపు జన్మరా అన్నయ్యా! మీక్షేమం చూచి, మాడక, ఏమరహంకారితో అడ పిల్లని అంటకట్టారు. మరోటొచ్చిపడింది యివాళ. అబ్బాయి బీదల కన్నదానం చెయ్యాలని ఉబలాట పడ్తోన్నాడు. నేను కాదనగలనా అన్నయ్యా మరి కుమారిక మాట? ఒట్టపుడే బిచ్చగాళ్ళ ఆకలిడొక్కలు చూచి బెంగపెట్టుకుంటుంది. 'కడుపునిండా భోంచేస్తోన్నట్టు కనుపించ వేమే తల్లీ?' అని అడిగా అమధ్య. 'ఇదేమిటమ్మగారూ! ముప్పొ ద్దులా భోంచేస్తున్నా. నాకేం లోపం. రాయులసీమ కాటకంలో నిత్య భోదానందసామినారి రామకృష్ణమఠంతో క్షామపీడితుల రక్షణ కెళ్ళి నపుడు, పిడికెడు మెతుకులు, పుడిసెడు గంజికరవైన అన్నార్తుల ఎము కలపోగులు, క్షీణప్రాణాలు ఈకళ్ళతో చూచా. ఇప్పటికి ముద్ద నోట పెట్టుకుంటే వాళ్ళు జ్ఞాపకమొస్తారు. కళ్ళనీళ్ళతిరుగుతై. నే నేదో ఒక్క పిడచ తక్కువతిన్నానని బాధపడ్తోన్నవారు, వాళ్ళనే చూస్తే ఎంతి బెంగ టిల్లుతారోకదా' అంది. ఇంతగా బీదలకోసం ఆరాటపడే కుమారిక, ఆబీదల కడుపున పెళ్ళిసమయంలో మనయింట్లో ఒకపిడచ పడుతుందంటే పొంగిపోయింది. దీని ఆనందం, ఆ ఆనందహేతువైన దీని దీనజన వాత్సల్యం చూస్తే అబ్బాయి కంటివెంట ఆనందబాష్పాలు వర్షించినై. ఈ సత్కార్యసాధనకు వాళ్ళిద్దరూ సహజంగా అన్యోన్యాశయులు కారా? పెండ్లికాముత్తపడి అబ్బాయితో ఈపనిలో తోడ్పడుతోందని ఎవరనుకో మన్నారు మీబావని? పెళ్ళిమాటేముంద దీనిలో? అబ్బాయి ఆపెతో అన్నదాన కార్యక్రమం ఆలోచిస్తోంటే శోకతొక్కినట్రాములా లేచారు మీబావ. పోనీ ఖర్చుఅవుతుందని ఆయన అనుకొన్నారా అంటే, ఆయన ఖర్చుకు ముఖంచూచుకొనే మనిషి కాదు. ఆయనబాధ మరోటి చెప్పనే చెప్పారుగా. అడ్డమైనవాళ్ళ అంటమెతుకులు తొక్కవలసివస్తుందట. అంటమెతుకులు తొక్కినవాళ్ళకు నరకప్రాప్తి తప్పదంటారా మీబావ" అంది మా సీతమ్మ.

నేను నవ్వు ఆపుకోలేకపోయాను. "ఇదేం వైపరీత్యం బావా? ఓఅన్నం మెతుకు అన్నార్తునికడుపున వేస్తే స్వర్గద్వారాలు తెరుచుకుం

టాయని విన్నావేమో కాని, అంటుమెతుకు తొక్కినవాళ్ళకు నరక ద్వారాలు తెరుచుకుంటై అని వినలేదోయి. గొప్పసిద్ధాంతమే లేవదీశావు నీవు గాగా. అంటే అంటమెతుకు తొక్కనివారంతా పుణ్యాత్ములు, తొక్కినవారంతా పాపకర్ములు అన్నమాట నీ అంటమెతుకు సిద్ధాంతం. అల్లా ఉండాలి పుణ్యపాపనిర్ణయం. దేవు డవసరంలేదు. మతం అక్కఱ అదివఱకే లేదు. అంటమెతుకు తప్పించుకుని తిరిగినంత కాలంఅన్నా. దైవపితృకర్మలన్నీ మానుకున్నారు. దేవతలకు హవ్యాలూలేవు? పితృదేవతలకు కవ్యాలూలేవు. తండ్రి తద్దినంకూడా కాఫీనీళ్ళతో కానిచ్చే ఈశకం, నీరకం వాళ్ళకు కులం కావాలా! మతం కావాలా? శుద్ధజాబాలివి. ఆర్షమతాన్ని విమర్శించబోతావు" 'పోశ్' అన్నాడు మా బావ. 'అయితే చెబ్దూ, ఆర్షమతంలో అంటమెతుకు ఎన్నో అధ్యాయమో చదువుకునే విమర్శిస్తాను' అన్నా.

"మీ బావ అలా అవహేళన చెయ్యవగ్గమనిషేరా అన్నయ్యా! శ్రావణికి ఉల్లాం వెళ్ళే బ్రాహ్మణ్యానికి వచ్చేవాళ్ళకు ఈనాటున, మాయిల్లేరా మజిలీ. మీ బావను వారంతా తలమీద పెట్టుకుంటారు. 'సత్యసంధుడు, శ్రోత్రియుడు' అని మీ బావను అంతంత ఘనాపాటీలు వేనోళ్ళ కీర్తిస్తారు. కుమారిక మా యింటికొచ్చిందన్నా. మీ బావగారి కీర్తే కారణం. ఆట్టివారి నీమాలను, 'మనకు యిబ్బంది అయినా, సాదర బుద్ధితో చూడాలి. వాటికి లొంగి మనం మన ప్రవర్తనను మలుపుకోవాలి' అంటుందిరా కుమారిక. దానిజ్ఞానం మనకు లేదురా!' అని భర్తను వెనకేసుకొస్తూ, నన్నే మందలించింది. భార్యాభర్తల తగాయిదాలో తల దూర్చినా, తగవు చెప్పినా, పైవాళ్ళకే గతిపడ్తుంది కాబోలు ననుకొన్నా.

మా సీతమ్మ తనమఱది శాస్త్రిగారిని సంభావించి "నీవు నైష్ఠికుడవు. బహుగ్రంథపరిచయం కలవాడవు. లోకరీతు లెరిగినవాడవు. నీకన్న మాకు ఆప్తులులేరు. నీఅన్నగారి ఆజ్ఞను నేను ఉల్లంఘించలేను. ఆయన గీచిన గీటు దాటి ఎఱుగను. ఆయనకు మనశ్శాంతిలేనినాడు, మేము ఏమి సాధించి ఏమిలాభం? ఉన్నమాట చెప్పవద్దూ, కుమారికను మాయింటి నుంచి తరుమవలసిన దుర్విధి దాపరిస్తే, నే జీవించడం కల్ల. మా ఇల వేల్పు

కామేశ్వరిసాక్షిగా చెప్తోన్నా. ఈపరీక్షా సమయంలో, నీనిర్ణయం నాకు శిరోధార్యం" అని చెప్పింది.

'నీనిర్ణయం నాకు శిరోధార్య' మంటూనే, 'నిర్ణయం నాకు వ్యతిరేకమైతే నాకు మరణమే శరణం' అనడం, పెద్దమనిషి నిర్ణయాన్ని కోరడమేనా అని వదినగార్ని అడగవలసినమాట శాస్త్రిగారు. స్త్రీ సాహసి, ఏమోనని హడలి పోతూను కాబోలు ఆయన ఆధోరణికిపోక, "ఒకేమనస్తత్వం ఒకేలక్ష్యం గల యువతీ యువకులకు భగవద్విలాసంగా, సామీప్యతసిద్ధిస్తే, వాళ్ళు పెండ్లి చేసుకుంటారా కాదు ప్రశ్న. 'ఎందుకు చేసుకోరు?' అని అడగాలి. క్షీరం, చక్కెర, ఒకేబల్లమీదకు రావడం తటస్థిస్తే, 'ఎందుకు కలుపుతావు?' కాదు, ఎందుకు కలపవు?" అనీ, అడగదగ్గది. వారికలయిక సుహృజ్జనహృదయాల కోరిక. ఆకలయిక ఒండొరుల ప్రయోజనాన్ని ఇనుమడిస్తుంది కాబట్టి కల్యాణప్రదం. ఇక్కడ యిద్దరిలక్ష్యమూ ప్రజాసేవయే కాబట్టి, ఏకలక్ష్యసాధనకు వెలిగించిన భిన్నజ్యోతులవలె, ఒకరిసహచర్యంతో ఒకరు సంఘానికెంతో ప్రయోజనకారు లవుతారు సంఘహిత కార్యకలాపంలో ద్విగుణీకృతంగా సామర్థ్యం చూపుతారు. అట్టి స్త్రీపురుష అన్యోన్యాశ్రయావశ్యకతా ప్రభావాన్ని ఏమనాలి? మోహం కాదు. మోహం రూప ప్రధానం. అట్టిదే ఆదర్శప్రేమ. ఆదర్శప్రేమ గుణ ప్రధానం. అట్టి ఆదర్శప్రేమను భంగంచేస్తే కలిగే ఫలితం వాళ్ళ ప్రయోజనాలు క్షీణించడం సంపూర్ణమానవత్వం సిద్ధించాలని కోరదగ్గదిపోయి, పైగా నేను పేర్కొన్న దుష్ఫలితానికి కూడా తావీయు మనగలనా?" అన్నారు కోనసీమశాస్త్రిగారు.

"అల్లా చెప్పు నాయనా మీ అన్నగారికి. దేవుడిలా వచ్చావు" అంది మాసీతమ్మ.

రామశాస్త్రుల్లు కరకర చూస్తున్నారు మాసీతమ్మవంక. 'నేర్పుగా తీర్పు నీ పక్షం చెప్పించమని ఎంతదూరం వెళ్ళకలవో!' చూస్తానన్నట్టు.

శాస్త్రిగారందుకొని, "ఉత్తరగతులకంటూ ఉత్తరోత్తరాకలిగే ఫలాల దూరదృష్టితో, నిత్యకర్మల ననుష్టించే నిష్టాగరిష్టుడు, మా అన్నకు నయానయవిజ్ఞత లేదంటే నమ్మలేను. బిడ్డల ఆదర్శప్రణయానికి అడ్డవాట్లు

వేశాడంటే ప్రబల కారణ మేదో ఉండాలి. సుంతైనా, నీవు నాకది చెప్పలేదమ్మా, వదినా!" అన్నాడు.

"అల్లా అనుకు. కుమారికి బ్రాహ్మణకన్య కాద" న్నాడు మాబావ.

"బ్రాహ్మణేతరకన్యా కా" దంది మాసీతమ్మ అంత నిక్కచ్చిగాను. అయోమయంగా చూచారు శాస్త్రిగారు.

"మన పంక్తిని బోంచెయ్యదు. మచ్చలేకపోతే ముఖం ఎందుకు చాటేస్తుంది పంక్తిభోజనానికి ?" అన్నాడు మాబావ.

"బ్రాహ్మణేతరుల పంక్తినీ బోంచెయ్యదు, అదే పరీక్ష అయితే. కులలోపముంటే కాదు, అది దాని నియమం. ఆనియమం ముందే చెప్పింది. రావడంతోనే సరాసరి మాతో భోజనానికి లేస్తే, శూద్రాంగనేమోనన్న సందేహానికి తావుండకపోను మీ అన్నగారికి. తనంతట తనే నియమం చెప్పకపోతే, ఏసందేహమూ కలగని చోట, సందేహం కల్గించే ఒకనియమాన్ని పరిగట్టుకొని చెప్పిందంటే, ఆమె తప్పకుండా సత్యసంధురాలైన బ్రాహ్మణకన్య. మనుష్యుల కొలదిని మీఱినకన్య అనాలని నా నిశ్చయం. ఆనియమానికి కారణ మేమని తర్జనభర్జన చెయ్యకుండా, ఆమె నియమాన్ని నేను గౌరవిస్తున్నా. పరిస్థితి యాథార్థ్యం నీకు చెప్పా" నంది మాసీతమ్మ.

"వదినా, నీ అంతఃకరణ పారిశుద్ధ్యం నీప్రతిమాటలోను ప్రస్ఫుటమైంది. కాదనను. కాని. 'అగమ సత్యధర్మాచారతపముల కునికిపట్టుగాగ, వనజభవుడు కలిగించె మును బ్రాహ్మణుల' అట్టి ఉత్తమలక్షణాలకు ఉనికిపట్టైన బ్రాహ్మణ్యం అంతరిస్తోన్న ఈ పిదపకాలంలో, అక్కడోటి, అక్కడోటి, మీకుటుంబంలాంటి జీవకణాలు నాబోంట్లకు కాస్త ఆశాజనకంగా, మిణుకుమిణుకుమంటో కన్పిస్తున్నై. మాఅన్న ఆర్షధర్మాభిమాని. అతిథ్యభ్యాగత సేవాపరతంత్రుడు. అతడిపుడు బ్రాహ్మణకర్మదూరుడు కాలేదు కద. అతడి ఆచారాదికాలు సాగమి, మనకందరకు ఖేద కారణమే.

"పరమసాధులైన బ్రాహ్మణులకు బాధయగుడు మహిని, బాధయగు

ధరిత్రికైన బాధ చేసి యఖిలలోకంబులు గరము బాధ నొందు కమలనాభ' అని భారతవాక్యం. మా అన్నకు మనోక్లేశం కలగరాదు" అన్నాడు శాస్త్రి గారు.

త్రాసు తన వైపుకు మొగ్గినందుకు ఎగిరిపడి, "అల్లా చెప్పు దానికి నోరు లేనకుండా" అన్నాడు మా బావ.

మా సీతమ్మ కనుబొమలు ముడివడ్డై.

శాస్త్రిగారు, "అన్నా, భువనోపకారకమతులు మహాత్ములు. లోకసంగ్రహమార్గం సత్కార్యాల నాదేశించారు. లోకకల్యాణమే సత్కార్యాల పరమార్థం.

'వర్ణములు నాశ్రమంబులు వసుమతికి దుక్త
పథమున నడిపించి యుభయలోక సంసిద్ధి గను'

నన్నాడు భీష్ముడు. ఉభయలోకసిద్ధి అన్న మాట అంతరార్థం గ్రహించావా? ఒరుల శ్రేయస్సుకు భంగకరమైన కర్మలు సత్కార్యాలు కాజాలవు. శ్రోత్రియుల సత్కార్యాలను హింస అని నిరసించే అపరిపక్వమనస్కుడెంత నింద్యుడో, సత్కార్యాల నాచరిస్తోన్నానన్న అహంకారంతో, పరహింసకు హేతుభూతుడయ్యే శ్రోత్రియుడు, అంతే నింద్యుడు. లోకకల్యాణమపేక్షించి శాసించిన మహాత్ములు భార్యాబిడ్డల శ్రేయస్సుకు భంగకరమైన తీరున కర్మల నాచరించమని ఆదేశించరు. కర్మలకు, లోకతంత్రానికి సంఘర్షణ కలిగే పక్షంలో, ఆ ఇబ్బందిని అధిగమించుటకు, ఆపద్ధర్మాలను, సమన్వయసూత్రాలను చూపినారు. ఉభయతారకంగా, సమన్వయశక్తితో మనము సమస్యను పరిష్కరించలేకపోము. నీవు నిగ్రహానుగ్రహ సమర్థుడవు. ఆపది కాబట్టి వదిన కలవరపడ్డోంది గాని నీభయం నాకెప్పుడూ లే"దన్నాడు.

మా బావ. మా సీతమ్మా ఉభయులూ ఆలోచనాధీనమనస్కులయారు.

"ఆ కన్యను నేను చూడ్డం పడలేదే?" అన్నాడు శాస్త్రిగారు.

"మొన్న మన విద్వద్గోష్ఠిలో, పండితజనోచితమైన చందనతాంబూలాది సత్కారసామగ్రిని పళ్ళెరంలో తెచ్చి పెట్టిన సౌందర్యవతియేనండి మహాకవుల స్త్రీసౌందర్యవర్ణనలోని వాస్తవికతకు రుజువిచ్చిందని శ్రీనాథుని పద్యాలు చదివినవారు మీరు" అని శాస్త్రిగారికి జ్ఞాపకం చేశాను.

శాస్త్రిగారు విద్యుదావేశంతో "ధన్యురాలవు పెట్టిపుట్టావమ్మా! ఏ పురాకృతపుణ్యఫలాతిశయంగా యీకన్య మీయింటప్రవేశించిందో కాని, వదినా! అన్నయ్యా, నీసత్కర్మానుష్ఠానదీక్షాపరతంత్రతకు మీకుభగవంతుడు ప్రసాదించిన వరఫలంసుమా, ఆమె ముఖవైఖరిని చూచి నేను భావించిన సదాచారసంపన్నతయే ఆమెయందుంటే" అన్నాడు శాస్త్రిగారు.

"ఆవిషయంలో ఏబ్రాహ్మణకన్యలూ ఆమెకు సాటిరారు. నేనెందుకు కాదంటాను, ఉన్నమాట?" అన్నాడు మాబావ.

ఆతడినోటంట ఆమాటలు రావడంతో మాసీతమ్మ ముఖంలో ఆనందం తాండవించింది. అందరమూ సంతోషాస్వాంతుల మైనాము.

"అన్నయ్యా యీకన్య స్వర్ణదీతరంగాలిత దివ్యకమలమై యీ మీకుటుంబానికి అభీష్టశుభప్రతిపాదిక కాగలదు. ఈసౌందర్య విశేషానికి దేవతాంశ ఉండక తీరదు. ఆమె నేత్రాలు చూడు. వాటిల్లో ఒకవిశ్వాస స్రవంతి ప్రవహిస్తోన్నట్టు తోస్తుంది. 'సిరివస్తూంటే మడిగట్టలేనా!' అన్నట్టుంది మన వ్యవహారం. స్వల్పప్రయోజనాలకు భల్లూకపుపట్టు పట్టడం మహాగర్వంతమైన విషయాలను జారవిడవడం, మన శ్రోత్రియశ్రేణి చాంచల్యలక్షణమని నవీనులంటూ రంటే, చిత్రమేముంది! చూపువాసీ చెయ్యాని అనుమానంమీద మనకు కన్పిస్తోన్న ప్రత్యక్షప్రమాణాలన్నింటినీ తోసిరాజని, బిడ్డల ఉజ్జ్వలభవిష్యత్తును త్రోసివేస్తామా? సందేహ సందర్భంలో వ్యక్తి నాణాన్ని కొలిచిచూపే మానదండం, మన అనుభవమే కదటోయి! నీ అనుభవరీత్యా నీకు కన్పడ్డ ఆమె 'బ్రాహ్మణ సాంప్రదాయం' కన్న వేరు రుజువేమి కోరుతావు? నీ అనుభవాన్ని నీవెందుకు సందేహించుకోవాలి? పునరాలోచన చేసుకో" న్నాడు శాస్త్రిగారు మాబావను.

"అవునోయి" అంటూ వినిపించీ వినిపించకుండా నసిగాడు మాబావ.

"పెంతలెగరేసినవాడు నసుగుడులోకి దిగడమే పదివేలు. కుమారిక ఇంట్లోఉంటే కుందనాలు తెంపేసుకొని, దేశాలట్టిపోయి, ఏచెట్టుకిందనో కుక్కచావో, నక్కచావో - వైనం జ్ఞాపకంలేదు - చస్తానన్నవాడు ఇప్ప

టికి మాటవినుపించుకునే సితికొచ్చాడు. "వదినా! మీరు రంగడి భక్తులు. మీరిప్పుడు దర్శించబోతోన్న రంగడే మీకు దారి చూపెడ్తాడు. అన్న సందేహవిచ్ఛేదు డవుతాడు. బెంగ పెట్టుకోకు. మీ వైమనశ్యం తొలుగుతుంది. మనశ్శాంతి కలుగుతుంది" అని శాస్త్రిగారు దీవించినట్టు పలికాడు.

---

# 20. దేవతాదర్శనం

కోనసీమశాస్త్రిగారి ఆశీర్వాద పుణ్యాహవాదాలకు తథాస్తులు పలుకుతోన్నట్టు ఒక్కపర్యాయంగా వీధిగుమ్మంలో తాషామరఫాలు, తదితర మంగలతూర్యారావాలు ఘోషమన్నై. అంతలో రంగారావు హడావుడిగా వచ్చి, 'నాన్నా ఇక్కడున్నావయ్యా, ఆలయానికి ఆలస్యమవుతోం' దంటే, ఆమాట లోనే కుమారిక వచ్చి, 'శాంతమ్మగారు మిమ్మల్ని వెతుక్కుంటున్నారు' అని మాసీతమ్మతో చెప్పింది.

సుమారుగా, ఇంతవనుక రంగారావు కుమారికల, ఉద్వాహవిషయం హృదయభారంతో ఉన్నామేమో, 'ఏమి ఈపరిస్థితుల ప్రభావం!' అని తోచింది. రంగారావు కుమారికలకు పరిణయాభిలాషను ప్రేరేపించే ప్రేమోదయ మైందో లేదో కాని, వారెవరేపని చేస్తున్నా, దంపతీ యుక్తంగా చేస్తోన్నట్టు దృశ్యం రూపొందుతోంది. స్త్రీజనంలో బాంధవులను. పరిచితులను, పెద్దముత్తయిదువలను ఉచితరీతుల్లో పలకరిస్తో పెండ్లివారిని బయల్దేర తీయవలసిందిగా కుమారికను, పురుషులను లేవతీయ వలసిందని రంగారావుకు ఎవరుచెప్పారు? ఎవ్వరిప్రమేయం అక్కఱలేదు. ఆశయాదర్శాలు. నిత్యనైమిత్తిక జీవితవిశేషకాభిప్రాయాలు ఏకీభవించి, భావసంబంధులై, తత్కారణంగా పరస్పరానురాగపూరితులైన యువతీయువకులకు పరిణయం సహజ పరిణామం. తీగకు లేజిగురు ఉదయించినట్టు, మొగ్గ పుష్పమైనట్టు, సహజంగా సంఘటించే ఒక అవస్థాభేదం మాత్రమే. మన్మథుడు, చంద్రుడు. చకోరాలు, తుమ్మెదలు – ఈబలగం రెక్కలు ముక్కలు చేసు

కోనక్కఱలేదు. రాయభారాలతో మధ్యవర్తులు కాళ్ళు విఱుచుకో నక్కఱలేదు. రామశాస్త్రుల్లగారు తుమ్మకుండా ఉంటేచాలు. తల్లి తపస్సే అది. రంగడి సమక్షంలో ఒక్క పూలదండ చాలు, పరిష్వంగం కూడా అక్కఱ్లే అక్కఱలేదు. సిద్ధాన్నం. ఇంకా, 'అయినా' అని బావ నసిగితే, శ్రీరంగేశుడే చూచుకుంటాడు బావ నసుగుడు. కుమారిక రంగని భక్తు రాలే. రంగారావుకు ఆరంగడి పేరే పెట్టేరాయిరి.

ఈ భావ తెరంగుల్లో నా ఆలోచనలు పోతుంటే, వీరేసెపుడు పాలకీ యెత్తాడో, శృత్యాపస్వృతులను, సగస్వగ విశుద్ధస్వరాలను సమనవయిస్తో, మేళవిస్తో, వివిధాంతరాయాలతో, లఘు దీర్ఘస్వరాలతో, అనుద్దేశిత ఆరోహణావరోహణాలతో, ఆహ్వానాన్ని వినిపిస్తో చుట్టుప్రక్కల పది ఊళ్ళప్రజకై నా పిలుపు అందాలన్న ఆశయమూ అన్నట్టు వయోవృద్ధు దూదేకులసాహేబు, కంఠముడి దగ్గరనుంచి కాలిముడమ దాకా దిగజారు తోన్న పంతుల పఠాణీవేషపు పటకా పరికిణీతో, ధూళిధూసరిత మైన చుట్ట తలపాగాతో, సబ్బునురుగులాంటి తెల్లటికత్తిర గడ్డంతో చెవిని వ్రేలాడు తోన్న ముత్యపుపోగులమీదకు పడి వంకరతిరిగిన, కత్తిర గిరజాతో. గెడ్డం గిరజా వినా, మతాచార వ్యత్యాసం అంతరించిన ముఖవర్చస్సుతో, తన బారెడుపొడవు తూతూబాకాను, అగ్రహారం పొలిమేర్లకేసి ఏటవాలుగా ఎత్తుతో దింపుతో, విజృంభించి ఊదాడు. తత్శుభసమయంలో తూతూ బాకా ఊదుతోన్నవాడు. ఒక సర్వసామాన్య వ్యక్తి కాడు. సినీమాతాకిడిని తట్టుకోలేకున్న నాట్యకళలా, బ్యాండువాయిద్యాన్ని తట్టుకోలేకున్న సన్నాయి మేళంలా, ఆనాటికానాడు దేశంలో అంతరిస్తోన్న ఒక శుభ ప్రదమైన వైవాహిక సంస్థ ప్రాచీనసంస్థ. మంగళకరమైన ఒక ప్రాచీన సంప్రదాయ స్వరూపం. ఈజీవి శుభసన్నివేశాలనుంచి వైతొలగి, మూల మూల్ల పసుపులు కుట్టుకొని పొట్టపోసుకోవాల్సి రావడం విచారకరం. పిల్లలు పుట్టగోచీ లెట్టుకొని, పొట్టాలు త్రిప్పితే గాని చీకట్లను చించి, వలయాకారంగా చిక్కగా పువ్వులు రాలిస్తేగాని, దీవళిపండగ దిగినట్టు కాదు. పెండ్లివారి దండు మనఊరు విజయం చేస్తున్నారని చెఱువుగట్టుమీద నుంచి దూదేకులసాహేబు కాహళరావం వినిపిస్తే గాని పెండ్లివారు దిగినట్టు కాదు.

నాప్రక్కను కూర్చుంటే వాడితో, "వర్ధిపర్తి అంటే హైందవ కుటుంబనామం, మీరాసాహేబు అంటే మహమ్మదీయ పురుషనామం మేళవించి ధరించిన యీతడు హిందూముసల్మాన్ సోదరత్వానికి చిహ్నం, అన్యమత విద్వేషపూరితులైన రాజకీయతాంత్రికుల ప్రపంచానికి పెద్ద సవాలా అబ్బాయీ" అన్నాను.

మాకోట్లు పరిహాసశిల్పంలో ప్రజ్ఞాశాలి.

"అయితే మామా, ఇద్దరు తూతూబాకా సాహేబుల్ని శుభ్రంగా కాష్మీరు చర్చిలో యక్షిబిట్సుగా మార్కు చేయిస్తే మనం కాష్మీరుసమస్య నెగ్గుతామేమోనయ్యా" అన్నాడు.

చూచారా వాడి వేళాకోళం. అంతలో దూరదూరంగా తచ్చాడ్తోన్న సన్నా పెద్దా పాలకీముందుకొచ్చారు. పాలకీముందు రంగారావు అధిపత్యం క్రింద, వెనకవైపున కుమారిక అధిపత్యంలోను, పెళ్ళివారందరమూ. అడుగులో అడుగు వేసుకుంటో సంగాలయానికి సాగాం.

పాలకీ మునసబుగారి ఇంటిముందుగా ఆలయానికెళ్ళాలి. మునసబుగారి లోగిలి నాలుగుబారలుండనగా, కుమారిక పాలకీముందుకొచ్చి రంగారావు చెవిలో ఏమిచెప్పిందో. రంగారావు మునసబుగారి లోగిట్లోకి వెళ్ళాడు. కుమారిక పెండ్లికూతురుతో మాట్లాడుతో పాలకీప్రక్కను నడుస్తోంది. మునసబుగారు, భుజంమీదనుంచి జీరాడుతోన్న కండువాతో కదలి, రంగారావు చెయ్యిపట్టుకొని, కర్రఊతంతో మెట్లుదిగి వచ్చారు. ఆనాడో క్రితంరోజో పత్యం పుచ్చుకొని ఉంటారు. త్రుటికాలమైనా వధూవరుల్ని చూచారో లేదో, "మీ అమ్మాణీగారి పెళ్ళి బాగా జరగాలని ఏమి దొర్లావన్నా. బాగా జరిగిందికద. నాకా నొప్పినుండి అస్వస్థత చేసి రాలేకపోయానమ్మా!" అని అతి ఆప్యాయతగా కుమారికను అడిగారు.

"అయ్యగారు, మళ్ళా గాలితగుల్తుంది, లోపలికి రండి". అన్నాడు మునసబుగారి పెద్దపాలేరు.

"గాలీలేదు, ధూళీలేదు. సద్వాక్కుడున్నావురా, నీసంగు ఏమిట్రా మధ్య? మరోపని లేదుట్రా నీకు?" అని వాణ్ణి మందలించి, "రాగలి

గితే మీ వెనకాలే నేనూ ఆలయానికొస్తానమ్మా!" అని కుమారికతో చెప్పి రంగారావు చేతిసాయంతో ఇంట్లోకి వెళ్ళాడు.

మరిపదినిముషాల్లో పాలకీ గుడిగుమ్మం చేరింది. చెదురు కాయలను పోగుచేస్తో స్త్రీజనం అందరిచేత కుమారిక ముమ్మారు ఆలయంలో ప్రదక్షిణ చేయించింది. పిల్లల నెత్తుకొని, ఒక్కొక్కరి చేతా గంట కొట్టించింది. శతకోపం వేళ రంగారావు, సుభద్రప్రియుడూ ఎత్తునాటుగా వెనక నుంచుంటే, స్త్రీజనంలో వాళ్ళకు దారిచేసి, కళ్ళతో వారిని ముందు కాహ్వానించింది. అమ్మాణీని కలుపుకుని కుమారిక రంగస్తుతి గానం చేస్తే, రంగడు ప్రసన్నుడయాడు. రంగారావు పరవశుడయాడు.

ప్రతిపని కుమారిక పర్యవేక్షణలో తామంతరం చేస్తోన్నట్టు తోచించి కాబోలు రంగారావుకు. తల్లిని పక్కకు పిలిచి, "ఏమిటే అమ్మా! కుమారిక మన ఊరొచ్చి అంతా పదిరోజులకన్న కాలేదన్నావు. మన ఇంటి పెత్తనమంతా ఆమెమీద నడుస్తోంది. సరే, నువ్వు పెత్తనం చేతికిచ్చావు కావొచ్చు. ఆలయంలో కూడా కర్తృత్వ మామెకు ఎవరిచ్చారే! — ఇక్కడా ఆమె పెత్తనమే చూస్తున్నాను. దార్లో మునసబుగారిక్కి వధూవరులను చూపమని పెద్ద నిక్కులా నాకు చెప్పింది. అమ్మాణీ వివాహం, కుమారిక చేతిమీద జరుగుతోన్నట్టే ఆయన కుమారికను కళల ప్రశ్న లేశాడు. అమ్మాణీ పెండ్లిచేయించడమే కాకుండా, లీలాసుభద్రల పెళ్ళిళ్ళకు పునాదులేసింది. లీల విషయంలో మునసబుగారు, సుభద్ర విషయంలో శాంతమ్మగారు. లీలసుభద్రలతో పాటు నా స్నేహితులూ యావన్మందీ కార్యసఫలతకు కుమారిక మీదే ఆధారపడి ఉన్నారు. పైగా నిన్ను నన్నూ కూడా వాటిల్లో యిరికించింది. ఇంట్లో వాళ్ళకు పైవాళ్ళకు యింతమందికీ తల్లో నాలిక ఏలా అయిందే కుమారిక?" అని అడిగాడు రంగారావు.

"ఎక్కడిదో ఏమో నాకు వైనం తెలియదు కాని, కుమారిక సంఘసేవకు చక్కని శిక్షణపొందిన కన్యరా అబ్బాయి. దాని నయప్రాజ్ఞత లెవరికీ రావురా. ఇప్పుడు జరిగిన చిన్న విషయం చూడు. నా తెలివి ఏమైంది? మీ నాన్నగారి తెలివి ఏమైంది? మేము మతిచేపోయాం.

ఎండకువచ్చి మానస సంసిస్తే పాకట స్వయానా వేసివెళ్ళిన మునసబు గార్కి వధూవరులను ఒక్కపర్యాయం చూపడంతో ఎంతలోపం కమ్మే సిందో. జబ్బుగా ఉండి ఈ నాల్గురోజులనుంచి ఆయన మనింటికి రాలేక పోయాడు. ఈపూట నాటితే నాకు వధూవరులను చూసే సావకాశ ముండేది. వారిమాట ఏలా ఉన్నా మనకే జిజ్ఞాసగా ఉండదూ? ఆయన పాలకీలోని వధూవరులను చూచి వెళ్ళాడంటే, మన మనస్సుకి ఎంత సంతుష్టిగా ఉంది. గ్రామంలో మనకది ఎంత పరపతి! ఏపనులలో ఏపని ఎంతచెయ్యాలో మెచ్చుమెచ్చుకు కోరకుండా చేసుకుపోతుంది. మితంగా హితంగా మాట్లాడుతుంది. హృదయం దివ్యతేజోనిలయం. మాట అమృతప్రాయం. కంఠస్వరం దివ్యగానం. సూక్ష్మబుద్ధి. సుగుణ శీల. ఎంతగుణవతీ కాకపోతే, ఆలయంలో తపస్సు చేసుకుంటోన్న యతిగార్కి ఆమెయందు పుత్రికా వాత్సల్యం మెండుగా కలిగింది! 'కుమారిక పాదంపెట్టిన చోట సిరిసంపదలు తొణికిసలాడ్తాయంట్రా' అని మా కోనసీమ బాబాయి ఊరికే అన్నారా? ఆ పెరుగుణసంపదచుతించి ఒక్క మీనాన్న గారే. ఉప్పూ పోకగానూ కావన్నట్టు మాట్లాడ్తారు, ఆకేం ఖర్మమో. మీ నాన్నకు కుమారిక బ్రాహ్మణకన్య కాదని అనుమానం. 'సిరివస్తోంటే మోకాలు అడ్డంపెడతావేం ఖర్మం వచ్చిం' దని మా కోనసీమబాబాయి మీ నాన్నను కసురుకున్నారులే. అందుకు కాదు. మీ నాన్న చేదస్తా నికి చెప్పా'' నంది మానీతమ్మ.

---

# 21. రంగారావు పరిణయేచ్ఛ

తత్ప్రసంగానంతరం, వధూవరులు ముత్తయిదువులు కూర్చున్న గర్భగుడి ముంగిటి మంటపానికి, తల్లీకొడుకులు వచ్చారు. ఈలోన కుమారిక పువ్వు నాటి పూలతో మూడుమాలలు కూర్చి ఉంది. ఒకటి అమ్మాణీ చేతికిచ్చి 'నీయిష్టం' అంది. అమ్మాణీ చిఱునగవుతో ఆమాలను భర్తమెళ్ళో వేసింది.

"ఇదేమిటమ్మా! నేనింత శ్రద్ధతో నీకు దండకూరిస్తే. నీవుదాన్ని ఎవరి మెళ్ళోనో వేయడం బాగుందీ? తనకు మాలిన ధర్మమా? పోనీ ఇది ధరించు" అని రెండోదండ యిచ్చింది. అమ్మాణీ ఆదండను చేత్తోపట్టుకొని సంశయిస్తోంది. "నీఅంతట నువ్వు మెళ్ళో వేసుకుంటే వేసుకున్న ట్టుండదు కాబోలు," అంది కుమారిక, చతుర్వేది వంక చూచి నవ్వురానిస్తో. ఆనవ్వులో వెన్నెలలు విరిసై. దానిమీదట పెండ్లికొడుకు అమ్మాణీ చేతిలో నుంచి దండతీసి, అమ్మాణి మెళ్ళోవేశాడు. ఏవరుడూ యింత ముద్దైనపని చేయడం ఎఱుగమన్నట్టు, మగపెళ్ళివారు కరతాళధ్వనులు వినిపించారు.

"మాతమ్ముడు ఆమాత్రం అంద మెఱుగని వాడనుకున్నావు కాబోలు కుమారికా!" అంది శాంతమ్మ. "ఈదండకూడా అమ్మాణీ మావాడికే వెయ్యబోయినా, మావాడు అపుచేసి అమ్మాణీ మెడలోనే వేసును సుమా" అంది.

"కుమారిక ఉప్పు అందించేవరకు తోచింది కనకనా పెళ్ళికొడుక్కి—. ఇప్పుడు ఎన్నైనా చెప్పవచ్చు" అంది, ఆడపెళ్ళివారి తాలూకు ముత్తె యిదువ. శాంతమ్మ వంక ఎద్దేవాగా చూస్తో.

ఆ మాటమీద మగపెళ్ళివారి తాలూకు ముత్తైదువ అందుకొని. కించెత్ ఉక్రోషంగా. "కుమారిక యింకా నేపు ఆమాట అనకపోతే తెలిసి వచ్చును ఆడపెళ్ళివారిఅందం. అమ్మాణీ ఈరెండోదండను చడీ, చప్పుడూ కాకుండా తనమెళ్ళోనే, తనంతట తనే వేసుకుని కూర్చుండును" అంది, గబుక్కున మెళ్ళో వేసుకోడాన్ని కళ్ళు చిటకరించి అభినయిస్తో.

ఆడపెళ్ళివారి తాలూకు మరోఆవిడ, "నువ్వంటే సరి. మీమాటే చెప్పాలి చెప్పి చెప్పి. ఇక్కడ ఎవరంటారో అనిపించవమ్మా చూదాం" అంది, తన ఆడపెళ్ళివారి పార్టీని. చివరకంటా చూపుతో.

"జైభమంది అంటారు ఆమాటకొస్తే" అని చఱ్ఱుమంది మగపెళ్ళి వారి తాలూకు మరోఆవిడ, తన మగపెళ్ళివారి పార్టీతలలమీద, పూజారి ఓగుంపుకంతకీ తలలకు తగలకుండా శఠగోపం గుండ్రంగా లాగేసినట్టు, చెయ్యూరానిచ్చి.

ఎంత నిష్పాక్షికమైన మధ్యవర్తులను కోరుకొన్నారో చూడండి. కాన్నే

పట్లో. ఒకళ్ళిద్దరితో సరసంగా ప్రారంభించిన మాటలు, చిలికి చిలికి గాలివానై, అటు యిటు మళ్ళి, నలభైమంది నోళ్ళ అలుముకున్నై. 'అంటూ రంటారు' అంటో ఆడపెళ్ళివారు. 'అనక అనక' అంటో మగపెళ్ళివారి బృందం రెచ్చిపోయారు. గర్భగుడిగుమ్మంలో రొద హెచ్చిపోయింది.

ఏమనుకుందో కుమారిక, మగపెళ్ళివారి మేస్త్రీని అప్పుచేసి, "నేను ఏమన్నానండీ? నాకే మఱుపు వచ్చింది నామాట" అంది.

ఆవిడ కుమారికవంక మిటుకు, మిటుకు చూస్తో ఆలోచనలో పడింది. ఆడపెళ్ళివారి మేస్త్రీని అడిగితే, ఆవిడ పొడిదగ్గు వినిపించింది. ఆగుంపులోనే ఒక ఆవిడ, యింకో ఆవిడను అడగబోతే, 'పోనిద్దూ తల్లీ' అని వైరాగ్యం వెలిబుచ్చింది ఆవిడ. మనలో మనమాట, ఈలోపల అంతా మరచిపోయారన్నమాట అసలుమాట, అది కారణం. ఈలా కారణం లేని కలహం పెంచుకోవడం, ఆడవాళ్ళకు ఒక పెండ్లివేడుక కాబోలు. తీరా, ఆరాత్రిస్తే, 'వడ్లగింజలో, బియ్యపుగింజ'.

తగాయిదావృష్ట్యా, కుమారిక పూలమాలల వినోదం వడ్లగింజే అయినా విధివిలాసమేమో, ఆవడ్లగింజే రంగారావు హృదయంలో, ఏ మధురకోమల భావము, ఈవిశ్వములోని భూతజాలమును ఏకసూత్రానికి బంధించడానికి ప్రయత్నిస్తో ఉంటుందో అనిర్వచనీయమైన ఆప్రణయానికి, బీజాంకుర మైంది. గిన్నె నేయూలో అంటియున్న ఒక్క అన్నమెతుకే గా, శ్రీకృష్ణపరమాత్మ హృదయంలో పడి, అభీష్టసిద్ధి పదమై, అక్షయమైన చతుర్విధాహారాలను ప్రసాదించిందని వింటాము. తన మాతృదేవత కుమారికను సకలకల్యాణస్థానమని ప్రశంసించిన దాది రంగారావుచిత్తము కుమారికా పరాయత్తమై ఉండి ఈ రసవిద్యోవనంతో రంగారావు హృదయంలో శరీరైక్యవాంఛ జనించింది. ఇంతవరకు కుమారిక జీవితోన్న తాదర్శతేజఃపుంజము అతడి కన్నులను మిఱుమిట్లుగొలిపి! హృదయాన్ని నింపేసింది. అంచేత అంతస్సౌందర్యమే గాని, ఆమె బాహ్యసౌందర్య మంతగా అతని దృష్టిపథానికి రాలేదు. అంతస్సౌందర్యానికి ప్రథమస్థాన మొసంగిన గుణగరిష్ఠుడు రంగారావు.

ఈ రసవద్వినోదంలో రంగారావు చూపులు సుశిక్షితఅయిన కుమారికలో అణగిమణగి ఉన్న ఒక లలితభావాన్ని పెల్లగించి పసిగట్టినై. ఆమె హృదయంలో అడుగుపొరక్రింద మధురస్రవంతులు ప్రవహిస్తోన్నట్లు ద్యోతకమైంది.

అమ్మాణీ, అమ్మాణీభర్త ఒండొరులను పుష్పమాలాలంకృతులను చేసుకొన్న తరుణంలో, పులకిత అయిన కుమారిక అరమోడ్పు కన్నులతో ద్యోతకమైన ఉజ్జ్వలానందజ్యోత్స్నలే, రంగారావు మధురానుభూతికి మూలకందం. వాటిని కుమారిక పరిణయ సంసిద్ధతకు సూచనగా అన్వయించుకుంది. ప్రేమాంకురమైన రంగారావు మనసు. అట్టి మాధుర్యభావం రసస్వరూపం దాల్చబోయే దోరపంకులాంటి దన్నాడు సోదరుడు బాపిరాజు. రంగారావు కీ తరుణం స్త్రీవాంఛ దర్శనమైన రసవద్ఘట్టం.

---

# 22. రంగారావు తపన

అంతో ఇంతో అంతరాయం కల్గితే గాని ప్రేమ ఉజ్జ్వలరూపం పొందలేదేమో! ఏ అడ్డంకులూ రాని కేవలం రైలుపట్టా ప్రేమలు, పంజరం పిట్టల్లా, మచ్చిక మృగాల్లా. నిజ లక్షణాలను గోల్పోయి నీరసించి, సామాన్యమైత్రి మర్యాదల్లోకి దిగవచ్చు. అన్నిబలాలు బాగున్నా, రంగారావుకు గట్టి చిక్కు తండ్రిగారితోటే కన్పిస్తోంది. తానైతే వర్ణాంతర, కులాంతర వివాహ పక్షపాతి. ఏ కన్యఅయినా తనకు పట్టింపులేదు. కాని తండ్రిగారికి సందేహనివృత్తి అయితే గాని. ఒక పెద్ద అభ్యంతరమే వాటిల్లవచ్చు. నాన్నగారి మనస్సు నొచ్చినపూట, సద్గుణశీల కుమారిక తనను పరిణయ మాడుటకు ఇచ్ఛగింప దది తథ్యం. అంచేత అయినా కుమారిక పుట్టుపూర్వోత్తరాలు తెల్సుకోవాలి. బ్రాహ్మణకన్యయే అవుతుందా తండ్రిగారితో భేటీ రానక్కఱలేదు. కుమారిక బ్రాహ్మణకన్య కాకపోవుటేమని మనస్సుకు ధైర్యం చెప్పుకుంటున్నాడు. ఆ ధ్యాసనుండడం చేత కాబోలు, ఈ తీరు అమ్మాయిని, ఎచ్చటో బ్రాహ్మణ పరిసరాల్లో చూచా

నేమో నన్ను భావమేమిటి, అతని మనసులో యిట్టే తళుక్కుమంది. యిట్టే అంతర్ధానమైంది. అంతలో తనకెదిరికి నవ్వుకున్నాడు.

రంగారావు భక్తులలిస్టు కెక్కినవాడు కాడు కాని అవసరం వెంబడి భక్తుల లెక్కలలో దొరుకుతాడు. తాను పెద్ద పరీక్షలిచ్చే రోజుల్లో కూడా, వినాయచవితినాడు, అమ్మాణీ పాలవెల్లి క్రింద తక్కెడు పుస్తకాల పెడుతుంటే నవ్వుతోనే, చూచీ చూడకుండా, తాను తన టెక్స్టుబుక్కొకటి, వినాయక పీఠంమీద దూర్చడం కద్దు.

తన స్నేహితుడో మెడికల్ విద్యార్థి వినాయక పీఠంమీద అపరేషను కత్తెర్లు, కత్తులు, ఫోర్సెప్సు పెట్టి పరీక్ష ఫేలయాడని, తనకోసరం ఏమేమి పెట్టారో అని పాపం వినాయకుడు తొండంతో పూజ చేసిన ప్రతిగుట్ట క్రింద వెదుకుతూండడంలో, ఆకత్తులు తొండాన్ని కాటేసుంటాయని, వినాయక వ్రతకల్పం, స్తోత్రం, సాత్రాజితీయం, యీలాంటి పుణ్యగాథలు వినాల్సిన పూజాసమయంలో, అట్లాంటి పిట్టకథలు చెప్పి నవ్వించేవాడిని భక్తుల్లో విలియా వెయ్యగలమా! కాని తెల్లారితే పరీక్ష అనగా రంగారావుకు శ్రీరంగేశుడు జ్ఞప్తికి రావడం కద్దు. ఏమాటకామాట అనుకోవాలి. నాటికి నేడు కుమారిక బ్రాహ్మణకన్య కావాలని మనసులో ప్రార్థించుకొన్నాడు.

కుమారిక మా సీతమ్మను తోడుకొని యతిగారిని సమీపించి, తాను కూర్చిన మాడవ పుష్పమాలను యతిగారి పాదసాన్నిధ్యంలో నునిచి, వారు కూర్చున్న మంటపం దిగువున సాష్టాంగప్రణామం ఆచరించింది.

జపనిమగ్నులై యున్న యతిగారు, కళ్ళువిప్పి, "అమ్మాయీ! పెండ్లి కొందరను రంగడికి దండకూర్చలేదేమో ననుకున్నానమ్మా" అన్నాడు.

"మొదటి మూడురోజులు విడిదవదలి వచ్చుటకు వీలుచిక్కలేదు. తర్వాత సావుకాశంగానే ఉంది, స్వామీజీ" అంది. "వీరే మాఅమ్మగారుస్వామీ" అని సీతమ్మగారిని పరిచయం చేసింది.

యతిగారు దిగ్గునలేచి మంటపం మెట్లుదిగి, పరమహర్షవికసితాననుడై, "అమ్మాయీ! దయాసముద్రమని, నారాయణకథామృతపాన కుతూహలి అని, నీవు చెప్తోవచ్చే పుణ్యాత్మురాలు వీరేనా? ధన్యుణ్ని. ఇట్టి

పవిత్ర రాంగ్రీడు యోగిజన హృన్మాన్యులు. పూజ్యులు సుమా. అమ్మాయీ!"
అని మా సీతమ్మను కళలప్రశ్న చేశాడు.

"అమ్మా! భగవంతుడు దీనదయాళువు. రంగడు ప్రేమస్వరూపుడు. తల్లితండ్రుల కోల్పోయిన కన్యను కడుపులో పెట్టుకొని ఆదరించే మీ ఆశ్రితవాత్సల్యం, మీ దాక్షిణ్యకోశం, అవే పవిత్రతకు గీటురాయి" ఆయనకళ్ళు నీళ్ళు క్రమ్మెన్న.

యతిగార్కి భక్తి తత్పరతతో నమస్కరిస్తో, నిలబడిపోయింది మా సీతమ్మ. యతిగారు కుమారిక వృత్తాంతం కొంతైనా తెల్సినట్లున్నారు. కుమారిక కులవిషయం తమకు నేడు ప్రధాన జీవితసమస్య అయింది. పరీక్షా ఫలితాలను తెల్సుకోకోరిన విద్యార్థివలె భయపడిపోయింది ఆడగడానికి. తీరా యతిగారిసమాధానం తన కాంక్షకు అన్యథా అయితే, తనకోరికల కోట గుభిల్లున కూలుతుంది. ఆశాలతను తాను చేచేతలా తెంపుకున్న దవుతుంది. ఆ నిర్భరస్థితికన్న, ప్రస్తుత సందేహావస్థయే గుడ్డిలో మెల్ల.

"అమ్మా! భక్తురాలు కుమారికకూర్చిన దండను రంగకైంకర్యము చేసి వత్తుమా!" అని కుమారికా సీతమ్మగార్లను తీసుకొని, మేమంతా కూర్చుని యున్న మంటపం ధరిసుంచి యతిగారు గర్భాలయంలోకి వెళ్ళారు.

---

# 23. కథ మియంసా కణ్వదుహితా!

ప్రేమ పాశ బద్ధుడై, కుమారిక కులవిషయ పర్యాలోచనా నిమగ్నుడై యున్న రంగారావు యతిగారిని, మా నడవకేసి వచ్చేటపుడు, గర్భాలయం లోకి వెళ్ళేటపుడు కించెత్ ప్రశ్నార్థకంగా వీక్షిస్తోన్నాడు. నిలబడి పెదిమలపై చేయి వైచుకొని ఆలోచనలో పడ్డాడు. దూర దూరంగా దర్శించిన విగ్రహంలా జ్ఞాపకమేదో కల్గుతోన్నట్టున్నాడు. ఆతిడి కను బొమలు, కనుదోయి మఱచిన పోలికను జ్ఞప్తికి తెచ్చుకొంటోన్న ప్రయత్నాన్ని సూచిస్తోన్నై. తల, జడలు, గడ్డం, మీసంకమ్మేసిన యతిగారి ముఖంలో తన స్థూలదృష్టికే ఏదైన పోలికస్ఫురించిందో, తన అనుమానానికి

యతిగారి గమనతీరులోని ప్రత్యేకత ఏదైన ఊతం ఇచ్చిందో, గర్భాలయంలోనుంచి రాదగ్గ యతిగారి రాకకై ఆతురతగా నిరీక్షిస్తోన్నాడు.

యతిగారు బైటకొస్తోంటే రంగారావు యతిగారి వంక, పదంపడి కుమారికవంక, కళ్ళు వప్పచెప్పి చూచి, భయ భక్తి సంభ్రమాలతో కృత ప్రణాముడై 'స్వామీ!' అని సంబోధించాడు.

యతిగారు జడల్లో చెయ్యిపెట్టుకొని, కళ్ళు ఒకపర్యాయం తపతపలాడించి, ఒక్క అడుగు వెనక్కేసి, పరకాయించి చూస్తో "రంగారావు? పిడుగా! యిక్కడున్నావా? డిగ్రీపుచ్చుకొన్నావా? బియ్యేనా, యమ్మేనా! అని అడిగాడు.

"యమ్మే" నన్నాడు రంగారావు.

"సబ్జెక్టూ?" అని అడిగారు యతిగారు.

"యికనామిక్స్" అన్నాడు రంగారావు.

"ఉద్యోగవిషయం తెల్సుకొని, ఉత్సాహపూరితంగా "అదృష్టవంతుడవోయి. ఇహం పరం కలిసే ఉద్యోగమేనోయి వికాసకేంద్రం పని. నీవు కాలేజీదినాల్లోనే ప్రజాసేవాభిలాషివి. నీ అభీష్టం సిద్ధించింది" అన్నారు యతిగారు.

యతిగారి అభినందనల పొందుతోన్న మా రంగణ్ని చూచుకొని మేము గర్వపడ్డాము. మా బావే ఏదోలా ముఖం పెట్టాడు. ఏమైతేం, 'వీడికి పదిరాళ్ళు చేసుకునే బుద్ధి పుట్టలేదు, చెప్పండి!' అంటాడో, 'వీడికి మడి మైలా లే' వంటాడో. ఏమి అపశ్రుతి మాటంటాడోనని నాకు డొక్కకొడ్తోనే ఉంది. చెప్పవద్దూ, అప్పటి కేమీ అనకుండా ఊరుకున్నాడు. రక్షించాడు.

మా సీతమ్మ రంగారావును దగ్గరకు పిలచి చెవులో ఏమో చెప్పింది.

"యతులకు పూర్వాశ్రమస్మృతులు తేవటం తప్పు అంటోందండి మా అమ్మగారు" అని చెప్పాడు మారంగడు.

"నాయినా, ఆసందేహం నీకక్కఱ లేదు. సన్యాసాశ్రమస్వీకారం ఎందుకు చేశానో, యిక్కడి కెందుకొచ్చానో బహుశః అడగదలచి ఉంటావు. అది సహజం. నేను మీ కాలేజీలో లెక్చరరుగా ఉన్నరోజు

ల్లోనే ప్రకృతి ఆరాధనానిమగ్నుడనై ఉండేవాడిని కద? నా బోటనీ క్లాసు 'కరిక్యులము'కు కట్టుడిఉండలేక, పరీక్షల దృష్ట్యా నా కర్తవ్యం స్వ్యంగా నిర్వహించలేక పోతున్నాని కించపడే వాడిని. నీవు ఇంటర్లో చేరిన సెకండుటెరం లోనే, ఆరేడేళ్ళ క్రితంమాట, నాకు భార్యా వియోగం తటస్థించి, అధ్యాపక వృత్తికి స్వస్తి చెప్పి, పుణ్యక్షేత్రాలు-అంటే, బ్యూటీస్పాట్సు,-సేవించుకుంటో వస్తోంటే, మీరంగాలయం నన్ను అకర్షించింది. అందుకు కొంతవరకు యిచ్చుటి ప్రకృతిశోభ, ప్రశాంత వాతావరణం, ఈ ఆలయప్రాంగణంలో బాగు కోరుతోన్న పుష్పవాటి, ఇచ్చుటి సత్కర్మానుష్ఠాన పరాయణులైన బ్రాహ్మణ్యం కారణమే మా!" అన్నారు యతిగారు.

సత్కర్మానుష్ఠాన ప్రసక్తి యతిగారు తేవడంతో మాబావ చెవులు రిక్కించి, నావంకచూచి, "చిత్తం చిత్తం. మీవంటి తపశ్శాలురు మా ఆలయానికి దయచేయడం, యిది మాపూర్వజన్మ కృతసుకృతాతిశయ మండి" అన్నాడు యతిగారితో.

"స్వామీ! నాఇంటర్ ఫస్టుటెరంలో.-మీరూ అమ్మగారు, తలితండ్రుల గోల్పోయిన ఒక కన్యను ప్రాణసమానంగా పెంచుకునే వారు. మీకు కంట్లోపాపలాగుండేది. 'పాప' అని పిల్చేవారు కూడా. కాలేజీ గంటల్లో తప్ప మీరు మీతోకూడా తిప్పుకునేవారు. వృక్షశాస్త్రరహస్యా లెన్నో షికారుసమయాల్లో మీశిష్యులతో పాటు మీరు చెప్పగా శ్రద్ధగా వింటోండేది. అమ్మాయి శ్రద్ధకు, బుద్ధిసైశిత్యానికి విద్యార్థులు అబ్బుర పడేవారు. అమ్మగారామెకు ఇంటివద్ద భారత, భాగవత గాధలు, వచనం చదివించి, చెప్పేవారు. ఇప్పుడు మీరు దేశాటన చేస్తోంటిరి. అమ్మాయిని ఏంచేశారండీ?" అని అడిగాడు రంగారావు.

"భార్యావియోగం కల్గినపుడు ఇంటో దక్షతలేక, బిడ్డను వదలిఉండ లేకే ఉద్యోగానికి రాజీనామా యిచ్చాను. మనశ్శాంతి కొరకు బిడ్డతో రామకృష్ణమఠస్వాముల సాన్నిధ్యానికి అనుదినం వెడ్తోండే వాడిని. ఏడా దికి వారు నాకు ఆశ్రమమిచ్చారు. ఆ పది పండ్రెండు మాసాలూ పగలు సాంఘిక సేవాకలాపం, రాత్రులు పురాణేతిహాసాల్లో శిక్షణయిచ్చి, అపుడు

నాకు ఉపదేశం చేశారు స్వాములు. 'నీకెందుకమ్మా?' అంటున్నా వినక, నాతో సమానంగా శ్రద్ధాభక్తులతో ఆశ్రమ కార్యకలాపంలో పాల్గొనేది. అంత చిన్నవయసులో ఒకనాడు శారదా పీఠంవద్ద ఒక్కర్తె ధ్యాననిష్ఠయై కూర్చుంటే, స్వామివారు నేనూ ఆందోళనపడి ఆటలకు పంపించాం. ఎప్పుడొచ్చిపడిందో, తిరిగా మేము చూసేసరికి పుష్ప వాటిలో మొక్కలకు నీళ్ళుపోస్తోంది. నేను యాత్రలకు వెళ్ళిననాటినుంచి నిరంతరాయంగా ఆశ్రమశిక్షణ పొందుతోనే ఉంది. శిశురక్షణ కేంద్రం' పుష్పవాటి అమ్మాయికి ఆశ్రమంలోనే నాస్థలాలైనాయి. మధ్యగా ఒక పర్యాయం అమ్మాయి భవిష్యత్తును స్వాములతో ఆలోచించి, నిర్ణయిం చాలని వెళ్ళా. సత్య శౌచామ్యత్వమ విజ్ఞాన సుయ నిబంధనలను, తూచాలు తప్పకుండా పాలిస్తోంది. రామకృష్ణ మఠవాతావరణం, అమ్మాయి హృద యంలో భారతజాతీయార్యాలైన త్యాగసేవల నెలకొల్పింది. సుశీల వ్రతులగు ఆస్వాముల సాన్నిధ్యం, ఏ సాంగాలయుంకును, ఏ విశ్వవిద్యా లయమందును బడయజాలని ఆత్మజ్ఞానం, పరోపకారబుద్ధి, దీనజనవాత్స ల్యం ఆమె కొసగింది. శ్రీశారదాదేవిని మఱిపించే కన్యారత్నం తమఆశ్ర మానికి లభించిందని వారు పొంగిపోయారు. అనుహాత్ముల మెప్పును పొందిన కన్యను నేనుపెంచానన్న భావం స్మరణకొచ్చినపుడు వివశుణ్ణి అవుతాను.

"నేనాపె భవిష్యత్తును నిర్ణయించడానికి వెళ్ళినరాత్రి, 'బిడ్డను బాలయోగినిని చేయ పూనుకున్నారా?' అని నాభార్య ఖేదిస్తోన్నట్టు. భాష్పపూరితనేత్రయై కలలో కన్పించింది. స్వామితో ఆలోచించా, నాఅన్నగారు ప్రఖ్యాతిచెందిన వకీలు పట్నంలో. ఆయనకు అమ్మాయి అంటే ప్రాణం. అప్పటికి స్వాములవారూ, నేనూ, అమ్మాయిని పంపుదామని ప్రయత్నిస్తే ఆమె యిచ్చగింపలేదు. ఒక్కమాటమాత్రం చెప్పింది. 'వివాహ కారణంగా నేవాక్షేత్రం విస్తృతమయే సందర్భం లభిస్తే స్వాముల అజ్ఞనందుకొని పరిణయం చేసుకుని అమ్మగారిఆత్మకు శాంతికలుగ చేస్తా,' నని నామనోక్లేశానికి ఉపశమనం కల్గించి, నాకు ధైర్యం చెప్పి పంపించింది. నేను ఆశ్రమం స్థాపించినా, స్థిరవాసం చేయ సంకల్పించినా, ఆశ్రమ స్వాము లకు తెలియపర్చవలసిందని నన్ను కోరింది. ఆపె ఆశ్రమంలోనే ఉంటోం

డగా రాయలసీమ క్షామంలో స్వాముల పనుపున నిత్యబోధానంద స్వామి వారి ఆధిపత్యంలో రాయలసీమ కెళ్ళి, క్షామ నివారణోద్యమంలో అతి శ్లాఘాపాత్రంగా పనిచేసిందని స్వాములు నాకేనాడో వ్రాశారు. అంతా పదిరోజులు కాలేదు, నే నా ప్రశంసను అప్పటికిప్పుడు అమ్మాయికి చెప్పాను'' అని ఆగారు.

రాయలసీమ క్షామపీడితులకు కుమారిక సేవచేసినట్టు కుమారిక మా సీతమ్మతోను, మా సీతమ్మ యింతక్రితమే గాదిదగ్గర మాతోను చెప్పిఉన్న విషయం కావడం మూలాన మా సీతమ్మ పొంగివచ్చే కన్నీటి కెరటాలను చీరకొంగుతో అద్దు కొంటోంది. కుమారిక భావపరంపరా సమాకుల చిత్తయై శ్రీరంగేశుని వంక చూస్తోంది. నేను శాస్త్రిగారు వార్లవంక తదేకదృష్టితో చూస్తున్నాము. కుమారిక రాయలసీమ సేవ మా రంగడి కింకా తెలియదు, ఈ పెరయే కాకూడదా అని కోరుకుంటోన్నా డేమో కాని.

అంచేత కించదాందోళనాయుత మైన గాత్రంతో, ''స్వామీ! పది రోజుల లోపలే నిత్యబోధానంద స్వామివారి ప్రశంశ అమ్మాయికి చెప్పా నన్నారు. కొన్ని మాసాలనుంచి మీ రిచ్చటే ఉంటున్నారని విన్నాను. అయితే అమ్మాయి ఎక్కడున్నట్టండీ ?'' అని అడిగాడు రంగడు.

ఈ ప్రశ్నతో వాతావరణం బహు (టెన్సు) గాఢమైంది. యావన్మందీ యతిగారి సమాధానానికి, ఉచ్ఛ్వాస నిశ్వాసాలు తీయకుండా నిరీక్షి స్తున్నాము. నైశ్శబ్ద మావరించింది. కుమారిక మా సీతమ్మను చేతులతో పట్టుకొని ఉంది. మా సీతమ్మ మహావాతముచే గదలుతోన్న కదళీతరు కాండము వలె గడగడ లాడ్తోంది. తన జీవితాశయానికి, ఏదైతే ప్రబ లావరోధంగా కన్పిస్తోందో అది తొలగునో, కలుగునో, తేలనున్న పరీక్షా సమయం కావడం వల్ల, రంగారావు మనసులో చండప్రచండమైన తుపాను రేగియుండాలి. మునిగాళ్ళపై యతిగారి సమాధానానికి వేచియున్నాడు.

''నాయనా, రంగారావు! నే నీ రంగాలయాన్ని ఆశ్రయించి యున్నానని తెలిసి, స్వాముల ననుజ్ఞ పొంది పది పంద్రెండు రోజులై యిచ్చటకు వచ్చింది. నేను మాధుకరవృత్తితో జీవిస్తోండడంచేత, యిచ్చటనే ఒక

శ్రోత్రియకుటుంబంలో సేవచేస్తూ కాలక్షేపం చేస్తోంది. ఇంతక్రితమే తన్నాదరిస్తోన్న పుణ్యాత్మురాలిని పరిచయం చేసి నన్ను ధన్యుణ్ణి చేసింది. ఈమెయే ఆ మహాయిల్లాలు" అని మా సీతమ్మను నమస్కరిస్తూ యతిగారు చూపేసరికి, మేమందరం సంభ్రమాశ్చర్యదివ్యానందములకు లోనైనాం. భాష్పజలపూరితలోచనుల మైనాము. మా సీతమ్మ కుమారికను గాఢంగా ఆశ్లేషించి, చంటిపిల్లలా ఎక్కిళ్ళురానిచ్చింది. పాతాళం వీడి వచ్చిన పాతాళగంగలా ఆమెకు అశ్రులు పొంగి వచ్చినై.

రంగారావు యింటికొచ్చిన నాటినుంచి, మా బావ విముఖత్వ కారణంగా. మా సీతమ్మ పడ్డ చిత్తక్షోభ యింతా అంతా కాదు. విషయం వేరైతే. ఆమె మంచంపట్టును. తత్కాలజనితావేళ పరంపరా వశంవదుడై మా రంగడు టోపీ ఎగరవేసి పండుపట్టుకునే పోజులో నున్నాడు.

కోనసీమశాస్త్రిగారు బ్రహ్మానందభరితులై, కుమారిక వంక చూస్తూ 'కథమియంసా కణ్వదుహితా' అని యీ అభిజ్ఞానశాకుంతల సదృశ సన్నివేశానికొక మనోహరమైన విద్వత్సమీక్ష నిచ్చారు. నాకోరికపై శాస్త్రిగారు యీ అర్థం చెప్పారు.

"కథం=ఎట్లు !

ఇయం + సా=ఈముగుద:

కణ్వదుహితా=కణ్వమహర్షి యొక్క కుమార్తెయా ?" అని.

---

# 24. బావకు దిగడ్డ ధర్మసందేహం

మా బంధుకోటి కందరకు పెద్ద బరువు దింపు కొన్నట్టుంది. హృదయాలు తేలికైనై. మా యెదుట యామినీ తమస్సులువిడిపోయి, యేదో మహత్తర ప్రపంచం ప్రత్యక్షమౌతోన్నట్టుంది. 'భగవంతు డెంత చిత్రసంఘటనను సంకల్పించి నవరసభరితమైన ఈ నాటకమాడించాడు!' అని నాహృదయం ఆనందపు టెల్లువల్లో మునకలు వేస్తోంది. గుళ్ళో చేరిన వందమంది బందుగులము కలకల్లాడుతోంటే, మా బావముఖమే, శూలనొప్పి పోయినా, నులినొప్పి బాధ దిగడ్డవాడి ముఖంలా ఉంది.

ఆ నళినొప్పికి కూడా మాత్ర యిప్పుడే పడ్డం మంచిదనుకొని "బాగా జరిగిందోయి బావా!" అన్నా.

"కాని, ..." అన్నాడు.

"ఏమిటింకా ఆ కానీ, అర్ఘణా? ఏదో కొసరు దిగదుడ్చుకునే కూర్చున్నావు!" అన్నా.

నన్ను గోడచాటుకు తీసుకెళ్ళి "యింతకు ఈయతి, యతి" అని నసిగాడు.

"బాహ్మడేనా, అనేనా నీ శిరోవేదన? ఊరుకో, ఎవడైనా వింటే నవ్విపోయేను. ప్రపంచానికంతకు బ్రాహ్మణ్యం నీ నొష్టనే వ్రాసిఉన్నట్టు చేస్తున్నావు హంగామా. మరీ యింత చేటు మతి పోతోందేం. ఆపూట కాపూట. అందరి లాగ సృష్టిని చూస్తే సిష్టులం కాకపోతామేమో నని, నీకు, నీఅవధాన్లకీ ఏదోరోగం బయల్దేరింది. మీరు కుళ్ళంకలు పనిగట్టుకొని లేవతీసి, అదంతా సంస్కారబలం అనుకుంటున్నారు లాగుంది. లేకపోతే ఏమిటి ఈ దౌర్భాగ్యం? కుమారిక 'సాధు, సరళవర్తిని, మేధావి,' అని నువ్వు వప్పుకుంటున్నావు. బహుపుణ్యాత్ముకరాలని మనకు ప్రత్యక్షప్రమాణాలున్నై. పరులకష్టం భరించలేని కరుణార్ద్రహృదయం కలదని అడుగడుగునా చూస్తున్నాం. పంచభూతాలూ అవునంటున్నై. ఇదేదో నీప్రయోజకత్వమనుకుంటున్నావు కాబోలు? మీఅమ్మాణీ పెండ్లి తనచేతిమీద చేసిం నువ్వు లగ్నపత్రిక పట్టుకొని ఊరేగడం తప్పితే చేసిం దేమిటి? అన్నప్రాశన అక్షరాభ్యాసం దగ్గరనుంచి విజ్ఞానవేత్త, ఉత్తమోత్తముడు ఈ యతిగారి పవిత్ర కుటుంబంలో పెరిగిందీ! తదాది నేటివరకు తపోనిష్ఠాగరిష్ఠులైన మహర్షుల సాన్నిధ్యంలో అసారమైన వైదుష్యం. గుణశీలసంపదా గడించిందీ! ఇంత ఉత్తమసంప్రదాయం యతిగారు చెప్పి చూపెట్టినా, ఎంతసేపూ నీకు నీఉద్ధరిణి చప్పుళ్ళే కాని. యిచేసి నీ చెవికెక్కలేదన్నమాట? ఇంతమంది మహోల్లాసంగా కేరింతాలు కొడ్తోంటే 'అయినా' అంటో నీచేదస్తం ఊరేగించి ఏమి బాధపడిపోతున్నావోయి! మీతమ్ముడు కోనసీమశాస్త్రీగారు సూచించినట్టు శకుంతలే కోడలుగా వచ్చినా, నీ శ్రోత్రియపుతిక్క తిరగ లేదన్నమాట. పైగా, యతిగారి. కులాన్ని సంశయించ

బోతావు. పైకి అను తెలుస్తుంది. వందమంది పెళ్ళివారూ నీకంఠం నొక్కుతారు—" అని రాబోయాను.

అప్పుచేసి "అశకుంతల ఉపమానానికే భయపడ్తున్నానోయి. అది ఏమంత సమంజసంగా ఉంది, శకుంతల రాజకన్య అయిందేమోనోయి!" అన్నాడు.

"అంటే? నువ్వనేది బ్రాహ్మణింట పెరిగినా కుమారిక అదిగో శూద్రాంగన కావచ్చుననా? గొప్ప లాపాయింటే తీశావు నీవు కాగా. ఓహోహో! ఏమి ఉపజ్ఞ. ఈశుభసమయంలో మేమంతా కట్టుకట్టుకునివెళ్ళి, తాలూకాఫీసులు గాలించి, కుమారిక జననరిజిస్టరు నకలు తీయించి తెచ్చి నీకు దాఖలు చేసుకోమంటావన్న మాట? ఎల్లా ప్రాణం వచ్చిందోయి. ఈ అమాంగళ్యం మాటకు? వారి శుభాశుభాలులేకుండా పోతున్నావు! ఇంతచేలు అగ్నిహోత్రావధాన వయ్యావేం ఖర్మం! మా ప్రాణాలకు నీచాదస్తపు అదర్శాల్లో మన్నుల్నందర్నీ వడపొయ్యాలని చూస్తావు. శకుంతల నచ్చునివాడికి పెంచిన కణ్వుడు, కన్నవిశ్వామిత్రుడు మాత్రం ఏం నచ్చుతాఁ! విశ్వామిత్రుడు బ్రహ్మర్షి అయితే మాత్రమేమి? మొదట్లో క్షత్రియుడు నీకు పనికిరాడు గద. మరి కణ్వజన్మక్రమం పురాణాలు గట్టిగా వెతికితే, ఎక్కడ్లో ఏకుండగానో జాగ్రత్త పెట్టినబాపతు జనన మవుతుంది. కుండ అనేటప్పటికి కంఠ పట్టుకుంటావు. ఊరగాయకుండలు మైలపడ్డాయనేగా యిరువదినాల్గుగంటలూ నీగోల యింట్లో. పురాణాల్లో చెప్పబడ్డ వాళ్ళంతా మడి, మైలా లేకుండా పుట్టినవాళ్ళనేగా, నీకూ నీఆవధాన్లకి పురాణాలంటే నిరసన" అని చవచమిడి తిట్టా. నాకుకోపం ఆగలేదు.

"కాదోయి, వినుపించుకో. వివాహకార్యంలో కొందరవాలు పనికిరాదోయి. అంతా పిచ్చినిపడితే నేనెందుకు పడాలి? అయ్యో, అయ్యో! బావా! అంతా సిద్ధమైనట్టు నీ మేనల్లుడు అయుతికి సాగిలా పడ్తున్నాడోయి. ఇదంతా ఏదోగాంధర్వం లాగుంది. బ్రాహ్మణ్యానికి గాంధర్వవివాహాలు చెప్పబడ లేవోయి. తీరా ఆ యతిగారు, ఏదో కిరస్తానీ మతంలా ఇద్దరి చేతులూ కలిపి, ఆశీర్వదించి పొండంటే అప్పైన మనం కాదంటే, అదేం బెడిసికొడ్తుందో నోయి. యతితో పని.

అదటుంచు, యిది చూచావా? మనం చిన్నసంసార్లం, కుమారిక సంబంధాలన్నీ పెద్దవోయి. ఇదంటే యిటు గ్రామాధికారీ లక్షాధికారీ మున్సబు, అటు తపశ్శాలి యతిగారూ ప్రాణ మిస్తోన్నారు. కుమారికను మనం అనుపాజ్ఞల్లో ఉంచగలమా? ఆడది ఇంత మేధావి, అంగబలం కలదైతే, అబ్బాయికి ఒబ్బిడి కాపురం చేసుకొని, నాలుగు రాళ్ళు వెనకేసుకోడానికి వీలిస్తుందా? ముందుమాట, బీదసాదలకు ఇదిచేసే అన్నదానాలకే చాలదేమోనోయి అబ్బాయి సంపాదన! దీన్ని పల్లెత్తుమాట అన్నామంటే, మునసబు అధికార బలమంతా చూపెట్టి ఈవయస్సులో నేనేదో టీకాతేయించుకున్నానుకానని ఏకేసో పెట్టి హాతమారుస్తాడు యీవూళ్ళో. పట్నంలో యతిగారి అన్నగారు పెద్ద వకీలట, ఆయనకూ ప్రాణమట కుమారిక. యతిగార్కి కష్టంతోస్తే, శాపబలంతో మన్ని భస్మీపట్లంచెయ్యగలడు. ఇంకో మతస్వాములుపైన పొంచే కూర్చున్నారు దీని చెప్పుచేతల్లో. ఇదెక్కడి సంబంధమోయి నాయిన! అబ్బాయిలకు పాఠంచెప్పేటంత కాలేజీ పెద్ద చదువులు చదువుకుంటోన్న అమ్మాయిలు కాపరానికొచ్చే చోట్లు చూస్తున్నాము అక్కడక్కడ. అటువంటివాళ్ళ చేత అత్తమామలు, యిక్కడచెంబు అక్కడ పెట్టమని చెప్పి బ్రతుకుతారుటోయి! వాళ్ళందర్నీ తలతన్నిన పాండిత్యమోయి కుమారికది. ఎటు చూచినా, ఇది మనకు తలకు మీఱిన సంబంధమోయ్! అబ్బాయిని యతిగారి పాదాలదగ్గరనుంచి లాగైవోయి నీకొచ్చిన భయంలేదు పొరుగూరి వాడివి" అన్నాడు.

ఏవైతేకుమారికను కోటి కోడలు గా తెచ్చుకోడానికి కళ్ళకు కట్టినట్టు కన్పిస్తోన్న కారణాలో, అవే పెద్ద విపత్తుల్లా కన్పించే ఈతడి విరుద్ధ దృక్పథానికి, కోపమూ వచ్చింది. జాలీ వేసింది నాకు.

"చాల్లేతూ, నువ్వూ నీగడుస్తనమున్నూ, నేర్చుకు పోయావు. చిన్న సంసార్లమంటో, ఈ తేలుకొండెం మాట ఎక్కడ నేర్చావు? తగిత్తే చితికి పోతావేమో అన్నట్లు పైకి కన్పిస్తావ్. తీరా ముట్టుకుంటే కొండెం ప్రయోగిస్తావు. పైకి అతిసౌమ్యమా మాటలో. లోపల అంతా వక్రపు ఆలోచనా? రాజబాట చూపెడ్తే, పోనిద్దూ చిన్నసంసార్లమంటో సందులు

గొంతులు వెతికేవాణ్ని ఏమనాలి? అటువంటి పరమపవిత్రురాలికి అత్త మామలపట్ల విసయం లేకపోవడమేమిటి? నువ్వు పల్లెత్తుమాట ఆమెను అనాల్సిన అవసరం ఏం కలుగుతుంది? తోచకనా, సరదాకా? తర్వాత మాట—గ్రామాధికారికి మీకుటుంబంమీద ఏర్పడ్డ ఇష్టం ప్రేమస్వరూపం, యతిగారి ఆశీర్వాదబలం, ఏసంస్కారికీ లభించని యింత శ్రేయోదాయక మైన వసతి వరప్రసాదంగా కుమారిక మీకు యిస్తే వాళ్ళు మిమ్మల్ని భస్మీ పటలం చేస్తారంటో ఈదుర్బుద్ధి ఎందుకు కలగాలి ఖర్మం కాకపోతే? 'బ్రాహ్మణ్యం.' 'చిన్నసంసార్లం' — ఈరెండు అస్త్రాలూ చేతబట్టి చిందులుత్రొక్కుతో బంధుజనాన్నందరినీ సలగత్రొక్కేస్తోంటివి. ఈ పాటికి వాటిని వరలో పెట్టె. నువ్వన్నట్టే. ఎవరో, ఏమూల ఉన్నాడో తెలియని రామశాస్త్రుల్ని కుమారిక సంబంధకారణంగా, కృష్ణాగోదావరీ మధ్య గొప్ప సంసారి అయ్యాడని అతిశయపడు. పేరొచ్చి పోతోందని బాధపడ్డావేమోయి" అని ఘాటుగా పెట్టా. పెట్టాల్సిన నాలుగూ.

దాంతో అబ్బాయికి తిక్కతిరిగి, యితే నడువు," అంటో ముఖ మంటపంలోకి వచ్చాడు.

ఇప్పటికి మాసీతమ్మకు మాటతిరిగింది. యతిగారి సమక్షంలో "అమ్మా, కుమారీ! మాపంక్తిని భోంచెయ్యనని నియమం పెట్టుకొని అంతబాధ పడ్డావెందుకమ్మా?" అంది.

"ఈఊరువస్తోనే ఆలయంలో నన్ను కల్సుకొని, నాతో ఈవిషయం చర్చించే మీయింట ప్రవేశించింది. ఒకటి రెండునెలల మాత్రమే యిచ్చట ఉండవచ్చింది. సేవ చేసికాని పరాన్నం భుజించని కట్టుబాటు రామకృష్ణ మఠస్థులది. అందుచేత తొలుతనే మీతో పనిమనిషినంది. ముందే పనిషరతు పెట్టుకోకపోతే, అమ్మాయి ముఖవర్చస్సును చూచినవాళ్ళు, అమ్మాయిని పనిచెయ్యనీయరు. పని చెయ్యకపోతే ఆమె నియమంప్రకారం ఉపవాస ముండాలి. మరి పంక్తి భోజనవిషయం—రామకృష్ణ మఠస్థులకు వేదం ప్రమాణమే అయినా, వారి దరిద్రనారాయణ సేవాక్రమంలో, కులమత భేదాల కతీతమైన ఒక ఉత్తమోత్తమ ఉచ్ఛస్థాయి వారికి ఆత్మప్రబోధ మవుతుంది. ఏకులం అని పరీక్ష చేస్తే సేవ కుంటుబడ్తుంది కద. అచ్చటి శిశు

రక్షణకేంద్రాల్లోను, క్షామనివారణోద్యమాల్లోను, అష్టావశవర్ణాల బిడ్డలను ఆడించి, లాలించి, అన్నం తినిపించే అలవాటులో ఉంది అమ్మాయి. కాని రెండునెలల భాగ్యానికి, యిక్కడ మీ శ్రోత్రియకట్టుబాట్లను ఎందుకు పాటించకుండా పోవాలి? బ్రాహ్మణనియమావళిని ఆదరించి గౌరవించ బూనియే ఆకొద్ది యిబ్బందీ పడింది. బ్రాహ్మణకుటుంబంలోనే ఉండిపో దల్చుకుంటే కించెత్ ప్రాయశ్చిత్తం చెప్పారు." అన్నారు యతిగారు.

'ఒక్క గట్టి ప్రాయశ్చిత్తం చేయించి సమస్తకిల్బిషాలను కడిగైకలను. అది నాచేతులోపనే!' అనుకున్నాడు కాబోలు రామశాస్త్రుల్లు, ఆయన ముఖంలో ఆనందరేఖ ఉదయించింది.

ఇష్టాగోష్ఠిగా, మా నీతమ్మ, "కుమారిక మాయింట ప్రవేశించింది మొదలు, మాఇలవేల్పు కామేశ్వరియే మాయింట వెల్సిందనుకున్నా నండీ!" అంది.

"నా పూర్వాశ్రమంలో నాగృహిణి కూడా అమ్మాయిని యిలవేల్పుగా భావించేది. రామకృష్ణస్వాములు 'శారదాదేవి' అనే వారు. శారదాదేవి అన్నా, ఇప్పుడు శాస్త్రిగారు సూచించినటు శకుంతల అన్నా, ఇలవేల్పు కామేశ్వరి అన్నా, కాక మీరు నామకరణంచేసినట్టు కుమారిక అన్నా, మా ముద్దుపేరు పాప దేనికీ ప్రతిబంధకం కాదన్నారు" యతిగారు.

"అయితే మన రంగడు పేరుపెట్టి పెళ్ళిచేసుకోవాలన్న మాట!" అన్నాడు మాబావ రామశాస్త్రుర్లు, నాచెవిలో.

"రక్షించావు నాయినా. ఇప్పటికి శుభం పలికావు. పేరుకేమొచ్చె, పేరు పెళ్ళినాడే చూచుకోవచ్చులే" అన్నాను మాబావతో.

---

# 25. కల్యాణ పరంపర

## 1. గ్రామమునసబుగారి హితవు

యతిగారితో మాట్లాడుతో యావన్మందీ పువ్వవాటి వద్దకు వచ్చాము. అస్తంగత సూర్యబింబారుణదీధితులు తరుశాఖలకు కొత్తరంగులు పూస్తున్నై.

అనిమిషానికానిమిషం సర్వవర్ణాల్లోని స్పష్టతా కరగిపోయి ఏక వర్ణంలో కలిసి పోతోంది. పెండ్లివారి బాలబాలికలు, పుష్పవాటిలో నుంచి తుంపుకొచ్చిన పూలు అందందు రాలి, 'పొదిలిపువ్వులవాన పోరి పోరి గురిసె' అన్నటుంది ఆ ప్రదేశం. ఆలయ ప్రాంగణ వృక్షాల గూళ్ళను చేరుతోన్న పక్షుల కలకలరావాలు వినవస్తోన్నై. శ్రుతిసుఖ భ్రమరగీతాలు చెవిని పడ్తోన్నై. మందపవనాలు మందయానల కేశబంధాల్లోని పరిమళాలను గుబాళింప చేస్తున్నై. ప్రకృతికావ్యం లోని ప్రతిపద్యం ప్రణయోద్రేకాన్ని పెంపొందిస్తోంది.

ఆలయముఖద్వారంలో కలకలం. 'మెల్లిక్కడానికి జబ్బుపట్టుకోమంటే, మెలి పెడ్తావేం ఖర్మంరా. ఇకపో. ఇంటిదగ్గరుండు' అన్న కేక వినిపించింది లోపలకు.

"ఆయెదంచంకలో దేంటో, జాగ్రత్త దొరగారు" అని అవతలమనిషి అంటే, "దానిఊసు నీకెందుకోయి యింటి కెళ్ళమంటే!" అని మునసబుగారు వారి పెద్దపాలేరును ఇంటికి కసిరేసి కర్రపొత్తంతో ఆలయంలో అడుగెట్టారు. లోపలి గుమ్మంలోయున్నరజకుడు దారి చేస్తోన్నాడు. రంగారావు ఎదురుగుండా వెళ్ళి మునసబుగారిని తీసుకొచ్చాడు.

"కాస్త స్వస్థత చిక్కినట్టేనా!" అని కుశలప్రశ్న చేశారు యతిగారు.

"చిత్తం స్వామీ! 'మీపాదతీర్థం' అని గుక్కెడు మావాళ్ళు కంఠంలో పోసారట. గుటకడ్డం ఏమిటి, కును కట్టడం ఏమిటి. మూడు నాలుగురాత్రుల నిద్ర ఒక్కరాత్రి తీసేశానండి నిద్దట్లో జ్వరం దిగజారింది. కళ్ళు తెరిచాటప్పటికి కణికలాగుంది వొళ్ళు. 'ఏమో! ఎవరికొచ్చిందో జ్వరం' అన్నటుందండి. యిందాకా రంగారావుగారు నన్ను వీధిలోకి కేకేసేసరికి ఎండవేళ కదలొద్దని ఆంక్ష చేశారు మావాళ్ళు, కాని మీ పాదాల మీద ఎప్పుడు పడుదునా అని మధ్యాహ్నంనుంచీ నాప్రాణాలు ఇక్కడే ఉన్నాయండి" అన్నాడు మునసబుగారు.

యతిగారు 'ఆ! ఆ! వద్దువద్దు' అంటోండగానే మునసబుగారు కర్ర ఎత్తి యతిగారి వంకే చూస్తో ఓప్రక్కగా పడేశారు, దభీలునచప్పుడయేలా. రంగారావు, మరో పెద్దమనిషి, ఎందుకైనా మంచిదని మున

సబుగారి చరోజబ్బా గట్టిగా పట్టుకొన్నారు. ఏమీలేదు. మునసబు గారు సాష్టాంగ పడదామన్నా, ముఖ్యంగా పడ్డాక లేవడమన్నా అదో పెద్ద క్రతువు. అది జనస్తోమతుతో కూడుకున్న పని. నయమే మునసబు గారు సాష్టాంగపడ్డం మానేశారు. యతిగారు కర్రత్తిని మునసబుగారిచేతి కిచ్చి మునసబుగార్ని ఆశీర్వదించారు. కర్రఎత్తినపుడు దూరదూరంగా పారిపోయిన పిల్లలు దగ్గరకొచ్చారు. రంగారావు మునసబుగారిచేత ఆలయ ప్రదక్షిణ చేయించాడు.

అప్పుడు యథాలాపంగా అడిగినట్లు రంగరావును మునసబుగారు కుమారిక విశేష మడిగితే, యతిగా రప్పుడు చెప్పిన విషయమంతా సవిస్తరంగా రంగారావు ఆయనకు చెప్పాడు. తన అభిప్రాయమేదో నిజమే నన్న ఆనందం మునసబుగారి ముఖంలో తాండవించింది. రంగదర్శనం కూడా చేసుకొని, మునసబు రంగారావుగార్లు యతిగారి వద్దకు వచ్చారు.

“అమ్మా! మునసబుగారి దోసిట్లో నీచేత్తో ఈపూజాపుష్పాలు వేసిరా, అని కుమారికకు, “మునసబుగారూ, ఈమె భక్తురాలు, ఈమె మీ కిచ్చే పూలను జుట్టుముడిలోను చెవిలోను పెట్టుకోండి. పాండురంగడు మీకు ఆయురారోగ్యాలను ప్రసాదిస్తాడు” అని మునసబుగారితోను యతిగారు చెప్పగా వా రట్లు చేశారు.

“మీచేతిలో పెరిగినబిడ్డ పుణ్యాత్మురాలు కావడం వింత కాదండి. కాని నన్నోచింత ఏడిపిస్తోంది అండి. ఎవరో ‘పనిమనిషి’ అంటే, రామ శాస్త్రుల్లగారి పందిరిగుంజలు పాతేటప్పుడు, ఈ అమ్మచేత నీళ్ళుమోయించా నండి. చేసిన పాపం చెప్తే పోతుందని తమకు చెప్పుకుంటున్నానండి. ‘ఈవిడేమిటి, పనిమనిషేమిటి?’ అని అంతసేపూ నామనసు బాధ పడ్తోనే ఉందండి” అన్నాడు మునసబుగారు.

“అమ్మాయిచేత పనిచేయించడమే దోషమైతే, మీకన్నా దోషులు రామ కృష్ణస్వాములు. వారి ఆశ్రమం చాకిరీ అంతా అమ్మాయి చేస్తుంది” అన్నారు యతిగారు.

రామకృష్ణస్వాములతో గొప్పపోలిక తెచ్చుకోడానికి అనకపోయినా, అంతవరకు మాట్లాడని మాబావ “తద్విషయంలో మేమూ దోషులమే నండి, మునసబుగారూ” అన్నాడు మాబావ.

మునసబుగారు, తిరిగినంత మేర మెడను వెనక్కు తిప్పి, "ఉన్నారండీ యిక్కడ రామశాస్త్రుల్లుగారూ? మీ అబ్బాయిగారికి గొప్పఉద్యోగమ యిందటగా? మనదేవుడు పేరుగూడాను. చాలా బుద్ధిమంతుడు. నేనంటే ప్రాణం. ఎప్పుడు సెలవులకొచ్చినా, నేను దూరప్పొలాన్నున్నా కూడా 'మామా! బాగున్నావా?' అనివచ్చి తప్పకుండా పలకరించి వెడతాడు. గొప్పఅంతే స్తండి. ఇంతకన్నా బుద్ధిమంతుడూ, చదువుకున్నవాడూ, ఆవ హైనవాడూ, ఆ అమ్మాకైనా ఎక్కడ దొరుకుతాడు? ఇంకా చూస్తారేమండీ రామశాస్త్రుల్లుగారు? నా కాట్టే మాటలు చేతకావు గాని, యతిగారి కాళ్ళు పట్టుకోండి, ఆ అమ్మను అబ్బాయిగారి కివ్వమని. యతిగారిని కనిపెట్టుకొని ఉన్నావంటే, వారు మరోచోటుకు వెళ్ళరు. వారుంటే మనఊరికి రోగాలూ రొచ్చులూ ఉండవు. మనఊరిక్షేమం కోరి చెప్పేమాటండీ నాది, మీబ్రాహ్మలకు నేను చెప్పదగ్గవాణ్ని కాకపోయినా" అన్నాడు మునసబు.

ఆ పెద్దగృహస్తు బోళాబోళీగా, నిష్కాపట్యంగా, తోచింది తోచినట్టు చేసిన ఉపపాదనతో, నాకూ, కోనసీమశాస్త్రిగారికీ బరువు దింపినవాడయాడు. అమాటే మేమంటే మమ్మన్ని ఏమంటాడో బావావ, వత్తి తిక్కశంకరాయి. అతడికి తోచినవిషయమే అయినా, కావాలసిన వాళ్ళం చెప్పామంటే బిగిసిపోయే గుణం. అక్కడనుంచి మాటనిలబెట్టుకోడానికి రసాభాస చెయ్యగలడు.

కోనసీమశాస్త్రిగారు మునసబుగారి నుద్దేశించి, "పుత్రమిత్ర కళత్ర సుహృద్బాంధవు లంతా ఐక్య కంఠంతో, కోరుతోన్న ఈ సంధానానికి అనుజ్ఞ యిప్పించండని మా అన్న యతిగారిని నిస్సంశయంగా కోరుతాడు" అనిచెప్పి, "ఏమోయి? అన్నా, అంతేకదూ?" అని మాబావ రామశాస్త్రులను అడిగారు.

"చూచావా? మాతమ్ముడు నిండుసభమీద నన్ను ఏలా వొరకంలో పెట్టాడో? తానుపెంచినవాడు, సరే, కన్నవారెవరో అమాట వీసమెత్తైనా రాల్చలేదు. అది దాచేసి యతిగారు మాట్లాడితే ఏమనను, నేను ఊటిపెట్టుకోవాలి?" అని లోకంఠంలో నాతో అన్నాడు.

సభంతా మాబావవంక చూస్తున్నారు. 'రామశాస్త్రుల్లుగారూ!' 'రామశాస్త్రుల్లుగారూ!' అని ఒకటిరెండుకేకలుకూడా సభలోనుంచి వినుపించాయి.

ఇక, తప్పక, 'ఏమి దంపూరావచ్చిందిరా భగవంతుడా!' అని గొణుక్కుంటూ నుంచుని, "పిల్లను కన్నవారెవరో కాని చాలా అదృష్టవంతులండి. పిల్ల మీ చేతుల్లో పడి, ఇంతదైంది" అన్నాడు.

చూచారా, గడుస్తన లోపం లేదు మాబావకు. మాబావ అంతర్యం యతిగారు గ్రహించి, కాకపోయినా, కన్నవారి మాటవచ్చింది కాబట్టి తద్విషయం చెప్పారు యతిగారు.

"అనోచిత్ర సంఘటన" అని ప్రారంభించారు, "నేను ఉద్యోగానికెళ్ళిన తొలిరోజుల్లో మా కళాశాలను అంటి ఉన్న ఉత్తరపురోడ్డు చివరమేడలో ఓ కోటీశ్వరుడుండేవాడు. అమ్మాయి వారి ప్రథమకళత్రానికి కలిగినబిడ్డట. ఆయన ద్వితీయం చేసుకున్నాడు. ద్వితీయానికి పుష్కలంగా సంతానం కలిగింది. అమ్మాయి తల్లిలేని పిల్ల కావడంగా, అమ్మాయిని ఆయన ప్రత్యేక శ్రద్ధానురాగాలతో వ్యాపార వ్యవహారాల కెళ్ళినపుడు కూడా కారులో ఎక్కించుకొని, ఇంటనున్నపుడు భుజాల నెక్కించుకొని వదలిపెట్టకుండా త్రిప్పుతోంటే, సంకుచిత హృదయ సవిత్తల్లి అమ్మాయిని కంట్రగించుకొంటోంది. కాపరాని కొచ్చిన మూడవరోజున ఆవిడచేసిన మొదటిపని కోటీశ్వరుని ప్రథమభార్య ఫోటోను, అమ్మాయి ఫోటోలను మేడలనుంచిలాగేసి, పొడుంచేసి 'మునిసిపల్ డస్టుబిన్ను' లో గిరాటెట్టించడం, అని ఆమహాతల్లి కితాబు. అమ్మాయి మంచి రూపసి, చురుకైంది కద. అంచేత కోటీశ్వరుణ్ని సందర్శించే వాళ్ళందరూ ఏర్పాటుగా అమ్మాయిని ముద్దాడి వెళ్ళేవారు. సవిత్తల్లి కది మరీ పుండుమీద కారంచల్లేది. సవిత్తల్లికి ఈర్ష్యాగ్ని రవిలి, అమ్మాయికి ప్రాణసంకటమయే రెండుమూడు దుస్సంఘటనలా యింట సంభవించినై.

"అమ్మాయిని చెయ్యిపట్టుకొని షికారుగా వీధివెంటవస్తో నన్ను తారసిల్లినపుడు రెండుమూడుదఫాల నాకష్టసుఖాలడిగి కుశలప్రశ్న చేశాడు.

"బిడ్డలు లేరా ?" అని ఆఖరున అడిగి, 'విష్ణు' చేసి, వెళ్లేంతవఱం ఒక పరిపాటైంది ఆయనకు. బిడ్డలు లేకపోవడమే సౌఖ్యమనుకొని నా సౌఖ్యానికి సంతోషిస్తున్నాడో, అది మహాలోపమని నాలోపానికి విచారిస్తోన్నాడో, అప్పట్లో నాకు వారిఅంతర్యం తెలియలేదు.

"ఒకనాడు నన్ను గుమ్మంలోచూచి, నే నాహ్వానించలేదన్న సంశయం లేకుండా అమ్మాయితో లోపలి కొచ్చాడు. నన్నాయన యోగక్షేమా లడుగుతోనే ఉన్నాడు, అమ్మాయి లోపలిగుమ్మంలో ఉన్న నాగృహి ణిని చూచి, చిర్రున పరుగెత్తి ఆమెవళ్ళో కూర్చుంది. మాతృహస్తం సోకని శిశుహృదయం తెలియ చెప్పకోలేకపోయినా, అమ్మకు వెతుకు తాడ్తోంటుంది కాబోలు. అతిసౌమ్యమైన ముఖాకృతి నాభార్యది. అమ్మాయి 'అమ్మా!' అని నాభార్యను సంబోధించింది. బిడ్డలు లేరని నాభార్య అంతచేటు పరితపిస్తూందని నా కానాటిదాకా తెలియదు. 'పాపా!' అని తప్పిపోయి దొరికిన పిల్లను కౌగలించుకొన్నట్లు గాఢంగా అక్కున చేర్చుకొని, ఆనందాశ్రులతో అమ్మాయి మూర్ధం తడు పుతో,అమ్మాయిబుగ్గలమీద ఎంతసేపుముద్దులిడింకో నాభార్య. చెప్పలేను.

"నాభార్య పిల్లలపిచ్చికి ఆయన నన్నుమాచి నవ్వుతాడని లజ్జితుడనై నేను అమ్మాయిని నాభార్యచేతుల్లోంచి తేబోతే, 'అన్యాయమండీ, లెక్చరరుగారూ!' అని ఆయన నన్నువారించాడు. బిడ్డలులేంది అయినా మాతృత్వంలోని మహనీయత్వంచూపిన నాభార్యనుచూచి ముగ్ధుడ య్యాడో. తన బిడ్డను మరోరు ముద్దాడుతోంటే కలిగే సామాన్యానంద మేనో, ఆయన ముఖంలో ఆనందం తాండవించింది.

"అమ్మాయికి నాటినుంచీ, నాభార్య అమ్మ అయింది. అమ్మాయి మాయిద్దరికీ పాప అయింది. మళ్ళావచ్చినపుడు, 'నేను అమ్మదగ్గరే బువ్వ తిని బజ్జుంటాను, నువ్వువెళ్ళిపో నాన్నా!' అనే స్థితికొచ్చింది అమ్మాయి.

"'అమ్మగారింటికి వెడాం రా నాన్నా!' అంటో, ఒకరోజున తండ్రిని లాక్కొచ్చి, నన్నుచూపి 'ఆనాన్న అమ్మతో కబుర్లు చెపుతాడు, నువ్వు చెప్పవేం నాన్నా! చెప్పు' అని తండ్రిని గిల్లితే, మేము ముగ్గరమూ అమ్మాయి మాటలలోని అపసవ్యతను నవ్వుకున్నాము.

అమ్మాయి చాకచక్యమేమో ఒక మాస మయేసరికి 'అమ్మాయీ!' అంటూ గదపలో కూర్చుని చనువుగా నాభార్యతో మాట్లాడుతున్నాడు ఆయన. 'పాపా' అంటూ అమ్మాయితో నేనాడుకొంటున్నాను. అమ్మాయి కోటీశ్వరుణ్ణి, తనకే కాదు, నాకూ నాభార్యకూకూడా పవిత్రపితృస్థానంలో కక్కించేసింది. ఏక్లాసునోట్సో వ్రాసుకొంటూ వీధిగదిలో వంటెత్తుగా నేనూ, బిక్కుబిక్కుమంటూ వంటగదిలో నాభార్యా, అలా మూగగా ఉండేకొంపను రెండోమాసం గడిచేసరికి ఝుమ్మంటూ కలకలలాడుతోన్న చిన్నకుటుంబాన్ని చేసింది, అమ్మాయి. నాకు నాభార్యకు మాటలు నేర్పింది. వేరేవేరే కూర్చున్న మమ్మల్ని పెల్లగించుకొచ్చి ఓచోట కూలేసి మామధ్యకూర్చుని మమ్మల్ని కబుర్లల్లో పెట్టేసి. అదేం చిత్రమో అమ్మాయి మూలంగా, నాకూ నాభార్యకూ ఏదో అమ్మాయి విశేషం అనుకొని మాట్లాడుకోవాల్సిన అవసరాలూ కలిగాయి. అట్లాంటి ఘట్టాల్లో కోటీశ్వరుడొచ్చి మమల్ని చూచి రెట్టింపయిపోయేవాడు. నేను అనుకోడం, వాతావరణాని కనువుగా భూతజాలం తన అంగసౌష్టవం దగ్గరనుంచీ నెమ్మది నెమ్మదిగా మార్చుకొనేటట్టు, అమ్మాయి తనసర దాకు సరిపోయేటట్టు మాకుటుంబాన్నే మార్చేసిందేమో!

"మరో ఆరుమాసాలకా కోటీశ్వరుడు మాయింటికొచ్చి, 'వైరొచ్చి తాను బొంబాయివెడ్తోన్నానని, ఎవరు కబురుచేసినా బిడ్డను పంపవద్దని, ఎవరైనా దండోరా చేస్తే నా యీ కాగితం వారికి చూపించి వారిని పంపే యాల్సిం' దనీ నిక్కచ్చిగా చెప్పి వెళ్ళాడు."

"ఓరాత్రి, అమ్మాయి వెర్రిపెట్టుగా నిద్రమేల్కొని నాభార్యనులేపి కౌగలించుకొని ఏడ్వ నారంభించింది. 'ఏమమ్మా?' అంటే, ఆనాన్న చెవిలో ఏవరోఏదో పిండి చంపేశారని కలవొచ్చిందని ఏడ్చింది. అది కొంత నాపొరపాటే. నాకేమీ బాలసాహిత్య పరిచయం లేదు, అమ్మాయికి చిన్నచిన్న కథలు చెప్పటానికి. నాభార్యకొచ్చిన పిట్టకథలు మూడు రోజుల్లోనే అయిపోయినై. అమ్మాయి కథచెప్పమని మారాంపడ్తే, నేను పాఠ్యగ్రంథంగా చదివిన 'హామ్లట్టు' కథచెప్పాల్సి వచ్చింది. అది అమ్మాయి అదాయానికి మించినకథైనా ఏదో కాస్తవిని, కునుకోతుందిగదా

అని, లెక్చరు మొదలెట్టేటప్పటికే నిద్రలకుపడతారు స్టూడెంట్సు, చెప్పాను. పోమ్మట్టుకథ చెప్పింది ఊఉలిక్కిపడి లేచి, ఏడ్చిన రాత్రికి మూడునాళ్ళక్రితమే. అమితాసక్తితో వింది. కథలో రాణి, రాజు నిద్ర పోతుంటే చెవిలో విషం పిండి చంపేస్తుంది. అది అమ్మాయి బుర్రలో అడ్డోందేమో, అంచేత ఇట్లాంటి కలవచ్చిందేమో ననుకొని, ' అన్నీ, వెర్రి తల్లీ ! కథలోమాటలు నిజమనుకున్నావా ! ' అని ఆరాత్రల్లా అమ్మాయిని నాదగ్గరే పరుండపెట్టుకొని పరున్నా.

" కథలునిజం కాకపోవచ్చును గాని అమ్మాయికల నిజమైంది. బొంబాయిలో అసలు ఏంజరిగిందోకాని, అమ్మాయి యిచ్చట కలకన్న సమయానికి కోటీశ్వరు డచట బొంబాయిలో హృద్రోగమొచ్చి హఠాత్మరణానికి గురిఅయినట్లు తర్వాత కొద్దిరోజులకు పుకారు బయల్దేరింది. అమ్మాయి సవితల్లిపుట్టింటివారు జమీందార్లట. వారింటి కావిడ సంతానంతో వెళ్ళిపోయింది. నేటికీ అమ్మాయి ప్రస్తావన తెచ్చినవాళ్ళే లేరు. "

" అస్థిలో కుమారికకోవాటా ఉండి తీరుతుంది " అన్నాడు మాబావ నాచెవిలో, నన్నుగిల్లి.

యతిగారు సశేషంచెప్తో, " అమ్మాయికి కలవచ్చిన నాల్గురోజులకు, డబ్బు మూలుగుతోన్నవాళ్ళకు వచ్చే యిక్కట్టు ఒకటి నాకు వచ్చిపడి, అక్రమంగా నాతోడి లెక్చరరు చేత తిట్లుతినాల్సి వచ్చింది.

" నెలకు నాలుగువందలు తెచ్చుకొంటోన్నవాడిని నన్ను గతిలేని వాణ్ని అనుకోన్నావా, రెండువందల బసలు భాగ్యానికి ముఖంచూచుకున్నావు. ఎనభైవేలు చేతులో పట్టుకునికూర్చుని " అని నిష్ఠూరంగా చీటీవ్రాసి లేబొరేటరీప్యూన్ ద్వారా పంపించాడు.

" గుక్కతిరగని పనితొందర్లో ఉండి, ' నాక్కాదురా చీటీ ' అని వాణ్ని కసురుకొని పంపించేశా. చీటీమీద 'Dear friend' అని మాత్రం వ్రాసి ఉంది. నే నెరిగిఉన్నంతమట్టుకు బాంకులో నాకు నూట పాతికరూపాయిలు మాత్రమున్నై. నాకే ఆచీటీ అని ఎలా అనుకోగలను ? సాయింత్రం షికారుగా అమ్మాయితో కాలేజీగ్రౌండుకు వెళ్ళా. నాతోడి లెక్చరరు నన్నుచూచి ఎడమొఖాలు పెడమొఖాలుగాను ఉన్నాడు. అతి

చనువుగా ఉండేవాడిలో అకస్మాత్తుగా అంతమార్పు ఎందుకురావాలని నామనసు అవిధిపడ్తోంది. రెండురోజులక్రితం నన్ను రెండువందలు చేబదులడిగాడు. నా ఆర్థిక స్థితిని ఉన్నదున్నట్టుగా చెప్తే, 'ఏలాగయినా ఇంకా డెబ్బదిఅయిదు కావాలి. ఎందుకూ పొందకుండా వాటినితీసెయ్యకు. మరోఫ్రెండుదగ్గర పుచ్చుకొంటాన' ని, నాకు హితవు చెప్పి వెళ్ళాడు. సరసంగా మాట్లాడుకుని విడిపోయాం ఈనాడు బాకులా ఈచీటీ, నాకే అయితే.

"అంచేత 'ఎవరికోయి ఉదయం చీటీవ్రాశావు? నాదగ్గరకు తెచ్చావుడుప్యూన్' అన్నా. 'తమకే' అనిమాత్రం అని, నన్నేహ్యంగా చూసి చక్కాబోతున్నాడు. మాసంఘన పలకరించుకోవడంలో ఏనాడూ బహువచనప్రయోగంలేదు. తెల్లబోయి అతడివెంటబడ్డా. అతడు నన్ను ఛీత్కారించుకుంటూ చివరకు, 'పచ్చిఅబద్ధంకూడా ఎందుకు? పినాసితనం చాలకనా? నీబాంకు ఎకౌంటులో ఎనభైవేలు నేను చూపెడ్తా' నన్నాడు.

"నేను లబోలబోమని అతణ్ని తీసుకొని బాంకుకెళ్ళా, నాకళ్ళను చెవులనూ నేను నమ్మలేకపోయా. నా ఎకౌంటులో నున్నది నూటపాతిక కాదు. ఎనభైవేల నూటపాతిక రూపాయిలు! అమ్మాయికోసం నా ఎకౌంటులో కోటీశ్వరుడు వేశాడన్నమాట. ఇటువంటి తటవిట్లు ఇకరాకుండా అమ్మాయిచేత బాంకు ఎకౌంటు ఓపెన్ చేయించి, ఆపెడబ్బు ఎనభైవేలు, నాఅన్నగారిదగ్గర నేను జాగ్రత్తచేసుకొని ఉన్న మూడువేలు, అమ్మాయిపేర బాంకులో వేసి, ఆపాస్‌బుక్కు, నేనాశ్రమ స్వీకారం చేసేముందు స్వాములకిచ్చా" నన్నాడు యతిగారు.

"అమ్మ రామశాస్త్రులుగారూ! అగ్రహారానికే కాదు, ఈనాటుకే అధికుడవయ్యావయ్యా. అన్నివిధాలా ఎత్తుకెత్తు బంగారమయ్యా ఆఅమ్మ" అని కేకేశాడు మునసబుగారు. పరవశత్వంలో కూర్చోలేక లేచి, లేవలేక కూర్చునిన్నీ.

మంచిమాటేఅయినా హఠాత్తుగా వినిప్రాణాలు వదలిన వాళ్ళున్నారు. అట్టి దుష్ఫలితమేమీ కలగలేదుకాని పెండ్లివేళ, యతిగారు చల్లగా

చెప్పిన దబ్బుమాట సభమీద 'బాంబు షెల్' లా పని చేసింది. అప్పటి కప్పుడు తమజేబులోని సొమ్ము చేతిదెబ్బతిన్నట్టు కొన్ని ముఖాలు, పెద్ద అప త్తేదో విరచుకుపడ్డట్టు కొన్ని ముఖాలు, తేలో జెర్రో కుట్టినట్టు కొన్ని, 'పరమేశ్వరుడి లీలలు కానలేం' అని వేదాంతం ముసుగేసుకొన్నవి కొన్ని, మతులే పోయినవి కొన్ని, మతిమట్టుకు ఉన్నవి కొన్ని, వికసిత వదనాలు కొన్ని, విషాదవదనాలు యిహన్ని, దర్శకత్వంలో ఎంత నిష్ణాతుడూ, ఏ 'ఫిల్ము గ్రూప్' చిత్రంలోనూ కూర్చిఉంచని హావభావ వైవిధ్యమెంతో ప్రత్యక్షమైంది సభమీద ఆతరుణంలో.

రామశాస్త్రుల్ల శాంతమ్మగార్లవి, సీతమ్మరంగారావుగార్లవి 'క్లోజప్పు'లు నాకంట బడ్డాయి. యతిగారు చెప్పే కుమారిక జననవృత్తాంతంలో ధన ప్రమేయమే లేకుంటే, కన్న వాళ్ళు '! బాహ్మణాళ్ళైనా! అది చెప్ప వయ్యా అవసరమ్మాట, అట్టే గొడవెట్టక!' అని అనగదగ్గ రామశాస్త్రుల గారి ముఖంలో, 'కుమారిక ఎనభై వేలతో వస్తోంది' అన్నమాట చెవిని పడ్డంతోటే, ఒక్క దెబ్బతో సందేహాలన్నీ పటాపంచలై, ఆయన మోమును అదివరకు అలుముకుని ఉన్న మబ్బులు విడిపోయాయి.

డబ్బుముందు శ్రోత్రియులైనా ఇంతవారే అనుకున్నా, 'ఈడబ్బు మాట రెండురోజులు ముందే తెలుస్తేనా? రామశాస్త్రుల్లదగ్గర ఏమి ఊడేదేతునో కద' అని శాంతమ్మమోము కాస్త మేఘాచ్ఛాదితమైంది.

అప్పుడూ యిప్పుడూ కూడా మాకు కుమారిక బంగారపుబొమ్మే నని మూప్పులేకుండా ఉన్నారు సీతమ్మ రంగారావులు. కంచంవాయిస్తే శిశువులు ప్రపంచం గుప్పినిపడ్డట్టు, తాపామరపా లా దెశను భోరుమనడంతో సభ యావన్మందీ తొల్లిటి హర్షోత్కర్షలో పడ్డారు.

## 2. శుభాశీస్సులు

అంతలో లీలా డాక్టరులు చెయ్యాచెయ్యా పట్టుకొని, తెరమీద నొచ్చిన నటీనటుల వైఖరిని ఆలయముఖద్వారంలో ప్రత్యక్షమయారు. 'వారెవరో? వారిరాక తాత్పర్యమేమో?' మన మెరుగున్న ఒకగుప్పెడి

మందికి దక్క ఒరులకు తెలియని కారణంగా స్త్రీజనంలో కాస్త కలవరం బయల్దేరింది.

రంగారావు చతుర్వేదుల కబురందుకొని, డాక్టరు సరాసరి ఆడపెళ్ళి వారింటికి రాగా, ఒక్క లీల మాత్రమే అచ్చటఉండి ఉంటుంది. ముసలమ్మ రవణమ్మగార్లు కూడా పెళ్ళివారితో అలయాని కొచ్చారు. అంచేత డాక్టరు లీలలు, అతివియోగానంతర పునస్సమాగమ శుభసంఘటనవేళ, గతవియోగవ్యథను కళ్ళించుకొని, కరకరలాడారో, కళపెళ్ళాడారో, వలవల దుఃఖాశ్రువుల రాల్చారో, మాటామంత్రీ లేకుండా ఒండొరుల చేతుల్లోకి వాలి మూర్ఛపడ్డారో, కాక కథను ఊహించే క్రమంలో విస్మయ, క్రోధ, శోకకరుణారసాలనన్నిటినీ కొంతవడి ప్రదర్శించారో, రెండేండ్లుగా మరుగుపడిఉన్న మమతలు ఒక్కసారిగా బయటపడ్తే పాపం ఎలా నిల్దొక్కారో, ఏమి కిందామీదా పడ్డారో, కన్నవారూ, విన్నవారూ లేరు.

లీలాడాక్టరులు హితులను కల్సుకోడానికి అలయానికొచ్చారు. రంగారావు చతుర్వేదులు, కుమారిక వారిని చూస్తూనే మహదోల్లాసంగా ఎదురేగి యతిగారి మంటపసమీపానికి తోడుకొచ్చారు.

అదే సుభద్ర, ఆ పెప్రియుడు పూపాదరిండ్ల పరీమిళాల నాస్వాదిస్తో 'మాటిమాటికి సముద్ధత మోహానిబద్ధబుద్ధులై,' 'భావము లొక్కటయ్యెను, ప్రపంచ మొకించుక తోచదాయె, నేనీ వను భేదమున్ జనె,' నన్నట్టు అన్యోన్య హితభాషణులై యతిగారి మంటపంధరికి వస్తూన్నారు. అంతలో ఆగుతున్నారు. అంతలో కదలుతున్నారు. 'అనుమాన ముడిగి వినుమా' అన్నట్టేదో చెప్పి యువకుడు 'చనువును బలిమియును నెనరుసైగలుదోపన్' సుభద్రకు ఊతంగా 'హాండుషేక్కు' యిచ్చాడు. యువకుని చేతి ఊతం సుభద్రను ఊపేసింది. కంఠకల భర్తతో కలగబోయ్యే సంసారసుఖం కళ్ళముందుకొచ్చింది కాబోలు, సుభద్రకు బుగ్గలు కందిసై. మనసెందుకో ఊఅకలువేస్తోన్నట్టు, లోపల ఏదో గాలిబుగ్గ ఉన్నట్టు, ఆ గాలిబుగ్గ ఆమెను పైకిపైకి తేల్చివేస్తోన్నట్టు ఉంది ఆమెగమనగతి. వస్తూనే, 'చెలగి జగమెల్ల మోహింప జేయ జాలు

నీతని పై వ్రాలరె ఎట్టిపాలతుకైన' అన్నట్టు కళ్ళల్లోకి చూస్తో, పాశ్చాత్య సంప్రదాయంలో స్త్రీజనానికి యువకుని పరిచయం చేస్తోంది. పడుచులు తోట్రుపాటు పడుతున్నారు. ముత్తయిదువలు తెల్లబోతున్నారు.

'సంబంధనిశ్చయంనాడే ఇంతచేటు కాళ్ళవిరగత్రొక్కేసే వేగిఱపాటు మానాడు ఎఱుగమమ్మా!' అని పెద్దముత్తయిదువలు బుగ్గలు నొక్కుకుంటున్నారు.

అంతలో కుమారిక, ఏమిసంజ్ఞ చేసిందో సుభద్ర తనవరునితో వచ్చి, పొందిగ్గా డాక్టరులీలల ధరిని నుంచుంది.

కాస్తవెనగ్గా సభకు చేరుకుంటోన్నట్టి ఆహూతులవలె మేనరికంకథ అవధాన్లుగారు, ఆవెంట ఆయనగారి కూతురు, ఆవెంట ఒక కాకినాడ అబ్బాయి, ఆవరసను సమాప్తి చేస్తో చివ్వర, అగ్రహారపు మహిళామండలి సెక్రటరీ విచ్చేశారు. సెక్రటరీ, అధికారిణికి వచ్చే ఆర్భాటంతో, తన మాటలే తనకు వైతాళికులై, తన ఆతిథ్యాన్ని సర్వసిద్ధం చేయించేటట్టు దూరాన్నుంచే, మాట్లాడుతో ప్రవేశిస్తుంది. దగ్గరగా నుంచున్నా నాల్గువందల మహిళలను యడ్రసు చేస్తోన్నట్టు ప్రక్కగా ఒకఎత్తులో చూస్తో, కళ్ళఅద్దాలను చీరకొంగుతో తుడుచుకుంటో మాట్లాడుతుంది. మనం చెప్పేమాటలు ఆవిడకు అందకుండా దార్లోనే హరాయింపైపోతై. 'విడమాటలే మనం వినాల్సివస్తుంది.

"ఈసాలుకు నాబాదరబందీ వదలింది. అవధాన్లుకూతురుకు తాంబూలాలు యిప్పించేశాను. పెద్దబరువు దింపుకున్నా" నంటో చంకనున్న ఆజీప్పుబాగ్'ను ధరినున్న మంటపంమీద పడేసి, భర్తృవాంఛాపర అయిన అవధాన్లుకూతుర్ని, కాకినాడ అబ్బాయిని, సుభద్రజంటప్రక్కన నుంచో పెట్టింది. అవధాన్లకూతురికి సంబంధం నిశ్చయం అయిందన్నమాట చెవిని పడ్డంతోనే మహిళామండలి కన్యలు 'ఓకే! ఓకే!' అంటో కరతాళ ధ్వనులు చేశారు.

మహిళామండలికన్యల నంతగా ఈబలాటపెట్టిన ఈసంబంధ నిశ్చయం, ఒక వింత సంఘటన. ఈవధూవరులు 'సమ సుచారిత్రులు.' పదేళ్ళ పాటు ఆశపెట్టుకొని, అవధాన్లుకూతురు మేనత్తకొడుకు చేత మోసపడితే,

పదేళ్ళపాటు ఆశపెట్టుకొని పెట్టుకొని, కాకినాడఅబ్బాయి మేనమామ
కూతురి చేత మోసపడి ఉన్నాడు. ఆ యా సంధానాలకు నేటిపె.
చదువులే ప్రతిబంధకమైనై. పెద్దచదువు వెలిగించిన మేనత్తకొడుకు చదువు
ఖర్చంతా కట్నంరూపంలో పొయ్యలేక అవధాన్లుకూతురు చెబ్బతింది
పెద్దపరీక్షల నిచ్చాననన్న అతిశయాహంకారాలతో, సమాన పరీక్ష
నిచ్చిన వాడిముఖం కాని చూడనని శపథంచేసి, తనవృజ్జీ వరునికోస.
విశాఖజిల్లాలో, వీరవిహారం చేస్తోన్న మేనమామకూతురి కంటబడితే నే
పంజాదెబ్బ కొట్టేస్తుందని హడలిపోయి, ఆ పెద్దపులి కంట బడకుండా
పైసంబంధం చేసుకుపోవాలని దూరప్రాంతాల కొచ్చినవాడు కాకినాడ
అబ్బాయి. పాప మీతడు ఇంటర్లో పిల్లిమంత్రాలు కొట్టికొట్టి అక్కడే
ఎత్తడిపోయాడు. మేనమామకూతురో. నాలుగు కప్పగంతుల్లో యస్.
యస్‌సీ. కి ఎక్కికూర్చుని 'నువ్వా! నేనా!' అని తొడకొడ్తోంది
ఈపరిస్థితుల ప్రభావాన్ని నేర్పుగా సొమ్ముచేసి, అవధాన్లకూతురికి
కాకినాడ అబ్బాయికి సంబంధం ఖాయపర్చింది మహిళామండలి సెక్రటరీ.

'ప్రతి ప్రఖ్యాతసంస్థ, ఒకమహావ్యక్తి ఛాయ' అన్నసూక్తిని సార్థకం
చేసిన అసాధారణవ్యక్తి, మహిళామండలి సెక్రటరీ. అగ్రహారపు మహిళా
మండలి ఆవిడగారినీడ అంటే అత్యుక్తి కాదు. 'ఓల్డుమెయిడ్డు' అయినా,
ఆవిడకు అవివాహితులపట్ల నిండా అభిమానం. మండలి సభ్యురాండ్రలో
యేఒక్కతెకూ, భర్త్రాభావబాధ కల్గకుండా చేయడానికి అవసరమయ్యే
సామాజికప్రయోజనాలను గుర్తించిన కుశాగ్రబుద్ధి. వరాన్వేషణకంటో
వెతుక్కుంటో వెళ్ళే పాతపద్ధతి గాదు. వరులనే వధువుల వద్దకు
రప్పించే ప్రావీణ్యం కలది. లగ్నాల 'సీజను' కు రెండుమూడుమాసాలు
ముందుగా, సమాజ వార్షికోత్సవమనో, సాంస్కృతిక సభలనో పేరెట్టి,
సమాజంలో అధమం ఒక తెలుగునాటకమూ, ఒకహిందీనాటకమూ వేయి
స్తుంది. సమాజంలోని అవివాహితలతో కాస్టు నింపుతుంది. ఒక
నాటకంలో సామాన్యపాత్రలు ధరించిన కన్యలు, మరోనాటకంలో
ప్రధానపాత్రలు ధరించేటట్టు వ్యూహంపన్ని ప్రతికన్యనూ ఆకర్షణీయం
చేస్తుంది. అసలు మండలి ప్రదర్శించే నాటకాలసెలక్షన్లోనే మరో

అంతర్నాటకం ఉంది. మహిళామండలినాటకాల్లో ఒకటి, తప్పితే రెండు కన్న పురుషపాత్ర లుండవు. అయినా, 'కాంట్రాస్టు' వల్ల స్త్రీ పాత్రలు శోభించాలన్న మహదాశయంతో ఆవిడ వ్రాసినవే. ప్రతిసన్ని వేశంలోను పురుషుడు అయితే అపరాధి, తప్పితే చేతకానివాడు. ఆగ్రహం కల్గిస్తాడు, కాకపోతే అసహ్యం వేస్తాడు. ఆకథాశిల్పమేమో, స్త్రీలు పురుషులూ కూడా స్త్రీపాత్రలనే శ్లాఘిస్తో యిళ్ళకుపోవాలి. తద్రీతుగా అగ్రహారపు మహిళామండలి ఆశయసిద్ధికి ఆమె ఎంతగానో తోడ్పడు తుంది. మహిళామండలి దృష్ట్యా మొత్తం నాటకం రక్తికట్టడం కించె ద్విషయం.

పురుషపాత్ర పోషణలోనే కాదు, పురుషవేషధారణా విషయంలో కూడా, మండలి ఆశయమదే. ఆమె వ్యవహారదక్షతయేమో, ఏకోశాన్నీ కళ్ళల్లో సుప్రసన్నత కన్పించని రెండో కానోప్ప మూడో కానోప్ప చూచిన 'యక్స్ మెంబరు' ను వెతకిపట్టి, ఆపెను పదిఊతుకులై కగ్గిపోయిన నల్ల లాయరులాంగుకోటు వెతకితెచ్చి, కనుముక్కు తీరుకు పొసగని పొడుగు మీసాలెట్టి, సత్యవంతుడు పేరెట్టి, రంగంమీదకు పంపిస్తుందా పుణ్యాత్ము రాలు. కనుబొమలకు కాస్త 'బ్రష్' కాని, పెదిమలకు కాస్త 'లిప్స్టిక్కు' గాని, యేముద్దూ ముచ్చటా — అందరూ స్త్రీవేషధారణ చింతతోనే ఉంటచే ఉండ దేమో — పాపం సత్యవంతుడు రంగంమీదకు రావడమే వెలవెలబోతో వస్తాడు. కొంతకథ అయినతర్వాత రాదగ్గ తలనొప్పి, మొదట్లోనే వచ్చి నట్టుంటాడు. వస్తూనే చప్పట్లు తింటాడు. దాంతో సత్యవంతుడికి అందరి మీదా తలనొప్పి. సావిత్రీసత్యవంతుల ప్రణయగాథ తిలకిస్తోన్నంతసేపూ ప్రేక్షకులకు 'కాఫీ యాస్పరీను' బిళ్ళలు బుర్రలో కొస్తో నేఉంటై. యముడు ప్రాణాలుతోడుకుపోయిన నిముషాన్నుంచి తిరగా సత్యవంతుడు బ్రతికి ప్రేక్షకుల వంక చూచేవరకు నాటకం అమోఘంగా రక్తికడ్తుంది. సత్య వంతుడు బ్రతికాడేం, మరినాటకం చూడనక్కఱలేదు. పురుషుల నాహ్వా నించి, పురుషులంటే అన్నహితవుతప్పే ప్రదర్శనం సమకూర్చడం లోని పరమార్థమేమో, తొడగిల్లి జోలపాడ్డం ఎందుకో అర్థంకాదు.

నటనాచాతురి చాలని అవివాహితలకు నృత్యవాయిద్య సంగీతవిద్యలను తయారీయిప్పించి కచేరీ చేయిస్తుంది. కొంతమందికి చిత్రలేఖనం నేర్పించి,

ఆభవనంలోనే ఒకమూల యక్షిణిషను పెట్టిస్తుంది. అదీ, యినీ లేని పిల్లలను హారహారా అని అహ్వానసంఘంలో గిరాటేస్తుంది. 'వివాహాలు దైవ సంకల్పమా? సెక్రటరీ సంకల్పమా?' అన్నది ఆప్రాంతాల చర్చనీయాంశమే.

కథకొద్దాము: కుమారికా రంగారావుల నాశీర్వదించవలసిందిగా, కోనసీమశాస్త్రిగారు మాబావకోరికపై యతిగారిని కోరాడు. కుమారిక అంగీకారాన్ని గ్రహించియున్న యతిగారు మంటపసమీపంలో, పుష్పాక్షతలను చల్లుచున్న మావిచ్ఛాయల్లో, కుమారికను చేతుల్లోకి తీసికొని వాత్సల్యవిలసిత లోచనుడై కణ్వమహర్షి ఆశీర్వాద శ్లోకాల్ని యథాతథంగా గానంచేస్తో దీవించారు.

మునసబుగారి కోర్కెపై, కోనసీమశాస్త్రిగారు అర్థం చెప్పారు. 'ఓతనయా! ఇదివరకే నేను, నీకు తగినవరుడని ఎవరిని మనసునందుద్దేశించితినో యట్టివానినే నీవు నీపూర్వపుణ్యావశంబున బడసితివి ఈవనజ్యోత్స్నయు చెంతనున్న క్రొమ్మావితో సాంగత్యము పొందినది. ఇదివరకు మీయిద్దరి కొఱకు బెంగకొనియున్న నామనస్సు, ఇపుడు నిశ్చింతమైనది' అని శాస్త్రిగారు వ్యాఖ్యానించి మాఅందరకు విద్వదాహ్లాదం కలించారు.

ఆ నిశ్చింత ముఖ్యంగా సీతమ్మగారి మోములో కోటిసూర్యప్రభాకలితమై ప్రకాశిస్తోంది. సీతమ్మశాంతమ్మగార్ల కోరికపై యతిగారు అమ్మాణీ చతుర్వేదులను, తెగతొందరపడ్తోన్న సుభద్రను ఆప్రియుణ్ని దీవించారు.

సీతమ్మ మసలమ్మగార్ల కోరికపై యతిగారు డాక్టరు లీలలను దీవించారు.

ముసలమ్మగారికి ఆనందభాష్పాలు ఏకధారగా కాల్వకట్టినై. పెద్దదిక్కు పాపం అవిడ అంతగా ఆనందిస్తోంటే, లీలావతి బాష్పధారాస్నపిత పయోధరయై ముసలమ్మగారిని ఆశ్లేషించింది.

కుమారికా రంగారావులకు, సీతమ్మగార్కి ఏమి విశేషార్థం స్ఫురించిందో, ఒక్కసారిగా తలలెత్తి మావి శాఖల్లోకి చూచారు. కోకిలకూజిత రూపంలో సమస్తప్రకృతీ, ప్రణయజీవులా డాక్టరులీలల పరిణయం శాస్త్రసమ్మతమే, న్యాయబద్ధమే నని అనుమతి నిచ్చిందన్నమాట. అంతలో అవధాన్లుగారులేచి, "ముగ్గురయారు మాఅమ్మాయికి, యిక్కడ మాటయిచ్చి

యింటికెళ్ళి ఉత్తరం వ్రాస్తామని మోసం చేసినవాళ్ళు. పదిమందిలోనూ అని పిద్దామని వరుణ్ణి యిక్కడకు తోడుకొచ్చాను" అన్నాడు.

"కాన్సేపు ఊరుకోలేవయ్యా" అని మందలిస్తూ మహిళామండలి సెక్రటరీగారు అవధాన్లుగారి కూతురికీ కాకినాడ యువకునికీ యతిగారిచే దీవన లిప్పించింది.

దీవన లందుకోడంతో నే ఒక్కొక్కజంటే యతిగారికి సాష్టాంగపడ్డారు వచ్చిందని వేరే చెప్పనక్కఱలేదు.

మహిళామండలికన్య ఒక్క సరోజ, యతిగారు వరసని అయిదు జోడా లనుదీవించడంతో పోటీప్రైజు లిచ్చేచోట, ప్రైజురాని విద్యార్థి దిగాలుపడి ఆకలిముఖం, బీదమూపులు వేస్తాడే, అలాతయారైతే, మహిళామండలి సెక్రటరీ పసిగట్టి, పరుగునవెళ్ళి, లోకంలో 'ఇంకా నీకొచ్చిన తొందర లేదంటే వినవుకద, సరోజా!' అని, చెవిలో ఏంపెళ్ళి ధైర్యం చెప్పివచ్చిందో, సరోజ కూడా ఎగిరిగంతేసి, కలకల్లాడుతో కలిసింది.

ఇహ మాబావ రామశాస్త్రులకు కళ్ళు తలమీద కొచ్చై. కాళ్ళు భూమి మీద లేవు.

"ఇప్పుడు తెల్సిందా అబ్బాయిలు! రామశాస్త్రుల్ల మజా, రాజా ముహూర్తం పెట్టాను అమ్మాణికి. దీని బలంచేత ఎన్నో శుభాలు జరిగే ముహూర్తమంటే నవ్విపారేశారు. ఆఖర్ని గుళ్ళో పాండురంగడి కల్యాణంతో అరడజను కల్యాణాలు చేయించే ముహూర్తం పెట్టావన్నమాట రామశాస్త్రుల్లు!" అంటూ ఎగిరిపోతున్నాడు మా బావ.

"అన్నా! అరడజను వివాహాలు అవడంతోటే సరిపోలేదు. నీ ముహూర్తవిశిష్టత ఏమో కాని, అన్నీ చక్కగా, 'సమశీలస్మృతియుతులకు — సమచారిత్రులకు, తమలో నెయ్యము, సఖ్యము' అని పురాణాల్లో ఆదేశింపబడ్డ పంపిణీ పరిణయాలేనయ్యా!' అన్నాడు కోనసీమశాస్త్రిగారు.

## 3. కంఠాభరణం

స్త్రీజనంలో, తారకామధ్యచంద్రబింబంవలె కాంతులీనుచున్న కుమారికను వీక్షిస్తోన్న ఉదారుడు, మునసబుగారు, అంతలో 'నాకు మతిపోయిందండీ, యతిగారు!' అనిమామధ్య నుంచి కెవ్వుమన్నాడు. క్రితంరోజునే పత్న్యం పుచ్చుకొన్న పెద్దమనిషికి, బహుశః అస్వస్థతనో అలసటనో

కల్గిన మనోవికారమై యుండునా అని మేము కించె దాపుర్దా పడుతోంటే. 'వచ్చిన పని మఱచానండి' అన్నాడు, అయన కడుపుచల్లగా. మాకు ప్రాణం కుదుట పడింది.

ఆయన కంఠవాలో బులబులాగ్గా కట్టుకొనివచ్చిన మేలిమి బంగారు బుఱ్ఱైన, నవరత్నఖచితమైన నెక్లేస్సును బయటకుతీసి, తన ఉద్దేశ్యం చెప్ప బోతుంటే, 'అయ్యగోరు, అయ్యగోరు' అంటో కేకమీద కేక, మూడు కేకలు ఏవో మునిగిపోతోన్నట్టు వినుపించినై మునసబుగారు నిర్ఘాంత పోయి, గుమ్మంకేసి చూసేసరికి, వారిపెద్దపాలేరు. "ఓరి నీకడుపుడక! ఎక్కడ పొంచి కూర్చుంటావురా? సరిగా వేళకు తయారవుతోంటావు. మెట్లమీదనుంచే ఇంటికి పొమ్మని గడ్డెట్టాను కాదట్రా. నువ్వు వెళ్ళనే లేదన్నమాట" అన్నారు మునసబుగారు.

"కాదుండి, 'యతిగాగో, మతోయిందండో' అన్న మీకేక వినిపించి ఏంచూస్తే మతోయిందో కనుక్కోని, మిమ్మన్ని ఇంటికి తీసుకెళ్ళాలని వచ్చానండి" అన్నాడు వాడు.

"అంటే గుళ్ళో నేనంటోన్న ప్రతిమాట నీకు ఇంటిదగ్గర వినుపిస్తోందన్న మాట. నీతో వాద మెందుకు. వస్తూన్నా, చప్పగా రోగం కుదురుస్తా!" అని మునసబుగారు అటుతిరిగేటప్పటికి, గుమ్మంలో మనుష్యులను తన్ను కొని ఉడాయించాడు వాడు.

మునసబుగా రాకంఠాభరణాన్ని యతిగారి మంటపంమీద పెట్టాడు. మునసబుగారు ఎంత ఆప్యాయతనుకూడా మేళవించి ఆనెక్లేస్సును చేయిం చారో, దాని అపూర్వరామణీయతకు. దానివిలువకు మంత్రముగ్ధులమైనాము.

"స్వామీ! మా రంగారావుగారిచేత అమ్మాయిగారి మెళ్ళోవేయించా లని నాకోరికండి. మీరు వారిద్దరినీ దీవించేవరకూ దీన్ని పైకితియ్యడానికి ధైర్యం లేకపోయిందండి నాకు. వీరిద్దరికీ వివాహం కావాలని నాబుర్రలో కదలుతోనే ఉందండి జబ్బు అన్నిరోజులూ. నేను చూచే-యోగ ముంద కనుకనే సరీగా వేళకిది తయారూ అయింది, నాకు జబ్బూ నివ్మళించింది. నేను పెద్దవాణ్ని. నాకోరిక మన్నించమని ప్రార్థిస్తోన్నా నండి. రంగా రావుగారికి నేనంటే అపేక్షే, కాదవరు. ఊరికే రంగారావుగారిచేత 'మామా' అనిపించుకోనా అండి, అమ్మాయి కొక కన్నెవస్తువేనా నాచేత్తో పెట్ట కుండా?" అన్నాడు మునసబు గారు ముకుళితహస్తుడై.

యతిగారి అనుజ్ఞతో, శాస్త్రిగారి ఆమోదంతో రంగారావు కుమారి

కను, కంఠాభరణం మెడలో వేసి అలంకరించాడు. మాకరతాళధ్వనులు మేళపతుల మంగళతూర్యారావాలు మిన్నుముట్టే యావన్మందీ ఆనందాంబువుల్లో కరిగిపోయామంటే అతిశయోక్తి కాదు.

---

# 26. ఉల్లాసలక్ష్మి

రంగణ్ణి అర్చించి, యతిగారి ఉపదేశామృతం గ్రోలి, సీతమ్మగారింటికి చేరుకోవడం కుమారికకీ పదిరోజులనుంచీ నిత్యకృత్యమే అయినా, ఈ డాపె కన్నులలో నొకప్రత్యగ్రత గోచరిస్తోంది. నేటి విశేష సంఘటన కారణంగా, గంభీరభావాలను లోన దాచుకోగల కన్యే అయినా, కుమారిక తండ్రిగారిని ఒంటరిగా వదలేసి పోతోన్నట్టు ఒక భావావేశం కలిగి, విచారభారంతో యతిగారి వద్దనే, మిగతా పెళ్ళివారు కదలుతోన్నా నిలచి ఉంది.

దుహితృ వియోగవ్యాకులిత స్వాంతుడైన యతిగారు కుమారికను చేతుల్లోకి తీసుకున్నారు. రంగారావు మూర్ధమును స్పృశించి "నాయినా, రంగారావూ! ఈపె నాకు అనేకజన్మసముపార్జిత తపఃఫలం సుమా" అని చెప్పి ఎదకు చేర్చుకున్నారు.

వారిద్దరి చేయూతతో యతిగారు మంటపమెక్కి పద్మాసనస్థుడై మనస్స్వాస్థ్యం తెచ్చుకున్నారు. యతిగారు జపమాల త్రిప్పుతో 'రంగా, రంగా. రంగరంగా' అంటో ధ్యాన స్థిమితుడైనాడు. యతిగారి పాలాన గభీర కాసార నిశ్చలత ప్రత్యక్షమయాక, కుమారికా రంగారావులు వారిని వీడివెళ్ళారు.

వారుభయులు వచ్చి మమ్మల్ని ఆలయం మెట్లమీద కలుసుకున్నారు. నూత్నవధూవరులందరి హృదయాలు ఉత్సాహంతో ఉత్తుంగ తరంగయుతంగా ఉన్నై. సీతమ్మగారి సంతోషానికి పట్టపగ్గాలు లేకున్నై. తన పెళ్ళిలో కుమారికా సుభద్రల పెళ్ళిళ్ళు కూడా నిశ్చయమైనందుకు అతిశయపడ్తోంది అమ్మాణీ. సందేహవిచ్ఛేదుడైన రామశాస్త్రులుగారి ముఖంలో సంతృప్తి, శాంతమ్మగారి ముఖంలో శాంతం తొణికసలాడ్తున్నై.

"నేను అమ్మాణీకి ఆడబిడ్డనైతే, మా అమ్మాణీ కుమారికకు ఆడబిడ్డయిం"దని శాంతమ్మగారంటోంటే, "అయితే అక్కా! అలగడం వంతు అమ్మాణీదన్నమాట. నువ్వు అమ్మాణీకి తయారీ తినిపించక పోతే, మాకొచ్చే లాంఛనాలు పోతాయిసుమా!" అన్నాడు చతుర్వేది నవ్వుతో

ఆనందడోలికల్లో తేలియాడ్తోన్న మునసబుగా రందుకొని, "అమ్మాణీగారికి రావాల్సిన లాంచనాల లిస్టు నాకు అందాలండోయి, రామశాస్త్రుల్లుగారికి కాదు. ఆయున మగపెళ్ళివారుగా!" అన్నాడు.

అడుగడుగునా మాకు కవితాసౌందర్యాన్ని కళ్ళముందు పెడ్తోన్న కోనసీమశాస్త్రిగారు అపరపండితరాయల పోలెక్క ప్రకాశిస్తోన్నారు.

ఆలయం ఆఖరి మెట్టు దిగుతోంటే రజకయువకుడు సీతమ్మగారిని సమీపించి, "అమ్మగారు, అబ్బాయిగారి పెళ్ళిపాలకీ నాబంటాక్కే చెప్పాలిసుమండీ, మఱచిపోయేరుస్మండీ!" అన్నాడు.

"ఆ కంజాయింపులన్నీ చేసేవాడిని నేనురా వెఱ్రిముఖమా" అన్నాడు మునసబుగారు.

"అమ్మో! వాడెక్కడ వెఱ్రిముఖమండీ. బలే వస్తాదండీ. మబ్బులేని పిడుగు. మల్లయుద్ధానికి పెట్టిన పేరు. నిన్న రాత్రి వీరకృత్యాలు చేసిపారేసి పెళ్ళివారికి మండపాక భాగవతులు రానిలోపం కప్పేసి, వినోదం కలిగించాడు. ఎంతమందో విరగపడి చూశారు" అన్నాడు రంగారావు.

"బుద్ధిమంతుడండీ!" అని కల్పింది కుమారిక.

"నువ్వందర్నీ బుద్ధిమంతుల్ని చేస్తావమ్మా!" అన్నాడు మునసబుగారు.

ఆ ప్రశంసా వాక్యంతో, కుమారిక మూలాన పరివర్తితవర్తనులైన శాంతమ్మగారికి, సుభద్రకు, డాక్టరుకు, రామశాస్త్రుల్లుగారికి, వారివారి ప్రత్యేకానుభవాలు సింహావలోకనమైనాయి కాబోలు, మునసబుగారు చేసిన ప్రశంస. ఎవరి మట్టుకు వారికే బహు సార్థకంగా కన్పించింది కాబోలు, వారందరూ కుమారికను తిలకిస్తో అవునన్నట్టు తల లూపారు.

రజకుడు 'జై' అని పాలకీ లేవతీశాడు.

"పెండ్లివారు దేవతాదర్శనం చేసుకొని వెడ్తోన్నారు. అక్కడ నుంచి గృహప్రవేశానికి బళ్ళు ఎక్కుతారు. యావన్మందీ రాండి, వేడుక చూచి పోండి" అని దూదేకులసాహేబు తన తుతూబా కా బ్రాడ్కాస్టు చేశాడు.

భేరీ ఢంకా మంగళ తూర్యారావాలు ఘోరుమన్నై. జగన్మంగళ స్వరూపధరుడు రంగడు కటాక్ష వీక్షణాల ప్రసరిస్తోంటే, పరవశుడౌతో, ద్విజ పురోహితార్యబంధు సమేతుడై మాబావ రామశాస్త్రుల్లుగారి పెండ్లిపందిరికి ఊరేగింపు సాగించాడు.

జై హింద్.

---